

శ్రీ కాకతీయ గ్రంథమాల,    సంపాదకులు

1. అనుబంధగ్రంథము    శ్రీ శేషాద్రి రమణకవులు.

# ఆంధ్రపదనిధానము

సటీకా శుద్ధాంధ్ర నిఘంటువు.

ఇది

తూము రామదాసకవి కృతము.

( 1వ కూర్పు 1000 కాపీలు )

తూము రంగయ్యగారిచే బ్రకటితము

కాటూరు రామమూర్తిగారిచే

భవానీ ముద్రణాలయమున

ముద్రితము.

1930



[వెల రు. 1-8-0.
పోస్టేజికాక



# దాసబోధ.



పుటలు 800॥ నిండు కాలికో బైండు.

ఇది శ్రీశివాజిచక్రవర్తి కొలువు అయ్యగారగు శ్రీసమర్థ రామదాసస్వామి రచించిన మహారాష్ట్రగ్రంథమునకు సరియగు తెనుగు వచనము. ఇందు రామదాసస్వామి జీవితము, దాసబోధ విమర్శనము. శివాజిరామదాసుల చిత్రపటములు గలవు. శ్రీసమర్థ రామదాసస్వామి మహారాష్ట్ర దేశమునందు గలిగించిన ప్రబోధ మఖండమైనది దాసబోధలో రాజకీయరహస్యములు వేదాంతచర్చలో ముఖ్యాంశములు విపులముగ గలవు. ఈ గ్రంథము బంగాళీ గుజరాతు హిందీభాషలలో తర్జుమాయై అఖండప్రచారములో నున్నది. పిండోత్పత్తి మొదలుకొని పరబ్రహ్మము నుదర్శించువరకు గల వేదాంతరహస్యము లిందు గలవు. పసిబిడ్డలకు సైతము వేదాంతానుభవము గలుగజేయు మహాగ్రంథము. ప్రతి మానవుడు పఠించినచో శ్రీశివాజిచక్రవర్తివలె మహాదృష్టవంతులు జ్ఞానులు అగు నవకాశములుగలవు. ఆంధ్రభాషలో నిట్టియుత్తమగ్రంథ మింకొకటిలేదు. లోకమాన్యతిలక మహాత్మగాంధి మున్నగు ప్రముఖులు ప్రశంసించిన ఉత్తమగ్రంథము.

ప్రకాశకులు: శేషాద్రిరమణకవులు వెల రు 4-0-0.

వలయువారు:—

కాకతీయగ్రంథమాల,
నందిగామ (కృష్ణాజిల్లా)

# తొలిపలుకు



ఆంధ్రకవుల గ్రంథములలోఁ బెక్కు నశించినవి. కేవలప్రాచీనకవుల గ్రంథములు ప్రత్యంతరరూపమున వ్యాప్తి జెందినకతన నేఁడుగానున్న యవికొంతకాలమునకేని లభింపవచ్చును. ఆధునికకవుల గ్రంథములస్థితి శోచనీయముగ నున్నది. ముద్రణము లగ్నమైన కాలమునఁ గలకవులు గ్రంథరచనము గావించి ప్రత్యంతరములఁ దమయింట భద్రపఱచి గతించిరి. వానికిలోకమున వ్యాప్తిలేదు. వంశీయులు ప్రచురింపరు. లోకులకు వాని యునికియె తెలియదు. ఈ యజ్ఞాతావస్థలో విలువగల గ్రంథములు నశించుచున్నవి. అట్లు నశింప నున్ముఖమైన పుస్తకములలో నీయాంధ్రపదనిధాన మొకటి.

గ్రంథకర్త తూము రామదాసకవి. ఈయన జీవితచరిత్రమును గ్రహింపఁదగిన వివరములు కృత్యాదియందు లేవు. వాధూలగోత్రజులగు సింగరాచార్యుల శిష్యుఁడనియు రంగాచార్యులకు మిత్రుఁడనియు మాత్రము కృత్యాదియందలి యైదవపద్యమువలన గ్రహింపవచ్చును. బాలనరేశుఁడగు విష్ణుమూర్తి కృతిభర్త. ఈవివరములు జీవితచరిత్రసంగ్రహమునకుఁ జాలవు. కవి కుమారులవద్దనుండి సంగ్రహించిన యంశముల ననుసరించి జీవితము వ్రాయుచున్నారము.

తూము రామదాసకవి కాపుకులజుఁడు. పూర్వమునుండియు నివాసము ఒరంగల్లు. పరిష్కృతము ఒరంగల్లులోని యొకభాగమగు బాలనగరమున వీరి గృహము కలదు. పసుపుమాళ్ళగోత్రము. ఈయన జననకాలము గడచిన నల సంవత్సర శ్రావణబహుళ ద్వితీయ సోమవారము(క్రీ-శ 18-8-1856). మరణకాలము క్రోధి సం॥ కార్తికబహుళసప్తమి (క్రీ-శ-29-11-1904). జీవితకాలము దాదాపు 49 సంవత్సరములు. ఇరువదియొకటవయేటఁ గవితారచనమున కారంభించినాఁడు, కవితారంభకాలము ధాతసంవత్సరము కానోపు. కవిపంచసంస్కారములఁ బడిసిన వైష్ణవమతస్థుఁడు.

ఈరామదాసకవి ఒరంగల్లునివాసియు సరసకవితావిశారదుఁడు వైదుష్యభూషణుఁడునగు పరితాపపురము రంగాచార్యులగారివద్ద సంస్కృతాంధ్రముల నభ్యసించి ఈక్రిందిగ్రంథరాజములను గ్రమానుసారముగా రచించెను

1 రుక్మిణీ కల్యాణము, గేయగ్రంథము,

2 గోపికావిలాసము. ప్రబంధము,

3 మిత్రవిందోద్వాహము. ప్రబంధము,
4 కాళిదాసునాటకము.
5 ఆంధ్రపదనిధానము,

రుక్మిణీకల్యాణము బాల్యావస్థలో రచించిన దగుటచే నంతప్రౌఢము గాదు. కవియే యాగ్రంథమునెడ శ్రద్ధ గైకొనవందున నెన్నఁడో నశించినది. గోపికావిలాసము పుష్పబాణవిలాసములోని శృంగారలీలల శ్రీకృష్ణున కన్వయింపఁజేసి వ్రాసిన పద్యకావ్యము. ఇందలి పద్యములు మిత్రవిందోద్వాహములోఁ గవి జేర్చుకొనినాఁడు. మధ్యకాలములో నీగ్రంథము మరుగు పడినది. ఇపుడెంత వెదకినను గనుపింపలేదు. కాళిదాసనాటకము ప్రకృతరంగస్థలముల కనుకూలముగ నిక్కవి సురభికంపినివారి ప్రార్థనపయి మూఁడు దినములలో రచించి రంగస్థలమునఁ బ్రదర్శింపఁజేసినాఁడు. ఆ కాలమున సురభికంపినీవారు ప్రదర్శించు విలువగల నాటకములలో నీ కాళిదాసనాటక మొకటి. క్రీ.శ. 1899లో కాళిదాసనాటకము ముద్రితమైనది. ఇపుడొక ప్రతి స్థానికగ్రంథాలయములో నుండఁగ మేము చూచినారము. మిత్రవిందోద్వాహము ముద్రితమెగాని ప్రతులు లభించుటలేదు. ఇది యైదాశ్వాసముల శృంగారకావ్యము. నిర్వచనము. గర్భకవితయు బంధకవితయు శబ్దాలంకారములుగల ప్రబంధము. ప్రకృతమగు ఆంధ్రపదనిధానము కుదిగ్రంథము.

ఈకవి ప్రారంభమునఁ గొంతకాలము నిజామునొరతనమువారి యటవీశాఖలో నుద్యోగిగా నుండి యది విరమించుకొని ఒరంగల్లు మండలములోని ఆత్మకూరు సంస్థానమున వెంకటనరసయ్య దేశాయిగారియొద్ద రాజకీయవ్యవహర్తగ బ్రవేశించెను. కవి స్వరూపపట మెన్నివిధముల యత్నించినను లభింపలేదు.

రామదాసకవికి ప్రతాపపురం రంగాచార్యులవారు విద్యాగురువు. కాంచివాస్తవ్యులు షట్శాస్త్రవేత్తలునగు కందాళ సింగరాచార్యులవారు పంచసంస్కారప్రదాతయగు కులగురువు. విద్యాగురువగు రంగాచార్యులవారీ యాంధ్రపదనిధానము మూఁడవకాండము ముద్రించువఱకు సజీవులైయుండిరి. కవిజీవితమునకు వలయు నంశముల నెన్నియేని చెప్పెదమని వాగ్దానము గావించిరి. గ్రంథముద్రణానంతరము వారితో సంప్రదింపవచ్చు ననుకొనన నీసంవత్సరము వర్షకాలమున నాకస్మికముగ స్వర్గతులైరి. ఆంధ్రవిద్యార్థిలోకమున కందుచే విపులజీవితచరిత్రము నివేదింప లేకపోతిమి.

ప్రకృతగ్రంథమగు నాంధ్రపదనిధానను గూర్చి కొంచెము చెప్పవలసి యున్నది. ఈగ్రంథమును కవినలువదవయేట వ్రాయనారంభించి, మరికొంతకాలమునకుఁ గొంచెమించుమించుగఁ బూర్తిగావించెను. నిఘంటువునకు వలయు పదసముదాయమును శబ్దరత్నాకరమను అకారాదినిఘంటువునుండి గైకొని వర్గీకరణమొనరించి పద్యములుగా గావించెను. సమగ్రమగు శబ్దరత్నాకరమున నున్న పదముల వర్గానుసారముగఁ దొలుతవ్రాసికొన్న చిత్తుప్రతులును మొదట వ్రాసిన పద్యప్రతులు దానిననుసరించి వ్రాసినశుద్ధప్రతియుఁ గవిసుతులచే మున నేటికిని భద్రపఱుపఁబడియున్నవి. కవిశుద్ధప్రతి మరలఁ బరిశోధింపమి చేఁ బలుతావుల దోషములు కలవు. మూఁడవకాండమునందు దాదాపుగ మూఁడుభాగముల కర్థము వ్రాయలేదు. మాకు లభించిన మాతృకలోఁ జివరభాగము చెదపుర్వులు గనివేసెను. అందుచేఁ గొన్నిపద్యములకు మొదలు,కొన్ని పద్యములకర్థము, మేము సమకూర్చితిమి. అర్థమునుబట్టిపద్యభాగము,పద్యభాగమునుబట్టి యర్థము వ్రాసియుంటిమిగాన దాదాపుగ నీసంస్కరణము కవిభావము ననుసరించి చేసియుండుమని మావిశ్వాసము. అందుచేఁ గుండలీకరణము మానితిమి.

సంస్కృతమున వర్గీకరణరూపముననున్న నిఘంటువు లెన్నియో గలవు. నామలింగానుశాసనము, మేదిని, విశ్వము, నానార్థరత్నమున్నగు నుపలభ్యములగునవియె గాక నింక నెన్నియో యున్నట్లు వ్యాఖ్యాతల యుదాహృతిభాగముచే వలన నెఱుంగ నగును. ఆంధ్రమున బద్యనిఘంటువులు చాల యరుదుగా నున్నవి, అందు

| | | | |
|---|---|---|---|
| 1 | ఆంధ్రభాషార్ణవము | పద్యసంఖ్య | 624 |
| 2 | ఆంధ్రనామసంగ్రహము, | ... ... ... ... | 209 |
| 3 | ఆంధ్రనామశేషము | ... ... ... ... | 100 |
| 4 | సాంబనిఘంటువు | ... ... ... ... | 95 |
| 5 | వెంకటేశాంధ్ర నిఘంటువు, | ... ... ... ... | 100 |

మాత్రము ప్రకృతముపలభ్యములు. నామలింగానుశాసనము వలె వర్గీకరణమొనరించినకోటివెంగనార్యునిఆంధ్రభాషార్ణవము సర్వవిధములబ్రశస్తతరము ఆంధ్రనిఘంటువులలో బ్రథమము ప్రథమగణ్యమునగు నీయాంధ్రభాషాభరణమునకు ఆంధ్రనామసంగ్రహమున కున్నంతయేని వ్యాప్తి లేకుండుటకుఁ గారణము చింత్యము. వర్గీకరణమున సాదృశ్యముంటచేతను గ్రంథ ప్రశస్తి

కొలఁదిగఁ దోఁచుటచేతను ఆంధ్రనామసంగ్రహమునకు సాంబనిఘంటు వివరిది. వెంకటేశాంధ్రము సాంబనిఘంటువునకు సమకాలికము. ఆంధ్రనామ సంగ్రహమునకు తరువాత జనించిన ఆంధ్రనామ శేషమును గూర్చి ప్రత్యేకించి చెప్పవలసినపనిలేదు. సమగ్రమగు ఆంధ్రభాషార్ణమునకుఁ టీకలేక పోయినందునను దానియునికియె యిటీవలివారలకు దెలియనందునను అసమగ్ర నిఘంటువులుకొన్ని బయలువెడల నవకాశము గలిగినది.

ఆంధ్రపదనిధానమునకు మాతృకయగు శబ్దరత్నాకరమునందు ఆంధ్ర భాషార్ణవ మట్టంకితమగుటచే సందలిపదములు సంగ్రథితములైన వనవచ్చును. శబ్దరత్నాకరసారమగు నీయాంధ్రపదనిధాన మీకారణములచేఁ బ్రకృతో పలభ్యములు. పూర్వోక్తములు సగునిఘంటువులన్నింటికంటె సమగ్రమనుట నిస్సంశయము. ఆంధ్రభాషార్ణవమున క్రియావర్గమొకటికలదు. అందు ధాతు రూపములు వివరింపఁ బడినవి. సామాన్యవ్యాకరణ సహాయమున రూపింపఁ దగిన యీరూపములకుఁ బ్రత్యేకవివరణము లనవసరమనికాఁబోలు ఆంధ్రప దనిధానకారుఁ డావర్గమును మానినాఁడు. ఆంధ్రభాషార్ణవమున రచనాప్రా గల్భ్యసూచకముగఁ బర్యాయపదములు మిగులదీర్ఘములుగఁ జెప్పఁబడినవి. జిజ్ఞాసువులకాదీర్ఘ పదములనుండి హ్రస్వపదముల గల్పించుట యెంతేని కష్టమనుటకు సందేహములేదు. ఆంధ్రభాషార్ణవములోని శివనామములఁ జూడుడు.

సీ. గట్టుల యొకిమీఁడు గన్నవాల్గంటిని
జెట్టపట్టుక యేలినట్టి దిట్ట
మున్నీటిరాచూలి ముక్కుఁగెంజెడలోనఁ
గ్రొన్విరిగాఁ బాల్చుకొన్న మేటి
గబ్బుచెంక మెకంబు గట్టికళవసంబు
కుబుసంబుగాఁ జేసికొన్న దంట
ప్రాఁబలుకుఁగట్టముల్ పన్నిసిస్తగునట్టి
పుడమితేరెక్కిన పోటుకాఁడు

ఈదీర్ఘపదము లాంధ్రపదనిధానమున వరుసగఁ గొండయల్లుఁడు నెలతాల్పు, తోలుదాల్పరి, యనుపర్యాయపదములుగ నీయఁబడెను. ఇట్లే సంక్షేప రూపముననున్న కతనఆంధ్రపదనిధానమునందు విశేషపదసముదాయము 1566పద్యములలో నిముడుట కవకాశము చిక్కినది. వర్గీకరణమున నామ

లింగానుశాసనములో బోలె యున్నను నిందు విశేషించి యందులేని పర్యా
యపదములు గలవు. ఒక్క స్వర్గవర్గ మిలికించిన నమరమునలేని నారదుఁడు
కృష్ణుఁడు నృసింహుఁడు, సీత, వెంకటేశుఁడు మున్నగు పేళ్ళలకు బర్యాయ
పదములు గోచరించును. ఇట్లీయాంధ్రనిఘంటువున బ్రతివర్గమున విశే
షాంశయము లున్నవి.

బహుజనపల్లి సీతారామాచార్యులవారు శబ్దరత్నాకర పీఠికలో తెనుఁ
గునిఘంటువులయందుండి పదములను మాత్రమెత్తి వ్రాసికొని యర్థము లంద
లివి తెలుపుచుగ లక్ష్యవిరుద్ధములుగనుంటచే లక్ష్యశోధనంబు గావించితి
అని పూర్వోక్త నిఘంటువులపయి నొకదోష మారోపించిరి, వాఙ్మ
యము గావించిన వారినుండి యెంతయేని సత్యము. సుపరిశోధితమగు శబ్దరత్నా
కరము ననుసరించి వ్రాయబడినది గావున నీయాంధ్రపదనిధానమున కట్టిదో
షమారోపింపఁ దావులేదు. కాన నిది యింతవఱకు బయలు వెడలిన యన్ని
నిఘంటువులకంటె సమగ్రమనియు విశేషపదావృతమనియు శబ్దరత్నాకరము
వలె ప్రమాణభూతమనియు జెప్పవచ్చును.

ఇందు నామలింగానుశాసనము వలెఁ గాండములు వర్గములు విభజింపఁబడి
నవి. లింగాదిసంగ్రహవర్గము మాత్రము తెనుఁగున విడువఁబడినది. ఆంధ్రమున
లింగాదిసంగ్రహవర్గము గూర్పనవకాశములు లేవనియు నేకొన్నిపదములకో
లింగనిర్ణయము జేసినను నీవర్గమువలన నంతగా నుపయోగ ముండదనియుఁ
గవి మానియుండును. మిగిలిన వర్గము లన్నియు నామలింగానుసారముగ
నున్నవి.

ఆంధ్రపదనిధానము 1565 పద్యములుగల యుద్గ్రంథము. శబ్దరత్నా
కరస్థములగు పదములేగాక నిజామురాష్ట్రమున వ్యవహరింపఁబడు దేశ్య
పదములనైత మిందు జేర్పఁబడినవి. కొన్నికొన్ని వర్గములందు అమరముకంటెఁ
బదసముదాయము విస్తరముగఁ గలదు. అమరమునందులేని పసిమట్టుల
పేరులు జాతీయవాచకములు వస్తునామములు నీకవి స్వయముగఁ బరిశోధిం
చి సమకూర్చియుఁ గొన్నితావుల సంస్కృతపదముల వ్యుత్పత్తిభావాదుల
గమనించి యాంధ్రీపదములను గల్పించియు గ్రంథాంతరములనున్న దేశ్యపద
ములను గూర్చియు నీగ్రంథమునఁ బదసముదాయమును బెంపొందించియు
న్నాఁడు, అందుచే నీనిఘంటువు ఆంధ్రలోకమునకుఁ బరమోపకారమనియు

నాంధ్రవాఙ్మయ ప్రత్యేకవ్యక్తిత్వమున కాదగ్గుప్రాయమనియు విద్యార్థుల కవశ్యపఠనీయమనియు మాతలంపు

ఆంధ్రవ్యాకరణ సహాయమున రూపాంతరములు సాధింపఁదగిన పగలు పవలు, తోఁడబుట్టువు తోఁబుట్టువు, వెలది వెలఁది, పెనిమిటి పెన్మిటి, ఇగురుచు ఇఁగుచు, మున్నగు పదములు ఇందు భిన్నపదములుగాఁ జెప్పఁబడినవి. పానుసా, మస్తీ, హజూరు, మున్నగు హిందూస్థాని వికృతపదములు దేశ్యములుగఁ జెప్పబడినవి. ఆంధ్ర వాఙ్మయమున నేయేపదముల కెన్నిపర్యాయపదములు కలవో దెలిసికొనుటకును సంస్కృతసంబంధములేని యాంధ్రభాషావిస్తృతి గ్రహించుటకును శుద్ధాంధ్రభాషాస్వరూపము నెఱుంగుటకును ఇరువదవశతాబ్దము నాటి కాంధ్రపదములుగ గ్రంథస్థములైన శబ్దములను గుర్తించుటకును నీనిఘంటువు పరమోపకారక మగునని మాతలంపు. మేము జూచినంతలోఁ బద్య నిఘంటువులలో నిదియే సమగ్రమైనది. లక్ష్మీనారాయణీయమను ప్రత్యేక శుద్ధాంధ్రాకార నిఘంటువు వొకటిగలదుగాని యిరువురు గ్రంథకర్తలు సమకాలికులు, భిన్నస్థలవాసులు, అపరిచితులు, నగుటచే నొకరిగ్రంథమువలని యుపయోగమును వేఱొకరు బడసియుండరని మాయుద్దేశము.

ఆంధ్రభాష ప్రత్యేకవ్యక్తిత్వము స్వతంత్రలక్షణముఁగల ప్రత్యేక భాష. వికృతివివేకకారుఁడు "భాషేయమమితాతత్రి దేశ్యాచిత్ర స్వభావయుక్ తచ్ఛ్రోతుర్ద్రష్టవ్యా పూజ్యపాదను భాషితే" యని యాంధ్రభాషను బ్రశంసించినాఁడు. (దీనిచే నాంధ్రభాష పరిమితిరహితమైనదనియు దేశ్యములు చిత్రములుగనుండుననియు వ్యాకరణసహాయమున నాచిత్రములు గ్రహింపనగుననియుఁ దెలియనగును) విశాలమగు నాంధ్రదేశమున నసంఖ్యాకజనులచే వ్యవహృతమగు నాంధ్రభాషలోఁ బదసముదాయ మమితముగఁ గలదు. ఎన్నియో పదము లింకను గ్రంథస్థము కావలసియున్నవి. అరణ్యములగు చెంచులు, ఏనాదులు, కోయలు, బోయలు, మాటలాడుపదములం దెన్నియో యాంధ్రపదములు గలవు. నిజాంరాష్ట్రమున మహమ్మదీయ సంపర్కములేని మండలములు కొన్ని కలవు. తన్మండలవాసులు వ్యవహరించు విలక్షణాంధ్ర వాఙ్మయమునుండి గ్రంథస్థము కాఁదగినపదము లెన్నియో గలవు. ఇటు లేయాంధ్రవాఙ్మయ మమితమైనదను నిర్ణయమున కీయాంధ్రపదనిధానము తోడ్పడఁ గలదు. త్రిలింగములలో నొకటియగు కాళేశ్వరక్షేత్రమునకు నెలవైన పశ్చిమాంధ్రదేశమున నెన్నియో యుత్తమగ్రంథములు నన్నయనాటినుండి నిన్నటి

వరకు బయలు వెడలినవి. అందు ఆంధ్రనగరమని పేరొందిన ఓరంగల్లు ఆంధ్రకావ్యరత్నములకు ఖని. భాస్కరరామాయణ భాగవత సీతారామాంజనేయాది గ్రంథరత్నముల కీఖనియే మాతృస్థానము. అదృష్టవశమునను ఆంధ్రపరిశోధకుల సుకృతవశమునను లభించిన కోహినూరురత్న మీయాంధ్రపదనిధానము. ప్రకృతిసిద్ధమగు నీదివ్యరత్నమునకు సంక్రమించిన స్వల్పదోషముల సంస్కరించి మెఱుఁగుపెట్టి నవకాశ మొదవిన మేమెంతయు ధన్యులము.

రామదాసకవి యీనిఘంటువును పూర్తిచేసి చివరకాండమును సంస్కరించి టీకవ్రాయనారంభించి రాచపుండుచే బాధనొంది యచిరకాలమున స్వర్గతుఁడగుటచే నూతనసంస్కరణము తృతీయకాండమునందు విశేషించి జరుపవలసివచ్చినది. ఓరుంగల్లులోని దర్శనీయప్రదేశములలో స్మారకచిహ్నమనదగు రామదాసకవిసమాధి యొకటి. ఇది బాలనగరసమీపముగా నున్నది.

ఆంధ్రనగరమని ప్రసిద్ధివహించిన ఓరుంగల్లుమండలమున గ్రంథపరిశోధనము శాసనపరిశోధనము జరుపు తరుణమునఁగొన్నిదినములు ఓరుంగల్లునివసించితిమి. స్థానికులును శబ్దానుశాసన గ్రంథాలయస్థాపకులును సౌజన్యభావులునగు తూము నరదరాజులు గారికి మాకు నవ్యాజమగు స్నేహము కుదిరెను. వారు మాయుద్యమమును దమయన్నగారును ధర్మస్వభావులును న్యాయవాదులునగు తూము రంగయ్యగారికిఁ జెప్పి పరిశోధనోద్యమమందు మాకు నెంతేని సాయంబు చేయించిరి. అనంతర మొకదినమున మీయింట నేమేని ప్రాచీన గ్రంథములు గలవాయని ప్రశ్నించ తమతండ్రియగు రామదాస కృతగ్రంథపేటిక మాముందుపెట్టిరి. జీర్ణాతిజీర్ణములగు నాగ్రంథములనుండి పుస్తకాకారముగనున్న యీయాంధ్రపదనిధానమును వెలికిఁదీసి పరిశీలించితిమి.

గ్రంథకర్తకుమారులగు తూము రంగయ్య గారు మాప్రోత్సాహమున గాపాడించి యాంధ్రభాషోపకారముగ ఆంధ్రపదనిధానమును ముద్రించుటకు వలయునంతధనము నొసంగి ముద్రణభారము గ్రంథసంస్కరణభారము మాతలపయి బెట్టి చివికి జీర్ణమైయున్న కాకితములకట్టను సంస్కరించి శుద్ధప్రతివ్రాసి నాలుగుసంవత్సరములు తీవ్రకృషిచేసి గ్రంథరూపముగ నీయాంధ్రపదనిధానము నాంధ్రలోకమునకు సమర్పింపఁగలిగితిమి.

మేమొకతావునను ముద్రణాలయము మఱొకతావునను నుండుటచే నెన్నివిధముల బరిశీలించినను దోషములు దొరలినవి. ద్వితీయముద్రణమున కవకాశము లభించినచో నిర్దుష్టతరముగ నీగ్రంథమును బరిష్కరింపఁ గలము.

ఈగ్రంథమును ముద్రించుపట్ల ప్రత్యేకశ్రద్ధగైకొన్న బెజవాడభవానీ ముద్రణాలయమువారికిఁ దొలుత కృతజ్ఞతఁ దెలుపుట మాప్రధానధర్మము.

ఆంధ్రపదనిధానమును ముద్రించి ప్రచురించినచోఁ బితౄణవిముక్తులగుటయెగాక యాంధ్రలోకోపకారు లగుదురని చెప్పినంతన వ్యయభారమున కోర్చి గ్రంథప్రకటనమునకు దోడ్పడిన తూము రంగయ్యగారికిని — అభిమానపూరితులై ముద్రితభాగములఁ బరిశీలించుచు సంస్కరణముల కానందించుచు మాకుఁ బ్రోత్సాహమిచ్చిన తూము వరదరాజులు గారికిని — సంతోషపూర్వకముగ ధన్యవాదముల నొనర్చుచున్నారము.

పితృగౌరవము నూతఁగొని యీయుత్తమగ్రంథము ప్రకటించి తమపిత్రువరుఁడగు రామదాసకవి శ్రమ సార్థక మొనర్చిన తూము రంగయ్య సర్వేశము, వరదరాజులు గారల యుదారభావముపై నింకఁ గొంతగ్రంథప్రచురణ మాధారపడియున్నది.

ఇట్లు భాషాసేవకులు,

| | | |
|---|---|---|
| నందిగామ,<br>శుక్ల సం॥ మాఘ బ ౧౨ | } | శేషాద్రిరమణకవులు,<br>శతావధానులు. |



శ్రీమతేరామానుజాయనమః.

# ఆంధ్రపదనిధానము

శా॥ శ్రీమించన్ గరిరాజునైకె మకరముఁ శిక్షించి తద్ద్వేభవో
ద్దామం బిచ్చుటఁజూపుదంచు రమనత్యంతంబు లాలించి త
ద్భామాద్విస్తనమధ్య నొక్కమకరిన్ వాలెంబుఁ జిత్రించి లీ
లామర్షంబును మాన్పు శౌరిగొలుతున్ లావణ్య మొప్పారఁగన్

చ. కలుములపట్టు శౌరిగుణగాథలబిట్టు మునీంద్రకోటిహృ
జ్జలరుహపాళినట్టు జలజాతకదంబకమాటపట్టు లే
ములతడకట్టు శక్రసతిమోసలపాలిటి పెట్టుఁజెట్టు ము
క్తులతలకట్టునౌ రమను గోరికలూర భజింతునెప్పుడున్. 2

సీ. సకలకల్మషఘోరశర్వశపటలత్వి
షాంపతియగు సుదర్శనము నెంతు
నరితతిషండంబు లవియంగరొదసేయు
పాంచజన్యంబును బ్రస్తుతింతు
హరిపదంబుల కసురాళియాదలలకు
ఘటకత్వమగు నందకముభజింతు
దైవతావనితాళి తాళికినభయప్ర
దాయియౌ శార్ఙ్గంబుఁ దలతుఁనెపుడు

గీ. మదముపొదలఁగ మొదలుఖట్టిదుల పొదల
కొదల దరిబెడిఁదవుఁ బదనెమఁగుకుదిర
చదలుకాపుల మదియెద సెదగఁ ద్రోలి
ముదమొదవు బల్లిదపుగద నెదఁదలంతు.

కం. మురవైరిశయ్యాయాఫణి
వరునిపదాంబురుహములను బక్షీంద్రునిప
త్సరసిజముల సూత్రవతీ
శ్వరునిచరణకమలములను వర్ణింతుమదిన్.

సీ. హారిగుణామృతసంగ్రహము నాథమునిగిరి
వర్షించు శఠకోపవారిదమును
గుసపఙ్క్తిచూత్తిక సురుచిరహారశో
భితతపఃఫలంబగు యతిపతులను
వచనభూషణ గోప్యవాక్సుధారస విశ
దీకరవరయోగి దేశికులను
ప్రణవాంతరవిహారవాధూలగోత్రమ
గ్ధాబ్ధీందులగు సింగరార్యమణులఁ
గీ. దలఁచి స్తుతియింపి భజియించి కొలిచి వినుతి
జేసి రంగార్యులకు వేడ్క దోసిలొగ్గి
సకలభాగవతాంఘ్రికంజాతజాత
రసమిళిందాయమానమానసుఁడనయ్యు.

సీ. ఆంధ్రభాషాపటిమాభ్యాసమొసరించు
బాలుర కతిసులభంబుగాఁగ
అఖిలాంధ్రమిళితవాక్యస్వరూపంబగు
శబ్దరత్నాకరసఖ్యమునను
బ్రతిశబ్దమునకుఁగూర్చి పదములురాసుల
నమకించి నామలింగానుశాస
నముగతి వర్గాళి నమరించినను కూర్చి
తనరార తెలుఁగువృత్తములఁగూర్చి

గీ. యాంధ్రపదనిధానమనియొక్క నొకనిఘం
టువురచింతు పెక్కు చివరలందు
జాడఁదెల్పనిపుడు సంస్కృతపదములఁ
జిత్తగింపు మానిచిత్తహారి.

సీ. స్వర్గవర్గను వ్యోమవర్గ దిక్కాలధీ
వాక్ఛబ్దముఖనాట్యవర్గలు బలి
వాసవర్గను భోగివర్గ నారకవారి
వర్గలు భూపురవర్గలు గిరి
వర్గ వనౌషధివర్గ సింహాదినృ
వర్గలు బ్రాహ్మణవర్గ భుజజ
వైశ్యవర్గలు శూద్రవర్గ విశేష్యని
ఘ్నాఖ్య సంకీర్ణనానార్థవర్గ

గీ. లవ్యయముగూడ నిరువదియారు నివియు
బారపది తిగ వంచగాఁ బంచి మూఁడు
కాండములఁజేసి నీకిత్తుకట్టనంబు
వేడ్కతో బాలనగరీశ వేంకటేశ. 7

వ. అంను స్వర్గాది ప్రథమకాండం బెట్టులనిన. 8

క. హితపుర హరనత సురవర
హితసురపర నుతకరివర యతివరవరదా
శతఖరకరజితసురుచిర
ధృతవరధర జితముపశర స్థితగరుడరథా. 9

క. ధరఁ దూముకులవనధిశశ
ధరుడఁగు సర్వేశదాస తనయుండ భవ
చ్చరణాంబుజాతరసహృ
చ్ఛరితోన్మత్తుఁడను రామదాసాహ్వయుఁడన్. 10

చ. సుకవుల వేఁడుకొందు నొకచో నొకటంగలతప్పులెన్నకే ల్
వికటముమాని యొప్పులను వేగ్రహియింపను రాజహంసము
నికమగుపాలు గైకొనుచు నీళ్లనుమానినభంగి యంచుఁనేఁ
గుకవులవాతరట్టులయి కూసెడువారిఁదలంపనేటికిన్. 11

ఉ. ఏనువచించు పల్కులను వ్యాప్తిగలిన్మది తప్పులెన్నకే
పూనిగ్రహింప నొప్పులని పుత్రుఁడుకందువమాటలాడినన్

మానుగఁ దేనెలూఱ బలుమత్తిలి తద్రసపంక్తిజాత స
న్మానసుఁడైన తండ్రికొను మాదిరిఁగై కొసవేఁ రమావరా. 12

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా భవదీయపాదారవిందనిస్రుత మకరందబిందుసందోహతుందిలేందిందిరాయమాణమానసుండనై రచియింపంబూనిన యాంధ్రపదనిధానం బను నిఘంటువుక్రమం బెట్టిదనిన.

---

# స్వర్గవర్గ

క. విను ప్రోలన జేజేప
ట్టనవిన్వాలననఁగ జేజెయండ యనంగన్
మినువీడన మినువలనన
వనజభవాశ్రితపదాబ్జ! స్వర్గాఖ్యలగున్. 1

విను, ప్రోలు, జేజేపట్టు, విన్వాలను, జేజేయండ, మినువీడు, మినువలను ఇవి స్వర్గమునకుఁ బేళ్లు.

సీ. తెలిగంట్లు జేజేలు దేవుళ్లుచదలుకా
పులు బాసవాళ్లు వేల్పులును మింటి
తెలివళ్లు జన్నపుదిండ్లు జేజెల్ విను
తెరవరులును గంగిదిండులనఁగ
వినుదిమ్మరులనంగ వేలుపులనఁగను
దేవతాహ్వయములౌ దేవదేవ
దేవుఁడు దయ్యంబు దేవర ముప్వేక
లాడన భవదాహ్వయమ్ములౌను
గీ. వెలయు నప్సరసలకు నభిఖ్యలయ్యె
యచ్చరలనంగఁ దెఱిగంటులనఁగ వేల్పు
గరితలనఁగను బుడమిలోఁ గలుషవార్ధి
తరణిచరణాంబుజాత విధాతృనేత. 2

తెలిఁగంట్లు, జేజేలు, వేల్పులు, చదలుకాపులు. బాసకాళ్లు, వేల్పులు, మింటితెరువరులు, జన్నపుదిండ్లు, జేజెలు, మిగుతెరవరులు, గంగదిండ్లు, మిన్నుద్రిమ్మరులు, వేలుపులు ఇవి దేవతలకుఁ బేర్లు. దేవుఁడు, దయ్యము, దేవర ముప్పొకలాడు, ఇవి భగవంతుని పేర్లు. అచ్చరలు తెలిగంటులు వేల్పుగరితలు ఇవి యప్సరసలకుఁ బేర్లు.

సీ. రక్కసి రాకాసి రక్కసీఁడును రక్క
సుండు రేఁద్రిమ్మరి సోకునల్లఁ
బ్రావుఁడు వేలుపుదాయ సోఁకుఁడు తోలు
వేలుపనంగ బ్రావేల్పు, పొలసుఁ
దిండియనంగ రేఁద్రిమ్మరీఁ డీరువుఁ
దిండినా మానిసిఁదిండి యెఱచి
మేఁపరియన పొలమేఁతరి యనఁగను
రాక్షసాఖ్యలు ఘోరరాక్షసారి
తే. రక్కసియనంగ రాకాసి రక్కసలనఁ
దిండివెలఁదియనఁగఁ బొలదిండినాఁగ
నవని రాక్షసకన్యకాఖ్యలగుచు
వఱలె బాలపురాధీశ భవవినాశ. 3

రక్కసి, రాకాసి, రక్కసీఁడు, రక్కసుఁడు, రేఁద్రిమ్మరి, సోకునల్లఁ బ్రావుఁడు, వేలుపుదాయ, సోఁకుఁడు, తోలువేల్పు, బ్రావేలుపు, పొలసుతిండి, రేఁద్రిమ్మరీఁడు, ఈరువుఁదిండి, మానిసిఁదిండి, ఎఱచిమేఁపరి, పొలమేఁతరి, ఇవి రాక్షసుని పేర్లు, రక్కసి, రాకాసి, రక్కస, తిండివెలఁది, పొలతిండి ఇవి రాక్షసస్త్రీకిఁ బేరులు.

సీ. బొమ్మంచరౌతుడుపు మోము వేలుపు తాత
తొలువేల్పు దుగినుఁడు నలువ బమ్మ
చదువులముదుకఁడు చదువులవేలుపు
పెద్దవేలుపు వేల్పుపెద్ద మొదటి
వేలుపు పొక్కిలిచూలి తామరచూలి
తమ్మిపుట్టువు ముళ్లతబసి తండ్రి
నిక్కపుజగమేలునేర్పరి యననివి
ధాత్రభిఖ్యలుజెల్లు ధరణిఁబల్కు
తే. చెలియ పొత్తువు చదువులచేడియయును
మినుకుగుబ్బెత చదువులమిన్న యన్ను
నలువ పడఁతి యనంగను జలరుహాయ
తాక్ష! వాణి కభిఖ్యలై యలరుభువిని. 4

బొమ్మ, అంచరౌతు, ఉడుపుమోము వేలుపు, తాత, తొలువేల్పు, దుగినుఁడు, నలువ, బమ్మ, చదువులముదుకఁడు, చదువులవేలుపు, పెద్దవేలుపు, వేల్పుపెద్ద, మొదటివేలుపు, పొక్కిలిచూలి, తామరచూలి, తమ్మిపుట్టువు, ముళ్లతబసితండ్రి, నిక్కపుజగమేలునేర్పరి, ఇవి బ్రహ్మదేవుని పేర్లు. పలుకుచెలియ, పొత్తువు, చదువులచేడియ, మినుకుగుబ్బెత, చదువులమిన్న అన్ను, నలువపడఁతి, ఇవి సరస్వతీదేవి పేర్లు.

క. నారదునకాఖ్యలౌ నా
ర్వేరపురుసి ముళ్లతపసి వేల్పుతపసి నా
సారెలెపుడు మీఁటెడు జడ
దారియనఁ బోరుతిండి తపసి యన హరీ. 5

ఆర్వేఁగపురుసి, ముక్లతపసి, వేల్పుతపసి, సారెలెపుముని, బెమజవారి, పోరుబెండితపసి, ఇవి నారదునికి పేర్లు.

సీ. నలమేనిదొర పచ్చవలువదాలుపు గట్టు
తాలుపు కరివేల్పు తమ్మికంటి
గరుడికా తాలకాపరి వలమురితాల్పు
పక్కిడాల్వేలుపు పసిఁడివల్వ
దారి రక్కసిగొంగ తమ్మిపొక్కిలి లచ్చి
మగఁడు వెన్నుఁడు మామమామ చుట్టు
వాలుజో దుడ్పనకేల్వేల్పు ముజ్జగం
బులబొజ్జదేవర నలువతండ్రి
తే. యనఁగ భవదీయనామంబులౌను శౌరి
మరునిఁగన్నయ్య నలమేనిదొర యనంగ
వెన్నదొంగ కన్నయ్యనాఁ వెన్నుఁడనఁగ
నవని భవదవతార కృష్ణాహ్వయములు. 6

నల్లమేనిదొర, పచ్చవలువదాలుపు, గట్టుఁతాలుపు, కరివేల్పు, తమ్మికంటి, గరుడికాతు, ఆలకాపరి, వలమురితాలుపు, పక్కిడాల్వేలుపు, పసిఁడివల్వదారి, రక్కసిగొంగ, తమ్మిపొక్కిలి, లచ్చిమగఁడు, వెన్నుఁడు, మామమామ, చుట్టువాలుజోదు, ఉడ్పనకేల్వేల్పు, ముజ్జగంబులబొజ్జదేవర, నలువతండ్రి ఇవి విష్ణుదేవునిపేళ్లు. మరునిగన్నయ్య, నల్లమేనిదొర, వెన్నదొంగ, కన్నయ్య, వెన్నుఁడు ఇవి కృష్ణునిపేళ్లు.

క. సింగఁడనంగను మానిసి
సింగఁడు కంబముదొర నరసింగఁడనంగా

రంగద్విహంగతుంగతు
రంగ! నృసింహాఖ్యలగుచు రాజిలునుర్వీ! 7

సింగఁడు, మానిసిసింగఁడు, కంబముదొర, నరసింగఁడు, ఇవి నృసింహదేవుని పేళ్లు.

తే. నేలకూఁతురు నాగటిచాలుపేరి
యతివ యన సీత; సీరాముఁ డనఁగ రాముఁ
డొప్పు; తిమ్మప్పఁ డనఁగఁ దిమ్మప్పయనఁగ
వెంకటేశాఖ్యలై యొప్పు వేదవేద్య. 8

నేలకూఁతురు, నాగటిచాలుపేరియతివ ఇవి సీతాదేవి పేళ్లు. సీరాముఁడు ఇది శ్రీరాముని పేరు. తిమ్మప్పఁడు, తిమ్మప్ప ఇవి వెంకటేశ్వరుని పేళ్లు.

ఆ. నాగటిదొర యొంటిప్రోగును వెలిమేని
వాఁడు నెత్తినీళ్లప్రోడ ఉక్కి-
వాలుజోదు నల్లవలువతాలుపు
తాటి పడగదారి యనఁగ బలుఁడు దేవ. 9

నాగటిదొర, ఒంటిప్రోగు, తెలిమేనివాఁడు, నెత్తినీళ్లప్రోడ, ఉక్కివాలుజోదు, నల్లవలుపతాల్పు, తాటిపడగదారి, ఇవి బలరాముని పేళ్లు.

చ. కలిమినెలంత లచ్చిచెలి కల్మిలపొల్తుక తమ్మియింటిపై
దలి సిరి తల్లితల్లియును దామరనట్టువ పైఁడిచాన పూ
విలుతునితల్లి లచ్చి కరివేలుపుటాలు జగంబుతల్లి త
మ్మిలకయిచానయుంగడలిబుట్టువులక్కిమినాఁగలక్ష్మియా.

కలిమిచెలంత, లచ్చిచెలి, కల్మితాల్పుక, తమ్మియింటిపైదలి, సిరి, తమ్మికన్నె, తామరసబ్బువ, పైఁడిచాన, పూవిల్తునవ్వ, లచ్చి, కడలిరేనిపట్టి, జగముతల్లి, తమ్ములకైచాన, కడలిఁబుట్టువు, లక్కిమి యనునివి లక్ష్మీదేవికిఁ బేర్లు.

సీ. అలరువిల్తుఁడు కమ్మవిలుకాఁడు చక్కెర
  విలుకాఁడు మరుఁడు పూవింటిజోదు
వలదొర సిరిచూలి వాలుగడా లించు
  విలుతుండు వలపులవేఁటకాఁడు
తుంటవిల్తుఁడు వెడవింటి నెయ్యపుఱేఁడు
  తామరతూపరి తలఁపుచూలి
వలపురాయఁడు తావివిలుకాఁడు జేసికై
  దువుజోదు ననవిలుతుండు తీఁగె
గీ. విలుతుఁడిగురులవిలుకాఁడుచిలుకరౌతు
పచ్చవాల్తపుజోదునులచ్చికొడుకు
పచ్చవిలుతాలుపు మొసలిపడగదారి
యనఁగనివిమన్మథునకాఖ్యలంబుజాక్ష. 11

అలరువిల్తుఁడు, కమ్మవిలుకాఁడు, చక్కెరవిలుకాఁడు, మరుఁడు, పూవింటిజోదు, వలదొర, సిరిచూలి, వాలుగడాలు, ఇంచువిలుతుఁడు, వలపువేఁటకాఁడు, తుంటవిల్తుఁడు, వెడవింటినెయ్యపుఱేఁడు, తామరతూపరి, తలఁపుచూలి, వలపురాయఁడు, తావివిల్కాఁడు, జేసికైదువుజోదు, ననవిలతుఁడు, తీఁగెవిలుతుఁడు, ఇగురులవిల్కాఁడు, చిలుకరౌతు, పచ్చవాల్తపుజోదు, లచ్చికొడుకు, పచ్చవిల్తాలుపు, మొసలిపడగదారి అనునివి మన్మథుని పేర్లు.

గీ. చుట్టుకైదువు గుడుసల్లు చుట్టువాలు
కంటివాలు వేయంచులకైదువు సుడి

వాలు బటువల్లు నాఁ బిల్లవా లనంగ
నఘనిశాభాస్కర! సుదర్శనాఖ్యలౌను. 12

చుట్టుకైదువు, గుడుసల్లు, చుట్టువాలు, కంటివాలు, వేయంచుల కైదువు, సుడివాలు, బటువల్లు, బిల్లవాలు, అనునివి చక్రమునకుఁ బేర్లు.

ఆ. వె. బిల్లవాల్జోడనఁగఁ గఱివేల్పుబూర
గొమ్ము వలమురి పాంచజన్యంబుపేళ్లు;
నీటియిక్కయనంగనునీటిపుట్టు
వనఁగఁ గౌస్తుభమునకాఖ్య లచ్యుతాఖ్య. 13

బిల్లవాలుజోడు, కరివేల్పు. బూరఁగొమ్ము, వలమురి, యనపాంచజన్యముపేర్లు. నీటియిక్క, నీటిపుట్టువు, అననివికౌస్తుభమణికిఁ బేర్లు.

పంచపాది. గీ. పాఁపమేపరి గురుడినాఁబక్కిఱేఁడు
బొల్లిగ్రద్ద చిలువతిండి బొల్లఁడు గరు
టాలమంతుఁడు వెన్నునిడాలు పులుఁగు
మన్నియఁడు గరుటామంతుఁడన్న పులుఁగు
బొల్లఁడన గరుడాఖ్యలై చెల్లె శౌరి. 14

పాఁపమేపరి, గరుడి, పక్కిఱేఁడు, బొల్లిగ్రద్ద, చిలువతిండి, బొల్లఁడు, గరుటాలమంతుడు, వెన్నునిడాలు, పులుఁగుమన్నియఁడు, గరుటామంతుడు, పులుఁగుబొల్లఁడు, ఇవిగరుడునిపేర్లు.

సీసమాలిక. అయిదుమోములవేలుఁ పాబోతురా తంగ
మొలవేల్పు నెలతాల్పు చిలువతాల్పు
తిగకంటి ముక్కంటి దిసమొలవేలుపు.
మినుసిగదేవర మిత్తిగొంగ

కార్తేఁడు మిక్కిలికంటిదేవర యగ్గి
కంటి పునుక తాల్పు కాటిఱేఁడు
గట్టువిల్తుఁడు వేఁడికంటి తెల్లనిసామి
విసపుమేతరి మిత్తివేఁటకాఁడు
జింక తాల్పరి నింగిసిగ కఱకంఠుఁడు
కొండయల్లుఁడు వెండికొండవిడిది
వేలుపు మిన్వాఁకతాలుపు వలదొర
సూడు జన్నపుగొంగ కోడెరౌతు
జడముడిజంగంబు కుడుములతిండిదే
వరతండ్రి ముమ్మొనవాలుదారి
తోలుఁదాల్పరి వాఁకతాలుపు చిచ్చఱ
కంటిదేవర బేసికంటిసామి

గీ. వలమల్లుఁడు గంగికైయలుగువాఁడు
నాఁగ బూచులయెకిమీఁడునాఁగ శివుని
కా॥ లబ్ధినివేశ మహాప్రకాశ
బాలనగరేశ యళికేశ భవవినాశ. 15

అయిదుమోములవేల్పు, ఆబోతురౌతు, అంగమొలవేల్పు, నెల తాల్పు, చిలువతాల్పు, తిగకంటి, ముక్కంటి, దిసమొలవేల్పు, మిను సిగదేవర, మిత్తిగొంగ, కార్తేఁడు, మిక్కిలికంటిదేవర, అగ్గికంటి, పునుక తాల్పు, కాటిఱేఁడు, గట్టువిల్తుఁడు, వేఁడికంటి, తెల్లనిసామి, విసపుమేతరి, మిత్తివేఁటకాఁడు, జింకతాల్పరి, నింగిసిగ, కఱకంఠుఁడు, కొండయల్లుఁడు, వెండికొండవిడిది, మిన్వాఁకతాలుపు, వలదొరసూడు, జన్నపుగొంగ, కోడె రౌతు, జడముడిజంగము, కుడుములతిండిదేవరతండ్రి, ముమ్మొనవాలుదారి,

తోలుదాల్పరి, వాఁకతాల్పు, చిచ్చరకంటిదేవర, జేసికఁటిసామి, వలమ లల్లుఁడు, గంగిక్రైయలుగువాడు, బూచులయొకిమీడు అననివి శివునకుఁ బేర్లు.

గీ. దుగ్గి మలయమ్మ యమ్మికదుగ్గ జండి
సత్తి కఱకంఠునిల్లాలు సామితల్లి
గట్టుచూలి గట్రాచూలి గట్లఱేని
పట్టి సింగమెక్కుడుజంత పార్వతియగు. 16

దుగ్గి, మలయమ్మ, అమ్మిక, దుగ్గ, చండి, సత్తి, కఱకంఠు, నిల్లాలు, సామితల్లి, గట్టుచూలి, గట్రాచూలి, గట్లఱేనిపట్టి, సింగమెక్కుడు, జంత, అననివి పార్వతీదేవిపేర్లు.

క. దనుజారి నందికగు బస
వనయనఁగా నాలఱేఁడు బసవఁ డనఁగఁ జే
ర్గొనె భువిని; త్రిశూలము ము
మ్మొనవాలనఁ దెనుఁగునందు ముదమొప్పారన్.

బసవన, ఆలఱేఁడు, బసవఁడు, అననివి నందికిపేర్లు. ముమ్మొనవాలు ఇదిత్రిశూలముపేరు.

సీ. కందుండు వేలుపుగమికాఁడు పుంజుఁదా
ల్పరి సామి యమ్మికపట్టి యగ్గి
చూలిముద్దయ తెల్లుచూలి కొమరసామి
కొంచగుబ్బలిప్రక్కలించుమేటి
నెమ్మికా తార్గురునెలఁతలబిడ్డఁడు
నెమ్మితాల్పరియును నెమ్మిఱేఁడు

తిగజంటమోములదేవరయన శక్తి
ధరునినామంబులౌ; చెఱుపుఱేఁడు

గీ. గుజ్జువేలుపు పిళ్లారి కొక్కిరౌతు
బొజ్జదేవర యేనుఁగు మోమువేల్పు
నొంటికొమ్మయ్య వెనకయ్య జంటతల్లుల
బిడ్డ కుడుములతిండి నా విఘ్నరాజు. 17

కందుఁడు, వేలుపుగమికాఁడు, పుంజుడాల్పరి, సామి, అమ్మిత్రకపట్టి, అగ్గిచూలి, ముద్దయ, ఱెల్లుచూలి, కొమరసామి, క్రౌంచగుబ్బలిప్రక్కలించుమేటి, నెమ్మిరౌతు, ఆఱ్గురినెలతలబిడ్డఁడు, నెమ్మితాల్పరి, నెమ్మిఱేఁడు, తిగజంటమోములదేవర, అనునివి కుమారస్వామికిఁ బేళ్లు. చెఱుపుఱేఁడు, గుజ్జువేల్పు, పిళ్లారి, కొక్కిరౌతు, బొజ్జదేవర, ఏనుఁగుమోమువేల్పు, ఒంటికొమ్మయ్య, వెనకయ్య, జంటతల్లులబిడ్డఁడు, కుడుములతిండి, అనునివి వినాయకుని పేళ్లు.

గీ. మలపగతుఁడు వేఁగంటియు మబ్బురౌతు
నొడలిచూపొడయఁడు వేల్పుటొడయఁడు సుర
తాణియును తూర్పుఱేఁడన దనుజవైల
వజ్రి వజ్రికభిఖ్యాలై వఱలె శౌరి. 19

మలపగతుఁడు, వేఁగంటి, మబ్బురౌతు, ఒడలిచూపొడయఁడు, వేల్పుటొడయఁడు, సురతాణి, తూర్పుఱేఁడు, అనఁగనివి, యింద్రునకుఁ బేళ్లు

క. మలపగతునిరాణియనం
బెలఁగెను సురతాణియనఁగఁ బెల్లై శచికి; వే
ల్పులబోనము సుధపేరై
ఖిలసిల్లెను కలుషభంగ విహగతురంగా. 20

మలపగతునిరాణి, సురతాణి, అనునివి శచీదేవికిఁబేళ్లు. వేల్పుం బోనము, ఇది అమృతమునకుఁ బేరు.

గీ. వేలుపులగారు చౌదంతి వెలిగవురన
నిలను నైరావతాఖ్యలాయె; వెలిమావు
నిక్కువీనులఁజక్కి నా నెలవుకొనెను
ధరణి నుచ్చైశ్రవాఖ్యలై దనుజవైరి. 21

వేల్పులగారు, చౌదంతి, వెలిగవురు, అనునివి యైరావతమునకు పేళ్లు. వెలిమావు, నిక్కువీనులజక్కి, అనునివి నుచ్చైశ్రవమునకు పేళ్లు.

సీ. వెలిమ్రానువినుమ్రాను వేలుపుఁజెట్టీవి
మ్రాననంగఁ బుడుకుమ్రాను పెట్టు
జెట్టును మెచ్చులఁజెట్టనఁ గల్పకా
ఖ్యలు; పుడుకుదోడుకు వెలిమొదవును
వేలుపుగిడ్డియు వెలిగిడ్డియావుల
మొదవన నామముల్ కుదిరె కాను
ధేనువునకు; వేల్పుమానికం బీవుల
రతనంబునా జాగరతనమనఁగఁ

గీ. దలఁపుఁజాయి పుడుకుగల్లు తలఁపుమిన్న
యనఁగఁజింతామణికినాఖ్యలౌను; పిడుగు
వాలు నాఁగ నూఱంచులవాలు జాతి
వాలు మగజాతివాలన వజ్రమగును. 22

వెలిమ్రాను, వినుమ్రాను, వేలుపుఁజెట్టు, ఈవిమాను, పుడుకుమ్రాను, పెట్టుజెట్టు, మెచ్చులజెట్టు, అనునివి కల్పవృక్షమునకుఁ బేళ్లు. పుడుకుదోడుకు

వెలమొదవు, వేలుపుగిడ్డి, వెలిగిడ్డి, యీవులమొదవు ఇవి కామధేనువునకు పేర్లు. వేల్పుమానికము, ఈవులరతనము, చాగరతనము. తలఁపుఱాయి, పుడుకుఱాల్లు, తలఁపుమిన్న అనునివి చింతామణికిఁ బేర్లు. పిడుగువాలు, నూఱంచులవాలు, జాతివాలు, మగజాతివాలు అనునివి వజ్రాయుధమునకు పేర్లు.

సీ. జంటమోముల వేల్పు చాగంటి కరువలి
విందు తగరురౌతు వేఁడివేల్పు
నీఁటికానుపు గాడ్పునెచ్చెలి సెగఱేఁడు
కప్పుతెరువరి యుగాలిమిత్త
యనఁగ నెఱ్ఱని వేలు పన నీరుపాఁపనా
నంటగిట్టని వేలు పనఁగ నగ్గి
సతనాలుకలజేజె సవి యగ్ని దేవుని
నామధేయంబులై భూమినలరు;
గీ. వారువపుట్టగ్గియనఁగను, నీరుచిచ్చు
నాఁగ బడబానలమునకు నామములగు;
నెరగలియనఁగఁ గారగ్గి యెరవలియనఁ
ధరణి దావానలాఖ్యలు గరుడగమన. 23

జంటమోములవేల్పు, చాగంటి, కరువలివిందు, తగరురౌతు, వేఁడివేల్పు, నీటికానుపు, గాడ్పునెచ్చెలి, సెగఱేఁడు, కప్పుతెరువరి, గాలిమిత్త, ఎఱ్ఱనివేల్పు, నీరుపాఁప, అంటగిట్టనివేల్పు, అగ్గి, సతనాలుకలజేజె, సవిఅనునివి యగ్నిదేవునిపేర్లు. వారువపుట్టగ్గి, నీరుచిచ్చు, అనునివి బడబానలముపేర్లు. ఎరగలి కారగ్గి ఎరవలి అనునివి దావానలముఁపేర్లు.

క. కణఁ కగ్గి కిత్తి యింగల
మన నింగిలమనఁగ నిప్పు సగిసి నిపుక చి
చ్చన నిప్పుకయన నిద్ధర
ననఘా యినియగ్ని కాఖ్యలై విలసిల్లున్. 24

కణఁకు, అగ్గి, కిత్తి ఇంగలము, ఇంగిలము, నిప్పు, అగిసి, నిపుక, చిచ్చు, నిప్పుక అనునివియగ్నినికిఁ బేర్లు.

ఆ. వె. మిడుఁగురు నిప్పుకల పరులు మిణుఁగురులన
విస్ఫులింగాఖ్యలౌను గోవింద;కనలు
మెలకు మంటనజ్వాలాఖ్యలలరుచిచ్చు
అయనచిచ్చుఅనానగ్నిమయము పేర్లు. 25

మిడుఁగులు, నిప్పుకలు, మిడుఁగురులు, అనవిస్ఫులింగములపేర్లు. కనలు మెలకు, మంటు, అనునివిజ్వాలలపేర్లు. చిచ్చులు, చిచ్చుట, అనునివి అగ్నిమయము పేర్లు.

క. బుసి బుగ్గి బూది వెల్మిడి
బసుమము నీఱు నిగుడనఁగఁ బదడనఁగా నీ
వసుమతిభస్మాభిఖ్యలు
భసలాలక కమలనేత్ర భవ్యచరిత్రా. 26

బుసి, బుగ్గి, బూది, వెల్మిడి, బసుమము, నీఱు, నిగుడు, పదడు అనునివి భస్మమునకు పేర్లు.

తే. గీ. జమునసైదోడు పితరులసామి గుదియ
తాలుపరి జము డనఁబ్రాద్దుచూలిఁ దక్కి

గొరగొర తురితంబు దురము జకీలున
బిరబిర బోరన బిఱబిఱ వెస
తుఱుతు తటాలున తుఱ్ఱు తటుక్కున
నెప్పరంబు తురీన నెప్పళంబు
వేశిరంబు జకీన వేళంబు వైళంబు
బిసబిస వైడంబు బిట్టు బిఱ్ఱు
సిరరసు బిఱాన తెప్ప తెరలగ వే
దురుసు పొటుక్కున తొరన చెరచెర
సరగ పదరు బిట్టు జఱ్ఱున సరిగున
క్రచ్చర గొబ్బున క్రన్న వేగ
గ్రక్కున గ్రక్కన గ్రిమ్మన గ్రద్దన
తటకున దబ్బున దారున తడు
కున బిఱీన తటాన గుబ్బన పొటుకున
చివ్వన జివ్వన చెచ్చెరయును

గీ. చయ్యన బిఱీల్న జిఱ్ఱున చట్టనయును
తెప్పునయును దిగ్గునయును దిగ్గన యన
త్వరితమున కాఖ్యలై యొప్పు దనుజగోత్ర
గోత్రహాతగోత్రి ధృతగోత్రి చిత్రగాత్ర. 32

అత్త్యగము, అడచిపాటు, ఆత్రము, అతిచుఱి, ఉత్తలము, క్రచ్చర, తమి, సమకము, పడి; గొరగొర, తురితము, దురము, జకీలున, బిరబిర, బోరన, బిఱబిఱ, వెస, తుఱుతు, తటాలున, తుఱ్ఱున, తటుక్కున, నెప్పరము, తురీన, నెప్పళ

తామసము, అననివి ఆలస్యమునకు పేళ్ళు. జంపాలు, మందుడు. అనునవి, మాంద్యమునకు పేళ్ళు. వాలూర అన ఆలస్యమగుటకు పేరు.

గీ. మస లలయునంటుగొట్టిన నుసలునట్టు
  గొట్టసరవేయు నన నండగొనను నామ
  నికరములరౌ నాలస్యమునకు; తెఱపి
  బిడువెడమునాఁగ ననకాశమునకరౌఁ. ౩౪

మసలు, అలయు, అంటుగొట్టు, నుసలు, నట్టుగొట్టు, అసరవేయు అండగొను, అన ఆలసించుటకు పేళ్లు. తెఱపి, బిడువు, ఎడము, అన అవకాశమునకు పేళ్లు.

క. ఎడతెగనిది సతతమెల్ల
  ప్పుడుజొంపమునిచ్చవాలెమునెపు డసంగా
  జడి వాలాయమనంగన్
  పుడమి నిరంతరముపేళ్లు పుణ్యచరిత్రా. 35

ఎడతెగనిది, సతము, ఎల్లప్పుడు, జొంపము, నిచ్చ, వాలెము ఎపుడు, జడి, వాలాయము, అననివి నిరంతరమునకు పేళ్లు.

సీ. ముక్కంటిచెలికాఁడుమరొక్కపుదొరలచ్చి
    రాయఁడువానీఁడుకాయకంటి
  పసిఁడిరాయఁడు మానిసిరౌతు వడచక్కి
    సామి బాబారౌతు జక్కినీఁడు
  జక్కులరాయఁడు చాగకాఁడనఁగు బే
    రాఖ్యలు;జక్కులుయక్షులకగు;

పక్కియొడలుఁవాఁడు పక్కి నైతాలుపు
కిన్నరాఖ్యలునయ్యెఁ; గింపురుషుని

గీ. కాఖ్యగుజ్జుపుమోము వేల్పనఁగఁజెల్లు;
జక్కినియనఁగు బేరునిసతికి పేరు;
నిధికి లిబ్బియనంజెల్లు నిజము; వేల్పు
గాణ గంధర్వునకుపేరు గానలోల. 36

ముక్కంటిచెలికాఁడు, రొక్కపుదొర, లచ్చిరాయఁడు, వానీడు కాయకంటి, పసిఁడిరాయఁడు, మానిసిరవుతు, వడచక్కిసామి, బాబా రాతు, జక్కినీఁడు, జక్కులరాయఁడు, నాగకాఁడు, అనగనివి కుబేరుని పేర్లు. జక్కులు, అన యక్షులకుపేరు. పక్కియొడలువాఁడు, పక్కిమెడ తాల్పు అనగాకిన్నరుని పేర్లు. గుజ్జుపుమోము వేల్పు, కింపురుషుని పేరు. జక్కిని, ఇదికుబేరునిభార్య పేరు. లిబ్బి, ఇదినిధికి పేరు. వేల్పుగాణ, అనఁగా గంధర్వుని పేరు.

క. కడదెసగాపరియనఁగా
వడచక్కటిచెలిమి త్త పాఁపతొడవుదే
వుఁడు జడముడిజంగంబన
నడరివి యీశాన్యునాఖ్యలై మురవైరీ! 37

కడదెసఁగాపరి, వడచక్కటిచెలిమిత్త పాఁపతొడవుదేవుఁడు జడముడిజంగము, అనగా యీశాన్యునకు పేర్లు.

క. దేవళము దద్దళముఁగుడి
కోవెల దద్దడము నగరు కోయిలయనఁగా

దేవాలయనామములౌ
పావనచారిత్ర స్వర్గవర్గిలముగిసెన్. 38

దేవళము, దద్దళము, గుడి, కోవెల, దద్దడము, నగరు, కోయిల, అనగా దేవాలయమునకు పేర్లు.

స్వర్గ వర్గు ముగిసెను.

---

# వ్యోమ వర్గు

గీ. బయలు చదలాకసము నింగి బైలు విన్ను
విను మొగులుదారి యుప్పరవీది వేల్పుఁ
దెరువు మిను మిన్ను చుక్కలతెరువు మబ్బు
దారి యుప్పరమన ననంతంబు పేళ్లు
వఱలముగిసె ధరణి వ్యోమవర్గుశౌరి. 39

బయలు, చదలు, ఆకసము, నింగి, బైలు, విన్ను, విను, మొగులుదారి, ఉప్పరవీది, వేల్పుఁదెరువు, మిను, మిన్ను, చుక్కలతెరువు, మబ్బుదారి, ఉప్పరము అననివి ఆకాశమునకుఁ బేళ్లు.

వ్యోమ వర్గు ముగిసెను

# దిగ్వర్గ

గీ. కెలఁకు చక్కటి కడ దెస కెలను చెఱఁగు
వలను వలఁకు వలంకువు చెలఁగె దిశకు;
దక్కినము వలకడనాఁగ దక్షిణంబు;
తూరుపనఁ బూర్వదిశకొను తోయజాక్ష. 40

కెలఁకు, చక్కటి, కడ, దెస, కెలను, చెఱఁగు, వలను, వలఁకు, వలంకువు, అననివి దిశకుఁ బేర్లు. దక్కినము, వలకద, అనఁగా దక్షిణముఁ బేర్లు. తూరుపుఅనగా పూర్వదిశకుఁ బేర్లు.

ఆ.వె. పడమర వెనుకనఁబశ్చిమనామముల్;
కోన మూల రోక గొందియనఁగఁ
బుడమికోణంబొను;వడచక్కియనఁగ ను
త్తరముదిక్కగును దానవారి. 41

పడమర, వెనుక అననివి పశ్చిమదిశకుబేర్లు. కోన, మూల, రోక గొంది, అననివి కోణమునకుబేర్లు. వడచక్కి అనగా ఉత్తరదిశకుబేరు.

క. ఎగువ పయి మీఁదు నుప్పర
మగునూర్ధ్వదిశకు; నధోదిగాఖ్యలు భువిలోఁ
దిగువాటు క్రిందు క్రిందల
దిగసన దిగునయనఁ జెల్లు దీనశరణ్యా. 42

ఎగువ, పయి, మీఁదు, ఉప్పరము అన ఉపరిభాగమునకుపేర్లు. దిగువాటు, క్రింపు, క్రిందల, దిగసన, దిగువ, అననివి అధోభాగముపేర్లు.

సీ. చక్కియ బగి బరి సంగడి దెస కోపు
పఱగడ మే మెయి పఱగడంబు
పక్క పక్కియ వైపు ప్రక్క వలను కెడ
చాయ కెలను క్రేవ చాయతట్టు
వంకయనఁగ నిత్య బహువచనంబున
సూరెలనంగ వసుమతినౌను
పార్శ్వభాగముపేళ్లు; వలపల కుడి వల
ననఁగ దక్షిణభాగమునకుఁబేళ్లు;
గీ. డా యెడమ పుఱ్ఱ డాకడ డాపలయన
దాపలయనంగఁ దెలుఁగునఁ దనరె వామ
భాగమునకు నభిఖ్యలై బాలనగర
నిలయ సుమనఃకిరీట మణీగణపరి
చుంబితనఖాళియుత చరణాంబుజాత. 43

చక్కియ, బగి, బరి, సంగడి, దెస, కోపు, పఱగడ, మే, మెయి, పఱగడము, పక్క, పక్కియ, వైపు, ప్రక్క, వలను, కెడ, చాయ, కెలను క్రేవ, సాయ, తట్టు, వంక, బ॥ సూరెలు, అనగా పార్శ్వభాగమునకు పేళ్లు. వలపల, కుడి, వలను, అనగా దక్షిణభాగమునకుపేర్లు. డా, ఎడమ, పుఱ్ఱ, డాకడ, డాపల, దాపల, అనఁగా వామభాముగనకు పేర్లు.

గీ. బిల్ల బింబికయన రవిబింబమునకు
నగు;గుడి గుడుసు పరిది గాలిగుడి వఱద
గుడియనగఁ బరివేషాఖ్యలడరె; మోడ
మనఁగ మందారమనఁగ మేఘావరణము. 44

బిల్లి, బింబిక, అనఁగా సూర్యాదిబింబములపేళ్లు. గుడి, గుడుసు పరిది గాలిగుడి, ఒఱిదగుడి, అనఁగా పరివేషముపేళ్లు; మోదము, మందారము, అనఁగా మేఘావరణముపేళ్ళు.

సీ. నీరుమోపరి మబ్బు నీరుతాల్పరి మ్రబ్బు
నాఁగ మొగులు నీటిచాగియనఁగ
నభ్రాఖ్యలౌ; నుఱుమనగర్జితాఖ్యయౌ;
మించుమెఱుపు మించు మించు మెఱము
నాఁగశంపాఖ్యలౌ; తీఁగెమెఱుంగన
శంపాలతాఖ్యయౌ; జడియనంగ
వానసోననా వర్షంబునకుఁబేళ్లు;
తొలుకు కురియు చినుకు తొలకరించు

గీ. ననఁ దువర తూర తుప్పురయనఁదుసార
నామములు;నిత్యబహు వచనమునవాన
కాళ్లనఁగవర్షధారల పేళ్లు బాల
నగరసౌధవిహార కంధరశరీర. 45

నీరుమోపరి, మబ్బు, నీరుతాల్పరి, మ్రబ్బు, మొగులు, నీటిచాగి, అనగా మేఘముబేళ్ళు. మించు, మెఱుపు, మించుమించు, మెఱుము, అనగా మెఱుపు బేళ్ళు. తీఁగమెఱుఁగు, అనఁగాశంపాలతపేరు. జడి, వాన, సోన అనఁగా వర్షముబేళ్ళు. తొలుకు, కురియు, చినుకు, తొలకరించు, తువర, తూర, తుప్పుర, అనతుసారముబేళ్ళు. వానకాళ్ళు, అనగా వర్షధారలపేళ్ళు.

గీ. చినుకనఁగవర్షబిందువయ్యెను; రతనపు
విల్లు సింగిణి ముప్వన్నెవిల్లనంగ

వజ్రధన్వాభిఖ్యలు; వానరాయి
యనఁగ వడగల్లనఁగ కరకాఖ్యలౌను. 46

చినుకు ఇది నీటిబిందువు పేరు. రణనపువిల్లు, సింగిణి, సువ్వాస్న విల్లు, అనగా ఇంద్రధనుస్సు పేర్లు. వానరాయి, వడగల్లు, కరకలు పేళ్ళు.

సీ. కలువలవిందు చుక్కలఱేఁడు రేఱేఁడు
 చందు చందురుమామ చందమామ
నెల చందమామఁడు వెన్నెలగుత్తి చలువల
 ఱేఁడు పైగులగొకిమీఁదు జింక
తాల్పరి జాబిల్లి తమ్మిపగతుఁడు జా
 బిలి జక్కవలగొంగ వలివెలుంగు
వెన్ననిశాకన్న వేల్పుఁబువ్వ వె
 న్నెలఱేఁడు వలిముద్ద నిసివెలుంగు

గీ. చలివెలుఁగు కలువలఱేఁడు చలువజోతి
కడలివెన్న యనంగ జక్కవలగొంగ
తొగసిగన్నాఁపుడనఁగను దనరుచంద్రు
నాఖ్యలై తెలుఁగునఁ గలుషాబ్ధితరణి. 47

కలువలవిందు, చుక్కలఱేఁడు, రేఱేఁడు, చంద, చందురుమామ, చందమామ, నెల, చందమామఁడు, వెన్నెలగుత్తి, చలువలఱేఁడు, పైగులగొకిమీఁడు, జింక తాల్పరి, జాబిల్లి, తమ్మిపగతుఁడు, జాబిలి, జక్కవలగొంగ, వలివెలుంగు, వెన్ననిశాకన్న, వేల్పుఁబువ్వ, వెన్నెలఱేఁడు, వలిముద్ద, నిసివెలుఁగు, చలివెలుఁగు, కలువలఱేఁడు, చలువజోతి, కడలివెన్న, జక్కవలగొంగ, తొగసిగన్నాపు అనునవి చంద్రుని పేళ్ళు.

గీ. అవని నెలవంక నెలకూన యనఁగ బాల
శశికళాఖ్యలు; పాలు వీసమునఁగళకు
వఱలె సరదు సరసు సమభాగమునకును;
మఱక నుచ్చునైల్య మరయనొకటి. 48

నెలవంక, నెలకూన అనఁగా బాలచంద్రునకుఁ బేళ్లు. పాలు, వీసము అనఁగా కళకుఁ బేళ్లు. సరదు, సరసు అనఁగా సమభాగమునకుఁ బేళ్లు. మచ్చు, మఱక అన నైల్యమునకుఁ బేళ్లు.

గీ. చిన్నె యడియాల మానాలు చిన్నియ గుఱి
కతము పులు గానవాలు లక్కనము గుఱుతు
లచ్చనము డాగు మచ్చనాఁ లక్షణాఖ్య
లలరె మునిహృదయానంద హరిముకుంద. 49

చిన్నె, అడియాలము, ఆనాలు, చిన్నియ, గుఱి, కతము, పులుగు, ఆనవాలు, లక్కనము, గుఱుతు, లచ్చనము, డాగు, మచ్చ ఇవి లక్షణము పేరులు.

గీ. కళుకు మిస పోసనము డాలు గచ్చు నిగ్గు
రంగు జిగిడంబు మిసిమి మెఱుంగు దౌరు
బాజు దవురు రువాణంబు తేజనంగ
నమరగణనుతపాద శోభాఖ్యలగును. 50

కళుకు, మిస, పోసనము, డాలు, గచ్చు, నిగ్గు, రంగు, జిగి, డంబు, మిసిమి, మెఱుఁగు, దౌరు, బాజు, దవురు, రువాణము, తేజు, అన శోభకు పేళ్లు.

ఆ. పొనుఁగు గాజువాఱు పొనుపడు మక్కునా
గాంతిహీనమునకుఁ; గౌముదికిని
వెలసె నెలవెలుంగు వెన్నెల రేయెండ
చందిరిక యనంగ జలజనాభ. 51

పొనుఁగు, గాజువాఱు, పొనుపడు, మక్కు అనగా కాంతిహీనముఁ పేళ్లు. నెలవెలుఁగు, వెన్నెల, రేయెండ, చందిరిక అనగా కౌముదికి పేళ్లు.

చ. చలిమిరి సీతు వీఁను వలి చల్మిరి సీతు సిరం బిగంబు నాఁ
జలువడి చల్వడిం జలువ చల్లన చల్వ యివంబు నాఁ గుతిన్
వలిపిరి నాఁగ నా నివక బల్కునా చలి నాఁగ నా నభి
ఖ్యలు ధరలోన శీతమున కబ్బె నిభాంగ తెలుంగుమాటలన్. 52

చలిమిరి, సీతువు, ఈఁను, వలి, చల్మిరి, సీతు, సిరము, ఇగము, చలువడి చల్వడి, చలువ, చల్లన, చల్వ, ఇవము, వలిపిరి, ఇవక, చలి ఇవి శీతము పేర్లు.

గీ. ఇగ మివము మంచు మను చీము హిమము పేళ్లు;
నివతళిం పివతాళింపు నెగడు శైత్య
మునకుఁ బేళ్లు; గామన గ్రహమునకుఁ బేరు;
కలిగెఁ జుక్క రిక్క యన నక్షత్రము హరి. 53

ఇగము, ఇవము, మంచు, మనుచు, ఈఁగు, అనఁగా హిమమునకు బేళ్లు. ఇవతళింపు, ఇవతాళింపు, అన నివి శైత్యమునకు బేళ్లు. గాము అనగా గ్రహమునకుఁ బేరు. చుక్క, రిక్క అనగా నక్షత్రము పేరు.

గీ. నెగడు హరి! కెంపుగామన నేలపట్టి
యనఁగ నంగారకున కాఖ్యలయ్యె; బుధున

కాఖ్య నెలచూలి; గురునకాఖ్యలగు వేల్పు
టొజ్జ నుడుగుఱేఁడన భువినొప్పి చెలఁగె. 54

కెంపుగాము, నేలపట్టు ఇవి అంగారకుని పేళ్లు. నెలచూలి బుధునిఁ పేరు. వేల్పుటొజ్జ, నుడుగు ఱేఁడు ఇవిబృహస్పతికిఁ పేళ్లు.

క. చుక్కతెలిగాము వేఁగురుఁ
జుక్కయనఁగ సోఁకుటొజ్జ సుకరుఁడనఁగ వాల్
జుక్కొంటికంటి వేఁగుం
జుక్కయనఁగనాఖ్యలగును శుక్రునకు హరీ. 55

చుక్క, తెలిగాము, వేగురుఁజుక్క, సోఁకుటొజ్జ, సుకరుఁడు, వాలు జుక్క, ఒంటికంటి, వేఁగుజుక్క అననివి శుక్రునకుఁ పేళ్ళు.

గి. శనికి సని కప్పు మేనిగా మనఁగఁ గుంటి
గామనఁగఁ జాయపట్టినా నామధేయ
ములు చెలఁగె; కేతువునకభిఖ్యలగు మిత్తి
చూలు టెక్కపుగామన నీలగాత్ర. 56

శని, కప్పుమేనిగాము, కుంటిగాము, చాయపట్టి అనఁగా శనేశ్వరునిఁ పేళ్ళు. మిత్తిచూలు, టెక్కపుగాము అనఁగా కేతువునకుఁ పేళ్ళు.

క. వనజాక్షా! చీఁకటిగా
మనఁ దలగాము నెలతిండి యన మొండెపుగా
మన రాహువునకభిఖ్యలు
తెనుఁగునవిలసిల్లె భువిని తెల్లమిగాగన్. 57

చీఁకటిగాము, తలగాము, నెలతిండి, మొండెపుగాము అన నివి రాహువునకు బేళ్ళు.

సీసమాలిక. అలరె గుఱ్ఱపురిక్క తొలుచుక్కయన నశ్వి
నికిని;బరనిచుక్క నెగడె భరణి;
కత్తెర మంగల కత్తిగా పనఁగను
గృత్తికాఖ్యలు; బండిరిక్క రోహి
ణీనామధేయంబు; నెలరిక్కయన జింక
తలచుక్కయనఁగను దనరె మృగశి
రాఖ్య; లార్ద్రాభిఖ్యయునౌ పగడపురిక్క;
క్షోణిని బొదరిండ్ల చుక్క యనఁ బు
నర్వసునక్షత్ర నామధేయంబయి
యేపుమీరెను; తొండరూపురిక్క
పొట్లపూచుక్కనాఁ బుష్యమికాఖ్యలౌ;
నిక్కంబు సప్పురిక్క నాఁగ
నసిలేరు నాశ్లేష కాఖ్యలు;పితరుల
చుక్కనా జన్నపురిక్కనాఁగ
మఘకాఖ్యలౌ; నిల మఱి సామికంటిచు
క్కయన పుబ్బకుఁబేళ్లునమరు; ప్రొద్దు
చుక్క యుత్తర పేరుకెక్కెను; కైసాటి
చుక్కనా హస్తకుఁజోద్యముగను;
ముత్తెపుసవతన చిత్తనాఁ జిత్రాఖ్య
లగు; కరువలిరిక్క యనఁగఁ గెంపు
సవతనఁ గనుపేళ్లు స్వాతికినగు; చేట
రిక్క కుమ్మరిసారెచుక్క జోడు

వేలుపుఁజుక్కనా వెలసె విశాఖకా
ఖ్యలు; తోరణపురిక్క చెలిమిచుక్క
యన ననూరాధకాఖ్యలు; పెద్దపేరిటి
చుక్కనాఁగను తాటి రిక్కనాఁగ
జ్యేష్ఠ కభిఖ్యలై జెల్లును; సోఁకుఁజు
క్కయు మూల నీఁటి చుక్క తొలునీఁటి
రిక్కనాఁగను పేరు కెక్కెఁ బూర్వాషాఢ;
యేచకంకటి రిక్క తోఁచెనుత్త
రాషాఢ కాఖ్యలునగు; కటి వేల్పుచు
క్కయనఁగ తూపు రిక్కయన శ్రవణ
నెక్కె మద్దెలగూపు రిక్క ధనిష్ఠకా
ఖ్యయు; నీటిజేని రిక్కయన శతభి
షమునకు నాఖ్యమైయమరె; నెన్మిదికాళ్ల
చుక్క పూర్వాభాద్ర కెక్కెఁగీర్తిఁ

గీ. బూనె; ముక్కంటిచుక్కనాఁ బ్రొద్దురిక్క
యనఁగ నుత్తరాభాద్రకాఖ్యలు చెలంగి
మెలఁగెఁ; గొనరిక్క కడ చుక్క మీనుగూపు
చుక్కయన రేవతికిఁ బేళ్లు సురనుతాంఘ్రి. 58

గుఱ్ఱపురిక్క, తోలురిక్క అనఁగా అశ్వినికి పేర్లు. బరని అనఁగా భరణికి పేరు. కత్తెర, మంగలకత్తిరూపు అనఁగా కృత్తికా నక్షత్రమునకు పేర్లు. బండిరిక్క అన రోహిణికిఁ బేరు. నెలరిక్క, జింకతలచుక్క అనఁగా మృ

గశీర్షా నక్షత్రముఁ బేర్లు. పగడపురిక్క అనఁగా ఆర్ద్రకుఁ బేరు. పొదరిండ్లచుక్కయన పునర్వసుఁ బేరు. తొండరూపురిక్క, పొట్లపూఁజుక్క అనఁగా పుష్యమికిఁ బేళ్ళు. సప్పపురిక్క, అసిలేరు అన ఆశ్లేషకుఁ బేర్లు. పితరులచుక్క, జన్నపురిక్క అనఁగా మఘకుఁ బేళ్ళు. సామికంటిచుక్క అనఁగా పుబ్బఁ బేరు. ప్రొద్దుచుక్క అన ఉత్తర. కైసాటిచుక్క అనఁగా హస్తమి. ముత్తెపుసవతు, చిత్త అనఁగా చిత్తానక్షత్రముఁ బేళ్ళు. కరువలిరిక్క, కెంపుసవతు అనఁగా స్వాతీనక్షత్రము. చేటరిక్క, కుమ్మరిసారెచుక్క, జోడువేల్పురిక్క అనఁగా విశాఖానక్షత్రము. తోరణపురిక్క. చెలిమిచుక్క అనఁగా అనూరాధనక్షత్రము. పెద్దకంటిరిక్క, తాటిచుక్క జ్యేష్ఠానక్షత్రము. సోఁకుఁజుక్క అన మూలానక్షత్రము. నీఁటిచుక్క, తొలునీటిరిక్క అనఁగా పూర్వాషాఢకుఁ బేళ్ళు. ఏచకంకటిరిక్క అన ఉత్తరాభాద్ర బేరు. కతివేల్పుచుక్క, ఱూపురిక్క అనఁగా శ్రవణానక్షత్రము. మద్దెలరూపురిక్క ధనిష్ఠకు పేరు. నీఁటిఱేనిరిక్క అనఁగా శతభిషము. ఎనిమిదికాళ్లచుక్క అనఁగాపూర్వాభాద్రకు పేరు. ముక్కంటిచుక్క, ప్రొద్దుఁరిక్క అనఁగా ఉత్తరాభాద్రనక్షత్రము. కొనరిక్క, కడచుక్క, మీనురూపు, ఇవిరేవతీనక్షత్రము పేళ్లు.

ఆ. అవని నభిజిదాఖ్యలమరియొప్పెను బొమ్మ
చుక్క కానరానిరిక్కయనఁగ;
తెలుఁగునం దరుంధతికిని నారంజోతి
యనఁగ కీర్తి మీఱె నంబుజాక్ష. 59

బొమ్మచుక్క, కానరానిరిక్క అనఁగా అభిజిన్నక్షత్రము పేళ్లు. ఆరంజోతి ఇది అరుంధతి పేరు.

సీ. మేకరాసియనంగ మేషరాశికి పేరు;
ఋషభరాశికినిఁ బేర్గిబ్బయనఁగ;

మిథునాహ్వయము ప్రతిమెలఁగె సంగడిరాసి;
రాజిలె నెండ్రికరాసి కటక
మునకు; సింగపురాసి తనరె సింహాఖ్యమై;
కన్యాఖ్యలౌ కన్నె కన్నెరాసి
నాఁ; ద్రాసుగాసియనఁగ తుల; తేలురా
సియన వృశ్చికరాశి చెలఁగె; వింటి
గీ. రాసినాఁ వెలసెను ధనూరాశిపేరు;
మొసలిరాసియన మకరమునకు; కుండ
రాసి కుంభమునకు; చేఁపరాసి చేఁప
నాఁగ మీనంబునకుపేళ్లు నలిననాభ. 60

మేఁకరాసి అన మేషరాశికిపేరు. గిబ్బరాసి అన ఋషభము. సంగడిరాసి మిథునము. ఎండ్రికరాసి కర్కాటకము. సింగపురాసి సింహరాశి. కన్నె, కన్నెరాసి కన్యారాశి. త్రాసురాసి తులకుపేరు. తేలురాసి అన వృశ్చికరాశి. వింటిరాసి అనగా ధనూరాశి. మొసలిరాసి అన మకరరాశి. కుండరాసి అన కుంభరాసి. చేఁప, చేఁపరాసి అన మీనరాశి.

సీ. గాములతేఁడు రేకంటు కాఁక వెలుంగు
పచ్చవార్వపుజోదు పగటివేల్పు
తామర చెలి ప్రొద్దు తమ్మివిం దివముల
మేపరి వినుకెంపు మింటిదారి
జమునయ్య చెయ్యులసాకిరి మినుకుల
యిక్క యిరులగొంగ యిగముసూఁడు

ఛాయమగఁడు తమ్మిసామి జక్కవ ఱేఁడు
కలువలదాయ వేవెలుఁగు వేఁడి
గీ. వెలుఁగు మిన్కులబరణియు వేఁడివేల్పు
సెగవెలుఁగు వెలుఁగులఱేఁడు జగముకన్ను
చదలుమానికమన నెండసామి యనఁగ
రవికినామంబులై యొప్పు భవవినాశ. 61

గాములఱేఁడు, రేకంటు, కాఁకవెలుఁగు, పచ్చవార్వపుజోదు, పగటివేలుపు, తామరచెలి, ప్రొద్దు, తమ్మివిందు, ఇవములమేపరి, వినుకెంపు మింటిదారి, జమునయ్య, చెయ్వులసాకిరి, మినుకులయిక్క, ఇరులగొంగ ఇగముసూఁడు, ఛాయమగఁడు, తమ్మిసామి, జక్కవఱేఁడు, కలువదాయ, వేవెలుఁగు, వేఁడివెలుఁగు, మిన్కులబరణి, వేఁడివేల్పు, సెగవెలుఁగు వెలుఁగులఱేఁడు, జగముకన్ను, చదలుమానికము, ఎండసామి అన నివి సూర్యునకు పేళ్లు.

గీ. పిచ్చుకుంటన బిచ్చుకకుంటు పిచ్చి
కుంటనంగను పిచ్చికకుంట నంగ
నమరియొప్పు ననూరునకాఖ్యలగుచు;
వెలుఁగుమినుకన కిరణ మాఖ్యలు మురారి. 62

పిచ్చుకుంటు, పిచ్చుకకుంటు, పిచ్చికుంటు, పిచ్చికకుంటు అనఁగా అనూరునకు పేళ్లు. వెలుఁగు, మినుకు అనఁగా కిరణమునకు పేళ్లు.

క. వేఁడిమి తీండ్రము వెచ్చన
వాఁడియొకెఱ వెచ్చ తీండ్ర వడ యొక్కఱనాఁ

వేఁడి మిడి వెట్ట వెక్కు యు
కూడియుతీక్ష్ణాఖ్యలయ్యె గోవిందహరీ. 63

వేడిమి, తీండ్రము, వెచ్చన, వాడి, ఒకారు, వెచ్చ, తీండ్ర, వడ, ఒక్కారు, వేఁడి, వెక్కు, వెట్ట, మిడి అనఁగా తీక్ష్ణమునకు పేళ్లు.

గీ. వెలుఁగనఁగ నెండ వెలుతురు వెల్తురనఁగ
నలరె నాతపమున కాఖ్యలగుచు; కొద్ది
యెండ యీరెండ యనఁనొప్పె నెలమి యలఁతి
జ్యోతమునకాఖ్యలై కందశోభితాంగ. 64

వెలుఁగు, ఎండ, వెలుతురు, వెల్తురు, అనఁగా ఆతపమునకుఁ బేళ్లు. కొద్దియెండ, ఈరెండ అనఁగా అల్పజ్యోతికిఁ బేళ్లు.

క. తళుకు పిసాళము వాఁడిమి
బెళుకు మెఱపు తేజు మించు వేడి పగటునాఁ
పొలప మొరపు తీండ్రము తుఱఁ
గలి విడి బిత్తరమనఁగఁ బ్రకాశాఖ్యలగున్. 65

తళుకు, పిసాళము, వాడిమి, బెళుకు, మెఱపు, తేజు, మించు, వేఁడి, పగటు, పొలపము, ఒరపు, తీండ్రము, తుఱఁగలి, విడి, బిత్తరము అనఁగా ప్రకాశమునకు పేళ్లు.

సీ. తిలకించ చలరుతన్కు తళుకొత్తు తీండ్రించు
తొలఁకాడు పావణిల్లు తొలుకు వఱలు
తులకించు నలరారు తళుకించు వెలుఁగొందు
చెలఁగు వెలయు మండు చెంగలించు

వరగలించు కొాఱలు నురళించు తలరు బి
త్తరములాడనఁగను తనుకుననఁగఁ
దేజరిల్లుననంగఁ దీడిరించనఁగను
తొాంగలించనఁగను రంగుమీాఱ

గీ. క్షితిని దెలుగుననగు ప్రకాశించుట కని
యెంచి కావ్యమ్ములను బ్రయోగించిరమరి
బాలనగరవిహార గ్రావవరధీర
కలుషసాలకుఠార దిగ్వర్గ ముగిసె. 66

తిలకించు, అలరు, తనర్చు, తళుకొత్తు, తీండ్రించు, తొాలుకాడు, హొవణిల్లు, తొాలుకు, వఱలు, తులకించు, అలరారు, తళుకించు, వెలుగొందు, చెలఁగు, వెలయు, మండు, చెంగలించు, వరగలించు, కొాఱలు, ఉరళించు, తలరు, బిత్తరములాడు, తనుకు, తేజరిలు, తీడిరించు, తొాంగలించు ఇవి ప్రకాశించుటమునకు పేళ్లు.

దిగ్వర్గ ముగిసెను.

---

# కాలవర్గు

ఆ.వె. పొద్దు కారు పూఁట పొద్దనకాలంబు
దనరెఁ; బ్రొద్దు పూఁట దినముపేళ్లు;
పట్టబవలనంగఁ బవలన మధ్యాహ్న
మునకు వెలసె పేళ్లు మునినుతాంఘ్రి. 67

బ్రొద్దు, కారు, పూఁట, పొద్దు అనఁగా కాలమునకుపేళ్లు. పొద్దు, పూఁట అనఁగా దినమునకుఁబేళ్లు. పట్టబవలు, పగలు అనఁగా మధ్యాహ్నమునకు పేళ్లు.

క. వేఁకువనా వేఁగన వే
బోకయనం బ్రేపనంగ బ్రొద్దన వేఁగుం
బోకయనఁ వేఁగుజామన
శ్రీకర! ప్రత్యూషమునకుఁ జెల్లునభిఖ్యల్. 68

వేకువ, వేఁగు, వేఁబోక, ప్రేపు, ప్రొద్దు, వేఁగుఁబోక, వేఁగుజాము, అనఁగా (ప్రత్యూష) ప్రభాతమునకు పేళ్లు.

ఆ.వె. పూఁట పుంట సంజ పురఁట నెత్తురుఁబొద్దు
సందె నాఁగనొప్పె సంధ్యపేళ్లు;
క్రుంకు నింగిఁబడన క్రుంకుడనఁగ నస్త
మయమునకును బేళ్లు మదనజనక. 69

పూఁట, పుంట, సంజ, పురఁట, నెత్తురుఁబొద్దు, సందె అనఁగా సంధ్యానామములు. క్రుంకు, క్రుంకుడు, నింగిపడు అనఁగా అస్తమయమునకుఁబేళ్లు.

గీ. ఉదయ సంజకు తొలుసంజ యొప్పెను; నెఱ
సంజ మలుసంజనాఁ బరసంధ్యపేళ్లు;
నిత్యబహువచనంబున నీరుకాళ్లు
నలరె సంధ్యాకిరణములకాఖ్య శౌరి. 70

తొలుసందె అనఁగా పూర్వసంధ్యకుపేరు. నెఱసండె, మలుసంజ అనఁగా అపరసంధ్యకుపేళ్లు. బ|| నీరుకాళ్లు అనఁగా అరుణపీతవర్ణమైన సంధ్యాకిరణములకు పేరు.

క. ధాత్రృపతి! రేయి రెయి రే
రాతిరి నిసి మాపనంగ రాత్రికభిఖ్యల్;
భూతలమున మునిమాపన
ఖ్యాతిఁగొనెఁబ్రదోషనామమగుచు మురారీ. 71

రేయి, రెయి, రే, రాతిరి, నిసి, మాపు అనఁగా రాత్రికిపేళ్లు. మునిమాపు అనఁగా ప్రదోషకాలమునకుపేరు.

గీ. అగును కాఁదారిమాఁదారి యనఁగ ముచ్చు
ప్రొద్దు కాఁదారి నిసి సరిప్రొద్దన నడు
రేయినాఁగను మరి నడిరేయనంగ
నర్ధరాత్రికిపేళ్లగు నమవపోష. 72

కాఁదారిమాఁదారి, ముచ్చుప్రొద్దు, కాఁదారి, నిసి, సరిప్రొద్దు, నడురేయి, నడురే అనఁగా అర్ధరాత్రికిపేళ్లు.

గీ. ధాత్రి రేవగలన నహోరాత్రమునకు
నాఖ్య; నెలయన పున్నమయనఁగఁ బౌర్ణి

మాఖ్యలుజెలంగె; నమవస యన నమాస
యన నమావాశ్యకాఖ్యలై యలరెశౌరి. 72

రేవగలు అనఁగా అహోరాత్రమునకుపేరు. నెల, పున్నమ అనఁగా పూర్ణిమపేళ్లు. అమవస, అమాస అనఁగా అమావాశ్యపేళ్లు.

క. తెలిపక్కము తొలుపక్కం
బలనారెను శుక్లపక్ష మగుచుఁ దెలుఁగునఁ
ములుపక్కము కటిపక్కము
వెలసె బహుళపక్షమునకుఁ బేళ్లగుచు హరీ. 74

తెలిపక్కము, తొలుపక్కము అనఁగా శుక్లపక్షమునకుపేళ్లు. ములుపక్కము, కటిపక్కము అనఁగా బహుళపక్షమునకు పేర్లు.

గీ. యామమునకాఖ్య జామనవౌను; మాస
మునకు నెలయనసౌ; ఋతువునకుఁ గందు
వయననగు నామధేయంబు వాసవాది
బుధనికరపాల మునిలోల మదనహేల. 75

జాము అనఁగా యామముపేరు. నెల అనఁగా మాసమునకు పేరు. కందువ అనఁగా ఋతువునకు పేరు.

క. ననకారన పూఁదరి యా
మని యన విరిహాద ననంగ మండు నెలయనం
దనరె వసంతాభిఖ్యలు
మనసిజశతశతవిలాస మణినిభహాసా. 76

ననకారు, పూఁదరి, ఆమని, విరిహాదను, మండునెల అనఁగా వసంతఋతువునకు పేర్లు.

పంచపాదిగీ. వెట్ట వేసఁగి వేసవి వెట్టకార
నంగ గ్రీష్మాఖ్యలౌను; వానతఱి కారు
తొల్కరి తొలుకారనఁగను దొలకరియనఁ
జిత్తఱియన నీరామని చెలఁగియొప్పె
వర్షఋత్వాఖ్యలై భువి వాసుదేవ. 77

వెట్ట, వేసఁగి, వేసవి, వెట్టకారు అనఁగా గ్రీష్మఋతువుపేర్లు. వాన తఱి, కారు, తొల్కరి, తొలుకారి, తొలకరి, చిత్తఱి, నీరామని అనఁగా వర్షఋతువుపేర్లు.

గీ. ధరణి వెన్నెలకారన శరదృతువున
కాఖ్య; హేమంతమునకు జేరౌను మంచు
కారు; శిశిరంబునకుఁ జలికారుపేరు
వఱలె; నేఁడాది యేఁడన వత్సరంబు. 78

వెన్నెలకారు అనఁగా శరదృతువుపేరు. మంచుకారు అనఁగా హేమంతఋతువుపేరు. చలికారు అనఁగా శిశిఋతువుపేరు. ఏఁడాది, ఏఁడు సంవత్సరమునకుపేర్లు.

గీ. వెలసె తుదిరేయి పెనువెల్లి ప్రళయమునకు;
క్షేమమునకొప్పె నెమ్మినా సేమమనఁగ;
బుత్తియన సుకమనఁగను భోగమునకు
నాఖ్యలలరెను శ్రీమానసాబ్జభృంగ. 79

తుదిరేయి, పెనువెల్లి అననివి ప్రళయరాత్రమునకుఁ బేర్లు. నెమ్మి, సేమము అనగా క్షేమముపేర్లు. బుత్తి, సుకము ౘువిభోగమునకుఁ బేర్లు.

క. తరవాయి హదను తతి తల
తరుణ మదను సామి ప్రొద్దు తఱి తోయమనఁగా
బరగె సమయమునకాఖ్యలు
సురమునిచిత్తాపహార సురగిరిధీరా. 80

తరవాయి, హదను, తతి, తల, తరుణము, అదను, సామి, ప్రొద్దు, తఱి, తోయము అననివి సమయమునకు పేర్లు.

గీ. బుత్తి సొం పిమ్ము పోఁడిమి బులియ బులుపు
సో ముసులు హాయి సుకమును సోము సుగమ
నంగ సుఖమునకాఖ్య లుప్పొంగె; బులియు
ననఁగ సొగియించునా సుఖించాఖ్యలగును. 81

బుత్తి, సొంపు, ఇమ్ము, పోఁడిమి, బులియ, బులుపు, సోము, ఉసులు, హాయి, సుకము, సోము, సుగము అనఁగా సుఖమునకు పేర్లు. బులియు, సొగియించు అనఁగా సుఖించుటకు పేర్లు.

ఆ. వె. నెపము కతము కోపు నేవము వైనంబు
నెవమనంగ వెలసె భువిని దెనుఁగు
నందుఁ గారణమున కాఖ్యలై కల్హార
మిత్రమిత్రనేత్ర చిత్రగాత్రి. 82

నెపము, కతము, కోపు, నేవము, వైనము, నెవము అనఁగానివి కారణమునకు పేర్లు.

క. మది యిచ్చ గుండె తలఁ పెడ
యెద డెందం బుల్లమనఁగ నెడ్డ యనఁగ నె

మ్మది గుండియనా డెందమె
డఁద యన హృదయాఖ్యలగుచు డంబువహించెన్. 83

మది, ఇచ్చ, గుండె, తలఁపు, ఎద, ఎద, డెందము, కల్లము, ఎడ్డ, నెమ్మది, గుండియ, డెందము, ఎడఁద అనఁగా హృదయమునకుఁ బేర్లు.

క. పుట్టన బామన మేనన
పుట్టుకయన పుట్టువనఁగ పుట్టుగనంగన్
దిట్టరి వారి జననాఖ్యలు
నెట్టనఁగానికీర్తిమించి నెలకొనెభువిలోన్. 84

పుట్టు, బాము, మేను, పుట్టుక, పుట్టువు, పుట్టుగ జననమునకుఁ బేర్లు.

సీ. తెలువాఱు ననఁగను తొలుకరించుననంగ
జొబ్బిల్లనంగనుజొబ్బిలనఁగ
నుప్పతిల్లనఁగను జిప్పిల్లనంగను
బొంపిరివోవనఁ బొటమనంగ
నలరె పిచ్చిల్లన నామతిల్లన గండ
రించనంగను బొడతెంచెనాఁగ
వసుధఁదోఁచన నివి వాస్తవాద్యుత్పత్తి
యాహ్వయంబులు నయ్యెనాంధ్రముననను
ఆ. భువినినొప్పె జావు పొలయిక యనఁగను
మరణమున కభిఖ్య లరసిచూడ
కమలసదృశనేత్ర కంధరనిభగాత్ర
దనుజరాజజైత్ర ధర్మమిత్ర. 85

తెలువాటు, తొలుకరించు, జొబ్బిల్లు, జొబ్బిలు, ఉప్పతిల్లు, చిప్పిల్లు, పొంపివోవు, పొటము, పిచ్చిల్లు, ఆమతిల్లు, గందరించు, పొదతెంచు, తోఁచు అనునివి గుణవస్తువాద్యుత్పత్తికిఁ జేర్లు. చావు, పొలయిక అనఁగానివి మరణమునకుఁ జేర్లు.

క. కొల యనఁగను దోసంబనఁ
గలుచయనఁగ కొడిమెయనఁగ కసటనఁగను గా
వలమనఁగను బాపంబున
కలరె నభిఖ్యలు మురారి యసురవిదారీ. 86

కొల, దోసము, కలుచ, కొడిమె, కసటు, కావలము అనునివి పాపమునకుఁ జేర్లు.

చ. కసటు నెపంబు తప్పు కొఱగామియు నేరమి యెగ్గు నేరముౕ
మసటును దప్పిదంబు కుసుమాలముమల్కువముక్కు దోసముౕ
మసడును కల్పయుం గొడిమె మాగుడు నా నెరసన్న నౌ గదా
యసురకుల ప్రజాటవిదవానల ద్రోహముపేళ్లు నిద్ధరౕ. 87

కసటు, నెపము, తప్పు, కొఱగామి, నేరమి, ఎగ్గు, నేరము, మసటు, తప్పిదము, కుసుమాలము, ముల్కువ, ముక్కు, దోసము, మసడు, కలుచ, కొడిమె, మాగుడు, నెరసు అనఁగానివి ద్రోహమునకుఁ జేర్లు.

గీ. పున్నెమన మేలనంగను పునె మనంగఁ
బున్నియంబన నాఖ్యలౌ పుణ్యమునకు;
పంతు వావిరి మేలు సోబనము లగ్గు
మంచియన శుభమునకు పేళ్లంచితముగ. 88

పున్నెము, మేలు, పునెము, పున్నియము అనఁగానివి పుణ్యమునకుఁ

పేర్లు. పంతు, వావిరి, మేలు, సోబనము, లగ్గు, మంచి అనఁగానివి శుభమునకుఁ బేర్లు.

గీ. సేగి యొప్పమి కోల్పాటు చేఁతటికము
చేటు కీడోగు డగరము చెఱపు చెఱుపు
చెట్ట దుండగ మెగ్గును జెడ్డ దగర
మన నశుభమగు; కాల వర్గయ్యె శౌరి. 89

సేగి, ఒప్పమి, కోలుపాటు, చేఁతటికము, చేటు, కీడు, ఓఁగు, డగరము, చెఱపు, చెఱుపు, చెట్ట, దుండగము, ఎగ్గు, చెడ్డ, దగరము అనఁగా అశుభమునకుఁ బేర్లు.

కాలవర్గము ముగిసెను.

---

# ధీవర్గు

గీ. బుద్ది మది నెఱి కఱద నాబుద్ధిపేళ్లు;
పగ్గెయన నెఱ యనఁగను బ్రజ్ఞపేళ్లు;
గొనము గుణమునకగు; తఱటనఁగ తుంట
యనఁగ మూర్ఖత్వమునకాఖ్య లౌనుశౌరి. 91

బుద్ది, మది, నెఱి, కఱద అనఁగానివి బుద్ధికి పేర్లు. పగ్గె, నెఱ అనఁగా ప్రజ్ఞకుఁ బేర్లు. గొనము అనఁగా గుణమునకు పేరు. తఱటు, తుంట అనఁగా మూర్ఖత్వమునకు పేర్లు.

గీ. కఱుదు నేరుపు పోహణ మెఱవడియును
నేర్పు విన్ననువు చదురు నేరిమియును
వలను విన్నాణమనఁగను వనజనాభ
యవని ప్రౌఢిమమున కాఖ్య లౌను ధరణి. 91

కఱుదు, నేరుపు, పోహణ, మెఱవడి, నేర్పు, విన్ననువు, చదురు, నేరిమి, వలను, విన్నాణము అనఁగానివి ప్రౌఢిమముఁబేర్లు.

క. కుదిరికయున కుదురన నె
మ్మదియనఁగను నెమ్మియనఁగ మదిమది యనఁగ౯
బొదలెను స్వస్థముపేళ్లుగ
సదమలరాజీవనయన సదయాహృదయా. 92

కుదిరిక, కుదురు, నెమ్మది, నెమ్మి, మదిమది అనఁగా స్వస్థమునకు పేర్లు.

గీ. అరమరిక యురియా పాన లరమర పుయి
లోట మరగలి మలికిత మోటు కొంకు
సందియంబు నంజాయించు సందు ముదము
దయును బిమ్మిటి యనఁగ సంశయము పేళ్లు. 93

అరమరిక, ఉరియా, పానలు, అరమర, పుయిలోటము, (రూ॥ పుయిలోట) అరగలి, మలికితము, ఓటు, కొంకు, సందియము, అంజాయించు, సందు, ముదముద, బిమ్మిటి అననివి సంశయమునకు పేళ్ళు.

క. కాంచనచేలధర! కొదుకు
కొంచు కొసరు గగ్గు ముడుఁగు కొంజు కొతుకు కొం
చించు పుయిలోడు స్రుక్కని
యెంచిన నాంధ్రమున సంశయించుట పేళ్లౌ 94

కొదుకు, కొంచు, కొసరు, గగ్గు, మదుఁగు, కొంజు, కొతుకు, కొంచించు, పుయిలోడు, గ్రుక్కు అనఁగా సంశయించుటకుఁ బేళ్లు.

క. నిచ్చయము నిజము నిక్కము
నిచ్చలు ప్రెబ్బొత్తి నికము నేటు నికువముఁ
నిచ్చలమన నిశ్చయమున
కచ్చుపడఁగ నాఖ్యలయ్యె నాంధ్రమున హరీ. 95

నిచ్చయము, నిజము, నిక్కము, నిచ్చలు, ప్రెబ్బొత్తి, నికము, నేటు, నికువము, నిచ్చలము అనఁగా నిశ్చయమునకు పేర్లు.

గీ. కమ్మ తియ్య తీపి కమ్మన తీయ తీ
యన యనంగ మధురమునకుఁ బేళ్లు;
తొగర కనరు తొవర యొగరను నివియెల్ల
తువరమునకుఁ బేళ్లు తోయజాక్ష. 96

కమ్మ, తియ్య, తీపి, కమ్మన, తీయ, తియ్యన అనఁగా మధురమునకు పేర్లు. తొగర, కనరు, తొవరు, ఒగరు అనఁగానివి తువరమునకు పేళ్లు.

గీ. కటువునకుఁ బేళ్లు నొట్టన కారము మొట్టి
యనఁగఁ; దిక్తమునకుఁ జేఁదు; నామ్లమునకుఁ
బులుసు పుల్లన యనఁ బేళ్లుబోలె; లవణ
మునకు నుప్పన యనఁజెల్లు మురవిదారి. 97

ఒట్టన, కారము, ఒట్టి యనఁగా కటువునకుఁబేళ్లు. చేఁదు, అన తిక్తము. పులుసు, పుల్లన అనఁగా ఆమ్లము. ఉప్పన అనఁగా లవణరసము.

క. పొలపంబు కమ్మ కమ్మన
వలపుం గడి తావి నాఁగ వల్పని యనినఁ

జలజాయతేక్షణా! పరి
మళమున కాఖ్యలయి వెలయు మహిలో నెపుడున్. 98

పొలపము, కమ్మ, కమ్మన, వలపు, కడి, తావి, వల్పు అనఁగానివి పరిమళమునకుఁ బేళ్లు.

గీ. ఎఱుక యెఱుకువ తెలివి నా వఱలె జ్ఞాన
మునకభిఖ్యలునై; బైజయును మఱకువ
మబ్బు నేరమి మఱపన మహిఁ జెలంగె
వనజభవనుత యజ్ఞానమునకుఁ బేర్లు. 99

ఎఱుక, ఎఱుకువ, తెలివి అనఁగా జ్ఞానమునకు పేళ్లు. బైజ, మఱకువ మబ్బు, నేరమి, మఱపు అనఁగా అజ్ఞానమునకు పేళ్లు.

గీ. ముగితి ముత్తియనఁగఁ బేళ్లు మోక్షమునకు;
బరగె సుకృతంబునకు మేలు బాగె మనఁగ;
వెలసె దుష్కార్యమునకుఁ గ్రొవ్విదము కీడు
పని యనఁగఁ బేళ్లు భవసిశాపాళిహేళి. 100

ముగితి, ముత్తి అనఁగా మోక్షమునకుఁ బేళ్లు. మేలు, బాగెము అనఁగా సుకృతము పేర్లు. క్రొవ్విదము, కీడుపని అనఁగా దుష్కార్యమునకుఁ బేళ్లు

ఆ.వె. వన్నె రంగు చాయ వన్నియ నాఁగ వ
ర్ణంబు పేళ్లు; కారనంగ కవురు
నాఁగ నొప్పె తెనుఁగునందు వర్ణాధిక్య
మునకభిఖ్యలగుచు దనుజవైరి. 101

వన్నె, రంగు, చాయ, వన్నియ అనఁగా వర్ణమునకు బేర్లు. కారు, కవురు అనఁగా వర్ణాధిక్యమునకుఁ బేరులు.

క. తెల తెల్ల తెల్పు తెలివెలి
వెలరు వెలుక వెల్లి బొల్లి వెల్ల యనఁగ నా
ఖ్యలు శుభ్రమునకు తెలుఁగున
నలరె; పలుకఁబాఱు శుభ్ర మగుటకు పేరౌ. 102

తెల, తెల్ల, తెలు, తెలి, వెలి, వెలరు, వెలుక, వెల్లి, బొల్లి, వెల్ల అనఁగా శుభ్రవర్ణమునకుఁ బేళ్ళు. పలుకబాఱు శుభ్రమగుటకుఁ బేరు.

చ. కఱి నల కందు చామనము కావిరి నల్లన చామ నీలియుం
గఱ కసిసంబు నల్ల కసుఁగందన కఱ్ఱ యనంగ నింకనుం
గఱియయనంగ కప్పనఁగ కారనఁగన్ భువి నీలవర్ణమై
వఱలెను వాసవాదిసురవందితపాదసరోరుహద్వయా.

కఱి, నల, కందు, చామనము, కావిరి, నల్లన, చామ, నీలి, కఱ, కసిసము, నల్ల, కసుగందు, కఱ్ఱ, కఱియ, కప్పు, కారు అనఁగా నీలవర్ణము.

ఆ.వె. అళఁది పసిమి పచ్చ హాళఁది పసుపు పస్పు
కవిల పచ్చన యన భువిహారిద్ర
వర్ణమునకు భేళ్లు; పాటలమునకును
బరగె పయ్యా పస్సె పల్ల యనఁగ. 104

అళఁది, పసిమి, పచ్చ, హాళఁది, పస్పు; పసుపు, కవిల, పచ్చన అనఁగా హారిద్రవర్ణముఁ బేళ్ళు. పయ్యా, పస్సె, పల్ల అనఁగా పాటలవర్ణమునకుఁ బేళ్ళు.

క. ఎఱ యెఱ్ఱ కెంపు గవరన
యెఱుపును కావి తొగరు తొవ రెఱ్ఱన విడి జే

గుఱు కావి లాలు తోఁపును
వఱలెను జొత్తనఁగ రక్త వర్ణముపేళ్లై.　　105

ఎఱ, ఎఱ్ఱ, కెంపు, గవరన, ఎఱుపు, కావి, తొగరు, తొవరు, ఎఱ్ఱన, విడి, శేగుఱు, కావి, లాలు, తోఁపు, జొత్తు అనఁగ రక్త వర్ణముపేళ్ళు.

గీ. ఎఱ్ఱనగు నెత్తురువాఱు నెఱుపుబాఱు
తొగరుకొను జాజువాఱును జిగురువాఱు
నెఱ్ఱవాఱు చిగుర్చన కృష్ణదేహ!
రక్తవర్ణంబగుటపేళ్లు రమణమీఱె.　　106

ఎఱ్ఱనగు, నెత్తురువాఱు, ఎఱుపుఁబాఱు, తొగరుకొను, జాజువాఱు జిగురువాఱు, నెఱ్ఱవాఱు, చిగురుచు అనఁగా రక్తవర్ణమగుటకుఁ బేళ్ళు.

గీ పచ్చ పచ్చన మదుపును పసిమి యనఁగ
హారితవర్ణంబు పేళ్లయి యలరె; చంద్ర
కావి చందురుకావినా శబ్దజాతి
నెగడె సింధురవర్ణాఖ్య లగుచు శౌరి.　　107

పచ్చ, పచ్చన, మదుపు, పసిమి అనఁగా హారితవర్ణమునకుఁ బేళ్ళు. చంద్రకావి, చందురుకావి అనఁగా సింధురవర్ణముపేళ్ళు.

క. మాదవళంబని పల్కిన
మాదావళమనఁగనొప్పు మాదళమనఁగన్
మాడావళియన బుధనుత
పాదాంబుజయుగ్మ కపిల వర్ణముపేళ్లౌ.　　108

మాదవళము, మాదావళము, మాదళము, మాదావళి అనఁగా కపిల వర్ణముపేళ్ళు.

క. బొమ్మంచన రక్తిమమగు
నిమ్మహిఁ; కత్తెరియనంగ నిది నానావ
ర్ణమ్మున కాఖ్యయగు; కదం
బమ్ము కదంబకము మిశ్ర వర్ణము పేళ్లౌ. 109

బొమ్మంచు అన రక్తిమమగుటకు పేరు. కత్తెరి అనఁగా నానావర్ణము పేరు. కదంబము, కదంబకము, మిశ్రవర్ణముఁ బేళ్ళు.

క. ఇల పంచవన్నియ యనఁగ
నలరె మఱియుఁ బంచవన్నె యనిబల్కినచోఁ
జెలఁగెనివి పంచవర్ణా
ఖ్యలతో ధీవర్గముగిసె ఖగరాట్తురగా. 110

పంచవన్నియ, పంచవన్నె అనఁగా పంచవర్ణములఁ బేళ్ళు.

ధీ వ ర్గ ము గి సె ను.

---

# వా గ్వ ర్గ

గీ. నుడి పలుకు సుద్ది ముచ్చట నొడి మునుకన
వాక్యనామంబులగు; వ్యర్థభాషణమున
కాఖ్యయగు రజ్జనంగ; రహస్యవాక్కు
కిద్ధరణి పేరుగానె కమ్మసుద్ది యనఁగ. 111

నుడి, పలుకు, సుద్ది, ముచ్చట, నొడి, మునుకు అనఁగా వాక్యమునకు పేర్లు. రజ్జు అనఁగా వ్యర్థభాషణమునకు పేరు. కమ్మసుద్ది అనఁగా రహస్యవాక్కు పేరు.

గీ. హాటకాంబర! వంకరమాట యనఁగ
వఱలె వఱగొడ్డమన బహువచనమందు
సడుగులన దోషవాక్యములకడరిపేళ్ళు
గలిగె; వాగ్వాదుకాఖ్య వాకాటనంగ. 112

వంకరమాట, వఱగొడ్డము, బ॥సడుగులు, అనఁగా దోషవాక్యములకు పేళ్లు. వాకాటు యనఁగా వాగ్వాదునకు పేరు.

క. ఒంటరము కరుసు పరుసన
కంటసమును కాఱు కఱకు కాఱొడ్డెంబుఁ
గంటునుడి కంటగించును
కంటనఁగ విరోధవాక్య గణము మురారీ. 113

ఒంటరము, కరుసు, పరుసన, కంటసము, కాఱు, కఱకు, కాఱొడ్డెము, కంటునుడి, కంటగించు, కంటు యనఁగా విరోధవాక్యము పేళ్ళు.

గీ. గండ్రలు తుటారమును గొడ్డ కాఱు బెట్టి
దంబు బేరజమును బెడిదంబు గెంట
సం బనంగను పరుషవాక్యంబుపేళ్లు;
మిడియ యన వేదవాక్యమై యడరు శౌరి. 114

గండ్రలు, తుటారము, గొడ్డ, కాఱు, బెట్టిదము, బేరజము బెడిదము, గెంటసము అనఁగా పరుషవాక్యము పేళ్ళు. మిడియ యనఁగా వేదవాక్యము పేరు.

గీ. కలిగె నొఱగొడ్డెమన మనోఘాతవాక్య
మునకు పేరు; గయ్యాళంబు ననఁ గయాళి

మనఁగ నివి తిరస్కారోక్తి తనరె; నామ

మునకుఁ బేరనఁ జెల్లును మునివిలోల. 115

ఒఱగొడ్డెము అనఁగా (మనోఘాతవాక్యము)మనసునొప్పించెడుమాట. గయ్యాళిము, గయాళిము అనఁగా తిరస్కారోక్తికిపేర్లు. పేరు అనఁగా నామమునకుసంజ్ఞ.

ఆ. వె. కఱుకన కరుసన కాఱొడ్డెమనఁగను

కాఱనంగ నీఱతాఱ లనఁగ

పరుసన యనఁగను పరుస నఁగను కఠో

రోక్తి కాఖ్య లొప్పె నురగశయన. 116

కఱుకు, కరుసు, కాఱొడ్డెము, కాఱు, ని॥బ॥ఈఱతాఱలు, పరుసన, పరుసు అనఁగా కఠోరోక్తికిఁ బేళ్ళు.

గీ. మోసమన మఱపనఁగను మోస యన వి

తా కనఁగ పరాకన ప్రమాదంబుపేళ్లు;

దనరె మొఱకడమన గొఱతన మనంగ

నలరె దుష్టత్వమున కాఖ్య లంబుజాక్ష. 117

మోసము, మఱపు, మోస, వితాకు పరాకు, అనఁగా ప్రమాదముఁ బేళ్ళు. మొఱకడము, గొఱతనము అనఁగా దుష్టత్వమునకుఁ బేళ్ళు.

క. పొరపడు నా నేమఱుచన

పొరపాటన నేమఱనఁగ పొలమారవ నే

మరుపాటన నేమరిలన

నురగశయానా ప్రమాద మొందుట కాఖ్యల్. 118

పొరపడు, ఏమఱుచు, పొరపాటు ,ఏమఱు, పొలమారు , ఏమరుపాటు, ఏమరిల్లు అనఁగా ప్రమాదపడుటకుఁ బేళ్ళు.

గీ. తగువు పెనకువ యన వివాదంబుపేళ్లు
స్థిరము; శపియించుటకు పేళ్లు తిట్టన శపి
యించనఁగఁజెల్లె; వాకట్టు మించియొప్ప
ధరణి వాగ్బంధనమునకు దానవారి. 119

తగువు, పెనఁకువ అనఁగా వివాదముఁబేళ్ళు. తిట్టు అన, సపియించు అనఁగా శపియించుటకుఁబేర్లు. వాకట్టుఅనఁగా వాగ్బంధనమునకుఁబేరు.

గీ. చెడగరము వాఁడి ప్రామిడి చెడుగు చెండి
బెరసు బెట్టిదమననొప్పె పేళ్లు క్రూర
మునకు; రచనకభిఖ్యలుఁ దనరె భువిని
పన్నుగడ పన్నకంబును పన్నికయన. 120

చెడగరము, వాఁడి, ప్రాఁమిడి, చెడుఁగు, చెండి, బెరసు, బెట్టిదము అనఁగా క్రూరమునకుఁబేళ్ళు. పన్నుగడ, పన్నకము, పన్నిక అనఁగా రచనకుఁబేళ్ళు.

గీ. కుమ్మ్మ సుద్దియనంగను కొమరుమిగిలి
దనరె సంకేతవృత్తాంతమునకుపేరు;
ధరణి నుడికారమన చమత్కారవాక్య
మునకు పేరొప్పె మునికుల వనజమిత్ర. 121

కుమ్మ్మ, సుద్ది సంకేతవృత్తాంతమునకుబేరు. నుడికారము అనఁగా చమత్కారవాక్యమునకుబేరు.

క. తొలిచదువులు ప్రామిన్కులు
తొలుఁబల్కులు ప్రాఁజదువులు తొల్చదువులు ప్రాఁ

బలుకులు పెనుమినుకులు మిను
కులు ప్రాఁగబ్బము తొలుమినుకులు వేదాఖ్యల్. 122

తొలిచదువులు, ప్రామిన్కులు, తొలుఁబల్కులు, ప్రాఁజదువులు, తొల్చదువులు, ప్రాఁబల్కులు, పెనుమిన్కులు, మినుకులు, ప్రాఁగబ్బము, తొలుమిన్కులు అనఁగా వేదములకుఁ బేళ్ళు.

గీ. కైతకబ్బము కయితము కయితయనఁగ
పొసఁగె కవిత కభిఖ్యలు; పొత్తము వహి
యనఁగ పుస్తకనామంబు లౌను; కబ్బ
మనఁగ కావ్యంబునకుపేరు దనరె శౌరి. 123

కైత, కబ్బము, కయితము, కయిత అనఁగా కవిత్వమునకుఁ బేళ్ళు. పొత్తము, వహి అనఁగా పుస్తకముఁ బేళ్ళు. కబ్బముఅనగా కావ్యమునకుఁ బేరు.

గీ. అసమనంగను పొగడితయనఁ బొగడ్త
యనఁగ కీరితినాఁగను యశముపేళ్లు;
సడి యనెడు నుడి యనియెడు శబ్దమున క
కీర్తి పే ళ్లంబుధరరుచిపూర్తి మూర్తి. 124

అసము, పొగడిత, పొగడ్త, కీరితి అనఁగా కీర్తికిఁ బేళ్ళు. సడి, నుడి అనఁగా అపకీర్తికిఁ బేళ్ళు.

గీ. నీతమును తనవ ముదల నీతకంబు
నేమమును కట్టడ యనంగ నిర్ణయంబు
బొంరెపేళ్లు వక్కాణంబు పోలుపొందు
సుద్దియనఁగ వృత్తాంతాఖ్య లుద్దిగొనెను. 125

నీతము, తనవ, ముదల, నీతకము నేమము అనఁగ నిర్ణయము పేళ్ళు. వక్కాణము, పోలుపొందు, సుద్ది అనఁగా వృత్తాంతముపేళ్ళు.

సీ. అంగ మం గొప్పిద మంచు మైవడి కైపు
కైవడి కట్టడ కరణి కోపు
తమ కెసకం బోజ యమరిక పాటుమై
పగిది తెఱఁగు పజి పదురు తీరు
మొగి జోక తోయంబు తొాగ పొల్పు మైలాగు
పంతెం బనువు తేవ పరుసు చెన్ను
మాడికి గనునిక మాడ్కి వైనము మెయి
వెరవు సంగడి వీఁక వితము వెంట
గీ. నెరవు చందము బల్విడి నెజి వగ వహి
పోఁడిమి బలువిడి వరుస పొలము రూపు
సంచు విన్ననువు వడుగు సొరు సూటి
నాఁగ విధమున కాఖ్యలు నాగశయన. 126

అంగము, అంగు, ఒప్పిదము, అంచు, మైవడి, కైపు, కైవడి, కట్టడ, కరణి, కోపు, తమకు, ఎసకము, ఓజ, అమరిక, మై, పాటు, పగిది, తెఱఁగు, పజి, పదురు, తీరు, మొగి, జోక, తోయము, తొాగ, పొల్పు, మే, లాగు, పంతము, అనువు, తేవ, పరుసు, చెన్ను, మాడికి, గమనిక, మాడ్కి, వైనము, మెయి, వెరవు, సంగడి, వీఁక, వితము, వెంట, నెరవు, చందము, బల్విడి, నెజి, వగ, వహి, పోఁడిమి, బలువిడి, వరుస, పొలము, రూపు, సంచు, విన్ననువు, వడుగు, సొరు, సూటి అనవిధముపేళ్లు.

ఆ. వె. స్రావి సరవి సోఁదిది వావిరి పదకఁబు
పరువడి లలిమేర వరుస యనఁగఁ
బరగె క్రమముపేళ్లు; పొరి యొగి దారనాఁ
గ్రమముగా ననుటకు గలిగెపేళ్లు. 127

ప్రావి, సరవి, సొరిది, వావిరి, పదకము, పరువడి, లలి, మేర, వరుస అనఁగా క్రమమునకుపేళ్లు. పొరి, ఒగి, దార అనఁగా క్రమముగా అనుటకుఁపేళ్లు.

క. వెర వన నిమ్మన వలనన
సరియన నొడికంబనఁగ పొసగన నొనరునాఁ
నెరవన ప్రావయనంగ పొ
నరునన తిన్నయన యుక్తనామములు హరీ. 128

వెరవు, ఇమ్ము, వలను, సరి, ఒడికము, పొసఁగు, ఒనరు, నెరవు ప్రావ, పొనరు, తిన్న యుక్తమునకుఁబేళ్ళు.

గీ. యుక్తమగుటకుఁ బేళ్లగు నొదవు పోలు
సరిపడు తగుననంగ నిర్ధరణి ; ననుపు
ననుచు కట్టడసేయు నంచనఁగఁ బేళ్లు
నార్యవినుత ! యాజ్ఞాపించు మనుట కగును. 129

ఒదవు, పోలు, సరిపడు, తగు అనఁగా యుక్తమనుటకుపేళ్ళు. అనుపు, అనుచు, కట్టడసేయు, అంచు అనఁగా ఆజ్ఞాపించు మనుటకుపేళ్ళు.

క. ఆనయన దురాయి యనఁగ
నానతియన ముదలయు సెలవన నోజయనం
గా నిమితమన దురాయన
నౌ నుత్తరువనఁగ నాజ్ఞ కగునామంబుల్. 130

ఆన, దురాయి, ఆనతి, ముదలయు, సెలవు, ఓజ, నిమితము, దురా, ఉత్తరువు అనఁగా ఆజ్ఞకుపేళ్ళు.

క. మొదలన నెత్తనగోలన
పొదలెను ప్రారంభమునకు ; మొదలుపెటుడనఁ

మొదలుకొనన తొడఁగనఁ దె
ల్పెద ప్రారంభించుటకును పేళ్లగును హరీ. 131

మొదలు, ఎత్తనగోలు అనఁగా ప్రారంభమునకు పేళ్ళు. మొదలుపెట్టు, మొదలుకొను, తొడఁగు అనఁగా ప్రారంభించుటకుఁ బేళ్ళు.

గీ. మొదలుకొను నన తొట్టునాఁ మొదలగునన
ప్రముఖమున కాఖ్యలగును ; మొచు మొదలుకొని
కొలె తొడఁగి కోలె యన ముని నిలయయాది
కొని యనుట కాఖ్యలై కీర్తిఁగొనియె భువిని. 132

మొదలుకొని, తొట్టు, మొదలగు అనఁగా ప్రముఖమునకుఁ బేళ్ళు. మొచు, మొదలుకొని, కొలె, తొడఁగి, కోలె అనఁగా ఆదికొని యనుటకు బేళ్ళు.

గీ. కడ చివర యంచు తుదయును కడపలయన
నంత్యమున ; కంత పిమ్మట యంతట పద
పడి వెనుక పదంపడి తరువాత వెండి
పిదపనా ననంతరమున కొదవె పేళ్లు. 133

కడ, చివర, అంచు, తుద, (రూ)తుది, కడపల అనఁగా అంత్యమునకుఁ బేళ్ళు. అంత, పిమ్మట, అంతట, పదపడి, పదంపడి, వెనుక, తరువాత, వెండి, పిదప అనునివి అనంతరమునకుఁ బేళ్ళు.

క. మునుపన తొంటియనఁగ తొలి
యనఁగను తొలు తొల్లి తొల్త యన మున్పనఁగా
వెనుకటు నన తొలుత యనఁగా
దనుజాంతక పూర్వమునకు దనరెను పేళ్లై. 134

మునుపు, తొంటి, తొలి, తొలు, తొల్లి, తొ_త్త, మున్ను, వెనుకటి, తొలుత అనఁగా పూర్వమునకుఁ బేళ్లు.

సీ. పొరిపొరి సారె వేమరు పలుమరు పలు
మారు పల్మారు వేమారును పలు
మాఱు పల్మాఱు వేమా అన యము పలు
మఱు తొడితొడియు వేమరు పలుమఱు
మఱిమఱి చీటికిమాటికి పల్మఱు
సారె కందంద నాఁ బేరుమీఱి
నామ్రేడితమునకు నాఖ్యలై తెనుఁగున ;
వినుకలి విన్కలి విన్కి వినికి
గీ. యనఁగనాకర్ణనమునకు నాఖ్యలయ్యె ;
ఆలకించు నాలకించన నాఖ్యలయ్యెఁ
బరగె నిల నాకర్ణించు పదమునకును
మదరిపువిహార శ్రీవధూహృదయచోర. 135

పొరిపొరి, సారె, వేమరు, పలుమరు, పలుమారు, పల్మారు, వేమారు, పలుమాఱు, పల్మాఱు, వేమాఱు, అనయము, పలుమఱు, తొడితొడి, వేమరు, పలుమరు, మఱిమఱి, చీటికిమాటికి, పల్మఱు, సారెకు, అంధంద అనఁగా ఆమ్రేడి తమునకు బేళ్లు. వినుకలి, విన్కలి, విన్కి, వినికి అనఁగా ఆకర్ణనముఁ బేళ్లు. ఆలకించు, ఆలించు అనఁగా ఆకర్ణించుటకుఁ బేళ్లు.

గీ. ఆమతించుసన జీరుసన పిలుచన
బేర్మి నివి యాహ్వానించుపేళ్లు; మంత
నమన గుంజిలిపెట్టన మఱియు దాఁప
రికమనంగ రహస్యంబునకునుఁ బేళ్ళు. 136

ఆమంత్రించు, చీరు, పిలుచు,(రూ)పిల్వు అనఁగా ఆహ్వానించుటఁబేళ్లు. మంతనము, గుంజిలిపెట్టు, దాఁపరికము అనఁగారహస్యమునకుఁబేళ్ళు.

ఆ. వె. నుడుఁగు నుడువు నొడుగు నొడువు వక్కాణించు
వక్కణించు సలుకు వాకొను వివ
రించు చెప్పు నుగ్గడించు ప్రాకుచ్చున
నికరమగా వచించుటకును పేళ్లు. 137

నుడుగు, నుడువు, నొడుగు, నొడువు, వక్కాణించు, వక్కణించు, సలుకు, వాకొను, వివరించు, చెప్పు, ఉగ్గడించు, ప్రాకుచ్చు అనఁగా వచించుటకుఁబేళ్ళు.

గీ. తెలియునన పసఁగు నాఁగను తెల్విడియన
విశదమగుటకు నాఖ్యలై వెలసె; తలఁచు
ననఁగ ధ్యానించుటకుఁ బేరు; ధ్యానమునకు
తలఁపనఁగఁబేరు జెల్లును జలజనాభ. 138

తెలియు, పసఁగు, తెల్విడి అనఁగా విశదమగుటకుఁబేళ్లు. తలఁచు అనఁగా ధ్యానమునకుఁబేరు.

గీ. పొగడిక పొగడ్త కైవారము పొగడితయు
గణుతి యనఁగను స్తుతికి భిఖ్యలు; పొగడ్త
పొగడు నగ్గించు కొండాడనఁగస్తుతించు
టకు నభిఖ్యలు మణిమయమకుటభూష. 139

పొగడిక, పొగడ్త, కైవారము, పొగడిత, గణుతి అనఁగా స్తుతికి బేళ్ళు. పొగడ్త, పొగడు, అగ్గించు, కొండాడు అనఁగా స్తుతించుటకుఁబేళ్లు.

క. వేఁడుకొనన కొసరనఁగా
వేఁడికొనన వేఁడనంగ విలసిల్లె నిలన్

బోఁడిమిఁ బ్రార్థించుటకే
వాడక నామగణమగుచు పాలితదేవా. 140

వేఁడుకొను, కొసరు, వేఁడికొను, వేఁడు అనఁగా ప్రార్థించుటకుఁ బేళ్లు.

గీ. వదరు వాపో వడ రఱచు వాకొననఁగ
ఘోషణాఖ్యలు; కుయి కుయ్యి కూయి మొఱ్ఱొ
వాచఱు మొఱ యనంగను వన్నె కెక్కి
వెలసె నార్తధ్వనికి బేళ్ళు వేదవేద్య. 141

వదరు, వాపోవు, అడఁగు, అఱచు అనఁగా ఘోషణమునకుఁ బేళ్లు. కుయి, కుయిన, కుయ్యి, మొఱ్ఱొ, వాచఱు, మొఱ అనఁగా ఆర్తధ్వనికిఁ బేళ్లు.

గీ. గువ్వఁ గుత్తిక పడన డగ్గుత్తికయని
యనఁగ తీఁగెయెలుంగనియనఁగ
నీ రెలుంగనంగను ఘూర్కలుషవితాన
భంగ తెలుఁగున గద్గదస్వరము పేళ్ళు. 142

గువ్వ, గుత్తిక. డగ్గుత్తిక, తీఁగయెలుఁగుఁ, ఈ రెలుఁగు ఇవి గద్గదస్వరము బేళ్లు.

చ. సడి యగ డాడికోలును దిసంతును సెగ్గము అట్టురట్టునా
అడి తెగ డాట యాడికయు అవ్వయు పల్కును తిట్టువాటునీ
సడమును ప్రబ్బునం గొడిమె సంహతి నిందకభిఖ్యలయ్యెని
వ్వడమిని పేరుగాంచె స్ఫుటపుష్కరలోచన పాపమోచనా

సడి, అగడు, ఆడికోలు, దిసంతు, సెగ్గము, అట్టు, ఆఱడి, తెగడు, ఆట, ఆడిక, అవ్వ, పలుకు, తిట్టువాటు, ఈసడము, ప్రబ్బు, కొడిమె ఇవి నిందకుఁ బేళ్లు.

గీ. తెగడునాఁ బ్రబ్బునఁగ దూఱునఁగ నొదరని
యన కరాళించునాఁగ నెగ్గాడనంగ
నెగ్గులాడన పోనాడు నింక గోస
డచు ననఁగను అవ్వాడన డంబుమీఱి
యొప్పనిందించుటకుపేళ్ళు నురగశాయి. 144

తెగడు, ప్రబ్బు, దూఱు, ఒదరు, కరాళించు, ఎగ్గాడు, ఎగ్గులాడు పోనాడు, గోసడచు, అవ్వాడు అనఁగా నిందించుటకుఁ పేళ్లు.

క. నిక్కువము నికము నిజమును
నిక్కము సత్తును నిబద్ది నిబ్బద్దియనఁగా
గ్రక్కున సత్యముపేళ్లై
నిక్కె భువిని దనుజజైత్ర నీరదగాత్రా. 145

నిక్కువము, నికము, నిజము, నిక్కము, సత్తు, నిబద్ది, నిబ్బద్ది అనఁగా సత్యమునకుఁ బేళ్లు.

ఉ. తవణియు లేదుబంతి బురుడా మసి బద్దుర కాఱు కల్లయుం
దవళిహుళక్కియుఁ బిజాగు దబ్బఱ సున్నయుబొల్లుజల్లియుఁ
దవడియబద్దముఁ హుళికి డబ్బఱనాఁగ నసత్యనామముల్
భవసముదాయవార్ధితరి పాదబిసప్రసవా రమాధవా. 146

తవణి, లేదుబంతి, బురుడా, మసి, బద్దుర, కాఱు, కల్ల, తవళి, హుళిక్కి, బిజాగు, దబ్బఱ, సున్న, బొల్లు, జల్లి, తవడి, అబద్ధము, హుళికి దబ్బఱ అనఁగా అసత్యమునకుఁ బేర్లు.

క. తలఁపనఁగ సెౌరభపవపుున
నలరె నభిప్రాయ మనకు నాఖ్యలగు మ; పూ -
టలబంతి దొంతిచేఁక
కలిగిన వాగ్వర్గముగిసె కంధిశయానా. 147

తలఁపు అనఁగా అభిప్రాయమునకుఁ పేరగును.

వాగ్వర్గ ముగిసెను.

---

## శబ్దాదివర్గ

గి. అలికిడి రవాళి మొరయిక యలుకువ రొద
మ్రోత సద్దు రొదాళంబు మొరపము మెడి
దంబు నా దుర వళియనఁ దనరె పేళ్ళు
ధ్వనికి కల్మషదూర కంధరశరీర. 148

అలికిడి, రవాళి, మొరయిక, అలుకువ, రొద, మ్రోఁత, సద్దు, రొదాళము, మొరపము, మెడిదము, రవళి, నాదు అనఁగా ధ్వనికిఁ పేర్లు.

క. ఉలియును జడియును క్రందును
నులివు తివుట గిలకరించు నోఁజలు మొరయు క్రం
దిలు మ్రోయు మ్రోగునన
నలరెధ్వనించుటకుపేళ్లు హాటకచేలా. 149

ఉలియు, జడియు, క్రిందు, మొరయు, ఉలివు, తివుట, గిలకరించు ఓజలు, మ్రోఁగు, క్రందల్లు, మ్రోయు అనఁగా ధ్వనించుటఁ పేర్లు.

గీ. గొండ్లి యన నాట నాఁగను గొండిలియన
నట్టువ యనంగ పచరణనాఁగ చిందు
నాఁగ మలపుగొనుననియనంగ కేళి
కయన నాట్యమునకు పేళ్లు కమలనాభ. 153

గొండ్లి, ఆట, గొండిలి, నట్టువ, పచరణ, చిందు, మలపుగొను
కేళిక ఇవి నాట్యమునకుఁ బేళ్ళు.

గీ. ఆడు తడవాడు పింపిసలాడు చిందు
ద్రొక్కు నట్టాడు చిందులుద్రొక్కు ననఁగ
మఱియు తుంపెసలాడన మహిని వెలసె
నర్తనము సేయుటకు పేళ్లు నలిననాభ. 154

ఆడు, తడవాడు, పింపిసలాడు, చిందులుద్రొక్కు, తుంపెసలాడు
ఇవి నర్తించుటకుఁ బేళ్ళు.

క. క్రోవియు వాసెయు పిల్లనఁ
గ్రోవి మయిలక్రోవి తూఁతకొమ్మును పిల్లం
గ్రోవియు పిల్లంగ్రోల్ నా
మావళి భువి మురళికౌను హాటకచేలా. 156

క్రోవి, వాసె, పిల్లనఁగ్రోవి, మైలక్రోవి, తూఁతకొమ్ము, పిల్లంగ్రోవి,
పిల్లంగ్రోలు అనఁగా మురళీవాద్యమునకుఁ బేర్లు.

క. వీణెయనఁగా దండియయన
వీణియయన వీనెయనఁగ వీనియయనఁగా
వీణకు పేళ్లౌ; నోళవన
వీణాదండంబు పేరు విహగతురంగా. 156

వీణె, వీణియ, దండియ, వీనియ, వీనె అనఁగా వీణపేర్లు. ఒళవు అనఁగా వీణాదండముపేరు.

గీ. కరివెన వీణెకాయనాఁ గకుభమునకు
మొనసెఁ బేర్లు; తంత్రీభేదమునకుఁ బేర్లు
తంబుఱా తంబుఱ యనఁగఁ దనరె; సరము
తంతి సరికట్టు సారె నాఁదంత్రిపేళ్లు. 157

కరివె, వీణెకాయ అనఁగా కకుభమునకుఁ బేర్లు. తంబుఱా, తంబుఱ అనఁగా తంత్రీభేదము. సరము, తంతి, సరికట్టు, సారె అనఁగా తంత్రికిఁ బేర్లు.

గీ. తుడుము నరగజము దమకు గిడియ డోలు
నాఁగనొప్పెను తమ్మటనామపంక్తి;
తవణి డంకా దవిణ డక్క భువిని ఢక్క
కాఖ్యలౌ మదదనుజారి యఘవిదారి. 158

తుడుము, నరగజము, దమకు, గిడియ, డోలు అనఁగా తమ్మటముపేర్లు. తవణి, డంకా, దవిణ, డక్క అనఁగా ఢక్కపేర్లు.

గీ. నాగసరమన్న సన్నాయినాఁగ సింగి
నాదమనఁగను తెనుఁగునామపంక్తి
యలరె మురళివిశేషంబునలఘు దురిత
దూర దనుసుతవారసంహార శూర. 159

నాగసరము, సన్నాయి, సింగినాదము అనఁగా మురళీవిశేషమునకు పేర్లు.

గీ. ఉడుకు యావజము కవడె యురుము కాళె
కనకతప్పెట గుమ్మెట కాళియ క్కయి

ముడి యుడుక్క గుమ్మెతయు కైముఁడియుఁ జెంగు
కరిదియుఁ గడవ లీటును నరగయనఁగ
నమరెవాద్యభేదంబుల కాఖ్యలగును. 160

ఉడుక, ఆవజము, కవడె, ఉరుమ, కాళె, కనకతప్పెట, గుమ్మెట, కాళియ, కయిముడి, ఉడుక్క, గుమ్మెత, కైముఁడి, చెంగు, కరిది, కడవ లీటు, నరగ అనఁగా వాద్యవిశేషముల పేర్లు.

గీ. సంతసం బరుసము రహిసంబరంబు
సంభ్రమ మెల ర్పెలరుపు సంతొసంబు
వెంట మెలమి సంతోసంబు వేడుకయరు
నంబు కొండాటమును హాసుసంబుంపొంపు
నెమ్మియన సంతోషముపేరు లిమ్మహిహారి. 161

సంతసము, అరుసము, రహి, సంబరము, సంభ్రమము, అలరు, ఎలర్పు, ఎలరుపు, సంతోసము, వెంటము, ఎలమి, సంతోసము, వేడుక, అరుసము కొండాటము, హాసుసము, పొంపు, నెమ్మి అనఁగా సంతోసమునకుఁ బేర్లు.

క. తలిరు చెలర్చును కేరును
చెలఁగు తలిర్చెలరుచు హూరుసించు తలిర్చు
వెలసెను సంతోషించుట
కిల నాఖ్యలగుచు మురారి కృతికవిహారీ. 162

తలిరు, చెలర్చు, కేరు, చెలఁగు, తలిర్చు, ఎలరుచు, హూరుసించు, తలిరుచు, వెలసు అనఁగా సంతోషించుట పేళ్లు.

సీసమాలిక.

అసలారు బంపిల్లు నగ్గలిం చేపారు
నన గుబ్బతి ల్లెలరు చగ్గలికయు

కడలు నెక్కొనసఁగును కడుకొనుఁ గ్రేళ్లుబ్బు
కదు రెసలారును కడలుకొనును
మూరిఁబోవు నెలర్చు మూఁగు నడరువాలు
కొదరు కెరలు వ్రాలు కొప్పరించు
తనరారు జడిఁగొను తనరు తనర్చును
తొంగలించు తలిర్చు తుఱంగలించు
తనరుచు తలిరుచు దైవారు దుద్దొక్కు
నిక్కు పం బెసలారు నిబ్బరించు
పరిఢవించు ననుచు బలకొను పమ్మను
ప్రబలు మిటారించు ప్రబ్బుతేయు
ముడివడు మేటిల్లు ముఁదియంబడును మొండు
కొను నివ్వటిలు క్రిందుకొను తొలంకు
గుబ్బతిలును గండుకొనును పొంపిఁబోవు
పొంగారు పొనకాడు చెంగలించు
గీ. నుట్టిపడును పొటకరించు నొడ్డగిల్లు
మించి యాగుబ్బుకొను మమ్మరించు పెంపు
మీఱు సందడించనఁగను మేఘశోభి
తాంగ! యతిశయించుట కాఖ్యలయ్యెధరణి. 163

అసలారు, అంపిల్లు, అగ్గలించు, ఏపారు, గుబ్బతిల్లు, ఎలరుచు, అగ్గలిక, కడలు, ఎక్కొ, ఎసఁగు, కడుకొను, క్రిళ్లుబ్బు, కదురు, ఎసలారు, కడలుకొను, మూరఁబోవు, ఎలర్చు, మూరు, అడరు, వాలు, కొదరు, కెరలు, వ్రాలు, కొప్పరించు, తనరారు, జడిఁగొను, తనరు, తనర్చు, తొంగలించు, త

లిరు, మఱుఁగలించు, తనరుచు, తలిరుచు, దైవాఱు, దుద్దెక్కు, నిక్కు, పంఱు, ఎసలారు, నిబ్బరించు, పరిడవించు, ననుచు, ఖలకొను, పమ్ము, ప్రబలు, మిటారించు, ప్రబ్బు, ఓయు, ముడివడు, మేటిల్లు, మురియబడు, మెండుకొను నివ్వటిల్లు, క్రందుకొను, తొలఁకు, గుబ్బతిల్లు, గడ్డుకొను, పొంపిపోవు, పొంగారు, పొనకాడు, చెంగలించు, ఉట్టిపడు, పొటకరించు, ఒడ్డగిల్లు, ఆగుబ్బుకొను, మమ్మరించు, పెంపుమీఱు, సందడించు అనఁగా అతిశయించుట పేళ్లు.

సీ. కడిమి యెడ్రెజెల యేచు కడ్మి ననుపు పిక్కటిల్లు పెల్చన పెల్చ పెల్లుపేర్మి
పెలుచన తనరువు పెలుచ మిటారంబు
బెట్టు పంచారంబు పెంపు నెలరు
వఱలు సందడి మెండు పరిడవం బెసకంబు
పేరిమి మెఱవడి పెల్లిదంబు
నిబ్బరం బాగుబ్బు నుబ్బరం బనఁగను
దనరారె నతిశయమునకుఁ బేళ్లు;

గీ. నంగవించు నంకించు నుప్పొంగు మొన
కట్టు వీఁగు కేరును కిలకొట్టును వసి
గొనును కొలల్కొను ననఁగను దనరె నుల్ల
సిల్లుటకుఁ బేళ్లు హరిహయసేవితపద. 164

కడిమి, ఎడ్రెజెల, ఏచు, కడ్మి, ననుపు, పిక్కటిల్లు, పెల్చన, పెల్చ, పెల్లు, పేర్మి, పెలుచన, తనరువు, పెలుచ, మిటారము, బెట్టు, పంచారము, పెంపు, ఎలరు, వఱలు, సందడి, మెండు, పరిడవము, ఎసకము, పేరిమి, మెఱవడి, పెల్లిదము, నిబ్బరము, ఆగుబ్బు, ఉబ్బరము ఇవి అతిశయమునకు పేళ్లు. అంగవించు, అలకించు, ఉప్పొంగు, మొనకట్టు, వీఁగు, కేరు, కిలకొట్టు, వసిగొను, కొలల్కొను అనఁగా ఉల్లసిల్లుట పేళ్లు.

గీ. అచ్ఛలం బారడము వీఁక యంగద లలి
యోజ యొడికారమును జోక యుబ్బకంబు
నగ్గలిక మొనకట్టు గొమ్మనఁగ భువిని
వెలసె నుత్సాహమునకు నాఖ్యలు మూఁడా. 165

అచ్ఛలము, ఆరడము, వీఁక, అంగద, లలి. ఓజ. ఒడికారము. ము, ఉబ్బకము, అగ్గలిక, మొనకట్టు, కొమ్ము అనఁగా ఉత్సాహమునకు పేళ్లు

క. నగవనఁగ నవ్వన నగు న
నఁగ హాసము పేళ్లు; చిన్నినగవనఁగను చి
ర్నగ వనఁగ ముసిముసినగ వ
నఁగ చిఱునగవనఁగ స్మితమునకు పేళ్లొప్పున్. 166

నగవు, నవ్వు, నగు అన హాసము పేళ్లు. చిన్నినగవు. చిర్నగవు, ముసి ముసినగవు, చిఱునగవు అనఁగా స్మితము పేళ్లు.

క. ఎగతాళి గేలి త్రిస్త్రరి
నగుబాటు పిసాళి క్రేణి నవ్వులు పేరం
బగు మఱియుఁ దచ్చనయును
నగు పరిహాసంబు పేళ్లు హరిహయగర్వా. 167

ఎగతాళి, గేలి, త్రిస్త్రరి, నగుబాటు. పిసాళి, తచ్చన అనఁగా పరిహాసముఁ బేళ్లు.

గీ. క్రేణిసేయు సంయాటించు గేలిగొట్టు
గుంజ నుసుఁగుడనంగను కుముదమిత్ర
సూర్యలోచన పరిహరించుటకు పేళ్లు
నాంధ్రభాషనుఖిలసిల్లె నవనియందు. 168

క్రేణిసేయు, సంధూటించు, గేలిగొట్టు, గుఁజనునుఁగుడు అనఁగా పరిహసించుటకు పేళ్లు.

గీ. తమి యనఁగ కుతూహలమున కమరుఁ దమిగొ
ను నన తివురన తిలకించు నన కుతూహ
లపడుటకు నొప్పు; తీక్ష్ణణంబు నపు డొయ్యన
బెట్టి యొక్కుఱ పేళ్లచే బిసరుహాక్ష. 169

తమి అనఁగా కుతూహలము పేరు. తమిఁగొను, తివురు, తిలకించు అనఁగా కుతూహలపడుట పేళ్ళు. బెట్టి, ఒక్కుఱ అనఁగా తీక్ష్ణము పేళ్ళు.

క. అక్కటికముఁగ నిబ్బరికం
బక్కటికయుఁ గనికరమన నగు దయ కాఖ్యల్;
నిక్కముఁ దెలిపెద సైరిం
చొక్కటి క్షమించుననుట నొప్పెమురారీ. 170

అక్కటికము, నిబ్బరికము, అక్కటిక, కనికరము అనఁగ దయాపేళ్ళు. సైరించు అనఁగా క్షమియించుటకు పేరు.

క. ఓరిమి యోపిక తాళిక
యోరుపు నోపోర్పు తాల్మి యోర్పును మఱియుఁగా
సైరణ యన క్షమ కాఖ్యలు
ఘోరదితికుమారజాల కుంజరసింహా. 171

ఓరిమి, ఓపిక, తాళిక, ఓరుపు, ఓపోర్పు, తాలిమి, ఓర్పు, సైరణ అనఁగ క్షమకు పేళ్ళు.

కే. కనుకట్టుం దనము నిడుని
వను కాంతాళంబనుచు ననఁగనీరసనాఁ

గ నసూయా కాఖ్యలగుచుం
దనరె రమాహృదయవికచ తామరసాళీ. 172

కనుకుట్టుఁ దనము, కాంతాళము, ఈరస అనఁగ అసూయపేళ్ళు.

సీ. అద టసం బెగ పుదు టుదురు గరువమును
గబ్బియు గబ్బును గబ్బితనము
డంబును ముర్వును డబడబ టెక్కువ
టెక్కును కచ్చును తెక్కు తెగటు
త్రుక్కును నిక్కును త్రుళ్లును నెగవును
బింకంబు పొగరును పిలుకు వీఁక
మురువు హంకారంబు మురిమిడి ముఱికంబు
బెట్టు మిటారంబు బెట్టిదంబు
గీ. వీఁకనఁగ గర్వమునకు నభిఖ్యలొప్పు
వీఁకనఁగ మిటారించన వీఁగుననఁగ
విక్కననఁగ పొంగారన నిక్కననఁగ
పొంగళించన త్రుళ్లన పొసఁగె నాంధ్ర
మునను గర్వించు పేళ్లగు మునివిలోల. 173

అదటు, అసము, ఎగపు, ఉదుటు, గరువము, గబ్బు, గబ్బిదనము, డంబు, ముర్వు, డబడబ, టెక్కువ, టెక్కు, కచ్చు, తెక్కు, తెగటు, త్రుక్కు, నిక్కు, త్రుళ్ళు, నెగవు, బింకము, పొగరు, పిలుకు, వీఁక, మురువు, హంకారము, మురి, మిడి, ముఱికము, బెట్టు, మిటారము, బెట్టిదము, వీఁకఅనఁగా గర్వమునకుఁ బేళ్ళు. వీఁకు, మిటారించు, వీఁగు, విక్కు, పొంగారు, నిక్కు, పొంగళించు, త్రుళ్ళు అనఁగా గర్వించుటకుఁ బేళ్ళు.

తే. గి. వెలసె నీటనఁగను మురిపెంబనంగ
నుర్వరఁ జెలంగె శృంగారగర్వమునకుఁ
బేళ్లు; కన రితె మెక్కు_ను వేడుకయును
బాళి యితవన నిష్టమహా పాశనాశ. 174

నీటు, మురిపెము శృంగారగర్వమునకుఁ బేళ్ళు. కనరు, ఇతవు
పక్కు_, వేడుక, బాళి, ఇతవు అనఁగా ఇష్టమునకు పేళ్ళు.

తే. గి. ఓటుపాటన నెడరన నోటమి యన
బాడుదల నాఁగ నోటన భంగమునకు
మొక్క_చెడు బన్నపడు నోటుపోవనంగ
భంగపడుట కభిఖ్యలౌ పంకజాక్ష. 175

ఓటుపాటు, ఎడరు, ఓటమి, బాడుదల, ఓటు అనఁగా భంగ
మునకుఁ బేళ్ళు. మొక్క_చెడు, బన్నపడు, ఓటపోవు అనఁగ భంగపడుట పేళ్ళు.

గీ. ఓటుసేయు నోటమిసేయు మాటలవని
భంగపఱచుటకగు; తలవంపు కేర
డంబు కాకును బ్రోచ్చన డంబుమీఱి
యగు తిరస్కా_రమున కాఖ్య లంబుజాక్ష. 176

ఓటుసేయు, ఓటమిసేయు అనఁగా భంగపఱచుటకుఁ బేళ్ళు. తల
వంపు, కేరడము, కాకు,బ్రోచ్చు ఇవితిరస్కా_రమునకుఁ బేళ్ళు.

గీ. తెగడనంగ రాకొట్టన తెవడన మురఁ
ళించనఁగ కేరనఁగ తుటారించనంగ
గోడగించనఁగను నామకోటి కీర్తి
మించియలరారెను దిరస్క_రించుటకును. 177

తెగడు, రాకొట్టు, తెవడు మురళించు, కేరు, ఈటూరించు, గోడగించు, ఇవి తిరస్కరించుటకుఁ బేళ్ళు.

గీ. బిడెము బిడియంబు సిగ్గు సిబ్బితియు నాన
యీల యన వ్రీడకాఖ్యలయ్యెను; తివురస
వలచు నా వేఁడు ననఁగను వెలసె తెనుఁగు
నం దపేక్షించుటకు పేళ్లు నళిననాభ. 178

బిడెము, బిడియము, సిగ్గు, సిబ్బితి, నాన, ఈల అన లజ్జకుఁ బేళ్ళు. తివురు, వలచు, వేఁడు అనఁగ అపేక్షించు పేళ్ళు.

క. తరితీపు కచ్చు నేఁకట
యరిమిలి యడియాస యాస యర్మిలి తమిహా
ళి రహియు మచ్చిక నర్మిలి
నరిమిలి మచ్చిగ యపేక్ష నామములు హరీ. 179

తరితీపు, కచ్చు, ఏఁకట, అరిమిలి, అడియాస, ఆస, అర్మిలి, తమిహాళి, రహి, మచ్చిక, నర్మిలి, నరిమిలి, మచ్చిగ అనఁగ అపేక్షకుఁ బేళ్ళు.

గీ. ఆస యాసత్తి చన విచ్చ యర్మిలియును
తలఁపు కోరిక తివుటయు వలపు కోర్కి
కొసరు నాఁగను జెలఁగెఁ దెన్గునను వాంఛ
కాఖ్యలగుచును దనుజరాడద్రివజ్రి! 180

ఆస, ఆసత్తి, చనవు, ఇచ్చ, అర్మిలి, తలఁపు, కోరిక, తివుట కొసరు, కోర్కి, వలపు అనఁగా వాంఛకు పేళ్ళు

గీ. వెరఁగు నివ్వెఱ నివ్వెర వెఱఁగు నొడు
కొట్టు నివ్వెఱఁగు నవుడుకొట్టు తేఁకు

వ మిణాకరమును వెలివెలిపాటు టిచ్చ
యు తటకాయన నిశ్చేష్టకొప్పపేళ్లు. 181

వెరఁగు, నివ్వెఱ, నివ్వెర, వెఱఁగు, నాడుకొట్టు, నివ్వెఱఁగు, నవ్వుడు కొట్టు, తేఁకువ, మిణాకరము, వెలివెలిపాటు, టిచ్చ, తటుకా అన నిశ్చేష్టకుఁ బేళ్ళు.

గి. మఱవు సొగయిక సొలవు సుమాళము మయి
మఱవు నుబ్బరవోవు నివ్వెఱ వితాకు
బెగ్గలంబును సొగయు నివ్వెరయు సొగవు
బిమ్మిటి యనంగ పరవశం బిమ్మహినగు 182

మఱవు, సొగయిక, సొలవు, సుమాళము, మైమఱవు, ఉబ్బరవోవు, నివ్వెఱ, వితాకు, బెగ్గలము, సొగయు, నివ్వెర, సొగవు, బిమ్మిటి అనఁగ పరవశముఁ బేళ్ళు.

గి. సొగయు పుతపుతవోవును చొక్కను మఱి
బెగ్గలముపడు నెరగొను బెగ్గిలు నన
పారవశ్యంబునకుఁ బేళ్లు బరగె; టిచ్చ
బడు వితాకన నిశ్చేష్ట పడుటపేళ్ళు. 183

సొగయు, పుతపుతవోవు, చొక్కు, బెగ్గలముపడు, ఎరగొను, బెగ్గిలు అనఁగా పారవశ్యముఁ బేళ్ళు. టిచ్చపడు, వితాకు అన నిశ్చేష్ట పడుటకుఁ బేళ్ళు.

గీ. కవుడు కువ్వాడమును వెద్పు కొండు కిటుకు
పొచ్చెము కువాళమును సట తచ్చన యుకి

పంబునను కువాడమునుచిట్టకంబు వైసి
కియు బవంతెబనఁగ పేళ్ళు కపటమునకు. 184

కపటము, కువ్యాజము, కెపు, కాడు, కిలుకు, పోఁచిమి, కగా
శము, నట, కచ్చన, ఉరవము, కువాడము, చిట్టకము, వైసిడము, జగ
తీసు అనఁగా కపటము పేళ్ళు.

జంకియయును పంచాడింపు జంకెన బెద
రింపు జంకెనయనఁగ విహ్వాలింపు పేళ్లు;
జంకు బెగ్గిలు గ్రక్కుతిల్ జళ్కుబెదరు
ననఁగ విహ్వాలమున కాఖ్యలౌను శౌరి 185

జంకియ, పంచాడింపు, జంకెన, బెదరింపు, జంకె అనఁ విహ్వా
లింపు పేళ్ళు. జంకు, బెగ్గిలు, గ్రక్కుతిల్లు, జళుకు బెదరు అనఁగా విహ్వా
లించు పేళ్ళు.

గీ. అలమటయుఁ గలవరము చింతాఖ్యలయ్యె;
నరయికయు వగ యాదట యరయుట తల
పోత తుందుడుక నగను పోసఁగె భువి వి
చారమునకాఖ్యలై జలజాతనాభ. 186

కలవరము, అలమట అనఁగా చింత పేళ్లు. అరయిక, వగ, ఆపట,
అరయుట, తలపోత, తుందుడుకు అనఁగా విచారమునకు పేళ్లు.

గీ. తలరు స్రుక్కును బెగ్గిల్లు నలమటించు
నలమ రనఁగ చింతించుట కాఖ్యలయ్యె
వెలసె తడుము నాలోచించు పేరుబొంది
మించె; పాటించునా విచారించుటకగు. 187

తలరు, క్రుమ్కు, బెగ్గిల్లు, అలమటించు, అలమరు అనఁగ చింతించుటకు పేళ్లు. తుడుము అనఁగా ఆలోచించుటకు పేరు. పొంటించు అనఁగా విచారించుటకు పేరు.

గీ. అదయు నన తలపోతయు ననఁగ నేక
తంబనఁగ వగయన మంతనంబనంగఁ
దనరె నాలోచనకు; నెగ్గతంబు మంత
నంబు కందువ యేకాంత నామమిలను. 188

అదయు, తలపోత, ఏకతము, వగ, మంతనము అనఁగా ఆలోచనకు పేళ్లు. ఎగ్గతము, మంతనము, కందువ అనఁగా ఏకాంతమునకుఁ బేళ్లు.

గీ. చెమట చెమ్మట చెమర నఁ జెల్లు ఘర్మ
మునకభిఖ్యలు; చెమ్మరించనఁ జెమర్చ
ననఁగఁ జెమరించు ననియన నావిరిల్లు
ననఁగఁ జెల్లు ఘర్మోత్పత్తి కాఖ్యలగుచు. 189

చెమట, చెమ్మట, చెమరు అనఁగా ఘర్మమునకుఁ బేళ్లు. చెమ్మరించు, చెమర్చు, చెమరించు, ఆవిరిల్లు అనఁగా ఘర్మోత్పత్తిఁ బేళ్లు.

గీ. గగురు గగ్గురు పులకించు గగురువొడుచు
గరు పులకరించు గరుపాటు గన్గురు గరు
పాటు నిడువెంట్రుకయు బహువచనమందుఁ
బులకలనఁ బులకాంకురాఖ్యలు మురారి. 190

గగురు, గగ్గురు, పులకించు, గగురువొడుచు, గరు, పులకరించు, గరుపాటు, గన్గురు, గరుపాటు, నిడువెంట్రుక, బ॥ పులకలు అనఁగా పులకాంకురముల పేళ్లు

క. ఓజ యోటమి కనుకని యోట కోఁచ
జంకు బెగ్గల మెద భీతు జలదరంబు
బెగడు బెగ్గడు తలఁకును బెగ్గలికము
నదలు వెఱ వెఱపన భయాఖ్యలు హరి. 191

ఓజ, ఓటమి, కనుకని, ఓట, కోఁచ. జంకు, బెగ్గలము, ఎద, భీతు, జలదరము, బెగడు, బెగ్గడు, తలఁకును, బెగ్గలికము, అదలు. వెఱ, వెఱపు, ఇవి భయమునకు పేళ్ళు.

తే.వె. బెగడు పిచ్చలించు బెగ్గిల్లు బెగ్గడు
వెఱచు నడలుచు వెఱచఱచు తలఁకు
పుల్లగిల్లు గ్రుక్కుఁ జెల్లెని పల్కులు
భయపడుటకు పేళ్లు భవ్యచరిత. 192

బెగడు, పిచ్చలించు, బెగ్గిల్లు, బెగ్గడు, వెఱచు, అడలు, వెఱచఱచు, తలఁకు, పుల్లగిల్లు, గ్రుక్కు ఇవి భయపడుటకుఁ బేళ్ళు.

క. పేదపడు పంద పేదర్మి పేదఱిమియు
పిఱికి యనఁ బేళ్ళదన రెను భీరువునకుఁ;
బరగ విప్వచ్చమనఁగ భీభత్సమునకు
సకలమునిజనాభయపాణి చక్రపాణి. 193

పేదపడు, పంద, పేదర్మి, పేదటిమి, పిఱికి అనఁగా భీరువునకు పేళ్ళు. విప్వచ్చము అనఁగా భీభత్సమునకుఁ బేరు.

క. గలతరించును పెల్కుఱు పెలుకుఱనఁగ
వెలసె భయవికారాఖ్యలై; బెడిదము చల

జంపు గోరగింతయు నాఁగ జలరుహానయ
నా! భయంకరమునకును నామపంక్తి. 194

గలతరించు, వెల్కుటు, వెల్కుకుటు అనఁగా భయవికారమునకుఁ బేళ్ళు. బెడిదము, చలజంపు, గోరగింత అనఁగా భయంకరము నకు పేరు.

గి. అరులు మాలిమి యర్మిలి యర్లనంగ
వెలసె వాత్సల్యనామముల్; చలపకార
మనఁగ పటికిరింతయు చలమనఁగఁ బేళ్ళు
దనరె మాత్సర్యమునకు మదనవిలాస. 195

అరులు, మాలిమి, అర్మిలి, అర్లు అనఁగ వాత్సల్యమునకుఁ బేళ్లు. చలపకారము, పటికిరింత, చలము అనఁగ మాత్సర్యమునకుఁ బేళ్ళు.

సీ. అరితి ప్రేముడి బాళి యర్మిలి యాదట
మచ్చిక గాదిలి మక్కువయును
గారాము తీయము గారాబమును నెమ్మి
నెమ్మిక తియ్యము నెనరు పెరిమ
యిచ్చకమును గూర్మి ముచ్చట గారవం
బును లలి కూరిమి యును నరి మిలియు
పేరిమి యనఁగను బేళ్లౌను ప్రేమకు;
రమణనా ాణనా గవణయనఁగఁ

గి. దనరె ప్రియమునకాఖ్యలై; చనువనంగ
కాయువన చిగురొత్తన క ఖ్యు నాఁగ
నను పనఁగ ననుదాగంబ ఎకును పేళ్ళు
జలరుహాయతనయన భు గళయన. 196

అరితి, ప్రేముడి, బాళి, అర్మిలి, ఆదట, మచ్చిక, గాదిలి మక్కువ, గారాము, తీయము, గారాబము, నెమ్మి, నెమ్మిక, తియ్యమి, నెనరు, పేరిమ, ఇచ్చకము, కూర్మి, ముచ్చట, గారవము, లకీ, కూరిమి. అరిమిలి, పేరిమి అనఁగా ప్రేమకు పేళ్ళు. రమణ. రాణ, రవణ అనఁగా ప్రియమునకు పేళ్ళు. చనువు, కాయువు, చిగురొత్తు, కాయ్వు, సనుపు అనఁగా అనురాగమునకు బేళ్లు.

సీ. అచ్చలం బంగద యుక్కసు తుకతుక
కినుక యీసును కాఁక కినుపు కసరు
కలుచ యీసరమును గాతాళమును గిన్క
పెలుచన యీసర పెలుచ యరుసు
చిట్టి యటుఁగొను జిట్టు చిరాగును
గనలు రోసంబును కసియుఁ జలము
బైడాలమును నిత్యబహువచనంబున
గలిగె నంకాపాంకములును మఱియు
గీ. నంకపాంకంబులని యన నలరె రౌద్ర
మునకు పేళ్లుక్కసును చలమువిడి మచ్చ
రంబు వేరమి మచ్చరికంబు వేర
మనఁగ ద్వేషంబునకు నభఖ్యలు మురారి. 197

అచ్చలము, అంగద, అక్కసు, తుకతుక, కినుక, ఈసు, కాఁక, కినుపు, కసరు, కలుచ. ఈసరము, కాతాళము, కిన్క, పెలుచన, ఈరస, పెలుచ, అరుసు, చిట్టి, అటుఁగొను, చిట్టు, చిరాగు కనలు, రోసము, కసి, చలము, బైడాలము, బ॥అంకాపాంకములు, అంకపాంకములు అనఁగా రౌద్రమునకుఁ బేళ్లు. ఉక్కసము, చలము, విడి, మచ్చరము, వేరమి, మచ్చరికము, వేరము అనఁగా ద్వేషమునకుఁ బేళ్ళు.

గీ. అలుగు కనలును గాసిల్లు నలువు కసరు
కినియు రొప్పు కనారిలు కింకిరిపడు
పదరు కిన్వడు తివురును పనుకు ననఁగ
నొప్పు కోపించుటకుపేళ్ళు నురగశయన. 198

అలుగు, కనలు, గాసిల్లు. అలువు, కసరు, కినియు, రొప్పు కనారిలు, కింకిరిపడు, పదరు, కిన్వడు, తివురు, పనుకు అనఁగా కోపించుటకుపేళ్ళు

గీ. రంజిలుటకగు రాగించు రాగిలనఁగ;
నిద్రకగు కూర్కు నిద్దుర నిదుర కూరు
కనగ నొప్పెను; జృంభణమునకు నావు
లింతయననామమగును పాలితమునీశ. 199

రాగించు, రాగిల్లు అనఁగా రంజిల్లుటకుపేళ్ళు. కూర్కు, నిద్దుర నిదుర, కూరుకు అనఁగా నిద్రకుఁపేళ్ళు. ఆవులింత అనఁగా జృంభణమునకు పేరు.

క. తూఁగనఁగ కునికిపాటన
తూఁగిపడన తందరయన తూఁగుపడు డనం
గాఁ గలిగె భువి తెలుంగున
నగశయానా! ప్రమీల నామములగుచుఁ. 200

తూఁగు, కునికిపాటు, తూఁగిపడు, తందర, తూఁగుపడు అనఁగా ప్రమీలకుపేళ్ళు.

గీ. ఉపవడంబును మెలకువ యుప్పవడము
మేలుకాంచును మేల్కొలు మేలుకొల్పు

మేలుకొనుసన విలసిల్లె మేఘశోభి
తాంగ యవబోధమునకు నామాళియగుచు. 201

ఉపపడము, మెలకువ, ఉప్పవడము, మేలుకాంచు, మేలొల్కాలు, మేలుకోలు, మేలుకొను అనఁగా అవబోధమునకుఁ బేళ్లు

గీ. రింబ యున్మాదమును కైపు రిమ్మ కయిపు
వెట్టి వేదురు తిక్కనా విఱ్ఱివీగె
ధరణి యున్మాదమునకు; తబ్బిబ్బు తెఱవు
మఱవునా విపర్యయ నామమాలిక హరి. 202

రింబ, ఉన్మాదము, కైపు, రిమ్మ, కయిపు వెట్టి, వేదురు, తిక్క ఇవి ఉన్మాదమునకు పేళ్లు. తబ్బిబ్బు, తెఱవు, మఱవు ఇవి విపర్యయము పేళ్ళు.

గీ. మంపు లాహిరి సోలంబు మత్తు మయిద
మదురువును లాహిరీ కైపు మైదు కైవు
మైకము మఱి మత్తాయు నున్మాదగుణము
మంపిలన మత్తుగొనునా మదింపుపేళ్ళు. 203

మంపు, లాహిరి, సోలము, మత్తు, మయిద, మదురువు, లాహిరీ కైపు, మైదు, కైవు, మైకము, మత్తు ఇవిఉన్మాదగుణమునకుఁ బేర్లు. మంపిల్లు, మత్తుగొను అన మదింపుపేర్లు.

గీ. గ్రాలుదెంచును గ్రాఁగును గ్రాలన వివ
శత్వమున గ్రాలుటకుఁ బేళ్ళు; శ్వాస కావి
యగును; నిశ్వసించుటకు రొజనఁగఁజెల్లె;
నూర్పు నూరుపు నుచ్ఛ్వాస శొప్పపేళ్ళు. 204

వ్రాలుడెంచు, వ్రాగు, వ్రాలు అనఁగా వివశత్వమునవ్రాలుట పేర్లు ఆవి అన శ్వాసమునకు పేరు. రోజు అనఁగా నిశ్వసించుటకు పేరు. ఊఁగాఫ్పు, ఊర్పు అన ఉచ్ఛ్వాసము పేరు.

పంచపాది గీ. రోజు నిట్టూరుపును వగరుచు వగర్చు
నాఁగ నొప్పెను నిశ్వాస నామపంక్తి;
యూఱడిలు సాకతము సేయు నూఱు డూఱ
డించు నోదార్చు నూరార్చు నంచుబల్క
నుపశమించుట కాఖ్యలై యొప్పె శౌరి. 205

రోజు, నిట్టూరుపు, వగరుచు, వగర్చు అనఁగ నిశ్వాసమునకు పేర్లు. ఊఱడిలు, సాకతము సేయు, ఊఱడు, ఊఱడించు, ఓదార్చు, ఊరార్చు అనఁగ ఉపశమించుటకు పేర్లు.

ఆ. వె. చెండు బంతి పుట్టచెండు పొటనబంతి
యనఁగ కందుకాఖ్యలయ్యె; కొట్ట
మనఁగ స్త్రీల మండలాకారనృత్యంబు;
నాట రంతు క్రీడకౌను పేళ్ళు. 206

చెండు, బంతి, పుట్టచెండు, పొటనబంతి అనఁగ కందుకము పేర్లు. కొట్టము, అనఁగ స్త్రీలు మండలాకారముగ నృత్యము సేయుట పేరు. ఆట, రంతు అన క్రీడకు పేరు.

క. చెరలాటలా డనంగను
చెరలాట యనంగనొప్పె చెల్లాటయనం
జెరలాడన చిట్టాడన
ధరధర క్రీడించుటకును దసరె నభిఖ్యల్. 207

తెరలాటలాడు, చెరలాట, చెల్లాట, చెరలాడు, చిట్టాడు అనఁగ క్రీడించుటకు పేర్లు.

సీ. అలఁగు నలఁచు నలఁత యలకువ యలయిక
యలసట యిజుకు బడలిక డయ్యు
లంపట యోలాము లంపటమును సేద
యల్లట తవతవ యలపు సోమ
వేసట చీకాకు వేసరమును దయ్యు
నలకువయు సరమ యలవనంగ
శ్రమకునభిఖ్యలౌ; సరముఁగొను సేద
పడు వేసరము శ్రమ పడుట పేళ్ళు;
గీ. తిమ్మనా స్వస్థమునకాఖ్య తెనుఁగునందు
నలరె; తిమ్మన తిమ్మవడనఁగ నొప్పె
స్వస్థపడుట కభిఖ్యలై సారసారి
మిత్రిలోచన యతిశతపత్రనేత్ర.  208

అలఁగు, అలచు, అలత, అలకువ, అలయిక, అలసట, ఇజుకు, బడలిక, డయ్యు, లంపట, ఓలాము, లంపటము, సేద, అల్లట, తవతవ అలపు, సోమ, వేసట, చీకాకు, వేసరము, దయ్యు, నలకువ, సరమ, అలపు అనఁగా శ్రమమునకు పేర్లు. సరముఁగొను, సేదపడు, వేసరము, అనఁగ శ్రమపడుటకు పేర్లు. తిమ్మ అనఁగా స్వస్థమునకు పేర్లు. తిమ్మన తిమ్మవడు అనఁగ స్వస్థపడుటకు పేర్లు.

గీ. అరుదు విసుమానమును వింత యచ్చెరువును
వెరఁగు నబ్బుర మబ్రంబు వెఱఁగు చిట్ట

యక్కజము వెఱ సొద్దెము నమరు సోదె

మనఁగ నాశ్చర్యమున కాఖ్యలొ మురారి. 209

అరుదు, విస్మయమానము, వింత, అచ్చెరువు, వెరఁగు, అబ్బురము ఆశ్చర్యము, వెఱఁగు, చిట్ట, అక్కజగు, వెఱ, సొద్దెము, అమరు, సోదెము అనఁగా ఆశ్చర్యమునకు పేర్లు.

గీ. సిబ్బియము సోబె సోబియ సిబ్బెమనఁగ

నంగజనితశృంగారాంకమౌ; విలాస

చేష్ట కొప్పెను సంయాట; శీలమునకుఁ

దనరె యాలుడియన నాఖ్యఁ ధర్మమూర్తి. 210

సిబ్బియము, సోబె, సోబియ, సిబ్బెము అన అంగజనితశృంగారమునకు పేరు. సంయాట అన విలాసచేష్టకు పేరు. ఆలుడి అన శీలమునకు పేరు.

సీ. చిన్నె యొయ్యారంబు చిన్నియ హొరాసును

చీటకం బెమ్మెయు చిట్టకంబు

హొంయ లొయారము వగ యోయారమును రువా

రంబు తెక్కరము హొరంగు కోడి

గంబు మసయు బిటారంబనంగ విలాస

మున కాఖ్యలైయొప్పె; గునిసియాడు

గునిసాడు గునియును గునుపు కులుకు ఠీవి

బెడఁగు చీటకమును బిత్తరంబు

గీ. కోడిగము చిట్టకంబును గున్పు వగయు

హొయలు బరుకారమనఁగ పేళ్ళొప్పె ధరవి

లాసచేష్టావిశేషాప్తి కీసులేక
హాటకాంబర శ్రీమానసాబ్జమిత్ర. 211

చిన్నె, ఒయ్యారము, చిన్నియ, హాళాము, ఎమ్మె, చిట్టకము, హొయలు, ఒయారము, వగ, ఓయారము, సవారము, శెకారము హొరంగు, కోడిగము, మస, బిటారము, అనఁగా విలాసమునకుఁబేర్లు. గునిసియాడు, గునిసాడు, గులియు, పసుపు, కులుకు, కీర, శెడఁగు, చీటకము, బిత్తరము, కోడిగము, చిట్టకము, గుసుప్పు, వగ, హొయలు, బయకారము అనఁగా విలాసచేష్టావిశేషమునకు పేర్లు.

క. వడకాఁడు నాఁగ యమరన
వడఁకనఁగను గులుకనంగ వలిసిరి యనఁగా
పుడమిని కంపముపేర్లై
యడరెను ఫణిరాజశయన యంబుజనయనా. 212

వడకాఁడు, అదురు, వడఁకు కులుకు, వలసిరి అనఁగా కంపమునకు పేర్లు.

సీ. ఆరటం బక్కసం బారాట మొలుఫును
తనుకు మంద్రాటంబు తన్కుసంతి
మల్లడి వేండ్రంబు మఱుకువ యుత్తలం
బురియు వేడిమి వగ యుదిల కంపు
నేక వేఁడి తుకతుక సెగ యావి యెకియును
గొబరును తుందుకుకును దగయును
నాఁగ సంతాపంబునకుఁబేర్లు; నుత్తల
పాటు.తన్కారటుపడును వందు

గీ. మునుకు మండ్రాడు దురపిల్లు తనుకు మఱుఁగు
నుదిలఁగొను నారటింపన నుత్తలపడు
నా నుదిరఁగొను నాఁగను నామధేయ
నికరమలరె సంతాపించుటకు మురారి. 213

ఆరటము, అక్కసము, ఆరాటము, ఒలుపు, త్రనుసు, మండ్రా
టము, తన్కు, వంత, మల్లడి, వేండ్రము, మఱుసవ, ఉత్తల, ఉఁయు
షేఁడిమి, వగ, ఉదిల, కందు, సెక, వేఁడి, తుకతుక, సెగ, ఆపిరి
ఎరియు, గొబరు, తుందుడుకు, దగ, ఇవి సంతాపము పేళ్లు. ఉత్త
లపాటు, తన్కు, ఆరటపడు, వందు, మునుకు, మండ్రాడు, దురపిల్లు
తనుకు, మఱుఁగు, ఉదిలగొను, ఆరటించు, ఉత్తలపడు, ఇవి సంతా
పించుటకు పేళ్లు.

గీ. తనుకు దూపించు దూపిల్లు తన్కు దూప
టిల్లు పొగలును వలయును మల్లడిఁగొను
వ్రేఁగు వెమ్మును వేఁగన వెలసెభువి త
పించుటకు నామధేయముల్ విష్ణుదేవ. 214

తనుకు, దూపించు, దూపిల్లు, తన్కు, దూపటిల్లు, పొగలు,
నులయు, మల్లఁడిగొను, వ్రేఁగు, వెమ్మ, వేఁగు అనఁగా తపించుట
కుఁ పేర్లు.

గీ. తమియు బెంగయు మండ్రాడ తనుకును తహ
తహయు మండాటమన పరితాపమునకు
దనరెనాఖ్యలు; ననగూఁను తమకము తమి
యునఁగ వెలసె కామోద్రేకమునకు పేళ్లు.

తమి, జెంగ, మంద్రాడ, తనువు, తహతహ, మంజాటము అనఁగా సంతాపమునకుఁ బేర్లు. సనగూడు, లమకము, తమి అనఁగా కామోద్రేకమునకుఁ బేర్లు.

క. మరులు వల చొక్కు మేలుꠂ
విరాళి వలపునన మోహ విధికాఖ్యలగుꠂ
వెరవేఁకియు వలకాఁకయు
విరాళి వలవంతయనఁగ విరహాగ్నియగుꠂ. 216

మరులు, వల, చొక్కు, మేలు, విరాళి, వలపు అనగ మోహమునకు పేరు. వెరవేఁకి, వలకాఁక, విరాళి, వలవంత అన విరహతాపమునకుఁ బేర్లు.

గీ. కుములు లోలోకుములును లోకుమరిలును కు
మారిలనఁగ నంతర్దుఃఖమౌను; కందు
ననఁగ కసుగందునాఁ గములునన దేహ
తాపమునకునభిఖ్యలౌ దనుజవైరి. 217

కుములు, లోలోకుములు, లోకుమరిలు, కుమారిలు అనఁగ అంతర్దుఃఖమునకుఁ బేర్లు. కందు, కసుగందు, కములు అనఁగా దేహతాపమునకుఁ బేర్లు.

గీ. నొవ్వియును నొవ్వు నోవియు నోవనంగ
వేదన కభిఖ్యలై యొప్పు వేదనపడు
పేరు; చుమ్మలు వారన వెలసెనొకటి
మత్తియన కామమునకు నామంబు శౌరి. 218

నొవ్వి, నొవ్వు, నోవి, నోవ అన వేదన పేర్లు చుమ్మలువారు అనఁగా వేదనబడుటకు పేరు. మత్తి అనఁగా కామమునకుఁ బేరు.

క. వలపని యన శైత్యగుణం
బులుగల శైత్యోపచారమునకును పేరౌ
వలచుననగ మోహించుట
కలరుచు నీనాట్యవర్గు కంతముశౌరీ. 219

వలపని అనఁగా శైత్యోపచారము పేరు. వలచుననఁగా మోహించుటఁ బేరు

నాట్యవర్గుముగిసెను

---

# పాతాళవర్గు

ఆ. వె. పాఁపజగమనంగఁ బాతాళమునకాఖ్య;
మబ్బు కప్పు నిరులు మైల చీకు
వాలు చీఁకటియన వఱలియొప్పె తమిస్ర
మునకు నాఱుపేళ్ళు దనుజవైరి. 220

పాఁపజగము అనఁగ పాతాళమునకుపేరు. మబ్బు, కప్పు, ఇరులు, మైల, చీకువాలు, చీఁకటి అనఁగా తమిస్రమునకుపేళ్ళు.

గీ. అవని గాఢాంధకారమై యలరెఁ జిమ్మ
చీఁకటియనఁజెల్లెను; పొడిచీఁకటి మస
కనయు మునిమునిచీఁకటియును మసమస
కన యనఁగ నవతమసమహా నంబుజాక్ష. 221

చిమ్మచీఁకటి అనఁగా గాఢాంధకారముపేరు. పొడిచీఁకటి, మసకన, మునిమునిచీఁకటి, మసమసకన అనఁగా నవతమసమునకుపేళ్ళు

క. తొలి దొండి క్రంత దుంకము
తొలిక యొడిపి గొయ్యి బొక్క తూఁటు బొరియయుఁ
బిలి లాఁగ బొత్రె యనఁగను
వెలసెను రంధ్రంబుపేళ్లు విధిముఖవినుతా. 222

తొలి, దొండి, క్రంత, దుంకము, తొలిక, ఒడిపి, గొయ్యి, బొక్క, తూటు, బొరియ, బిల, లాఁగ, బొత్రె అనఁగా రంధ్రమునకుపేళ్లు

గీ. చిలుబువడు తొఱటలువాఱు చిల్లులుబడు
ననఁగ రంధ్రంబులగుటకు నాఖ్యలయ్యెఁ
దనరె తెనుఁగున వరదాయి వనధిశాయి
స్వర్గపతినుత పాతాళవర్గుముగిసె. 223

చిల్లులువడు, తొఱటలువాఱు, చిల్లులుబడు అనఁగా రంధ్రంబులగుటకుపేళ్ళు.

పాతాళవర్గు ముగిసెను.

---

## భోగివర్గు

గీ. పుడమితాలుపు నాగఁడు తడవులనిడు
పడును జిలువలరాయఁడు పాఁపతేఁడు
చిలువతేఁడన నొప్పెను శేషునకు న
భిఖ్యలై కలుషాచలభిదురనామ. 224

పుడమితాలుపు, నాగఁడు, తడవులనిడుపడు, చిలువలరాయఁడు పాఁపఱేఁడు, చిలువఱేఁడు అనఁగా శేషునకు పేళ్ళు.

సీ. గాలిమేపరి త్రాఁచు కనువిన్కి విసదారి
 పడగదారియు భోరప్రాఁకు పాము
నిడుపడు లాఁగ డాఁగుడు సీదరంబును
 వెలుచయు సీందరింబు వెల్చ చిలువ
వినుకలికంటియు కనువినికియు నాగుఁ
 బాము సప్పంబును పడగతాల్పు
కానరానడుగులకాఁడు నిడుదవెన్ను
 నాగువు బహువచనమున నాగు
గీ. లనఁగ సర్పంబునకుపేళ్లుదనరె; నంజు
 విసము చిలుమనఁగను బేళ్లువిషమునకగు;
 పడగ పటమనఁగను పేళ్లు ఫణమునకగు
 శ్రీవధూస్తనకాశ్మీరచిహ్నితాంగ. ౨౨

గాలిమేపరి, త్రాఁచు, కనువిన్కి, విసదారి, పడగదారి, భోర ప్రాఁకు, పాము, నిడుపడు, లాఁగడాఁగుడు, సీదరము, వెలుచ, సీందరము వెల్చ, చిలువ, వినుకలికంటి, కనువినికి, నాగుబాము, సప్పము, పడగ తాల్పు, కానరానడుగులకాఁడు, నిడుదవెన్ను, నాగువు, బ॥ నాగులు అనఁగా సర్పమునకు పేళ్ళు. నంజు, విసము, చిలుము అనఁగా విషమునకు పేళ్ళు. పడగ, పటము అనఁగా ఫణమునకుఁ బేళ్ళు.

గీ. కుబుసమన కూసమనఁగను కుప్పసమన
 సీదరంబనియనఁగను సీదరిమనఁగ

కుహనమునఁగఁబ విలసిల్లెఁ గోకిసూర్య
తేజ! ఫణికంచుకాఖ్యలై తెలుఁగునందు  226

కుబుసము, కూసము, కుప్పసము. నీరము,
అనఁగా సర్పికంచుకమునకుఁ బేళ్ళు.

గీ. గారడీఁడును బరిజోగి గారడీఁడును
కడిమివాఁడన నహితుండికునకుఁ బేళ్లు;
చిలువకూఁడికపలుకులు గిలుఁగుబ్భా
వర్గముగిసెను మునిజన వర్ణపోషి.  227

గారడీఁడు, బరిజోగి, గారడి, కడిమివాఁడు అనఁగా ఆహి
తుండికునకుఁ బేళ్ళు.

భోగివర్గముగిసెను,

---

# నరకవర్గ

గీ. బిద్దె బిస్తమనంగను బేళ్లనరక
మునకు; కాఱియ నొవ్వి నొవ్వనఁగ యాత
నంబు పేరులు బహువచనమునఁ గష్ట
మునకుఁ గడగండ్లనఁగ పేరు దనుజవైరి.  228

బిద్దె, బిస్తె అన నరకమునకుఁ బేళ్ళు. కాఱియ, నొవ్వి, నొవ్వు
అన యాతనముఁ బేళ్ళు. బ॥ కడగండ్లు అన కష్టమునకుఁ బేరు.

గీ. బండిగిలు వందురన కష్టపడుటకాఖ్య
లొప్పె; కోడాడు గాసించు దెప్పరిల్లు
చేడ్పడును ప్రేముడించు గాసిల్లనంగ
బాధపడుట కభిఖ్యలు స్వర్ణచేల. 229

బండిగిలు, వందురు అనఁగా కష్టపడుటకుఁ బేళ్ళు. కోడాడు, గాసించు, దెప్పరిల్లు, చేడ్పడు, ప్రేముడించు, గాసిల్లు, అనఁగా బాధపడుటకుఁ బేళ్ళు.

సీ. అలుగులం బలతయు నంజలి గుంజలి
నలకువ చేడ్పాటు నలుకువయును
పిరువీకు కిసమస పిర్వీకు కఱకటి
కుసిగుంపులును ద్రిక్కు కుతిల బెడఁద
నొవ్వను ద్రిమ్మట నొవ్వి నెగులు వంత
దునుకు గొడ్డగ మేపు సణుగనంగ
బాధకభిఖ్యలు బరగెను; కసుగుగా
లించన పేళ్లు బాధించుటకును
గీ. గలిగె;వాలాయమనఁగ నిక్కచ్చి యనఁగ
నికటమన ముట్టడంబన నెగడియొప్పె
పేళ్ళు నిర్బంధమునకును వేదవేద్య
విపులభవరోగవైద్య సంవిజితచైద్య. 230

అలుగులము, అలఁత, అంజలిగుంజలి, నలకువ, చేడ్పాటు, నలుకువ, పిరువీఁకు, కిసమస, పిర్వీఁకు, కఱకటి, కుసిగుంపులు, ద్రిక్కు, కుతిల, బెడఁద, నొవ్వు, ద్రిమ్మట, నొవ్వి, నెగులు, వంత, దునుకు,

గొడ్డగము, ఏపు, పణుగు అనఁగా బాధకుఁ బేళ్లు. కసుగు, గాలించు. అన బాధించు బేళ్లు. వాలాయము, నిక్కచ్చి, నికటము, నుట్టిడము. అనఁగా నిర్బంధమునకుఁ బేళ్లు.

గీ. వాలయించు వాలాయించు వఱలెభువిని
ప్రకటనముగ నిర్బంధించుటకును బేళ్లు
నింట్రపడు తొక్కటపడన నెసఁగెసంక
టంబుపడుటకుఁ బేళ్లు ఫుల్లాంబుజాక్ష. 231

వాలయించు, వాలాయించు అనఁగా నిర్బంధించుట పేళ్లు. ఇంట్రిపడు, తొక్కిటపడు ఇవి సంకటపడుటకుఁ బేళ్లు.

సీ. తొక్కటం బిఱుకటం బిక్కట్టు మిక్కట్టిక్కట్టు
పా టింట్రమును ముట్టుపా టొఱకట
మొడుదొడు కింటరం బొఱకం బిజుకు త్రొ
క్కట యిమ్ముదప్పు త్రొక్కట మఱి యిఱు
కాటంబనఁగను సంకటమునకాఖ్యలు;
చదియ యిఱియు నజ్జు చదియు కసుగు
నలియు నలుగు నుగ్గు నగ్గుడు సదమద
మగును నలఁగును నలుగుడు వెంప
గీ. రయును మల్లామడియును మఱియునలుంగు
డింద్రమన పీడసంబున కెసఁగిపేళ్లు
మించె; పసగరగొనన బీడించుటకును
పేరు; పొట్టుపొరలునాఁగ పీడితమగు. 232

తొక్కటము, ఇఱుకటము, ఇక్క, ఇక్కట్టు, ఇక్కుపాటు, ఇం డ్రటము, మట్టుపాటు, ఒఱకటము, ఒడుదుడుకు, ఇంటరము, ఒఱకము, ఇజాకు, త్రొక్కట, ఇమ్మదప్పు, త్రొక్కటము, ఇఱుకాటము, ఇవి సంకటమునకుఁ బేళ్ళు. చదియ, ఇఱియ, నజ్జు, చదియు, కసుగు, నలియు, నలుంగు, నుగ్గు, నల్గుడు, సదమదమగు, నలఁగు, నలుగుడు, వెంపర, మల్లామడి, నలుగుడు, ఈంద్రము ఇవి పీడనమునకుఁ బేళ్ళు. పసగరఁగొను, అనఁగా పీడించుటకుఁ బేరు. పొట్టపొరలగు అన పీడితమగుటఁ బేరు.

చ. ఇడుమయు డెప్పరం బెడరు నెడ్డమి యంగద డెప్పరంబనన్
బడపబెడందయున్ సెరగు బన్నముదబ్బఱనెవ్వనొప్పియున్
గొడవదొసంగు నంకిలియు గోరము నుప్పలి నొవ్వునానలం
జడి యగచాట్లనంగ మునిసన్నుతయాపద పేళ్ళునొప్పెడున్

ఇడుమ, డెప్పరము, ఎడరు, ఎడ్డమి, అంగద, డెప్పరము, బడప బెడఁద, సెరగు, బన్నము, దబ్బఱ, నెవ్వ, నొప్పి, గొడవ, దొసఁగు అంకిలి, గోరము, ఉప్పలి, నొవ్వు, అలజడి, అగచాట్లు అనఁగా ఆపద పేళ్ళు,

సీ. గోడాడనంగఁజూకురునన దురపిల్లు
నాఁగుందనఁగ క్రందునాఁగ పలవ
రించనంగను పలవించన పలవన
పలుమన ఱోలన పల్వరించు
నాఁగను వందురనంగ సళించన
ప్రేముడించనఁగను వెనుబడునన
మనికిలపడునన వనరన ముచ్చిరు
నా నొఱలన సుఖ్కునాఁగనొప్పె

గీ. నవని విలపించుటకుఁబేళ్ళు; నల్లతయనఁగ

నలఁగనఁగ వాచారువన్యనఁగ బ్రుక్కు-

నాఁగ కనికర మనఁగను నవఁతయనఁగ

వగయనంగను శోకాఖ్య లగును శౌరి. 234

గోడాడు, చూకురు, దురపిల్లు, కుందు, క్రందు, పలవరించు, పలవు, పలుము, ఓలు, పల్వరించు, వందురు, సళించు, ప్రేముడించు, వెసుఱడు, మనికితపడు, వనరు, ముచ్చిరు, ఒఱలు, బ్రుక్కు అనఁగా విలపించుటకుఁబేళ్ళు. అలఁత, అలఁగు, వాచారు, బ్రుక్కు, కనికరము, నవత, వగ అనఁగా శోకమునకుఁబేళ్ళు.

పంచపాది గీ. అఱచు నలజడి యంగద యడలు గోడు

కస్తి యడజడి వగ వెత కన్నఱ గొడ

వయు వెతారము నుమ్మలికయును బాము

నంగలార్పును కుందు పొక్కనఁగ దుఃఖ

మున కభిఖ్యలు మునిపాళి వనజహేళి. 235

అఱచు, అలజడి, అంగద, అడలు, గోడు, కస్తి, అడజడి వగ, వెత, కన్నఱ, గొడవ, వెతారము, ఉమ్మలిక, బాము, అంగలార్చు, కుందు, పొక్కు అనఁగా దుఃఖమునకుఁబేళ్ళు.

గీ. నెగులనఁగ పిమ్మటయున నెంజిలియన

నగునివి మనోవ్యథకు పేళ్ళు; నలదురనఁగ

వెలసె దుఃఖించుదురనుట పేరు; చికిలు

ననఁగ ననురాగదుఃఖితమునకు పేరు. 236

నెగులు, పిమ్మట, నెంజిలి అనఁగా మనోవ్యథకుఁబేళ్ళు. అలదురు అదుఃఖించుదురనుటకుఁ పేరు. చికిలు అన దుఃఖితమునకు పేరు.

గీ. రొందుడును పంచకరపాటు రొంజుడనఁగ
రొల్లుడన ప్రలాపమునకు జెల్లిపేళ్లఁ
గాంచె; రొంజు రొల్లన ప్రలాపించుటకు న
భిఖ్యలగుచు నరకవర్గు వెలసిముగిసె. 237

రొందుడు, పంచకరపాటు, రొంజుడు, రొల్లుడు అనఁగా ప్రలాపము పేళ్ళు. రొంజు, రొల్లు అన ప్రలాపించుటకు పేళ్ళు.

నరకవర్గు ముగిసెను.

---

# వారివర్గు

గీ. నీటిఱేఁడు కడలియును నీటికుప్ప
నీరువామి సంద్రంబు మున్నీరు సంద
రంబు నీర్వామి సంద్రుఁడు రతనపుగని
యేటిజేఁడన నబ్ధిపే ళ్లెసఁగ శౌరి. 238

నీటిఱేఁడు, కడలి, నీటికుప్ప, నీరువామి, సంద్రము, మున్నీరు, సందరము, నీర్వామి, సంద్రుఁడు, రతనపుగని, ఏటిఱేఁడు అనఁగ సముద్రమునకుఁ పేళ్ళు.

గీ. పాలకుప్పయు పాలేఱు పాలవాఁగు
పాలనీర్వామి యును మఱి పాలవెల్లి
వెలసె క్షీరాబ్ధికాఖ్యలై; విసమునీరు
జలకమన నుదకముపేళ్ళు జలరుహాక్ష. 239

పాలకుప్ప, పాలేఱు, పాలవాఁగు, పాలనీర్వామి, పాలవెల్లి అన క్షీరాబ్ధిపేళ్ళు. విసము, నీరు, జలకము అనఁగ ఉదకముపేళ్ళు.

గీ. ధరణి యేనాదమనఁగ వాగరతయనఁగ
మఱియు రాగర్త యనఁగ నామంబు లబ్ధి
తీరమునకొప్పియుండు; తత్తీరజాత
భూమికగు కరవాఁకయు భోగిశయన. 240

ఏనాదము, వాగరత, రాగర్త అనఁగ అబ్ధితీరమునకుఁపేళ్ళు. కర వాఁక, అనఁగా అబ్ధితీరసామీప్యభూమిపేరు.

క. కరడన యలయన తెరయన
కరడము నక్కాలియనంగ కడలును తొలఁకుఁ
తరగయు బహువచనంబున
నరయఁగ వాఁగులన నూర్మికగు నామంబుల్. 231

కరడు, అల, తెర, కరడము, అక్కాలి, కడలు, తొలఁకు, తరగ బ॥వాఁగులు, ఇవితరంగములపేళ్ళు.

గీ. దొరగడలు నవఁగను పోతుకడలనంగ
నిత్యబహువచనంబున నెత్తులన
నీమహివెలింగె కల్లోలనామధేయ
ములు మనోజాతశతకోటిలలితరూప. 242

దొరగడలు, పోతుకడలు, ని॥ బ॥ నెత్తరులు అనఁగా కల్లోల, ములకుపేళ్ళు.

గీ. చిఱుతయల పెంటికెరడును జిన్నితరగ
నిత్యబహువచనంబున నెగడు తల్లు

కలసి సూక్ష్మతరంగమ్మై యలరె; చిమ్మ
యనఁగ బిందుసమూహమ్మై యలరె శౌరి. 243

చిఱుతయల, పెంటికరడు చిన్నితరగ, బ॥ తళ్ళు అనఁగా సూక్ష్మ తరంగముల పేళ్ళు. చిమ్మ అన బిందుసమూహము పేరు.

గీ. తిరుగుడన సుడియనఁగను తిరియనంగఁ
దనరె భువిలో జలావర్తమునకుపేళ్లు;
త్రొట్టు తెకొట్టు నా నెగదట్టు ననఁగ
నగు జలోల్బణమున కాఖ్య లసురవైరి. 244

తిరుగుడు, సుడి, తిరి అనఁగా జలావర్తమునకు పేళ్ళు. త్రొట్టు, తెకొట్టు, ఎగదట్టు అనఁగా జలోల్బణమునకు పేళ్ళు.

గీ. తుంపురును దుంపరయు జిన్కు తుప్పరయనఁగ
పొసఁగు బహువచనమున తుంపుళ్లనంగ
కలిగె బింద్వాఖ్యలును; నీరుకాయ నీటి
బుగ్గ నీర్బుగ్గనాఁగ బుద్బుదముపేళ్లు. 245

తుంపురు, తుంపర, చిన్కు, తుప్పర, బ॥ తుంపుళ్ళు అనఁగా సీకరముల పేళ్ళు. నీరుకాయ, నీటిబుగ్గ, నీర్బుగ్గ అన బుద్బుదము పేళ్ళు.

గీ. దిమ్మ దీవియు తిప్పయు దిబ్బ కోణఁగె
దిన్నె లంకయనఁగ పేళ్ళు ద్వీపమునకు;
కరయు నొడ్డును దరి యెడ గడ్డ యనఁగఁ
దీరమునకాఖ్యలైయొప్పె సారసాక్ష. 246

దిమ్మ, దీవి, తిప్ప, దిబ్బ, కోణఁగె, దిన్నె, లంక అనఁగా ద్వీపమునకు పేళ్ళు. కర, ఒడ్డు, దరి, ఎడ, గడ్డ అనఁగ తీరమునకు పేళ్ళు.

క. జలజాక్షి! యాంధ్రమున న
బ్బలి యడుసును చదుకు బురద బాడ యసలు న
మ్మలి యూబి పంకి దమ్మన
వెలసెను జంబాలమునకుఁ బేళ్లగుచు భువిన్ 247

ఉబ్బలి, అడుసు, చదుకు, బురద, బాడ, అసలు, ఉమ్మలి, ఊబి, పంకి, దమ్ము, అనఁగా పంకమునకు పేళ్ళు.

క ఉసుక కలుకుదు మ్మిసుకయు
నిసుమనఁగను సికతమునకు నెగడెను పేళ్లై;
ఇసుక గొణిఁగె యనపేరై
పొసఁగెను సికతామయంబు భోగిపశయనా. 248

ఉసుక, కలుకుదుమ్ము, ఇసుక, ఇసుము అనఁగా సికతమునకు పేళ్ళు. ఇసుక కొణిగె అనఁగా సికతామయమునకు పేరు.

ఆ.వె. వెలసె చెలమనాఁగ పిల్లనూయియనగ
నాంధ్రమున విదారకాఖ్యలగుచు;
కలము జోగు నోడ కప్పలి యనఁగను
నాగరాజశయన నావపేళ్ళు. 249

చెలమ, పిల్లనూయి, అనఁగా విదారకము పేళ్ళు. కలము, జోగు, ఓడ, కప్పలి అనఁగా నావపేళ్లు.

గీ. కట్టుమ్రానన తెప్పయు పుట్టి నాఁగ
తేపయన హరిగోలన తేటిక యన
నరడయన సంగడియనియనంగ దోనె
యనఁగ నరిగోలన నుడుపమునకు పేళ్లు. 250

కట్టుమ్రాను, తెప్ప, పుట్టి, తేప, హరిగోలు, తేటిక, నరడ, సంగడి, దోనె, అరిగోలు అనఁగ ఉడుపమునకుఁ బేళ్ళు.

ఆ.వె. పుడమి యోడ తెడ్డు కడపుఁజై చుక్కాను
నా నరిత్రమునకు నామములగు;
నోడకూలి కేవు నొప్పెను తరపణ్య
మున కభిఖ్యలగుచు మురవిదారి. 251

ఓడతెడ్డు, కడపుఁజై, చుక్కాను అనఁగా అరిత్రమునకుఁ బేళ్ళు. ఓడకూలి, కేవు అనఁగా తరపణ్యమునకుఁ బేళ్ళు.

గీ. పీలికాఁడు తండెలును తండేలు నార
కాటి యోడంగియును మరకాఁడు రేవు
బోయయు సరంగనఁగ నామధేయరాజి
కర్ణధారున కలరారె కమలనాభ. 252

పీలికాఁడు, తండెలు, తండేలు, ఆరకాటి, ఓడంగి, మరకాఁడు, రేవుబోయ, సరంగు అనఁగా నావికుని పేళ్ళు.

గీ. కొఱయు కొఱ్ఱయు చోఱయు చొఱయు చేఁప
వాలుగయు మీను బేడిస వాలువ తెర
గంటి తూలయు మచ్చెంబు గండ యనఁగ
మత్స్యమునకగు మునిలోల మదనహేల. 253

కొఱ, కొఱ్ఱ, చోఱ, చొఱ, చేఁప, వాలుగ, మీను, బేడిస, వాలువ, తెరగంటి, తూల, మచ్చెము, గండ అనఁగా మత్స్యముఁ బేళ్ళు.

సీ. ఇంగలాయి యు రజ యుల్లవ యుల్లెంబు
సొరంగి యొల్లెంక తూరయు తెర

గంటి ఓఁకి యు చేఁప కల్లరుజును కొొమ్ము
చేఁప యిసుక దొొందు చీరచింపు
నొల్లికుచ్ఛళమును గొల్లగొొందునుమఱి
యరుజును కాగిస యల్లెదమ్ము
పాఁపమీనును తౌటి పామును దాసరి
కొొయ్యయు మీనును కుంటముక్కు
గీ. పాము చేఁప యులుచ చందమామపక్కె
యీసపిట్టయు రొయ్యయు దాసరీఁడు
నాఁగ మత్స్యభేదంబుల నామములగు
ద్వీపవరావనభావన విహగజవన. 254

ఇంగలాయి, ఊరుజ, ఇల్లవ, ఇల్లెగు, సొరంగి, ఒల్లెంక, తూర, గొరగంటి, ఓఁకి, చేఁప, కల్లరుజు, కొమ్ముచేఁప, ఇసుకదొొందు, చీరచింపు, ఒల్లికుచ్ఛళము, గొల్లదొొందు, అరుజు, కాగిస, అల్లెదమ్ము, పాపమీను, తౌటిపాము, దాసరికొొయ్య, మీను, కుంటముక్కు, పాముచేఁప, ఉలుచ, చందమామపక్కె, ఈసపిట్ట, రొయ్య, దాసరీఁడు, ఇవి మత్స్యకుల భేదములకుఁ బేళ్ళు.

గీ. ఆకుజెల్లయు జెల్ల యుల్లాకు చేఁప
కొరద యుల్లాకు నిల్లెంబు బరగెగండ
కాఖ్యలై; బహువచనంబునమరెమొప్ప
లనఁగ మత్స్యకపోలాఖ్య యచ్యుతాఖ్య. 255

ఆకుజెల్ల, జెల్ల, ఉల్లాకుచేఁప, కొరద, ఉల్లాకు, ఇల్లెమ్ము అనఁగా గండకముల పేళ్ళు. బ॥ మొప్పలు అనఁగా మత్స్యకపోలములకుఁ బేరు.

గీ. ఎత్తెల యనంగ వలయన నెసఁగెజాల
మన కభిఖ్యలు; కోడిమెయు బుట్టయనఁగ
వెలసెను కువేణికాఖ్యలై తెలుఁగునందు
వనజభవపాల మునిలోల వరదశీల. 256

ఎత్తెల, వల అనఁగా జాలముఁబేళ్ళు. కోడిమె, బుట్ట అనఁగా కువేణిపేళ్ళు.

గీ. ఎండ్రికయు నెండ్రికాయయు నెండ్రిపీఁత
యన కుళీరాఖ్యలౌ; కప్పయన నభిఖ్య
యలరె మండూకమునకు; కించులకమునకు
నెట్టియన పేరుజెల్లు మునీశరక్ష. 257

ఎండ్రిక, ఎండ్రికాయ, ఎండ్రి, పీఁత అనఁగా కుళీరమునకుఁ బేళ్ళు కప్ప అన మండూకముపేరు. ఎట్టి అన కించులకముపేరు.

గీ. మొసలినా మకరముపేరు; మొగపిటికియు
దాసరయ్య తాఁబేలును దాసరీఁడు
నవఁగ తామేలనంగఁ గూర్మాఖ్యలౌను
భోగిశయన ముకుంద త్రిభువనతుంద. 258

మొసలి అనఁగ మకరమునకు పేరు. మొగపిటికి, దాసరయ్య, తాఁబేలు, దాసరీఁడు, తామేలు అనఁగ కూర్మమునకు పేళ్ళు.

గీ. కప్పచిప్ప యనంగనుగాకిచిప్ప
యనఁగ మఱియాలిచిప్పనా నాఖ్యలుగొనె
కుతలమునను శంబూకంబు; గుల్ల నత్త
గుల్లనాఁ క్షుద్రశంఖాఖ్య లుల్లసిల్లె. 259

కప్పచిప్ప, కాకిచిప్ప, ఆలిచిప్ప అనఁగా శంబూకము పేళ్ళు. గుల్ల, నత్తగుల్ల అన క్షుద్రశంఖము పేళ్ళు.

గీ. చుట్టుగుల్ల చిందము నీరుపుట్టువు వెలి
గుల్లయును సంకునాఁగను కూఁతకైదు
వనఁగ శంఖంబున కభిఖ్యలమరెను; గతి
చిప్ప ముత్తెపుఁజిప్పనా నొప్పె శుక్తి. 260

చుట్టుగుల్ల, చిందము, నీరుపుట్టువు, వెలిగుల్ల, సంకు, కూఁతకైదువు అన శంఖమునకు పేళ్ళు. గతిచిప్ప, ముత్తెపుఁజిప్ప అన శుక్తికి పేళ్ళు.

క. కేళకుళి కేళాకూళియు
కొలఁకువు కేళకుళి గుంట కొలఁకును కేళా
కుళి దొరవి దొరువు కొల్కును
కొలను మడుగనఁగ సరస్సగుఁ ముర వైరీ. 261

కేళకుళి, కేళాకూళి, కొలఁకువు, కేళకుళి గుంట, కొలఁకు, కేళాకుళి దొరవి, దొరువు, కొల్కు, కొలను, మడుగు అనఁగా సరస్సు పేళ్ళు.

గీ. పడియ నీరువెంకి మడువు పడె మడుంగు
వెంచ పల్వలమయి వెలసె; నుయ్యి
బావి నుయియునూయి నాఁగను బరగె నుధరకూప
మున కభిఖ్యలుగను మోహనాంగ. 262

పడియ, నీరువెంకి, మడువు, పడె, మడుఁగు, వెంచ అన పల్వలము పేళ్ళు. నుయ్యి, బావి, నుయి, నూయి అనఁగా కూపమునకు పేళ్ళు.

గీ. ఆటడిగ్గియ నా దోరువనఁగ డిగ్గి
యయన నడబావియన వాపి కలరెఁ బేళ్లు;

చెఱువునాఁ దటాకము పేరుజెల్లె; స్వామి
పుష్కరిణికాఖ్య కోమరేఱు పుష్కరాక్ష. 263

ఆటడిగ్గియ, దోరువ, డిగ్గియ, నడబావి అనఁగా వాపికి పేళ్ళు. చేఱువు అన తటాకము పేరు. కోమరేఱు, అన స్వామిపుష్కరిణి పేరు.

గీ. తమ్మికొలను కోనేరనఁ దనరెపేళ్ళు
పుష్కరిణికిఁ దెలుంగుననఁ బూనె; నోల
లాడు తెప్పలఁదే లోలలార్చు ననఁగ
ధరణి మగ్నప్లవంతికా దానవారి. 264

తమ్మికొలను, కోనేరు అనఁగా పుష్కరిణి పేళ్ళు. ఓలలాడు, తెప్పలఁదేలు, ఓలలార్చు అనఁగా మగ్నప్లవంతులకు పేళ్ళు.

గీ. అగడిత యనంగ కందకమన యగడ్త
యన దవంతియనఁగ పరిఘాఖ్యలగును
కాల్వయన క్రయ్యనా నోడికయన చింక
యనఁగ కుల్యంబుపేళ్లగు నసురవైరి. 265

అగడిత, కందకము, అగడ్త, దవంతి అన పరిఘము పేళ్ళు. కాలువ క్రయ్య, ఓడిక, చింక అన కుల్యము పేళ్ళు.

గీ. వాఁకయన జాలనంగను వ్రింతయనఁగ
జక్కరయనంగ నేఱన జాల్వనంగ
వరఁతయన వంతయనఁగను వఱలె నది క
భిఖ్యలగు భువనవిహారి యసురవైరి. 266

వాఁక, జాలు, వ్రంత, జక్కర, ఏఱు, జాల్వ, వరఁత, వంత అనఁగా నదికి పేర్లు.

గీ. మిన్నువాఁకయు మిన్నేఱు మిన్నుకొలఁకు
తెలివరఁతయును ముత్త్రోవదిమ్మరి చద
రేఱు పొడుగుమడువును ముయ్యేఱు వేల్పు
టేఱు మిన్వాఁకనా గంగకెసఁగె పేళ్ళు. 267

మిన్నువాఁక, మిన్నేఱు, మిన్నుకొలఁకు, తెలివఁరతి, ముత్త్రోవ
ద్రిమ్మరి, చదరేఱు, పొడుగుమడువు, ముయ్యేఱు, వేల్పుటేఱు, మిన్వాఁక
ఇవి గంగకు పేళ్ళు.

గీ. జమున జమునిసైదోడన యమునపేళ్ళు
వెలసె; జమ్మేఱనంగ జంబేఱనంగ
నగును జాంబూనదికి పేళ్లు; నట్టెడయున
సారువము వంతెనయన సారసాతు
సేతువునకు నభిఖ్యలై చెల్లె భువిని. 268

జమున, జమునిసైదోడు ఇవి యమునానదిపేర్లు. జమ్మేరు, జంబేరు ఇవిజాంబూనదికిపేరు. నట్టెడ, సారువ, వఁతెన అనఁగా సేతువునకుపేర్లు.

క. వఱదయు నంపాచారము
పఱలియు నోడికయు వెల్లి పట్టు పఱదయుఁ
పఱతయు వెల్లుక వెల్లువ
పఱవయు నిట్టయనఁగను బ్రవాహముపేర్లౌ. 269

వఱద, అంపాచారము, పఱలి, ఓడిక, వెల్లిపట్టు, పఱద, పఱత, వెల్లుక, వెల్లువ, పఱవ, నిట్ట అనఁగా ప్రవాహమునకుపేళ్ళు.

గీ. తొట్టు దైవాఱు జాల్కొను తొరఁగు నోడి
గల్లు వెల్లువగట్టును వెల్లివిరియు

వెల్లిపోడుచును పరగును వెలివిరియు న
నంగ ప్రవహించుటకు పేళ్ళు నలిననాభ. 270

తొట్టు, దైవాలు, జాల్కాను, తొరఁగు, ఓడిగల్లు, వెల్లువగట్టు జల్లివిరియు, వెల్లివొడుచు, పరగు, వెలివిరియు అన ప్రవహించుట పేళ్ళు.

ఆ.వె. చిలుప కొద్దినీరు జెల్లె స్వల్పోదక
మునకుఁ బేళ్లు; నురుగన నురువనఁగ
నిత్యబహువచనము నిత్యంబు నుచ్చిళ్లు
నా గ ఫేనమునకు నామములగు. 271

చిలుప, కొద్దినీరు అన స్వల్పోదకము పేళ్ళు. నురుగు, నురువు, బ॥ నుచ్చిళ్లు అన ఫేనమునకు పేళ్ళు.

గీ. తమ్మియన నీటిబుట్టువు తామరయన
నసలుబుట్టువనఁగ బేళ్ళు నబ్జమునకు
నెసఁగె; చేఁదమ్మి చెందమ్మి యెఱ్ఱదమ్మి
యు మఱి కెందమ్మి నాఁ రక్తకమలమగును. 272

తమ్మి, నీటిబుట్టువు, తామర, అసలుబుట్టువు అన కమలమునకు పేళ్ళు. చేఁదమ్మి, చెంతమ్మి, ఎఱ్ఱదమ్మి, కెందమ్మి అన రక్తాబ్జము పేళ్ళు.

గీ. కలువ తొగ తొవ కల్వ యుత్పలము పేళ్ళు;
చెంగలువ యెఱ్ఱకలువయు చెందొవయును
చేఁగలువయు ననంగను జెల్లెహల్ల
కమున కాఖ్యలు సంఫుల్ల కమలనేత్ర. 273

కలువ, తొగ, తొవ, కల్వ అన ఉత్పలము పేళ్ళు. చెంగలువ ఎఱ్ఱకలువ, చెందొవ, చేఁగలువ అన హల్లకమునకు పేళ్ళు.

క. తామరతంప మనంగా
దామరతంపరయునంగ తెంపర యనఁగా
నామాళి షండమునకౌ
స్వామీ తూఁడన మృణాల సంజ్ఞ వెలుంగున్ 274

తామరతంపము, తామరతంపర తెంపర అన షండమునకు పేళ్ళు. తూఁడుఅన మృణాలము పేరు.

క. ఱేకనఁగను కచ్చనఁగను
రేకన సుమదళములను గురించిన పేళ్లౌ
ఆకరుపువ్వన నాకరు
వాకరనం గేసరముల కాఖ్యలు శౌరీ. 275

ఱేకు, కచ్చు, రేకు అనఁగా పుష్పదళము పేళ్ళు. ఆకరుపువ్వు, ఆకరువు, ఆకరు అన కింజిల్కములపేళ్లు.

గీ. ప్రాఁచి నీరాకు నాచన వారిపర్ణి
పేళ్ళు; దిమ్మ దుద్దనఁగను వెలసె కర్ణి
కాఖ్యలగు; కైవడిముస్తెయనఁగ ముస్తె
యనఁగ కైవర్తికాఖ్యలౌ నంబుజాక్ష. 276

ప్రాఁచి, నీరాకు, నాచు అన వారిపర్ణిపేరు. దిమ్మ, దుద్దు అన కమలకర్ణిక పేళ్ళు. కైవడిముస్తె, ముస్తె అన కైవర్తిపేళ్లు.

గీ. చల్లు చిల్లించు పిఁజించు పేళ్లగు జల
సేకమునకు; చిందనఁగను చిల్లనంగ
నుత్కిరము పేళ్లు; కలమరి యొప్పెనొకటి
యవని నౌకావరోహాఖ్యఁ డగుచు శౌరి. 277

చల్లు, చిల్లించు, పింజించు అనఁగా జలసేకమునకు పేళ్ళు. చిందు, చిల్లు అన ఉత్క్షేపము పేళ్ళు. కలనురి అన నౌకారోహణమునకు పేరు.

గీ. వఱలె చిమ్మనఁగ్రోవినాఁ బుఱటకొమ్ము
సనఁగ బుఱ్ఱటకొమ్మనియనఁగ కొమ్ము
నాఁగ పింజనఁగ్రోవి యనంగనొప్పె
జలవినోదశృంగముపేళ్ళు జలజనాభ. 278

చిమ్మనఁగ్రోవి, బుఱటకొమ్ము, బుఱ్ఱటకొమ్ము, కొమ్ము, పింజనఁగ్రోవి అనఁగా జలవినోదశృంగము పేళ్ళు.

సీ. పుడమి జంబూద్వీపమునకును తొలుదీవి
దనరు; ప్లక్షద్వీపమునకు జువ్వి
దీవియగా; పుష్కరద్వీపంబునకుఁ దమ్మి
దీవియగా; శాల్మలద్వీపమునకు
బూరుగుదీవినాఁ బొసఁగె; క్రౌంచద్వీప
మొస్న దీనికి క్రౌంచదిన్నెయనఁగ
పేరుజెల్లెను; కుశద్వీపంబునకు జెల్లు
దీవియగా; సింహళద్వీపమునకు

గీ. సింగళంబనఁగను పేరు జెల్లె నాంధ్ర
మునను బేరు; శాకద్వీపమునకు టేకు
దీవియననగు నిగ్గతి తెన్గునందు
స్వర్గపతినుత పద వారివర్గముగిసె. 279

తొలుదీవి అనంగా జంబూద్వీపమునకు పేరు. జువ్విదీవి అన ప్లక్ష ద్వీపము పేరు. తమ్మిదీవి అన పుష్కరద్వీపము పేరు. బూరుగుదీవి అన శాల్మలద్వీపము పేరు. క్రౌంచెదిన్నె అన క్రౌంచద్వీపము పేరు. జెల్లుదీవి అనకుశ ద్వీపము పేరు. సింగళము అన సింహళద్వీపము. టేకుదీవి అన శాకద్వీపము పేరు.

వారివర్గుముగిసెను.

కలహంసోత్సాహవృత్తము

సురవితానమకుటరత్న సురుచియుక్తపాదుకా
సురసపత్నగహన వర్గ శుచిశితాంకితాయుధా
సురమునీశహృదయపద్మ సుమరసౌఘబంభరా
సురనదీజనితపదాబ్జ సుగుణరాజిపేటికా 280

గద్య

ఇది శ్రీమదుపలక్ష్మీలంగోత్తుంగ శృంగారస్తనశృంగసంగత
ధారాధర వేంకటేశ్వర కృపాపాంగలబ్ధవాగ్వైభవనిరం
తరభాగవతారాధనాధేయతూముకులపవిత్రసర్వేశా
భిధానపుత్రి రామదాసప్రణీతంబైనయాంధ్ర
పదాభిధానంబను నిఘంటువునందు స్వర్గవ్యో
మదిక్కాలధీవాక్ఛబ్దాదినాట్యపా
తాళభోగినరకవారివర్గకలి
తప్రథమకాండము

సంపూర్ణము.

శ్రీమతేరామానుజాయనమః.

# ఆంధ్రపదనిధానము

## ద్వితీయకాండము.

### భూవర్గ

క. శ్రీరమణీ కుచయుగకా
శ్మీరాంకితకౌస్తుభవిలసిత గరిమా సం
ధ్యారాగ సంయుత సజల
ధారాధర సదృశవక్ష దానవశిక్షా.

వ. అవధరింపుము. ద్వితీయకాండంబునందలి భూవర్గాది పశ
వర్గములను వివరించెద.

ఆ. వె. పంటవలంతి నేల పైఁడిచూలాలును
పుడమి మన్ను మనన భువికభిఖ్య
లలరె; పైర్లనేల పొలమన నుర్వర
కాఖ్యలౌను శౌరి యసురవైరి. 2

పంటవలంతి, నేల, పైఁడిచూలాలు, పుడమి, మన్ను, మఱి అన
భూమిపేర్లు. పైర్లనేల, పొలము అన ఉర్వరపేళ్ళు.

గీ. చౌటనేలయు మఱియు నూసరము కారు
నేల యెద్దడినేలనా నెగడె నూష
రాఖ్యలై; మిత్తినాఁగ మన్ననఁగ మృత్తి
కాఖ్యలౌ భక్తమందార యఘవిదార. 3

చౌటనేల, ఊసరము, కారునేల, ఎద్దడినేల అనఁగ ఊషరభూమి పేళ్ళు. మిత్తి, మన్ను అనఁగా మృత్తికపేళ్ళు.

ఆ. వె. నలుచదరము నంకణంబన స్థలికాఖ్య
లలరె; నొడ్డుమిట్ట వెలిగడయును
మెట్ట మిఱ్ఱునేల మెరకనా నున్నత
భూమికాఖ్యలౌను బుధనుతాఖ్య. 4

నలుచదరము, అంకణము అన స్థలముపేర్లు. ఒడ్డు, మిట్ట, వెలిగడ, మెట్ట, మిఱ్ఱునేల, మెరక అన ఉన్నతభూమిపేళ్ళు.

క. పంగిడి యొగ్గం బోదము
పంగౌన గౌయి గొల్లమునవపాతముపేళ్లు
ప్పొంగఁదెలుంగున; పుట్టయ
నంగను వల్మీకమౌను నాళీకాక్షా. 5

పంగిడి, ఒగ్గము, ఓదము, పంగౌన, గౌయి, గొల్లము అన అవపాతముపేర్లు. పుట్ట అన వల్మీకముపేరు.

ఆ. వె. బడువ వ్రంత గొయ్యి బాడువ గొల్లంబు
నొరకమనఁగ గర్తముప్పెఁ; కనుమ
యోనికట్టు నరవ యొప్పెకుధరమధ్య
సంధిమార్గమునకు సారసాక్ష. 6

బడువ, వ్రంత, గొయ్యి, బాడువ, గొల్లము, ఒరకము అన గర్తముపేళ్ళు. కనుమ, ఓనికట్టు, నరవ అన కుధరమధ్యసంధిమార్గముపేళ్ళు.

ఆ. వె. గరుము గరుపనేల గరుసు గులకత్రాతి
నేల గరువు మొరవునేల యనఁగ
శర్కరిలముపేళ్లు; జగమనంగ జగత్తు
నామధేయమౌను నలిననాభ. 7

గరుము, గరుపనేల, గరుసు, గులకఱాతినేల, గరువు, మొఱపు నేల ఇవి శర్కరిలముపేళ్ళు. జగము ఇదిజగత్తుపేరు.

గీ. మేరయన యెల్లనాఁ బొలిమేరయనఁగ
సరుదనఁగ గడియనఁగను కరియనంగ
సీమకునభిఖ్యలై భువిచెల్లఁగెను; పెను
మసనమన వారణాసినామంబు శౌరి. 8

మేర, ఎల్ల, పొలిమేర, సరుదు, గడి, కరి ఇవిసీమపేళ్ళు. పెనుమసనము అన వారణాసిపేరు.

గీ. వఱలె మసనం బొలికిమిట్ట వల్లెకాడు
నా శ్మశానాఖ్యలౌ; తెన్ను నంగ సడవ
నాఁగ తెరువన దారియనంగ త్రోవ
నాఁగ తెర్వన మార్గంబునకునుపేళ్ళు. 9

మసనము, ఒలికిమిట్ట, వల్లెకాడు అనఁగా శ్మశానముపేళ్ళు, తెన్ను, సడవ, తెరువు, దారి, త్రోవ, తెర్వు అనఁగా మార్గమునకుపేళ్ళు.

గీ. వీది క్రంత సందును సంది వెలసెసంధి
వీథిపే; ర్నగ్రహారంబు పేరగు బహు
వచనమునను నల్లిండ్లన వాసవాది
వందితపదాంబుజాత భూవర్గ ముగిసె. 10

వీది, క్రంత, సందు, సంది అనఁగ సంధిమార్గముపేళ్ళు. బ॥ నల్లిండ్లు అనఁగా అగ్రహారముపేరు.

భూవర్గముగిసెను.

---

## పురవర్గు

గీ. వెలసె పట్నము ప్రోలును వీడన నగ
రమునకగుచు; శాఖానగరమున కాఖ్య
పేఁటయననొప్పె; గ్రామంబుపేళ్లు నూరు
కుప్పమన కొట్టికయనంగ కొటికయనఁగ. 11

పట్నము, ప్రోలు, వీఁడు అనఁగా నగరమునకుపేళ్ళు. పేఁటఅన శాఖానగరముపేరు. ఊరు, కుప్పము, కొట్టిక, కొటిక అనఁగా గ్రామమునకుపేళ్ళు.

గీ. పల్లె పల్లియ పొలమును పాళెమనఁగ
పల్లికాఖ్యలుదనరె; వ్రేపల్లె గొల్ల
పల్లెయన ఘోషకాఖ్యలుబరగె రాచ
వీడనఁగ రాజధానికిపేరు శౌరి. 12

పల్లె, పల్లియ, పొలము, పాళెము అనఁగా పల్లెకుపేళ్ళు. వ్రేపల్లె, గొల్లపల్లి అన ఘోషకుపేళ్ళు. రాచవీడు అన రాజధానికిపేరు.

గీ. గూడెమనఁగ కాగూరన గోడెమనఁగ
కుప్పమన పక్కణముపేళ్ళునొప్పె; నగరు
నాఁ వటారమనంగను నవరనంగ
నగు వటారన రాజగృహంబుపేళ్లు. 13

గూడెము, కాగూరు, గోడెము, కుప్పము అనఁగా పక్కణముపేళ్ళు. నగరు, వటారము, నవరు, వటారు అన రాజగృహముపేళ్ళు.

గీ. కొలువు కూటా మజావంబు కూట మొల
గంబు హోజార మంగడి క్రంత మఱియు

రచ్చయును దివాణము హజారంబు కొలువు
కూటమున సభకాఖ్యలౌ కోమలాంగ. 14

కొలువు, కూటము, అజారము, కూటము, ఓలగము, హాజారము, అంగడి, క్రంత, రచ్చ, దివాణము, హజారము, కొలువుకూటము అనఁగా సభపేళ్ళు.

గీ. రచ్చపట్టన చదురన రచ్చకొట్ట
మనఁగ పడసాల యనఁగను హజురనంగ
బరగె ధరణిసభామండపంబుపేళ్ళు;
నదితిసుతపతినుతపాద యఘవిభేద. 15

రచ్చపట్టు, చదురు, రచ్చకొట్టము, పడసాల, హజారు అనఁగా సభామండపమునకు పేళ్ళు.

క. మేలిల్లన మేడయనఁగ
మాళిగయన యుప్పరిగయు మాడువనంగఁ
మాలెయు మాడుగు నోవరి
నా లక్ష్మీనాథ! సౌధ నామంబులగుఁ. 16

మేలిల్లు, మేడ, మాళిగ, ఉప్పరిగ, మాడువ, మాలె, మాడుగు, ఓవరి అనఁగా సౌధమునకు పేళ్ళు.

ఆ.వె. ఇల్లు గిము సాల యిక్కయుండ యనంగ
గృహమున కభిఖ్యలెసఁగె; మిద్దె
మిద్దెటిల్లు మచ్చు మిద్దియయన నర్ధ
సౌధమునకుపేళ్లు చక్రహస్త. 17

ఇల్లు, గిము, సాల, ఇక్క, ఉండ అనఁగా గృహమునకు పేళ్ళు. మిద్దె, మిద్దెటిల్లు, మచ్చు, మిద్దియ అన అర్ధసౌధము (పైనకప్పులేక చెక్కలు గచ్చుతో కట్టినది).

క. కోలారము కొల్లారును
సాలయును దొట్టికట్టు చౌసాలయు నల్
సాల బవంతి కొలారన
పోలె చతుశ్శాలపేళ్లు భోగిశయానా. 18

కోలారము, కొల్లారు, సాల, తొట్టికట్టు, చౌసాల, నిల్సాల, బవంతి, కొలారు అన చతుశ్శాలపేళ్ళు.

గీ. అంగడియు దుకాణంబని యన పసారు
నాఁగ మఱి పచారంబనినం బసార
మనఁగ నాపణమునకుపే; ళ్లంకణంబు
ముంగిలియనంగ నంగణమునకుపేళ్ళు. 19

అంగడి, దుకాణము, పసారు, పచారము, పసారము అనఁగా ఆపణము పేళ్ళు. అంకణము, ముంగిలి అన అంగణము పేళ్ళు.

గీ. బానసం బడసాలయు వంటసాల
యనమహానసమున కాఖ్యలయ్యె; నాకుఁ
జవికె రుసిసాల యన పర్ణశాలకాఖ్య
లగును తెనుఁగున శాతకుంభాంబరధర. 20

బానసము, అడసాల, వంటసాల అనఁగ మహానసమునకు పేళ్ళు. ఆకుజవిక, రుసిసాల ఇవిపర్ణశాలకు పేళ్ళు.

క. వనరుహాలోచన కొట్టడి
యన యుగాణింబన గదియన యట్టయునం
గనుపంటసాలయనఁగను
దనరెను కోష్ఠంబుపేళ్ళు దానవవైరీ. 21

కొట్టడి, ఉగాణము, గది, అట్ట, పంటసాల ఇవి కోష్ఠమునకు పేళ్ళు.

క. కావలియిలు కోణజా తల
చావడి పొదికట్టు మఱి వసారాయనఁగన్
దేవనుత గృహాంగణసభ
కీవసుమతి పేళ్లుదనరి యొసఁగెఁ దెలుఁగునన్ 22

కావలియిలు, కోణజా, తలచావడి, పొదికట్టు, వసారా అనఁగా గృహాంగణసభకు పేళ్ళు.

గీ. వారిజాక్ష! వసారా వసార యోర
పాక పంచాదియును పంచపాక యనఁ గృ
హాంగణకుటీరమునకాఖ్యలగు పురారి
త్రిభువనవిహారి శ్రీవధూహృద్విహారి. 23

వసారా, వసార, ఓరపాక, పంచాది, పంచపాక అనఁగా గృహాంగణకుటీరమునకుఁ బేళ్ళు.

గీ. అశ్వశాలకుపేళ్ళు లాయంబు సాహి
ణంబు మందడియనఁగ న్యాయంబయియల
రారెఁ; యెకరాయనంగ సజ్జారమనఁగ
వెలసె గజశాలకాఖ్యలు జలదమూర్తి. 24

లాయము, సాహిణము, మందడి అనఁగా అశ్వశాలకు పేళ్ళు. ఎకరా సజ్జారము అనఁగా గజశాలకు పేళ్ళు.

క. మొగసాలయు మోసాలయు
మొగసల మోసల హజారము నజారంబున్
నెగడె ప్రఘణంబునకు పే
ళ్లగుచు దెలుంగునను దివ్యహాటకచేలా. 25

మొగసాల, మోసాల, మొగసల, మోసల, హజారము, అజారము అనఁగ ప్రఘణము పేళ్ళు.

గీ. లోఁగడయు కుందకంబును లోఁగలి యడ
కంబునా గృహాంతర్భాగ మంబుజాక్ష!
యమరె; నట్టిల్లు నైనిల్లు నయినిలనఁగ
నలరె నంతర్గృహంబున కాఖ్యలగుచు. 26

లోఁగడ, కుందకము, లోఁగలి, అడకము అన గృహాంతర్భాగము పేళ్ళు. నట్టిల్లు, ఐనిల్లు, అయినయిలు అన అంతర్గృహంబునకు పేళ్ళు.

క. అంతఃపురమున కాఖ్యలు
నంతిపురము రాణివాస మంతిపురియనఁ
వంతుగొనె తెలుఁగునను శ్రీ
కాంతాహృదయాబ్జభృంగ ఖగపతురంగా. 27

అంతిపురము, రాణివాసము, అంతిపురి అనఁగా అంతఃపురమునకు పేళ్ళు.

గీ. తలదువారము మొగలివాకిలి యుఁదల
సాల దలవాకిలియనంగ నాలుగిలను
వెలసె భువిముఖద్వారంబు పేళ్లు; నట్ట
మునకు నట్టడియని పేరు మురవిదారి. 28

తలదువారము, మొంగలివాకిలి, తలసాల, తలవాకిలి అన ముఖ ద్వారమునకు పేళ్ళు. అట్టడి అనఁగా అట్టమునకు పేరు.

గీ. గుంబమన సరబడియన గుమ్మమనఁగ
వసుధపై దోరమనఁగ దువారమనఁగ
ద్వారమైయొప్పు; గోపురద్వారమునకు
గవఁకు గవనన పేళ్ళొప్పు కంధిశయన. 29

గుంబము, సరబడి, గుమ్మము, వాకిలి, దోరము, దువారము అనఁగా ద్వారమునకు పేళ్ళు. గవఁకు, గవను అనఁగా గోపురద్వారమునకు పేళ్ళు.

గీ. ఆడువఱియు నలంగంబు నాళువరియు
కోట ప్రహరియనంగ నెక్కొనెను సాల
మునకభిఖ్యలు; క్రొత్తడమనఁగ కోట
బురుజనంగ నట్టాలకమునకు పేళ్లు. 30

ఆడువరి, అలంగము, ఆళువఱి, కోట, ప్రహరి అన సాలమునకు పేళ్లు. క్రొత్తడము, కోటబురుజు అనఁగా అట్టాలకమునకుపేళ్లు.

గీ. కంపకోటయు కట్టువ కాట్రగడయు
నలవ యనప్రాంతతముపేళ్లు; వెలుగు వెనుగు
తడుకు నాఁగను స్వల్పప్రాంతతముపేళ్లు;
గోడయన కుడ్యనామమౌ కోమలాంగ. 31

కంపకోట, కట్టువ, కాట్రగడ, అలవ అన ప్రాంతతముపేళ్లు. వెలుగు రూ॥ వెల్గు వెనుగు, తడుకు అనఁగ స్వల్పప్రాంతతముపేళ్లు. గోడ అన కుడ్యమునకుపేరు.

గీ. ఇడుపనఁగ కుడ్యపార్శ్వాఖ్య యొసఁగెభువిని;
భిత్త్యధోపార్శ్వభాగంబుపేళ్లు తిన్నె
యోరనాఁజెల్లె; సోదయు గారయనఁగ
గచ్చునఁగ కుడ్యలేప్యాఖ్య లెచ్చెశౌరి. 32

ఇడుపు అన కుడ్యపార్శ్వముపేరు. తిన్నె, ఓర అనఁగా కుడ్యమున కథోపార్శ్వభాగముపేళ్లు. సోద, గార, గచ్చు అనఁగా కుడ్యలేప్యమునకు పేళ్లు.

గీ. కొప్పనఁగ వెన్నునా నడికొప్పనంగ
మొగడునా గృహాపరిశృంగమగును; నిడుప
కమ్మి చేరడు దారసాకయును దార
బంధమన ద్వారబంధమౌ భవవిదారి 33

కొప్పు, వెన్ను, నడికొప్పు, మొగడు గృహోపరిశృంగమునకు పేళ్ళు. నిడుపకమ్మి చేరడు, దారసాక, దారబందము అన ద్వారబంధము పేళ్లు.

ఆ. వె. క్షితిని సొరణంబు కిటికీయనంగను
నిత్యబహువచనమున నెలకొనినను
సోర్ణగండ్లనంగ సొరణగండ్లన
వఱలె పేళ్లు భువి గవాక్షమునకు 34

సోరణము, కిటికీ, బ॥ సోర్ణగండ్లు, సోరణగండ్లు, ఇవి గవాక్షుల పేళ్లు

గీ. చూరనంగ కొణిగెయు వాచూరనంగ
వెలిసె యనఁగ వలీకంబు పేళ్లు; చూరు
కమ్మియన చూరుమొగ్గనాఁగ మఱిచూరు
పట్టెయనఁగ గోపానసివడసె పేళ్లు. 35

చూరు, కొణిగ, వాచూరు, వెలిసె ఇవి వలీకమునకు పేళ్లు. చూరు కమ్మి, చూరుమొగ్గ, చూరుపట్టె ఇవి గోపానసికి పేళ్ళు.

క. తిన్నెయు జగ్గిలె యరుఁగును
తిన్నియ జగ జవిలె జగిలె తీనియ తీనెా
బన్నుగ నెన్నగ వేదిక
కు న్నామములమరె కలుషకుంజరసింహా. 36

తిన్నె, జగ్గిలె, అరుఁగు, తిన్నియ, జగ, జవిలె, జగిలె, తీనియ, తీనె అనఁగా వేదికకు పేళ్ళు.

గీ. దోరణయును బిబ్బియన దోరణమన
తోరణాఖ్యలగు; మొసలిదోరణమన
మొసలిబిబ్బియనంగను మొనసె మకర
తోరణమునకభిఖ్యలు తోయజాక్ష. 37

దోరణ, బిబ్బి, దోరణము అనఁగా తోరణమునకు పేళ్ళు. మొసలిదోరణము, మొసలిబిబ్బి అనఁగా మకరతోరణము పేళ్ళు.

గీ. చప్రమన కురాళంబన చప్పరమన
పందిరియు పందిలియనంగ బరగకాయ
మానమునకొప్పె; తమగంబు మంచెయనఁగఁ
దనరెమంచాఖ్యలై ఘోరదానవారి. 38

చప్రము, కురాళము, చప్పరము, పందిరి, పందిలి అనఁగా కాయమాన
ము పేళ్ళు. తమగము, మంచె అన మంచకు పేళ్ళు.

గీ. కుందయన కంబమనఁగను కూచమనఁగ
మొక్కలంబన గడయన మొకరమనఁగ
నిట్టనా రాడనంగను నెగడె భువిని
స్తంభమునకాఖ్యలై శాతకుంభచేల. 39

కుంద, కంబము, కూచము, మొక్కలము, గడ, మొకరము, నిట్టి, రా
డు అనఁగా స్తంభమునకు పేళ్ళు.

గీ. పరికనా ముగ్గనఁగ రంగవల్లికాఖ్య
లగు; గడప కడపయన దేహాలికిపేళ్ల
లరె తెలుఁగున; కప్పుబల్లయన నుత్త
రాసియనగ నాసాఖ్యలౌ వాసుదేవ. 40

పరిక, ముగ్గు అన రంగవల్లి పేళ్ళు. గడప, కడప అన దేహాళికి
పేళ్ళు. కప్పుబల్ల, ఉత్తరాసి అనఁ నాసకు పేళ్ళు.

గీ. తూపురాణి యొప్పరమును తూపురాణ
తూపురాణము జలదారితూమన జల
ధారకాఖ్యలగును; దుంధుమారమునకు
నౌను దూగలి కలిదూపమనఁగ పేళ్ళు. 41

తూపురాణి, ఒప్పరము, తూపురాణ, తూపురాణము, జలదారి, తూ
ము అనఁగా జలధారకు పేళ్ళు. దూగలి, కలిదూపము అనఁగా దుంధుమా
రమునకు పేళ్ళు.

గీ. ఓల మంతరు వంతస్తు నోలిమియును
బుర్రంగు మఱుఁగుచో టిఱుమన పొసఁగెపేళ్ళు
భువి రహస్యస్థలమునకు నివియు నేడు
తెలుఁగుబాసనువిలసిల్లె దేవదేవ. 42

ఓలము, అంతరువు, అంతస్తు, ఓలిమి, బ్రుంగు, మఱుఁగుచోటు, ఇఱుము అనఁగా రహస్యస్థలమునకు పేళ్ళు.

గీ. ఆసరా యండయును దెస యాటపట్టు
నూత యానికయును ప్రాఁపు నూఁతమనఁగ
నాశ్రియంబునకాఖ్యలు; నండగొనన
ప్రాఁపుగొను నాశ్రయించుటకోపు పేళ్లు. 43

ఆసరా, అండ, దెస, ఆటపట్టు, ఊఁత, ఆనిక, ప్రాపు, ఊఁతము అన ఆశ్రయమునకు పేళ్ళు. అండగొను, ప్రాపుగొను అన ఆశ్రయించు పేళ్ళు.

సీ. ఇక్క యిక్కవ యండ యిమ్ము కలఁకు చక్కి
యెడ యునుకువ బస యిరువు మనికి
యునికి యిరవు తావు మనకువ తానంబు
నెల వాటపట్టును కలను తెంకి
తానకంబును టెంకి తావలంబు బిడారు
విడిమట్టు చక్కటి వీడుపట్టు
నట్టు బిడారంబు పట్టు టెంకియు తావు
నన నివాసస్థానమునకుపేళ్ళు;
గీ. చక్కి నెలఁకువ చోటును చక్కటి నెల
నట్టు పొలము బిడారును నిట్ట నెప్పు
వలతి నెలవును సీమయు పట్టు మనికి
తావన ప్రదేశపుంబేళ్లు దానవారి. 44

ఇక్క, ఇక్కువ, అండ, ఇమ్ము, కలఁకు, చక్కి, ఎడ, ఊనుకువ, బస, ఇరువు, మనికి, ఊనికి, ఇరవు, తావు, మనకువ, తానము, నెలవు, ఆటపట్టు, కలను, తెంకి, తానకము, టెంకి, తావలము, బిడారు, విడిమట్టు, చక్కటిక్, వీడుపట్టు, నట్టు, బిడారము, పట్టు, టెంకియు, తావు అనఁగ వాసస్థానమునకు పేళ్ళు. చక్కి, నెలకువ, చోటు, చక్కటిక్, నెల, నట్టు, పొలము, బిడారు, నిట్ట, నెప్పు, వలతి, నెలవు, సీమ, పట్టు, మనికి, తావు ఇవి ప్రదేశము పేళ్లు.

గీ. కాణయాచి కాణాచియు పూనెపేళ్ళు
పుడమిని చిరకాలస్థానమునకు నొప్పు
తెలుఁగుపల్కులను పురప్రదేశమునకు
నామధేయంబు తలవీడునాఁగ శౌరి. 45

కాణయాచి, కాణాచి ఇవి చిరకాలస్థానమునకు పేళ్ళు. తలవీడు ఇది పురప్రదేశమునకు పేరు.

పంచపాదిగీ. మెట్టు మేటికి పావంచ మేలుకట్టు
నింక మెట్టిక సోపనం బేకవచన
మందు తాప బహువచనమందు తంతి
యలును పావటీలనఁగను తెలుఁగునందు
నొప్పు సోపానమాళి యురగశయన. 46

మెట్టు, మేటిక, పావంచ, మేలుకట్టు, మెట్టిక, సోపనము, ఏ॥ తాప, బ॥ తంతియలు, పావటీలు అన సోపానములకు పేళ్ళు.

క. ఆణియము నాడు సీమయు
నాణెమును విలాతి నేల యన నాడిక మా
గానియనఁ దేశాఖ్యలు
దానవరాణ్మత్తగజవితానమృగేంద్రా. 47

అణియము, నాడు, సీమ, ఆణెము, విలాతి, నేల నాడిక, మాగాని అనఁగా దేశమునకు పేళ్ళు.

గీ. గుజరాతి గుజ్జరాతియు
గుజరీయును గుజ్జరీయగును ఘూర్జరముఁ
నిజముగ; నొడ్డాదియనఁగ
నజనుత యోఢ్రంబుపేరు లాంధ్రమునగుఁ. 48

గుజరాతి, గుజ్జరాతి, గుజరీ, గుజ్జరీ అన ఘూర్జరదేశము పేళ్లు. ఒడ్డాది అన ఓఢ్రదేశము పేరు.

గీ. అవని హారుముంజి హార్మ్ముంజియనఁగ దివ్య
మౌక్తికోత్పత్తిదేశ నామంబులయ్యె
చెలఁగెను; సిరాజియును సిరాజీయననఁగు
దివ్యఖడ్గకృతోత్పత్తి దేశమునకు. 49

హారుముంజి, హార్మ్ముంజి అనఁగా దివ్యమౌక్తికోత్పత్తియగుదేశము పేళ్ళు. సిరాజి, సిరాజీ అనఁగాదివ్యమైనఖడ్గములుచేసెడునొకానొకదేశము పేరు

గీ. వసువసన! గృహాచ్ఛేదనవస్తువునకు
నలరె నోడబిల్లయు గూనయనఁగ నాఖ్య
నికరమలరుచు వీడుచేరికపలుకుల
వరుసతో తెలుఁగున పురవర్గ ముగిసె. 50

ఓడబిల్ల, గూన అనఁగా గృహము కప్పెడుమృత్తికాది వస్తువునకు పేళ్లు.

పు ర వ ర్గ ము గి సె ను.

---

# శైలవర్గ

గీ. జేజెగట్టు పాంగట్టు జేజేలకొండ
పైఁడిగుబ్బలినాఁగను బరగె మేరు
వునకభిఖ్యలు; కొంచగట్టనఁగ కొంచ
నాఁగ క్రౌంచాద్రిపేళ్లను నాగవంద. 51

జేజెగట్టు, పాంగట్టు, జేజేలకొండ, పైఁడిగుబ్బలి అన మేరుపర్వతముపేళ్లు. కొంచగట్టు, కొంచ అనఁగ క్రౌంచాద్రిపేళ్లు.

క. చలికొండ యీమదరి వలి
మలయు వడఁకుకొండ మంచుమలయనఁగ మఱిఁ
తెలికొండ గట్లఱేఁడన
నలరె హిమాద్రికి నభిఖ్యలగుచు ముకుందా. 52

చలికొండ, ఈమదరి, వలిమల, వడఁకుకొండ, మంచుమల, తెలికొండ, గట్లఱేఁడు అనఁగా హిమాచలముపేళ్లు.

గీ. కప్పుమల కాటుకమలయునొప్పె నంజ
నాద్రిపేళ్లయి; తావిగట్టనఁగ గంధ
పుమలనా గంధమాదనమునకుపేళ్లు;
మందుమలయన ద్రోణాద్రిచెందెపేరు. 53

కప్పుమల, కాటుకమల అనఁగ అంజనాద్రిపేళ్లు. తావిగట్టు, గంధపుమల అన గంధమాదనముపేళ్లు. మందుమల అన ద్రోణాద్రిపేరు.

గీ. తరిమలయును కవ్వపుగొండ తనరె మంథ
రాద్రికాఖ్యలు; చక్రవాళాఖ్యము సుడి

గట్టనఁగనొప్పెనిల; చేఁతగట్టనంగ
వెలసె కృతకాద్రినామంబు విమలచరిత. 54

తరిమల, కవ్వపుఁగొండ అనఁగ మంథరాచలము పేళ్ళు. నుడి.ఒఒ చక్రవాళము పేరు. చేఁతగట్టు అనఁగా కృతకాద్రి పేరు.

గీ. పుట్టుగట్టు పొడుపుకొండ మునుమలయనఁ
దనరె నుదయాద్రికాఖ్యలు ధరణి తెనుఁగు
నందుఁ గ్రుంకుడుగట్టన నామధేయ
మమరె నస్తాచలంబున కమరవినుత. 55

పుట్టుగట్టు, పొడుపుకొండ, మునుమల అన ఉదయాద్రి పేళ్ళు. క్రుంకుడుగట్టు ఇది యస్తాద్రికి పేరు.

క. కరువయు కొండయు గుబ్బలి
దరిగుండును మెట్టు నేలతాల్పు మలయుఁగ
ట్టరయఁగ తిప్పయనంగ కు
ధరమునకు నభిఖ్యలలరె దనుసుతవైరీ. 57

కరుప, కొండ, గుబ్బలి, దరిగుండు. మెట్టు, నేలతాల్పు, మల గట్టు, తిప్ప ఇవి కుధరము పేళ్ళు.

గీ. కొప్పరంబన క్రేపన కొప్రమనఁగ
కొమ్మనఁగ సిగరంబన కొపురమనఁగ
పేటనఁగ మోరనంగను పేళ్ళుశృంగ
మునకు దనరారె సజలవార్ముక్ఛగీర. 57

కొప్పరము, క్రేపు, కొప్రము, కొమ్మ, సిగరము, కొపురము, పేటు, మోరు అనఁగా శృంగమునకు పేళ్ళు.

పంచపాది గీ. కలు చలుప రాయి ఱా ఱాయి కల్లు చట్టు
నా శిలకుపేళ్లు; చట్రాయి నాఁగ మిడుగు

నాఁగ కఠినోపలముపేళ్లు; నాఁపరాయి
చలుప చట్రాయి బండయు చాఁపటాయి
యన విశాలోపలముపేళ్లు హరిహయనుత. 58

కలు, చలుప, రాయి, టా, టాయి, కల్లు, చట్టు అన శిలకుపేళ్ళు. చట్రాయి, మిడు అనఁగా కఠినశిలకుపేళ్ళు. నాఁపరాయి, చలుప, చట్రాయి, బండ, చాఁపటాయి అన విశాలమైనశిలకు పేళ్ళు.

క. కలుఁగు గవి బొఱియ గని గొబ
బెలము సొరంగము పడఁక బిలమునకాఖ్యల్;
సెల మలకాలువ వాఁగును
సెలజాల్మలయేఱనంగ చెలఁగె ఝురాఖ్యల్. 59

కలుఁగు, గవి, బొఱియ, గని, గొబ, బెలము, సొరంగము, పడఁక అనఁగా బిలమునకు పేళ్ళు. సెల, మలకాలువ, వాఁగు, సెలజాలు, మలయేఱు అన ఝురమునకు పేళ్ళు.

గీ. చఱియయన కొండచఱియన చఱియనఁగ ప్ర
పాతనామంబులగు; గిరిపల్వలమున
కాఖ్య దొనయననొ; దడియ నుపత్య
కాఖ్యయగు భువనవిహారి యఘువిదారి. 60

చఱియ, కొండచఱియ, చఱి అనఁగ ప్రపాతముపేళ్ళు. దొన అన గిరిపల్వలము పేళ్ళు. దడియ అన ఉపత్యకపేరు.

గీ. కురువఁగున కుధరోపరిసరణిపేరు
బరగె; నెత్తమునా ధరోపరివిశాల
భూమికాహ్వయమా దితిపుత్రరాజ
వనదవానల యీశైలవర్గు ముగిసె. 61

కురువ అనఁగా పర్వతముమీదిమార్గముపేరు. నెత్తము అనఁగా పర్వతముమీదివిశాలభూమికిపేరు. శైలవర్గు ముగిసెను.

# వనౌషధివర్గ

ఆ. వె. కారు కోన యడవి కాన పొలము డొంక
యనఁగ పేళ్ళదనరె యటవికిలను;
పేరడవియు లొంక వెలసె మహారణ్య
మున కభిఖ్యలగుచు దనుజనాశ. 62

కారు, కోన, అడవి, కాన, పొలము, డొంక అనఁగా అరణ్యముపేళ్ళు. పేరడవి, లొంక అన మహారణ్యముపేళ్ళు.

గీ. తోఁట యెలతోఁట యారెము తోఁపనంగ
నలరె నారామమునకాఖ్యలగుచు; నాట
తోఁటయనఁగ సింగారపుఁదోఁటయనఁగ
నమరె నుద్యానవనమున కాఖ్యలు హరి. 63

తోఁట, ఎలతోఁట, ఆరెము, తోఁపు అనఁగా ఆరామమునకు పేళ్ళు. ఆటతోఁట, సింగారపుఁదోట అన ఉద్యానవనమునకు పేళ్ళు.

ఆ.వె. మ్రాను పుడమిబుట్టు మ్రాఁకును మ్రాఁకన
వృక్షమునకుపేళ్ళు వెలసె; కవట
కొమ్మ మండ లేట కొమయన శాఖ క
భిఖ్యలౌను భోగిభిత్తురంగ. 64

మ్రాను, పుడమిబుట్టు, మ్రాఁకు, మ్రాఁకు అన వృక్షమునకుపేళ్ళు. కవటు, కొమ్మ, మండ, లేట, కొమ అన శాఖకుపేళ్ళు.

ఆ.వె. రెమ్మ కివట రివ్వ రెంబ రెబ్బయు జొంప
మన నిలనుపశాఖ కాఖ్యలౌను;

చివ్వ చివక సురిగ చువ్వ చువకయన
మృదులతరుణశాఖకొదవె పేళ్ళు. 65

రెమ్మ, రిపట, రివ్వ, రెంబ, రెబ్బ, బొంనము అన ఉపశాఖ పేళ్ళు. చివక, చివ్వ, సురిగ, చువ్వ, చువక అన మృదుత్వమైనలేత శాఖపేళ్ళు.

గీ. కొమ్మ చివరయు సుదియును కొన యనంగ
నమరె వృక్షాగ్రమునకాఖ్యలగుచు భువిని;
మోటు ప్రోడును మోడన నేటుకొనెను
స్థాణువున కాఖ్యలై ఫుల్లసారసాక్షి. 66

కొమ్మ, చివర, సుది, కొన అనఁగ వృక్షాగ్రమునకు పేళ్ళు. మోటు ప్రోఁడు, మోడు అనఁగా స్థాణువు పేళ్ళు.

గీ. కందయన దుంపనాఁగను గడ్డయనఁగ
కందమునకు నభిఖ్యలుగలిగె భువిని;
వేఱనంగను మొదలన వృక్షమూల
మునకుపేళ్లగు కలుషారి మురవిదారి. 67

కంద, దుంప, గడ్డ ఇవి కందము పేళ్ళు. వేఱు, మొదలు ఇవి వృక్షమూలమునకు పేళ్ళు.

క. తీఁగయనం దీవియనాఁ
దీఁగియయన దీవెనాఁగ తీవయనంగన్
దీఁగెయనన్ లతశాఖ్యలు
నాగశయన మానిపక్ష నాళీకాక్షా. 68

తీఁగె, తీవియ, తీఁగియ, తీవె, తీవ, తీఁగె ఇవిలతకు పేళ్ళు.

గీ. పర్ణమునకాఖ్య యాకౌను; బంక బంద
న యన వృక్షసారమునకునామమగును;

చొక్కు నెండాకు చొక్కాకు చొరగనంగ
శుష్కపత్రంబునకుపేళ్లు సుందరాంగ 69

ఆకు అన పర్ణముపేరు. బంక, బంకన అన వృక్షసారముపేళ్ళు. చొక్కు, ఎండాకు, చొక్కాకు, చొరగు అన శుష్కపత్రముపేళ్ళు

గీ. పక్వపర్ణంబునకుపేళ్ళు పండుటాకు
నాఁగ పండాకు కారాకు నాఁగ నొప్పు;
తొఱ్ఱి తొఱ తొఱట యు డొంగు తొఱ్ఱయనఁగ
కోటరమునకభిఖ్యలు కోమలాంగ. 70

పండుటాకు, పండాకు, కారాకు అన పక్వపర్ణముపేళ్ళు. తొఱ్ఱి, తొఱ, తొఱట, డొంగు, తొఱ్ఱ అనఁగా కోటరము పేళ్ళు.

క. ఇవురన నిగురన చిదుమన
చివురన ననయున తలిరన చిగురనఁగను ప
ల్లవమునకు పేళ్ళదనరెను
జలముగ్గణలలితగాత్రి సంగరజైత్రీ. 71

ఇవురు, ఇగురు, చిదుము. చివురు, నన, తలిరు, చిగురు అనఁగ పల్లవమునకు పేళ్ళు.

గీ. మొవ్వనఁగ మొవనంగను మోవనంగ
తరుణకిసలాంకురముపేళ్ళు దనరె; మొలవ
మొలక యీరిక మోకయు మోసునాఁగ
నగు నవీనాంకురమున కాఖ్యలుమురారి. 72

మొవ్వ, మొవు, మోవు అనఁగా తరుణకిసలయాంకురము పేళ్ళు. మొలవ, మొలక, ఈరిక, మోక, మోసు అన నవీనాంకురము పేళ్ళు.

గీ. కనుపు గనుపన పర్వాఖ్యలొనరెను; తల
యెత్తు గోరగించుటను మొలకెత్తు పొటమ

రించనఁగ నొప్పె పేళ్లంకురించుటను;
సదయనంగను పత్రిరజంబు పేరు. 73

కనుప్ర, గనుపు అన పర్వము పేళ్ళు. తలయెత్తు, కోరగించు, మొల కెత్తు, పొటమరించు అన అంకురించు పేళ్లు. పవ పత్త్రరజము పేరు.

గీ. పువ్వలరు నన పూఁ బువు పుష్పము విరి
యన లతాంతాఖ్యలౌ; మొగ సన యరవిరి
మొగడ మొగ్గనాఁ గోరకమునకుఁ బేళ్ళు
దనరె; రేకు తేకన పుష్పదళము పేళ్ళు. 74

పువ్వు, అలరు, నన, పూ, పువు, పుష్పము, విరి అన పుష్పము పేళ్ళు. మొగ, సన, అరవిరి, మొగడ, మొగ్గ అన గోరకమునకు పేళ్ళు. రేకు, తేకు అన పుష్పదళము పేళ్ళు.

గీ. పూప పూఁబిందెనాఁగను పుష్పజాల
కమునకాఖ్యలు విలసిల్లె; కాయయన శ
లాటు పేరగు; పండు ఫలంబు పేరు;
పృథుఫలము పేరు గొబ్బం బె కృష్ణవర్ణ. 75

పూప, పూఁబిందె అనఁగా పుష్పజాలకము పేళ్ళు. కాయ అనఁగా శలాటు పేరు. పండు అనఁగా ఫలము పేరు. గొబ్బండు అనఁగా పృథుల ఫలము పేరు.

గీ. కనియు మాఁగును మదురును కమియు నుదుర
బండనఁగ పరిపాకాంతఫలము పేళ్లు
నలరె; పిందెయు పిందియ యనఁగ జాల
కంబునకు పేళ్లగును లసితాంబుజాక్ష. 76

కనియు, మాఁగు, మదురు, కమియు, నుదురఁబండు అన పరిపాకాంతఫలము పేళ్ళు. పిందె, పిందియ అనఁగా జాలకము పేళ్ళు.

గీ. పుష్పాడియును బుక్కా_మన పుష్పరజము
బూనె పేళ్ళు; పూఁదేనె పూఁదేనియ నన
నీరు కిమ్మనీరనఁగను నె౯ ౘెను నల
డఁ బుపేళ్లయి; తొడిమె వృంతంబు పేరు. 77

పుష్పాడి, బుక్కా_ము అనఁగా పుష్పరజము పేళ్ళు. పూఁదేనియ, ననసీరు, కమ్మనీరు అన మకరందము పేళ్ళు. తొడిమ వృంతము పేరు.

గీ. ఫలరసంబునకాఖ్యయౌ పానకంబు
కందుకము పేళ్లగును గుత్తి చెండు బంతి
నాఁగఁ దెనుఁగున; గుచ్ఛంబునకును పేళ్లు
గుత్తి గుది గొల గెల నాఁగ కోమలాంగ. 78

పానకము అన ఫలరసము పేరు. గుత్తి, చెండు, బంతి అనఁగ కందుకము పేళ్ళు. గుత్తి, గుది, గొల, గెల అనఁగ గుచ్ఛము పేళ్ళు.

క. ఇగిరించు ఇగురుచు తలిర్చును
చిగుర్చు తలిరించును ననుచును చిగురుకొను ననఁగ
జిగిరించన గవిరించన
నగరాధ్ధర పల్లవించు నామంబులగుఁ. 79

ఇగిరించు, ఇగుర్చు, తలిర్చు, చిగుర్చు, తలిరుచు, ననుచు, చిగురుకొను, చిగిరించు, ఇవిరించు అన పల్లవించు పేళ్ళు.

గీ. విరియు ననుమను పూచును పిరిదులు పొదురు
నెంచనామంబులయ్యె పుష్పించుటకును
లలి పిసాళి యువ్వాయి న వ్వెలరు రోకు
నెలమి నాఁగ వికాసాఖ్యలెనఁగె శౌరి. 80

ఓడరేవు, సమాప, ప్రూనా, ఓడ్డబు, పాసుదు అని ప్రసిద్ధించు పేళ్లు.
అలవి, విశాలి, ఘనగ్రాసము, ఇన్వ్య, ఎలయు, నాకు, ఎలమి ఇవి విశాలము నకు పేళ్ళు.

గీ. అలరెలర్పనగ మొగ్గవి చ్చెలరుచు మఱి
విచ్చు తొంగలించుచు నవ్వు విప్పు వికియు
వికియఁబాఱు విడఁగును విక్క వికియు
చెలఁగుసన నామములు వికసించుటకును. 81

అలరు, ఎలర్చు, మొగవిచ్చు, ఎలరుచు, విచ్చు, తొంగలించు, నవ్వు, విప్పు, వికియు, వికియఁబాఱు, విడఁగును, విక్కవికియు. చెలఁగు ఇవి వికసించుటకు పేళ్ళు.

తే. మొగడించు మోడ్చు మోడుపు
మొగుచు మొవ్పుడు కోరగించు ముడుఁగు మొగుడ్చుక
మొగుడనఁగా ముకుళించుట
కగు నామము లబ్జనయన యంబుధిశయనా. 82

మొగడించు, మోడ్చు, మోడుపు, మొగుచు, మొవ్పుడు, కోరగించు, ముడుఁగు, మొగుడ్చు, ముగుడు అనఁగ ముకుళించుటపేళ్లు.

ఆ.వె. వడలు స్రుక్కు సొగటు వాడును బహువచ
నమునను వసివాళ్లనాఁగ మ్లాన
మునకు బేళ్లు; తఱపి పూప కవట లేఁత
పసి యన తరుణాఖ్యలెసగెశౌరి. 83

వడలు, స్రుక్కు, సొగటు, వాడు, బ॥ వసివాళ్ళు అనఁగ మ్లానము పేళ్ళు. తఱపి, పూప, కవట, లేఁత, పసి అనఁగా తరుణమునకు పేళ్ళు.

గీ. ఈరముును పొదరిలు తీఁగెయిల్లనంగ
కుంజమునకాఖ్యలౌ; స్వల్పకుంజమునకు

చెలఁగె నామాళి పొద తుప్ప చిట్టపొదరు
నాఁగ భక్తాళివరదాయి నాగశాయి. 84

ఈరము, పొదరిలు, తీఁగెయిల్లు అనఁగ నికుంజమునకు పేళ్లు. పొద తుప్ప, చిట్ట, పొదరు అనఁగా స్వల్పకుంజము పేళ్లు.

గీ. జీబు జొంప మీఁజమి యన చెలఁగె తెలుఁగు
నందు గుల్మపుటాఖ్యలై; చిందుదోరు
విదురు రాలు విదులు పాటు విద్రుననఁగ
పతనమునకు నభిఖ్యలు పాపనాశ. 85

జీబు, జొంపము, ఈఁజమి అనఁగా గుల్మని పేళ్లు. చిందు, దోరు విదురు, రాలు, విదులు, పాటు, విద్రు అనఁగా పతనమునకు పేళ్ళు.

క. దొంతి పరి యంచె చాలును
బంతి వరుస యోలి బారు పోఁ జనఁగను శ్రీ
కాంతాధిప! పంక్తికి నా
మాంతరమగు; కాత్రమాని కగు ఫలినంబుల్. 86

దొంతి, పరి, అంచె, చాలు, బంతి, వరుస ఓలి, బారు, పోఁజు అనఁగా పఙ్క్తికి పేళ్ళు. కాత్రమాను అన ఫలినము పేరు.

గీ. పొన్న సురపొన్న పున్నాగమునకు పేళ్లు;
పొగడనాఁగను వకుళంబు బొందె పేరు;
నెమ్మియన వంజుళంబయ్యె నెగడె ధరణి;
నేలకాహ్వయమేలకి నీలగాత్ర. 87

పొన్న, సురపొన్న అన పున్నాగవృక్షము పేళ్ళు. పొగడ అన వకుళము పేరు. నెమ్మి అన వంజుళము పేరు. ఏలకి అన ఏలకి పేరు

క. సంపెఁగ తుమ్మెదకంటును
సంపెంగము సంపెఁగెయును చనుపక మనఁగన్

సంపఁగియనాఁగ జిలుఁగన
చంపకనామంబులొను సారసనాభా. 88

సంపెగ, ఏన్మోదకంటు, సంపంగ, సంపెఁగె, చమ్పకము, సంపఁగియ, జిలుగు అనఁగా చంపకమునకు పేళ్ళు.

ఆ. వె. రేఁగు రేను రేవు నాఁగ బదరికాఖ్య
లమరె; లికుచమునకు నాఖ్యలొను
కమ్మరేఁగనంగ గజనిమ్మయనఁగను
కమ్మరేను నాఁగ కమలనేత్ర. 89

రేఁగు, రేను, రేవు అన బదరికాఖ్యలు. కమ్మరేఁగు గజనిమ్మ, కమ్మరేను అనఁగా లికుచమునకు పేళ్లు.

గీ. ధరణి కాంచనమన కోవిదారమునకు;
కలిగె కెంగేలియన నశోకంబుపేరు;
యీడ నారింజ కిత్తలి యీడె యనఁగ
నొప్పనారంగమునకాఖ్య లురగశయన. 90

కాంచనము అన కోవిదారముపేరు. కెంగేలి అనఁగా అశోకవృక్షము పేరు. ఈడ, నారింజ, కిత్తలి, ఈడె అనఁగ నారంగముపేళ్లు.

గీ. ధరణి దాడిమ్మ నాఁగను దాడినిమ్మ
యనఁగ దానిమ్మ దాళిమ్మయనఁగ దాడి
మాఖ్య; లొట్టికసిందయునన కచోర
మనఁగ కచ్చూరకాఖ్యలు వనజనాభ. 91

దాడిమ్మ, దాడినిమ్మ, దానిమ్మ, దాళిమ్మ అనఁగా దాడిమము పేళ్లు. ఒట్టికసింద,కచోరము అన కచ్చూరపేళ్లు.

క. విరజాజియు జాజియనఁ
విరజాజియు జాజియనఁగ సిన జాజియనఁ

విరవాజియనఁగ సప్తల
కిరుదు పేళ్లును తెలుఁగునందు సురారీ. 92

విరిజాజి, జాజి, విరిజాది, జాది, విరివాజి, విరవాజి అనఁగా సప్తలకు పేళ్లు.

ఆ.వె. దేవదారినాఁగ దేవదారువు పేరు;
పారిభద్రమునకు బారిజమన
బారిదప్ప్మునాఁగ వారిదమనఁగను
వారిజంబనంగ వాసుదేవ. 93

దేవదారి దేవదారువుపేరు. బారిజము, బారిదప్మ్మ, వారిదము, వారిజము అనఁగా పారిభద్రముపేళ్ళు.

ఆ.వె. దాసనంబనంగ దాసానియన జపా
వృక్షసంజ్ఞయు; కరవీరమునకు
కలిగపేళ్ళు భువిని గన్నేరు గన్నెరు
నాఁగ తెలుఁగునందు నాగశయన. 94

దాసనము, దాసాని అన జపావృక్షము. గన్నేరు, గన్నెరు అనఁగా కరవీరమునకు పేళ్ళు.

ఆ.వె. పాదిరి కలిగొట్టు పాదిలినాఁగను
పాటలికాఖ్యలై పరిఢవిల్లె;
బొట్టుగు బొట్టువు బొటుగనంగను పేళ్ళు
తిలకవృక్షమునకు దేవదేవ. (95)

పాదిరి, కలిగొట్టు, పాదిలి ఇవి పాటలికి పేళ్ళు. బొట్టుగు, బొట్టువు, బొటుగు అనఁగా తిలకవృక్షముపేళ్ళు.

ఆ.వె. గేదఁగి మొగిలియన కేతకిపేళ్లౌను;
మల్లె మల్లియయన మల్లికాఖ్య

ఆ.వె. కోరవి క్రోవి క్రొమ్మి గోరంటయు కురువ
కమునకాఖ్యలౌను; కదిరమునకు
చంద్ర యుంద్ర యుంద్రసయు నులిమ్రానన
నామధేయములును నాగశయన. 100

కోరవి, క్రోవి, క్రొమ్మి, గోరంట అనఁగా కురువకమునకు పేళ్ళు.
చంద్ర, ఉంద్ర, ఉంద్రస, నులిమ్రాను అనఁగా కదిరమునకు పేళ్ళు.

ఉ. అందుగునాఁగ నందువన నాఖ్యలు సల్లకికొప్పిమీఱె; ని
ల్లెందయు నింద్రవల్లికిని లెక్కఁగొనె న్మఱి; చిల్లచెట్టునా
నిందువు నిందుగన్నను మహిం గతకాఖ్యలు; మేడి యత్తి యు
న్నంచున నౌ నుదుంబరమునామము; లర్జునసంజ్ఞ మద్దినాన్.

అందుగు, అందువు అనఁగ సల్లకి పేళ్ళు. ఇల్లెంద అన ఇంద్రవల్లి పేరు. చిల్ల, ఇందువు, ఇందుగు అనఁగా కతకమునకు పేళ్ళు. మేడి, అత్తి అన ఉదుంబరము పేళ్ళు. మద్ది అనఁగా అర్జునము పేరు.

చ. గిరిసెము నా శిరీషమగు; కింశుకమొప్పెను మోదువన్న ప
ప్పరయన మోదుగన్నగు; బంధురనామము మంకెనన్న నౌ;
కరకయనన్ హరీతకికిఁ గల్గెను పేరు; మధుద్రుమాఖ్యమై
పరగొనె నిప్పమ్రాననఁగ పాతకభూజకుఠారపద్యగా. 102

గిరిసెము అనఁగ శిరీషము పేరు. మోదువు, పంపర, మోదుగు అనఁగ కింశుకము పేళ్ళు. మంకెన అనఁగా బంధురము పేరు. కరక అనఁగా హరీతకి పేరు. ఇప్ప అనఁగా మధుద్రుమము పేరు.

క. ఉసిరికయన నామలకం
బెసఁగె నభిఖ్యగొని యిరుగుడిరుపుడనంగన్
వెసగొనె శింశుపవృక్షము;
ముసిడియనం బేరగు విషముష్టికి శౌరీ. 103

ఉసిఁక అన ఆమలకము పేరు. ఇరుగుడు, ఇరువుడు అనఁగా శింశుపము పేళ్ళు. ముసిఁడి అన విషముష్టికి పేరు.

క. వాసంతికి తెలుఁగున పే
రౌ సరి పూఁలగురివెంద యగు; కర్కటికిన్
దోసయగు; తినిశమునకు తి
నాసము నెమ్మియనఁ బేళ్ళు నాళీకాక్షా. 104

పూలఁగురివెంద అన వాసంతికి పేరు. దోస యనఁగా కర్కటికి పేరు. తినాసము, నెమ్మి అనఁగా తినిశమునకు పేళ్ళు.

క. గురివెంద గురిజయనఁగం
జెలఁగెను గుంజాఖ్యలగుచు; సింధుకమునకున్
బరగెను వావిలియన సిం
దురమనఁ బేళ్లగుచు శౌరి దురితవిదారీ. 105

గురివెంద, గురిజ అనఁగా గుంజాఖ్యలు. వావిలి, సిందురము అనఁగా సింధుకమునకు పేళ్లు.

క. గిలక గిలగింత గిలగిల
యలరెను ఘంటారవమున కాఖ్యావళియై;
కలజువ్వినాఁగ తెలుఁగున
తలకొనె భువి కందరాళ తరువునకు హరీ. 106

గిలక, గిలగింత, గిలగిల అనఁగా ఘంటారవమునకు పేళ్లు. కలజువ్వి అనఁగా కందరాళము పేరు.

ఆ. వె. తీఁగెమొలుఁగు ప్రొద్దుతిరుగుడునాఁగ సూ
ర్యానువర్తనికిని నాఖ్యలౌను;
మోదెనంబనంగ మోదెన యనం శివ
మల్లి పేళ్ళు దనరె మదనజనక. 107

తీఁగెసంపెంగ, సౌగ్ధఫలపుష్పము అనఁగా సూర్యకాంతిపేళ్లు.
మొంటెసము, మొటిం అనఁగా శివవల్లిపేళ్లు.

గీ. రేఁగనఁగ గొట్లు నాఁగను రేవనంగ
బదరికాఖ్యలు; అనాసనాఁ బనసయనఁగ
పనసనామాళి; కాసమర్దనముపేరు
తెలుఁగున కసిందయనఁ జెల్లె దేవదేవ. 108

రేఁగు, గొట్టు, రేవు అన బదరికపేళ్లు. అనాస, పనస అన పణస వృక్షముపేళ్లు. కసింద అన కాసమర్దనముపేరు.

క. మొరటయు రాజాదనమగు;
విరిగి యుద్దాలమగును; వెలఁగ కపిత్థం
బరయఁగ; కొడిసె కుటజంబగు;
కరిరమునకు వెణుతురగును కంపనిభాంగా 109

మొరట అన రాజాదనముపేరు. విరిగి అన ఉద్దాలము పేరు. వెలఁగ అన కపిత్థముపేరు. కొడిసె అన కుటజము పేరు. వెణుతురు అన కరీరముపేరు

క. ఉలిమిరి మొగలింగయనం
జెలఁగె వరుణనామపంక్తి; శ్రీపర్ణికి పే
కలరె; మఱి మఱ్ఱియన నా
ఖ్యలు వటవృక్షంబునకు కలరె కలుషవిదారీ. 110

ఉలిమిరి, మొగలింగ అనఁగా వరుణవృక్షముపేళ్లు. పేకు అన శ్రీపర్ణికిపేరు. మఱి, మఱ్ఱి అనఁగా వటవృక్షముపేళ్లు.

గీ. వెదురనఁగను వేణువౌ; బదనిక యన
వెలసె వృక్షాదనికిః పుష వేరనంగ

బాలమునకౌను; వేగి జీవకమునకును;
వేఁప వేము నింబమగు వేదవేద్య. 111

వెదురు అన వేణువుఁ బేరు. ఖదనిక అన వృక్షాదనికిఁ బేరు. కుఱువేరు అన బాలమునకుఁ బేరు. వేగి అన జీవకమునకుఁ బేరు. వేఁప, వేము అన నింబముఁ బేళ్ళు.

గీ. ప్రేంకణము ప్రేంకడంబును బ్రేంకనంబు
నాఁ బ్రియాళాఖ్యలౌ; దొండనాఁగ బింబి
కాఖ్య; చీఁకటిమ్రానననగు తమాల
మునకు; గోలీఢకాఖ్యయౌ మొక్కమనఁగ. 112

ప్రేంకణము, ప్రేంకడము, ప్రేంకనము అనఁగా ప్రియాళముఁ బేళ్ళు. దొండ అనఁగా బింబికకుఁ బేరు. చీకటిమ్రాను అన తమాలముఁ బేరు. మొక్కము అన గోలీఢముఁ బేరు.

గీ. రావి అశ్వత్థమౌ; గంగరావి బ్రహ్మ
దారువౌ; పక్కి పిచులమౌ; తాండ్ర తాఁడి
యన విభీతమునకు నాఖ్యలౌను; గొలుగు
నాఁగ పీలువునకుపేరు నాగళయన. 113

రావి, అన అశ్వత్థముఁ బేరు. గంగరావి అన బ్రహ్మదారువుఁ బేరు. పక్కి అన పిచులముఁ బేరు. తాండ్ర, తాఁడి అన విభీతకము బేళ్ళు. గొలుగు అన పీలువు బేరు

గీ. ఆయిటియనంగనగు బూరుగనఁగ నిలను
శాల్మలికినామములు; నదీసర్జమునకు
నేఱుమద్ది; భల్లాతకికెసగె జీడి
మ్రాననఁగ; నక్తమాలకు కానుగు హరి. 114

ఆయిటి, బూరుగు అనఁగా శాల్మలీవృక్షముఁ పేళ్ళు. ఏఱుగన్ని అన నవీసర్జముఁ బేరు. జీడి అనఁగా భల్లాతకిఁ బేరు. కానుగు అనఁగా నక్తమాలకుఁ బేళ్ళు.

గీ. ధరణి నేలతామర మెట్టతమ్మియనఁగ
పైఁడితామరయన స్థలపద్మినికిని
జెల్లె; తింత్రిణి నామంబు చింత యనఁగ;
పాల మ్రానుకు క్షీరిక బరిగె నౌరె. 115

నేలతామర, మెట్టతమ్మి, పైడితామర అనఁగా స్థలపద్మిని పేళ్ళు. చింత అనఁగా తింత్రిణికి పేరు. పాలమ్రాను అన క్షీరికకుఁ పేరు.

గీ. కుంకుడనఁగ నరిష్టంబు; కొండగోఁగు
నాఁగ కర్ణికారమునకు నామమయ్యె;
తుమికి తుమ్మికియన తిందుకమునకాఖ్య
లలరె; గుగ్గులు నాఁగ గుగ్గిలపుమ్రాను. 116

కుంకుడు అన అరిష్టము పేరు. కొండగోగు అన కర్ణికారము పేరు. తుమికి తుమ్మికి అన తిందకము పేర్లు. గుగ్గులపుమ్రాను అన గుగ్గిలు పేరు.

క. టెంకాయ నారికడమును
తెంకాయయు కొబ్బరియును తేఁజెట్టన ని
శ్శంకనగు నారికేళా
ఖ్యాంకములౌ తెలుఁగునందు హరిహయరక్షా. 117

టెంకాయ, నారికడము, తెంకాయ, కొబ్బరి, తేఁజెట్టు అనఁగా నారికేళమునకు పేళ్ళు.

క. ఏవరకడ యనిబల్కిన
దావరడంగియున దేవతాడియనంగ

పాపహరాంఘ్రియనఁగ జన
తాపిఁసంపద్దార్ఘ్య దేవ తాళముపేళ్లు. 118

విష్ణుపది, పాపహరాంగి, దేవతాడి, పాపహరాంఘ్రి అనఁగా దేవతాళ ముపేళ్ళు,

గి. గిరికతాటు హింతాళమైబరగె తాడు
త్రాసనఁగ తాళనామముల్ వరఁగె తెనుఁగు
మీఁదౌ; ఖర్జూరమునకు కర్జూరమనఁగ
నింక గర్జూరమనఁగ వేరీదనంగ. 119

గిరికతాడు అన హింతాళము పేరు. తాడు, తాౖడు అన తాళము పేళ్ళు. కర్జూరము, గర్జూరము, వేరీద అనఁగా ఖర్జూరము పేళ్ళు.

గి. తుంట రసదాడి ముత్తైపుఁబంటు యించు
చెఱకు కన్నులభ్రమానసఁ జెల్లె పేళ్ళు
నిక్షువునకు; నిక్ష్వాగ్రాఖ్యలెసఁగె చెఱకు
కొనయనఁగ వాడెదవయన కోపులాంగ. 120

తుంట, వసదాడి, ముత్తెఁపుబంటు, ఇంచు, చెఱకు, కన్నులభ్రమాను అన ఇక్షువు పేరు. చెఱకుకొన, వాడెదవ అన ఇక్ష్వగ్రమునకు పేళ్ళు.

క. కవను కసవు గాదంబును
గవతంబును పూరి పుల్లు గడ్డియనంగ౯
భువి తృణమునకాఖ్యలు; కసు
మవు జెల్లగు కాచగడ్డి యగు శరమునకు౯. 121

కవను, కసవు, గాదము, గవతము, పూరి, పుల్లు, గడ్డి అన తృణము పేళ్ళు. కసుపు జెల్లు, కాచగడ్డి అనఁగా శరమునకుఁ బేళ్ళు,

గి. కుసుమ చందిరపూవన వెసకుసుంభ
పుష్పమునకు నభిఖ్యలు భోగిశయన

తెనుఁగునను కోనచేరికపలుకులుగల
వరుసతోడ వనౌషధివర్గు ముగిసె. 122

కుసుమ, చందిరపూవు, అనఁగా కుసుంభపుష్పః॥ జేళ్ళ.

వనౌషధివర్గుముగిసెను.

---

# సింహాదివర్గు

సీ. తెలివాయిమెకమును తెలిమెకమును పచ్చ
కన్నులమెకము సింగంబు బొల్చ
మెకము వెడఁదమోముమెకము తెల్లమెకంబు
మెకములఱేఁడు నేనికలగొంగ
బాకినోటిమెకంబు బాకినోటియు రెంట
ద్రాఁగుడుతిండియునాఁగ జడల
మెకమన సింహంబునకు నభిఖ్యలుజెల్లె;
కటకరంబు కడంతి కడతి నాఁగ
గీ. నమరె గంధర్వమృగమున కాఖ్యలగుచు;
సివఁగి మెకములతిండియు చివఁగియును సి
వంగియును సివ్వఁగియును చివ్వంగియనఁగ
ధర తరుక్షువుపేళ్లౌను దానవారి. 123

తెలివాయిమెకము, తెలిమెకము, పచ్చకన్నులమెకము, సింగము, బొల్చమెకము, వెడఁదమోముమెకము, తెల్లమెకము, మెకములఱేఁడు, ఏనికలగొంగ, బాకినోటిమెకము, బాకినోటి, రెంటద్రాగుడుతిండి, జడల

మెకము అనఁగా సింహామునకుఁ బేళ్ళు. కటికరసు, కడండి, కడతి అనఁగా గంధర్వమృగము బేళ్ళు. సిపగి, మెకములతిండి. చిపఁగి, సివఁగి సివ్వఁగి. చివ్వంగి అన తరుక్షువు బేళ్ళు.

క. పులి మువ్వన్నెమెకము బె
 బ్బులియును పసితిండి కోలుపులి వాలము చా
 అలమెకము వేఁగి దువ్వియు
 జలజాయతనేత్రియుగళ శార్దూలాఖ్యల్. 124

పులి, మువ్వన్నెమెకము, బెబ్బులి, పసితిండి, కోలుపులి, వాలము. చాఅలమెకము, వేఁగి, దువ్వి అనఁగ శార్దూలముపేళ్ళు.

క. చిఱుతపులి చిఱుతపురియన
 చిఱుతయు పొన్నాడ దువ్వి చిన్నపులియనన్
 వఱలెను చిత్రకనామము
 లఱమరలేక యె మురారి యసురవిదారీ. 125

చిఱుతపులి, చిఱుతపురి, చిఱుత, పొన్నాడ, దువ్వి, చిన్నపులి అనఁగా చిత్రకనామములగును.

ఆ.వె. శరభమునకుపేళ్లు చౌగంటియనఁగఁ జౌ
 గండ్లమెకమనంగఁ గలిగె; ఖడ్గ
 మృగముపేళ్లు కటికెమెకమన నడిదపు
 మెకమనంగ నొప్పె మేఘవర్ణ. 126

చౌగంటి, చౌగండ్లమెకము అనఁగా శరభమునకుఁ బేళ్ళు. కటికె మెకము, అడిదపుమెకము అనఁగ ఖడ్గమృగము పేళ్ళు.

ఆ వె. ఎలుఁగుబంటి యెలుఁగు నెల్లు నెలుగ్గొడ్డు
 పుట్టకూడుతిండి బొల్లిమోర

మెకము వెనుకచూపుమెకము నేదడి లేదు
పుట్టకాఁపు భల్లమునకుపేళ్లు. 127

ఎలుగుబంటి, ఎలుగు, ఎల్గు, ఎలుఁగ్గొడ్డు, పుట్టకూడుతిఁడి, బొల్లిమోర మెకము, వెనుకచూపుమెకము, ఏదడి, లేదు, పుట్టకాఁపు అనఁగ భల్లూకము పేళ్ళు.

గీ. వాలుమెక మేకలీడును పందికొమ్ము
కాఁడు చుల్లర మొంటరికాఁడు నొంటి
కాఁడు ముట్టెమెకంబనఁ గలిగెపేళ్లు
తెలుఁగున వరాహమునకౌను దేవదేవ. 128

వాలుమెకము, ఏకలీడు, పంది, కొమ్ముకాఁడు, చుల్లగము, ఒంటరికాఁడు, ఒంటికాఁడు, ముట్టెమెకము అనఁగా వరాహమునకు పేళ్ళు

కం. ములుపంది యేదుపందియు
సలు గాళుగ యేదనంగ శల్యకమునకా
ఖ్యలు; గురుబోతన గవయం
బలరెను; కేసరియు రోహితాఖ్య మురారీ. 129

ములుపంది, ఏదుపంది, సలుగు, ఆళుగ, ఏదు అనఁగా శల్యకమునకు పేళ్ళు. గురుబోతు అనఁగా గవయమునకు పేరు. కేసర అననగా రోహిత నామమగు.

ఆ వె. కారుపోతు దున్న కారెనుబోతెను
బోతు పోతు దున్నపోతు దుంత
నాఁగ సైరిభంబు; నక్క సగ్గారియు
వఱడు నరియుడన శివకును పేళ్లు. 130

కారుపోతు, దున్న, కారెనుబోతు, ఎనుబోతు, పోతు, దున్నపోతు. దుంత అనఁగా సైరిభము పేళ్ళు. నక్క, సగ్గారి, వఱడు, నరియుడు అనఁగా శివ అన జంబుకము పేళ్ళు.

గీ. కొమ్మతిప్పిమ్మరి క్రోతియు కొమ్మమేకము
చెట్టునట్టు మ్రాస్త్రిమ్మరి చింకలికక్క
తెఱులమేకము మలమనికి తెఱులమోర
మేకమనఁగ వానరాఖ్యలు మేఘవర్ణ. 131

కొమ్మ, తిమ్మరి, క్రోతి, కొమ్మమేకము, చెట్టునట్టు, మ్రాస్త్రిమ్మరి, చింకలికక్క, తెఱులమేకము, మలమనికి, తెఱులమోరమేకము అనఁగా వానరమునకు పేళ్ళు.

గీ. చెవులపిల్లి కుందేలును చెవులపోతు
నాఁగ కుందెలనఁగ శశనామపంక్తి;
చమరియగు జల్లిమేకమన సవరపుమేక
మనఁగఁ గుచ్చులమేకమన నాఖ్యలు హరి. 132

చెవులపిల్లి, కుందేలు, చెవులపోతు, కుందెలు అనఁగా శశకమునకు పేళ్ళు. జల్లిమేకము, సవరపుమేకము, కుచ్చులమేకము అనఁగా చమరీమృగము పేళ్ళు.

ఆ వె. లేటి యిఱ్ఱి జింక లేడి మేకంబన
హరిణమునకుఁ బేళ్లు; నాఁడుజింక
నాఁగ పిడిమేకంబునా లేటినా లేడి
నాఁగ స్త్రీహరిణమునకును బేళ్లు. 133

లేటి, ఇఱ్ఱి, జింక, లేడి, మేకము అనఁగా హరిణము పేళ్ళు. ఆడుజింక, పిడిమేకము, లేటి, లేడి అనఁగా స్త్రీహరిణము పేళ్ళు.

క. కడఁ జనఁగను కణఁజనఁగను
కడితియునాఁగ గణితియనఁగా గోకర్ణం;
బడకారు కొమ్ముమేకమును
ఘాడలమేకము దుప్పియన చమూరువుపేళ్లో. 134

కడఁజు, కణఁజు, కడితి, కణితి అనఁగా గోకర్ణమృగము పేళ్ళు. కారుకొమ్ము మేకము, పొడల మేకము, దుప్పి అనఁగా చమూరువు పేళ్ళు.

గీ. మనుఁను ముక్కొమ్ము మేకమును మను మేకంబు
మన్ను నంగను ఋష్యనామంబులయ్యె;
చీలి నాసియు పిల్లినాఁ జెల్లెపేళ్లు
ధరణి మార్జాలమునకును దానవారి. 135

మను, ముక్కొమ్ము మేకము, మను మేకము, మన్ను అనఁగా ఋష్యమృగము పేళ్ళు. చీలి, నాసి, పిల్లి అనఁగా మార్జాలము పేళ్ళు.

గీ. కమ్మపిల్లి కస్తురిపిల్లి కమ్మమేకము
పునుఁగుపిల్లియనంగను దనరె తెలుఁగు
నందు కస్తూరిమృగమున కాఖ్యలు; మెక
మనఁగ మెగమన మృగమున కాఖ్యలు హరి. 136

కమ్మపిల్లి, కస్తురిపిల్లి, కమ్మ మేకము, పునుఁగుపిల్లి అనఁగా కస్తూరిమృగము పేళ్ళు. మెకము, మెగము అనఁగా మృగము పేళ్ళు.

పంచపాది గీ. కొక్కునాఁగను గరిమిడికొక్కు పంది
కొక్కనఁగ మూషికాఖ్యలై నిక్కె; నెలుక
యెలిక యన మూషకము పేళ్లు చెలఁగె; కొండ
ముచ్చు కొండెంగయును కొండముసువు నాఁగ
దనరె ధరణి గోలాంగూలమునకు పేళ్లు 137

కొక్కు, గరిమిడికొక్కు, పందికొక్కు అనఁగా మూషికాఖ్యలు. ఎలుక, ఎలిక అన మూషకము పేళ్ళు. కొండముచ్చు, కొండెంగ, కొండముసువు అన గోలాంగూలము పేళ్ళు.

గీ. ఖురమగును గిట్ట డెక్కయు గొరిసె గొరిజ
యనఁగ; వాలంబునకు తోఁకయనఁగ మట్ట

నాఁగ; రోమంథము సేయునామసంజ్ఞ
నెమరుపెట్టు నెమర్చును నెమరుచనఁగ. 138

గిట్ట, డెక్క, గొరిసె, గొరిజ అనఁ ఖురమునకు పేళ్ళు. తోఁక, వట్టి అనఁగా వాలమునకు పేళ్ళు. నెమరుపెట్టు, నెమర్చు, నెమరుచు అన రోమంథము సేయుట పేళ్ళు.

క. నెలత్రాఁపుడనఁగ వెన్నెల
పులుఁగనఁగను చందమామపులుఁగు చకోరం
బలరెను; జక్కవయు గుడుసు
పులుఁగును జక్కవయు కోకమునకు నభిఖ్యల్. 139

నెలత్రాఁపుడు, వెన్నెలపులుఁగు, చందమామపులుఁగు అనఁ చకోరము పేళ్ళు. జక్కవ, గుడుసుపులుఁగు, జక్కవ అనఁ చక్రవాకము పేళ్ళు.

గీ. పావురంబును కూకీయు పారువంబు
పల్లటీ కూకియును నేలపల్లటీయు
పావురాయి లకోరీయు పార్వము బక
దారినాఁగను పారావతంబు పేళ్లు. 140

పావురము, కూకి, పారువము, పల్లటీ, కూకి, నేలపల్లటీ, పావురాయి, లకోరి, పార్వము, బకదారి అనఁగా పారావతము పేళ్ళు.

క. పులుకాసిపులుఁగు చదువుల
పులుఁగు చిలుక రామతమ్మ పూవిల్దొరక
త్తళమును చక్కెరతిండియు
పలుకుందత్తడి యనంగబరగె శుకాఖ్యల్. 141

పులుకాసిపులుఁగు, చదువులపులుఁగు, చిలుక, రామతమ్మ, పూవిల్దొరకత్తళము, చక్కెరతిండి, పలుకుఁదత్తడి అనఁగా శుకమునకు పేళ్ళు.

క. తలిరులతిండియనఁగ కో
యిలయనఁగను కెంపుకంటి యెసఁగెమఱియు కో
గెలయన పరితంబన కో
వెలయన ననమేపరియనఁ బికమున కాఖ్యల్. 142

తలిరుతిండి, కోయిల, కెంపుకంటి, కోగెల, పరితము, కోవెల, ననమే పరి అనఁగా కోకిలము పేళ్ళు.

ఆ వె. గోరువంక గోర గొరువంక గోర్వంక
సారె బట్టికాఁడు శారికయగు;
వానకోయిలయును వాననెచ్చెలియన
చాతకంబుపేళ్లు పాతకాంత. 143

గోరువంక, గోర, గొరువంక, గోర్వంక, సారె, బట్టికాఁడు అనఁగా శారిక పేళ్ళు. వానకోయిల, వాననెచ్చెలి అనఁగా చాతకమునకు పేళ్ళు.

ఆ వె. అజ్జవాలు కోడియగు మెట్టవాల్పిట్ట
యనఁగ కుక్కుటమున కాఖ్యలయ్యె;
పెగ్గురును వలికియు బెగ్గురు వానకో
యిలయు సారసమున కెసఁగె శౌరి. 144

అజ్జవాలు, కోడి, మెట్టవాల్పిట్ట అనఁగా కుక్కుటము పేళ్ళు. పెగ్గురు, వలికి, బెగ్గురు, వానకోయిల అన సారసపక్షి పేళ్ళు.

క. కలహంసాభిఖ్యలు హరి
తెలుఁగుననగు తూఁడుఁదిండి తెలిపిట్ట యనం
దొలకరిసూఁడును తెలినెఱి
పులుఁగును మఱి వానజాలిపులుఁగంచ యనన్ 145

తూఁడుతిండి, తెలిపిట్ట, తొలకరిసూఁడు, తెలినెఱిపులుఁగు, వానజాలిపులుఁగు, అంచ అనఁగా కలహంసము పేళ్ళు.

ఆ వె. రాజహంసమౌను రాయంచనా; టిట్టి
భమునకౌను లకుముకి; మఱియును క
పోతమౌను గువ్వ పొల్లపార్వ మ్మన;
లావుకంబు పేరు లావుకయన. 146

రాయంచ అన రాజహంసము పేరు. లకుముకి అన టిట్టిభము పేరు. గువ్వ, పొల్లపార్వము అన కపోతము పేళ్ళు. లావుక అనఁగా లావుకము పేరు.

గీ. బొల్లికోడియు బుడకోడి పుల్లికోడి
గుడ్డఁగి చిలవనా జలకుక్కుటాఖ్య
లగును; గండభేరుండాఖ్యలగు నిరుదల
పులుఁగు దుగమోములపులుంగు నలరె శౌరి. 147

బొల్లికోడి, బుడకోడి, పుల్లకోడి, గుడ్డఁగి, చిలవ అనఁగా జలకుక్కుటము పేళ్ళు. ఇరుదలపులుఁగు, దుగమోములపులుఁగు అన గండభేరుండము పేళ్ళు.

ఉ. నట్టువు పక్కినా నమిలినాఁగను నమ్మియు కప్పుగొంతుమేల్
పిట్టయు నెమ్మినా నెమిలిపిట్టయనన్ పురిపుల్గునా మఱిన్
నట్టుపులుంగు నెమ్మిలియునాఁగను పించెపుకుంచెపిట్టనా
జుట్టుపులుంగునాఁగ మధుసూధన బర్హికి నామధేయముల్.

నట్టువుపక్కి, నమిలి, నమ్మి, కప్పుగొంతుమేల్పిట్ట, నెమ్మి, నెమిలి, పురిపుల్గు, నట్టుపులుంగు, నెమ్మిలిపిట్ట, పించెపుకుంచెపిట్ట, జుట్టుపులుఁగు అనఁగా మయూరము పేళ్ళు.

క. పించియమన పురియనఁగా
పించెంబన పింఛమునకు పేళ్లు; బకాఖ్యల్
కొంచయును కొక్కరాయన
కొఱ్ఱించయనన్ వక్కపులుఁగు కొంగయన హరీ. 149

పించియము, పురి, పించెము అనఁగా పింఛమునకు పేళ్ళు. కొంచ, కొక్కరాయి, కొఱ్ఱించ, వక్కపులుఁగు, కొంగ అనఁగా బకమునకు పేళ్ళు.

గీ. కాకి గుమికాఁడనంగను కాకమునకు
గలిగె; రాపుల్గు రాబందు కంకమునకు:
కోటడును గ్రుడ్లగూబయు కొరడు పలుఁగు
పిట్టయన ఘూకమునకగు పేళ్లు శౌరి. 150

కాకి, గుమికాఁడు అనఁగా కాకమునకు పేళ్ళు. రాప్రల్లు, రాబందు అన కంకము పేళ్ళు. కోటడు, గుడ్లగూబ, కొరడు, పలుఁగుపిట్ట అనఁగా ఘూకమునకు పేళ్ళు.

గీ. పైఁడికంటియు సకినాలపక్కి గుబిలి
గుమిలినాఁగను కనకాక్షికమరె; గిజ్జి
గాఁడు పచ్చపిట్టయు గిజిగాడునా హా
రీత; తిత్తిరికిని పేరు తీతువనగ. 151

పైడికంటి, సకినాలపక్కి, గుబిలి, గుమిలి అనఁగా కనకాక్షికి పేళ్ళు. గిజ్జిగాడు పచ్చపిట్ట, గిజిగాడు అన హారీతము పేళ్ళు. తీతువుఅనఁగా తిత్తిరపక్షి పేరు.

సీ. ఏటిరింతయునంగ నేట్రింతనాఁగ మం
గలపిట్ట నల్లచ్చిగాఁడనంగ
నలరె; భారద్వాజమై భువి కుమ్మరి
గువ్వ కాటుకపిట్ట యువ్వఁబులుఁగు
ఖంజరీటము; కంజు కొఁజు కముజన కపిం
జలము; కేరజమన కేర్జమౌను;
జావడం బకుజును జాలియ నేలాఁవు
జాలె యోరణమును సాళువంబు

గీ. సాళ్వమణుజును లగడును సారణంబు
బాజు చెంచడము కురుజు బైరి వైల

గిడ్డియును వేసడంబును గిద్దనంగ
శ్యేనభేదంబులకుఁ బేళ్ళు శేషశయన. 152

ఏటిచింత, ఏటిగ్రింత, మంగలపిట్ట, నల్లిచ్చిగాడు అన భారద్వాజము పేళ్ళు. కుమ్మరిగువ్వ, కాటుకపిట్ట, ఉవ్వంబుల్లు అనఁగా ఖంజరీటము పేళ్ళు. కౌజు, కౌఁజు, కముజు అనఁగా కపింజలము పేళ్లు. డేగ అన శ్యేనము పేరు. జావడము, అడుజు, జాలియ, ఏలాఁపు, జాలె, ఓఁబాను, సాళువము, సాళ్వము, అణుజు, లగడు, సాళ్వాను, బాజు, చెంచాడము, సరుజు, బైరి, నైల, గిడ్డి, వేసడము, గిద్దు, అనఁగా శ్యేనవిశేషముల పేళ్ళు.

సీ. భరతపక్షికి పేళ్ళు బొంగెను కూఁకటి
గుడ్డంగి కూఁకటికువ్వ నుఱియు
కూఁకటిమూఁగనాఁ గూజాను; కారండ
వమునకు కన్నెలేడి మఱికరడు
కల్లేడునాఁగను జెల్లె; నింకను కళిం
గము పేళ్ళు కైజన కైదునాఁగ
నుల్లంకి కక్కెర యుల్లాము చిందచీ
పురుపిట్ట దోరువా పరజు చీఁద
గీ. యనఁగ పక్షివిశేషంబులౌను; కంక
ణాయి మోదెకొండుకు కంకణంబునోడె
కొంగ యాడేలడెలునా విహంగపతిర
థాంక! యగు జలపక్షిభేదాఖ్యలవని. 153

కూఁకటిగుడ్డంగి, కూఁకటికువ్వ, కూఁకటిమూఁగ అన భరతపక్షికి పేళ్ళు. కన్నెలేడి, కరడు, కల్లేడు అనఁగా కారండవము పేళ్ళు. కైజు, కైదు అనఁగ కళింగపక్షికి పేళ్ళు. ఉల్లంకి, కక్కెర, ఉల్లాము, చింద, చీపురుపిట్ట, దోరువా. పరజు, చీఁద అన పక్షివిశేషములు. కంకణాయి,

ఓదెకోలుకు, కంకణము, ఓదెకొంగ, ఆడేలు, అడెలు అనఁగా జః పక్షి విశేషములు.

క. పిట్ట యనం బులుఁగన నిరు
పుట్టావు పక్కియన గుడ్డుపుట్టువనఁగ గూ
డుబట్టువన గూడుకాన్పన
దిట్టరి హరి! పక్షిపేళ్ళు తెనుగునవెలసెక్. 154

పిట్ట, పులుఁగు, ఇరుపుట్టువు, పక్కి, గుడ్డుపుట్టువు, గూడుకానుపు, గూడుకాన్పు, అనఁగ పక్షికి పేళ్ళు.

గీ. తేఁటియును మొగరంబంబు తేనెతిండి
జంటముకాలి తుమ్మెద సంజ్ఞ భ్రమర
మునకు; మిడుఁగుఱు మిణుఁగుఱుబురువు మిణుఁగు
అనఁగ ఖద్యోతమున కభిఖ్యలు మురారీ. 155

తేఁటి, మొగరంబము, తేనెతిండి, జంటముకాలి, తుమ్మెద అనఁగా భ్రమరమునకు పేళ్ళు. మిడుఁగుఱు, మిణుఁగుఱుబురువు, మిణుఁగుఱు అన ఖద్యోతమునకు పేళ్ళు.

గీ. గబ్బిడాయియు జిబ్బటీ గబ్బిలాయి
జిబ్బిడాయియు గబిలంబు గబ్బిలంబు
తైలపాయి కభిఖ్యలైతనరె; నీవ
యీఁగ యన మక్షికాఖ్యలౌ నింద్రరక్ష. 156

గబ్బిడాయి, జిబ్బటీ, గబ్బిలాయి, జిబ్బిడాయి, గబిలము, గబ్బిలము అనఁగా తైలపాయికకు పేళ్ళు. ఈవ, ఈఁగ అన మక్షికపేళ్ళు.

క. ఉరిడె యనంగను కుమ్మరి
పురుగన మృత్కీటమౌను; భువి ఝుల్లికపే

రరయ యిలకోడి చిమ్మట
పురువనఁగను మఱియు నీల పుర్వన శౌరీ. 157

ఈరిడె, కుమ్మఁపురుగు అనఁగా మృత్తికాటము పేళ్ళు. ఇలకోడి, చిమ్మటపురువు, ఈలపుర్వు అన ఝుల్లిక పేళ్ళు.

ఆ. వె. పురుషమృగము పోతు; పురుషపక్షికి పుంజు
చెల్లు; పెంటి పిడియు స్త్రీమృగంబు;
పెట్టనాఁగ వెలసె పేరు స్త్రీపక్షికి
విమలకమలనేత్ర వేదపాత్ర. 158

పోతు అన పురుషమృగము పేరు. పుంజు అనఁగా పురుషపక్షికి పేరు. పెంటి, పిడి అనఁగా స్త్రీమృగము పేర్లు. పెట్ట అనఁగా స్త్రీపక్షికి పేరు.

ఆ. వె పిలుక కొదమ బోద పిల్లనా శిశువౌను;
జోడు దొందు దోయి జోక కవయు
యుగ్మమౌను; ద్వంద్వయుతమౌను జతగూడు
పెంటిపడును మఱియు దంటకట్టు. 159

పిలుక, కొదమ, బోద, పిల్ల అనఁగా శిశువునకు పేళ్ళు. జోడు, దొందు, దోయి, జోక, కవ అన యుగ్మమునకు పేళ్ళు. జతఁగూడు, పెంటిపడు, దంటకట్టు అనఁగా ద్వంద్వమగుట పేళ్ళు.

క. దంటయు సంగడి జమిలియు
జంటయు నుద్ది కవ నెట్టె జతయును గెడయుఁ
పొంటయునఁ సంగతమన
మింటియుడుగు వేల్పు! తోఁచె మిథునము పేళ్లై. 160

దంట, సంగడి, జమిలి, జంట, ఉద్ది, కవ, నెట్టె, జత, గెడ, పొంట, సంగతము అనఁగా మిథునము పేళ్ళు.

గీ. మిట్టిపడు మిడిమేలంబు మిడిసిపడన
నాంధ్రమున నుద్గమించుటకొను; తొంగు
నాఁ దొరంగన తొంగలినాఁగ తొరఁగు
ననఁగ వ్రాలన సండీర్ణమునకు బేళ్ళు. 161

మిట్టిపడు, మిడిమేలము, మిడిసిపడు అనఁగా ఉద్గమించుట పేళ్ళు. తొంగు, తొరంగు, తొఁగలి, తొరఁగు, వ్రాలు అన సండీర్ణమునకు పేళ్ళు.

గీ. ఎగు రెవయు నుం కొడియు నెగ వెగయు దూఁటు
కొను నెగయు దెంచు పల్లటీల్గొను నెగయును
మిట్టు పల్లటీల్ వైచును మిడియు పల్ల
టీలుదాటన నుద్గమాఖ్యాళి శౌరి. 162

ఎగురు, ఎవయు, ఉంకు, ఒడియు, ఎగవు, ఎగయు, దూఁటుకొను, ఎగయుదెంచు, పల్లటీల్గొను, ఎగయు, మిట్టు, పల్లటీల్వైచు, మిడియు, పల్లటీల్ దాటు అనఁగా ఉద్గమను (ప్రడీనము) పేళ్ళు,

గీ. రెక్క చెట్టుప చట్టుప ఱెక్క రేకు
గఱి నెఱి నెరక గరుదభిఖ్యలగు; ఱేకు
లాఁక గోటాపనయు మఱి యీఁకయనఁగ
పత్త్రమగు; లావు లవిటినా బక్షతి యగు. 163

రెక్క, చెట్టుప, చట్టుప, ఱెక్క, రేకు, గఱి, నెఱి, ఎరక అన గరుత్తు పేళ్ళు. ఱేకు, లాఁక, గోటాపన, ఈఁక అనఁగా పత్త్రము పేళ్ళు. లావు, లవిటి అన పక్షతి పేళ్ళు.

గీ. ముక్కనఁగ చంచువగు; నీఁక చిక్కన నెఱి
యనఁగ ఛదపాళిసంకీర్ణమగును; మేఁత
పొంగిలి యనంగ నాహారమునకుఁ బేళ్లు;
నారెనా గోరనంగ నఖాఖ్యలొను. 164

ముక్కు అన చంచువు పేళ్ళు. ఈఁకచిక్కు, రెటి అనఁగా ఛదపాళిసంకీర్ణము పేళ్ళు. మేఁత, ఐఁగిలి అనఁగా పక్షుల ఆహారము పేళ్ళు. ఆరె, గోరు అన నఖరము పేళ్ళు.

గీ. అంతు రొదయు హళాహళి జంపనంగ
కలకలధ్వనిపేళ్ళు; అంపిలునన రొద
సేయు అంతిల్లు నా ధ్వనిసేయుట; పొది
పదుపునా స్వజాతిగణంబు పరిమపుకుమ. 165

అంతు, రొద, హళాహళి, జంపు అనఁగా కలకలధ్వని పేళ్ళు. అంపిల్లు, రొదసేయు, అంతిలు అన ధ్వనిసేయుట పేళ్ళు. పొది, పదుపు అన స్వజాతిగణము పేరు.

సీ. అట్టియ గుమి గమి యంట జంజా దాటు
కూటువ కూటువు గుబురు గుములు
తుటుము తుట్టియ తొగ త్రుట్టియ తెగ తెవ
దండు తోలా పరి దడము తుటుము
కదుపు చేరువ తుట్టె గడ పొది బింకొంబు
మూఁక సంగడి పిండు ముంపు లేక
తెరలిక దిమ్మన బరగె సమూహంబు;
కుప్ప కూటువ కువ్వ లప్ప తెప్ప
గీ. కుఱుకు తిట్టయు దోరయు కువయు లొద్ద
పోగు ప్రోకయు వామియు ప్రోగనంగ
నొప్పె రాశికి; కుప్పంబు కుప్పతిల్లు
కుప్పఁగూర యనఁగ రాశిగూడుటకును. 166

అట్టియ, గుమి, గమి, అంటు, దాటు, కూటువ, కూటువు, గుబురు, తుటుము, తుట్టియ, తొగ, త్రుట్టియ, తెగ, తెవ, దండు

తోలా, పఱి, దడము, తుటుము, కదుపు, చేరువ, తట్టె, గడ, పోఁడి, బిందెము, మూఁక, సంగడి, పిండు, ముంపు, లేక, తెరలిక, దిమ్మ అనఁగా సమూహముపేళ్ళు. కుప్ప, కూటువ, కువ్వ. లప్ప, తెప్ప, కుఱుకు, తిట్ట, దోర, కువ, లొద్ద, ప్రోవు, పోరిక, వామి, ప్రోగు అనఁగా రాశికిపేళ్ళు. కుప్పము, కుప్పతిల్లు కుప్పఁగూర అన రాశిఁగూడుటకుపేళ్ళు.

గీ. గబ్బులుంగన సకినాలగ్రద్దనాఁగ
సకినపు పులుంగనంగను శకునపక్షి
భేదములకయ్యె తెలుఁగున నాదితేయ
దుర్గనుతపాద! సింహాదివర్గముగిసె. 167

గబ్బులుఁగు, సకినాలగ్రద్ద, సకినపుపులుఁగు అనఁగా శకునపక్షివిశేద్యములకుబేళ్ళు.

సింహాదివర్గముగిసెను.

---

# మనుష్యవర్గు

క. మగడనఁగను మగవాఁడన
మగబుట్టువు మొగయనంగ మానిసియనఁగా
నెగడె మనుష్యునకును పే
రగు; పజయన ప్రజకునామ మానుముగారీ. 168

మగఁడు, "రూ॥ మొగ, మగవాఁడు, మొగబుట్టువు, మానిసి అనఁగా మనుష్యునిపేళ్ళు. పజ అన ప్రజకుపేరు.

సీ॥ మాలిక. అతివ పొలంతుక యాఁడది యాఁడుది
యాఁటది యుగ్మలియన్ను కన్నె
యింతి యువిద మెల్త యెలనాగ పయిదలి
కొమ్మ కొమిరె కొమ యెమ్మెలాడి
చెలియ గుబ్బెత చెలి చెల్వ చేడియ చేడె
చాన కన్నియ కల్కి చామ చెలువ
తొయ్యలి నెలఁతుక తోయలి పడఁతుక
నవలా నవల పొల్తి నాతి గోతి
పడఁతి తెఱవ బోటి పైదలి నాతుక
పొలఁతుక నెలఁతయు పొలఁతి మగువ
మెల్తుక పొల్తుక నెలఁత మెలంతుక
వలఁతి బిత్తరి లేమ వెలఁది జోటి
గీ. ముదిత ముద్దియ మడఁతుక ముదియ మడఁతి
సకియ వెలఁదుక జోటిక సకి మడంతి
యనఁగ తెలుఁగున స్త్రీలనామాళి వెలసె
భస్మమృదుచేల మునిలోల ధర్మశీల. 169

అతివ, పొలంతుక, ఆఁడది, ఆఁడుది, ఆఁటది, ఉగ్మలిక, అన్ను, కన్నె ఇంతి, ఉవిద, మెల్త, ఎలనాగ, పయిదలి, కొమ్మ, కొమిరె, కొమ, ఎమ్మెలాడి, చెలియ, గుబ్బెత, చెలి, చెల్వ, చేడియ, చేడె, చాన, కన్నియ, కల్కి, చామ, చెలువ, తొయ్యలి, నెలఁతుక, తోయలి, పడతు, నవలా, నవల, పొల్తి, నాతి, గోతి, పడఁతి, తెఱవ, బోటి, పైదలి, నాతుక, పొలఁతుక, నెలఁత, పొలఁతి, మగువ, మెల్తుక, పొల్తుక, మెలఁత, మెలంతుక, వలఁతి, బిత్తరి, లేమ, వెలఁది, జోటి, ముదిత, ముద్దియ, మడఁతుక, ముదియ, మడఁతి, సకియ, వెలఁదుక, జోటిక, సకి, మడంతి అనఁగా స్త్రీలకుపేళ్ళు.

సీ. అందకత్తె యొయారి యలరుఁబోఁడి మిటారి
యొయ్యారి యోయారి యొప్పులాడి
కొమరాలు జవరాలు కులుకులాడియు మచ్చె
కంటి వాలుగకంటి కలువకంటి
తెలిగంటి వాల్గంటి తీఁగబోఁడియు లేడి
కంటి యొప్పులకుప్ప క్రాలుఁగంటి
చిల్కులకొలికియు చిగురుబోఁడియు తమ్మి
కంటియు లతకూన కపురగంది
గీ. ముద్దులాడియు సింగారి ముద్దుగుమ్మ
మించుబోఁడియు ననబోఁడి మెఱుఁగుఁబోఁణి
చిన్నెలాడి యొఱపులాడి వన్నెలాడి
యనఁగ స్త్రీవిశేషాఖ్యలౌ నమరవినుత. 170

అందకత్తె, ఒయార, అలరుబోఁడి, మిటారి, ఒయ్యారి, ఒయారి, ఒప్పులాడి, కొమరాలు, జవరాలు, కులుకులాడి, మచ్చెకంటి, వాలుకంటి, కలువకంటి, తెలిఁగంటి, వాల్గంటి, తీఁగబోడి, లేడికంటి, ఒప్పులకుప్ప, క్రాలుఁగంటి, చిల్కులకొలికి, చిగురుబోఁణి, తమ్మికంటి, తకూన, కపురగంది, ముద్దులాడి, సింగారి, ముద్దుగుమ్మ, మించుబోఁణి. ననబోఁడి, మెఱుఁగుబోఁడి, చిన్నెలాఁడి, ఒఱపులాడి, వన్నెలాడి అనఁగా స్త్రీవిశేషణనామములు.

క. అయిదువరా లైదువ ము
త్తయిదువ ముత్తో యనంగ నగును చిరంట్యా
హ్వాయములిల; పేరఁటాలు న
రయ జక్కిని నాఁగ మృతచిరంటికభిఖ్యల్ 171

అయిదువరాలు, ఐదువ, ముత్తైదువ, ముత్తో అనఁగా సువాసినికి పేళ్లు. పేరంటాలు, జక్కిని అనఁగా మృతసువాసినికి పేళ్లు.

గీ. జాణత గయ్యాళి గయాళి జంత గట్టి
వాయి గొంటియనఁగ ధూర్తవధువగు; జవ
రాలు నా జవ్వనియు కొమరాలనంగ
యౌవనస్త్రీ కభిఖ్యలౌ సరసిజాక్ష.                172

జాణత, గయాళి, గయ్యాళి. జంత, గట్టివాయి, గొంటు అన ధూర్తస్త్రీ పేళ్ళు. జవరాలు, జవ్వని, కొమరాలు అనఁగా యౌవనస్త్రీ పేళ్ళు.

గీ. ముగ్ధ ముఁగుదయు ముద్దరాల్ ముగ్ధపేళ్లు
కన్నియ పడుచు చిఱుతుక కన్నె గోల
కన్యకాఖ్యలగును; వంజకత్తె గొంజ
కత్తె గొడ్డుది నా వంధ్య కమలనాభ.                173

ముగ్ధ, ముఁగుద, ముద్దరాలు అనఁగా ముగ్ధకు పేళ్ళు. కన్నియ, పడుచు, చిఱుతుక, కన్నె, గోల అన కన్యక పేళ్ళు. వంజకత్తె, గొంజకత్తె, గొడ్డుకత్తె అనఁగా వంధ్యకు పేళ్ళు.

గీ. రాణివాసంబనంగను రాణివాసి
యనఁగ నంతఃపురస్త్రీకి నలరెను; దొర
సాని దేవేరి దేవెరి రాణి దుండి
నాఁగ రాజమహిషిపేళ్లు నలిననాభ.                174

రాణివాసము, రాణివాసి అనఁగా అంతఃపురస్త్రీకి పేళ్ళు. దొరసాని, దేవేరి, దేవెరి, రాణి, దుండి అన రాజమహిషి పేళ్ళు.

గీ. గట్టువాలన సైరంధ్రి; కుట్టనికిని
కుంటనియు పొంతకత్తె నాఁ గూడె పేళ్లు;
తాపికత్తియనాఁగ సంధానవధువు;
దొడవనాఁగ కురూపియౌ జడధిశయన.                175

గట్టువాలు అన సైరంధ్రిపేరు. కుంటని, పాంతకత్తె అన కుట్టనిపేళ్ళు. తాపికత్తె అనసంధానస్త్రీపేరు. దొడవ అన కథూపిపేరు.

గీ. ఇలను హెగ్గడికత్తియ హెగ్గడియును
పక్కిరాలు నంతఃపురపాలనియగు;
చదుర చదురాలును సమగ్రవధువుపేళ్లు;
దూతికకు జూజి యెడకత్తె ఖ్యాతిమీఱె. 176

హెగ్గడికత్తె, హెగ్గడి, పక్కిరాలు అనఁగా అంతఃపురపాలనిపేళ్ళు. చదుర, చదురాలు అన సమగ్రురాలిపేరు. జూజి, ఎడకత్తె అన దూతిపేళ్లు.

క. చెలికత్తె జోటికత్తియ
చెలి సకియయు బోటికత్తె చెల్మివెలఁదియుం
జెలిమరి గమికత్తియ సకి
చెలఁగెను సఖికాహ్వయములు శేషశయానా. 177

చెలికత్తె, జోటికత్తియ, చెలి, సకియ, బోటికత్తె, చెల్మివెలఁది, చెలిమరి, గమికత్తియ, సకి అనఁగా సఖికిపేళ్ళు.

గీ. పారికయు దాసురాలును బానిసయును
తొత్తనఁగ దాసియగు; తాఁటకత్తె మోస
కత్తెయన వంచనాకృతకాంత పేళ్లు;
కుంకయన బాలవిధవయౌ పంకజాక్షి. 178

పారిక, దాసురాలు, బానిస, తొత్తు అనఁగా దాసికిపేళ్ళు. తాఁటకత్తె, మోసకత్తె అనఁగా వంచనాకృతస్త్రీకిపేళ్ళు. కుంక అన బాలవిధవపేరు.

క. మేలరి గరితయు క్రొత్తడి
వాలెంబు పతివ్రతయగు; బాలెంతయనఁగ

బాలెంతరాలనఁగ పురు
టాలనఁగ బ్రసూతకాఖ్యలగును మకుటంబా. 179

మేలరి, గరిత, క్రొత్తడి అనఁగా పతివ్రతపేళ్లు. బాలెంత, బాలెంతరాలు, పురుటాలు అన ప్రసూతిపేళ్ళు.

గీ. చెడిప దిచ్చరి నసఁగూటి చెనఁగు జసివి
అంతులాడియు అంకెత తాఁగ నను పు
కత్తె విటుకులాడియు విటకత్తె అంతు
టాలు మిండతె జారిణికాఖ్యలు హరి. 180

చెడిప, దిచ్చరి, నసఁగూటి, చెనఁగు, జసివి, అంతులాడి, అంకెత, తాఁగ, ననుపుకత్తె, విటుకులాడి, విటకత్తె, అంతుటాలు, మిండతె అన జారిణిపేళ్ళు.

క. తెనఁగునగు మగడనఁగను
పెనిమిటియన సామియనఁగ పెన్మిటియన తే:
డన నొడయండన నోడయుం
డన భర్తకుపేళ్ళు వినుత హంసతురంగా. 181

మగడు, పెనిమిటి, సామి, పెన్మిటి, తేఁడు, ఒడయఁడు, ఒడయుఁడు అన భర్తకుపేళ్ళు.

గీ. ఆలు పెండ్లాము పెండ్లమిల్లాలు గరిత
రాణి ప్రోయాలనఁగ భార్యకౌను; తోడి
కోడ లేరాలు యాత్రాఖ్యకోటికగు; స
వతియు సవతాలునాఁగ సపత్నిశౌరి. 182

ఆలు, పెండ్లాము, పెండ్లము, ఇల్లాలు, గరిత, రాణి, ప్రోయాలు అన భార్యపేళ్ళు. తోడికోడలు, ఏరాలు అన యాతకుపేళ్ళు. సవతి, సవతాలు అన సపత్నిపేళ్ళు

గీ. అమ్మ యమ యవ్వ యవ యప్ప యపయు తల్లి
తాయి తలి నాఁగ జననియౌ; తండ్రి యయ్య
యప్ప యయ తండిరియు నప యబ్బ పితరుఁ
డన బితృవు; భ్రాతృవున కన్న యనయు శౌరి. 18

అమ్మ, అమ, అవ్వ, అవ, అప్ప, అప, తల్లి, తాయి, తలి అ
జననికి పేళ్ళు. తండ్రి, అయ్య, అప్ప, అయ, తండిరి, అప, అబ్బ, పితరుఁడు
అన జనకునకుఁ బేళ్ళు. అన్న, అన అనఁగ భ్రాతృనిఁ బేళ్ళు.

గీ. తోడబుట్టు తోఁబుట్టు సైదోడు తమ్ముఁ
డన సహోదరుఁడగు; నప్ప యక్క యపయు
నాఁగ జ్యేష్ఠభగినిపేళ్ళు; నాగశయన!
దాది దాదిలియన స్తన్యదాయిజనని. 18

తోడబుట్టు, తోఁబుట్టువు, సైదోడు, తమ్ముఁడు అన సహోదరునిఁ బేళ్ళు
అప్ప, అక్క, అప అనఁగా జ్యేష్ఠభగిని పేళ్ళు. దాది, దాదలి అన ధాత్రికి పేళ్ళు

గీ. చెల్లియలును తోఁబుట్టువు చెల్లె లాఁడు
తోఁడు చెలియలు చెల్లె సైదోడనంగ
సోదరికి పేళ్లగును; తోఁడిచూలు తోఁడు
నాఁగ సహజన్మునకుపేళ్ళు నలిననాభ. 18

చెల్లియలు, తోఁబుట్టువు, చెల్లెలు, ఆఁడుతోడు, చెల్లియలు, చెల్లె, సై
దోడు అనఁగా సోదరికి పేళ్ళు. తోఁడిచూలు, తోఁడు అనఁగా సహజను
నకు పేళ్ళు.

క. పట్టి కొమారుఁడు కొమరుఁడు
బొట్టె కొడుకు కుఱ్ఱ కూన బొట్టియుఁడును తో

పుట్టువు బిడ్డఁడు కుఱ్ఱఁడు
బొట్టియ బిడ్డ యనఁ వెలసె పుత్రునిపేళ్లై 186

పట్టి, కొమారుఁడు, కొడుకుఁడు, బొట్టె, కొడుకు, కుఱ్ఱ, కూన, బొట్టియఁడు, మేపుట్టువు, బిడ్డఁడు, కుఱ్ఱఁడు.బొట్టియ.బిడ్డ అనఁగా పుత్రునకు పేళ్ళు.

గీ. కూతురు కొమార్త కొమరిత కూన కూఁతు
పట్టి మేపుట్టువు కొమారి బొట్టె యాఁడు
బిడ్డ కన్నె కొమారిత బిడ్డయనఁగ
జెల్లె పుత్రికాభిఖ్యలై శేషశయన. 187

కూతురు, కొమార్త, కొమరిత, కూన, కూఁతు పట్టి, మేపుట్టువు, కొమారి, బొట్టె, ఆఁడుబిడ్డ, కన్నె, కొమారిత, బిడ్డ అనఁగా పుత్రికకు పేళ్ళు.

ఆ.వె అల్లువాఁడనంగ నల్లుఁడనంగ జా
మాతృసంజ్ఞ; మామ మాతులుండు
తాతనాఁగ తండ్రితండ్రియనఁగ పితా
మహుని కాఖ్యలౌ రమాహృదీశ. 188

అల్లువాడు, అల్లుఁడు అనఁగా జామాతృ పేళ్ళు. మామ అన మాతులుని పేరు. తాత, తండ్రితండ్రి అనఁగా పితామహుని పేళ్ళు.

గీ. జగిలెడన సడ్డకుండన జగిలెకాఁడు
నాఁగ మఱి తోఁడియల్లుండునాఁగ షడ్డ
కాఖ్యలౌ; బావ యన దేవరాఖ్య; వదినె
నాఁగ భ్రాతృజాయ; మఱఁదినాఁగ స్యాల. 189

జగిలెడు, సడ్డకుఁడు, జగిలెకాఁడు, తోఁడియల్లుఁడు అన షడ్డకుని పేళ్ళు. బావ అన దేవరకు పేరు. వదినె అన భ్రాతృభార్యకు పేరు. మఱఁది అన స్యాలనామము.

గీ. చూలు వేఁకటి కరువును చూఁడి నాఁగ
గర్భిణికి పేళ్లు; ప్రసవాఖ్య కానుపౌను;
గర్భమందలియిచ్ఛకు పేరు గంట్లమౌను;
సంతతినంగ సంతానమౌ సత్యశీల. 190

చూలు, వేఁకటి, కరువు, చూఁడి అనఁగా గర్భిణికి పేళ్లు. కానుపు అనఁగ ప్రసవము పేరు. గంట్లము అన గర్భమందలియిచ్ఛకు పేరు. సంతు అనఁగా సంతానము పేరు.

గీ. వెలసె బయ్యంకలనఁగ వేవిళ్లనంగ
దౌహృదము; రజస్వలకగు తలగు ముట్టు
చెఱఁగుమాయు ననఁగఁ బేళ్లు జెల్లె; మావి
నాఁగ గర్భాశయము పేరు నలిననాభ. 191

బయ్యంకలు, వేవిళ్లు అనఁగా దౌహృదము పేళ్లు. తలగు, ముట్టు చెఱఁగుమాయు (ఋతుమతి) అనఁగా రజస్వలకు పేళ్లు. మావి అన గర్భాశయము పేరు.

ఆ.వె. పాప బుడుత బిడ్డ పట్టి బురుక కందు
కుఱ్ఱ కున్న సిసువు కూన నిసుగు
నిసువునా శిశువగు; కసుగందు నెఱగందు
చూలి పూప తరుణ శిశువుపేళ్లు. 192

పాప, బుడుత, బిడ్డ, పట్టి, బురుక, కందు, కుఱ్ఱ, కున్న, సిసువు, కూన, నిసుగు, నిసువు అన శిశువుపేళ్లు. కసుగందు, ఎఱ గందు, చూలి, పూప అన తరుణశిశువుపేళ్లు.

ఉ. బొట్టెఁడు పిల్లకాయ చొఱ బోడిక కొండొక పైద కింగణా
బొట్టియ పాపఁడున్ పసుచు బుర్కఁడు కొండిక పిల్లగాఁడనన్

క. ముదిమియనఁగ కారనఁగను
ముదుసలినా ముసలినాఁగ ముదుకయనంగన్
ముదినాఁగను వృద్ధాప్యము
పొదిగొనె; నన్నగళ యన నపుంసకుఁడు హరీ. 197

ముదిమి, కారు, ముదుసలి, ముసలి, ముదుక, ముది అనఁగా వృద్ధాప్యముపేళ్ళు. అన్నగళ అన నపుంసకునిపేరు.

గీ. కోడెకాఁడన బొజుఁగన కోడెనాఁగ
జుమ్మడన నన్నుకాఁడన జుమ్మకాఁడు
నాఁ జెలువుఁడన మిండఁడు నాఁగ వెచ్చ
కాఁడు విటకాఁడునా విటాఖ్యలు ముకుంద. 198

కోడెకాఁడు, బొజుఁగు, కోడె, జుమ్మడు, నన్నుకాఁడు, జుమ్మకాఁడు, చెలువుఁడు, మిండఁడు, వెచ్చకాఁడు, విటకాఁడు అన విటునకు పేళ్ళు.

గీ. తొత్తు వెలయాలు వేసుకకత్తె లంజ
యాటవెలఁది రోవెలదియు నాటకత్తె
గడనకత్తె గణకత్తె పడపుఁగొమ్మ
వేల్పుబానిస లంజెత వేశ్యపేళ్ళు 199

తొత్తు, వెలయాలు, వేసుకకత్తె, లంజె, ఆటవెలఁది, రోవెలఁది, ఆటకత్తె, గడనకత్తియు, గణనకత్తె, పడపుఁగొమ్మ, వేల్పుబానిస, లంజెత అన వేశ్యకుపేళ్ళు.

గీ. తొండద తొందు లందయు దొడ్డు తుందిలాఖ్య
లౌను; బంబోతునా మొక్కుఁడన బలసిన

వాఁడనంగ స్థూలాంగుఁడౌ బక్కవాఁడు
బక్కనాఁగ కృశాంగుఁడౌ పద్మనేత్ర. 200

తొంద, తోఁదు, లంద, బొద్దు అనఁగా తుందిలునిపేళ్ళు. బంబోతు, మొక్కడు, బలసినవాఁడు అనఁగా స్థూలాంగునిపేళ్ళు. బక్కవాఁడు, బక్క అన కృశాంగునిపేళ్ళు.

క. ఆబూతికాఁడు తిండీ
డాబూతీఁడు పెనుతిండి హాఁబూతియు నా
నాబూతి తిండిపోతన
నాఁబడె నతిభక్షకునకు నాఖ్యలు శౌరీ. 201

ఆబూతికాఁడు, తిండీఁడు, ఆబూతీఁడు, పెనుదిండి, హాఁబూతి. ఆబూతి, తిండిబోతు అన అతిభక్షకునిపేళ్ళు.

క. పొటి తింగణా బుడుతయును
గిటక పొదరు పొట్టి గుజ్జు గిడ్డ బుడుగనఁగా
వటునకు నభిఖ్య; లవిటుకొ
నటినా హరి యంగహీను నకు నామంబుల్. 202

పొటి, తింగణా, బుడుత, గిటక. పొదరు, పొట్టి, గుజ్జు, గిడ్డ, బుడుగు అనఁగా వటువునకుపేళ్ళు. అవిటు, కొనటి అన అంగహీనునిపేళ్లు

క. చెవుటియన చెవుటివాఁడన
నవని బధిరునకు నభిఖ్యలగు; చీకనఁగ
న్నవిటియును గ్రుడ్డివాఁడన
నవు నంధునకాహ్వయంబు లాంధ్రమున హరీ. 203

చెవుటి, చెవుటివాఁడు అన బధిరునకుపేళ్ళు. చీకు, కన్నవిటి, గుడ్డివాఁడు అనఁగా అంధునకుపేళ్ళు.

గీ. కుంటి నా గుంటనఁగ పిచ్చకుంటనంగ
కుంటు పిచ్చుక పిచ్చుకకుంటనంగ
పంగునగు; నోరు మెంగయు ముంగ మూఁగ
యెడ్డినాఁగను మూకాఖ్యలెసఁగె శౌరి. 204

కుంటి, కుంటు, పిచ్చకుంటు, కుంటు, పిచ్చుక, పిచ్చుకకుంటు అన పంగువు పేళ్ళు. నోరుమెంగ, ముంగ, మూఁగ, ఎడ్డి అనఁగా మూకు పేళ్ళు.

క. నలుకువయన తెగులనఁగా
నలినా తెవులనఁగ రోగ నామంబులగుక్;
తెలుఁగున వెజ్జన వైద్యుం
డలరెను; మందనఁగ నౌషధాఖ్య మురారీ. 205

నలుకువ, తెగులు, నలి, తెవులు అనఁగా రోగమునకు పేళ్ళు. వెజ్జ అనఁగా వైద్యునకు పేరు. మందు అన ఔషధము పేరు.

ఆ.వె. పాలివాఁడు దాయ పాలిచుట్టము పాలి
పాలికాఁపునాఁగఁ బరగె జ్ఞాతి;
వావి చుట్టరికము బంధుత్వమునకౌను;
వావి వరుస బాంధవ్యక్రమంబు. 206

పాలివాఁడు, దాయ, పాలిచుట్టము, పాలి, పాలికాఁపు అనఁగా జ్ఞాతికి పేళ్ళు. వావి, చుట్టరికము, అన బంధువుల పేర్లు. వావి, వరుస అన బాంధవ్యక్రమము పేర్లు.

క. బందువుడన చుట్టంబన
బందుగుడన విందనంగ బహువచనంబుం
జెందిన చుట్టలు చుట్టా
లుం దగు బంధువునకాఖ్యలును శ్రీరమణా. 207

బందవు, చుట్టము, బంధుగుఁడు, కడిమి, చుట్టాలు, అన బంధువునకు పేర్లు.

క. మేనన మైనా నొడలన
మేనాఁగను బొందినాఁగ మెయిదము నోలం
బౌసన దేహము పేర్లగు
దానవకులవన సముదాహ దావానలమా.                208

మేను, మై, ఒడలు, మే, బొంది, మెయి, ఓలము అనఁగా దేహమునకు పేళ్ళు.

క. జడనిధిశయనా! యుడువన
నడయనఁగా జోకయనఁగ నొప్పొడవనఁగా
పొడయనఁగా రూపనఁగను
వడసెను రూపంబుఁ బేర్ల వసుధ వెలుఁగుచున్.                209

ఉడువు, అడ, జోక, పొడలు, పొడ, రూపు అనఁగా రూపమునకు పేళ్ళు.

ఆ వె. పుఱ్ఱె పుఱియ పునుక పుఱ్ఱియ నాఁగ క పా
లంబు పేళ్ళు; పోతరంబు మత్తు
పీచ మామికయును పించంబు హామిక
మంపు క్రొవ్వు నాఁగ మదము పేర్లు.                210

పుఱ్ఱె, పుఱియ, పునుక, పుఱ్ఱియ అనఁగా కపాలము పేళ్ళు. పోతరము, మత్తు, పీచము, ఆమిక, పించము, హామిక, మంపు, క్రొవ్వు అన మదము పేళ్ళు.

గీ. ఎముక యెమ్ముక యెమ్మను బొమికె బోఁకె
ముడుసు నాఁగ బహువచనమునను మక్కె

లనఁగ శల్యాఖ్యలౌ హృదయంబుపేళ్లు
గుండెకాయ కందనకాయ గుండె యనఁగ. 211

ఎముక, ఎమ్మెక, ఎమ్మ, బొమికె, బోఁకె, ముదుసు, బొ||
మిక్కలు అనగ శల్యములపేళ్ళు. గుఁడెకాయ, కందనకాయ, గుండె
అన హృదయముపేళ్ళు.

కం. మూలుగనగ నెమ్మూటయు
పూలుగునా జెక్కమనఁగ పూల్గును నెనదుఁ
వాలెంబు మజ్జమంబౌ;
నీలాంగా! బక్కయనఁగ నెగడె త్వగాఖ్యల్. 212

మూలుగ, ఎమ్మూట, పూలుగు, చెక్కను, పూల్గు, నెనడు అన
మజ్జముపేళ్ళు. బక్క అన త్వక్కుపేరు.

క. అడు గడ్గు మెట్ట యజ్జయు
నడువును హజ్జయును నంజయును నంఘ్రికి పే
ళ్లడరెను;మీగాలనఁగను
బడసె ప్రపదమునకుపేరు పంకజనాభా. 213

అడుగు, అడ్గు, మెట్టు, అజ్జ, అడువు, హజ్జ, అంజ అనఁగా
అంఘ్రికిపేళ్ళు. మీగాలు అనఁగా ప్రపదముపేరు.

క. కుడికాలు మించుకాలన
బడె దక్షిణపాదమునకు; ప్రసృతముపేళ్లఁ
బడసెను పిక్కయనఁగ చిఱు
తొడనా జంగయన భువిని తోయజనాభా. 214

కుడికాలు, మించుకాలు అన దక్షిణపాదముపేర్లు. పిక్క, చిఱు
తొడ, జంగ అనఁగా ప్రసృతముపేళ్ళు.

క. ముణుముణగఁను మోకాలన
నడరెను జానువున కాఖ్యలగుచు నెనఁగునన్;
తొడయనఁగను కురువన మఱి
యొడినా నూరువున కాఖ్యలొప్పు మునీంద్రా. 215

ముణుము, మోకాలు అన జానువునకు పేర్లు. తొడ, కురువు, ఒడి యన ఊరువునకు పేళ్లు.

గీ. అరు నూగారు రోమాళికౌను; బొడ్డు
పొక్కిలి యనంగ నాభియౌ; పొట్ట బొజ్జ
కడుపు బొఱ్ఱ డొక్క బొజ్జయు కడుపునాఁగ
గర్భమున కాఖ్యలై యొప్పు కమలనాభ. 216

అరు, నూగారు అన రోమాళి పేళ్ళు. బొడ్డు, పొక్కిలి అన నాభి పేళ్ళు. పొట్ట, బొఱ్ఱ, కడుపు, బొఱ్ఱ, డొక్క, బొజ్జ కడుపు అనునవి గర్భమునకు పేళ్ళు.

క. మడతయు మడుపును తఱియును
ముడుతయు నిత్యబహువచనమున స్త్రీకులసం
బడె వళులకు పేళ్లగు; మొల
నడుము కవును కౌను నడ్మ నాఁగటి పేర్లౌ. 217

మడత, మడుపు, తఱి, ముడుత, బ॥ స్త్రీకులసం అన వళులు పేళ్ళు. మొల, నడుము, కవును, కౌను, నడ్మ అన కటి పేర్లు.

క. వెనునా వెన్నన వీఁపన
గను పృష్ఠము; కొప్పర మఱికయు పుత్తియు మూ

పన స్కంధము పేళ్లగు; పిఱుఁ
దన పిఱ పిఱ్ఱయన నగు నితంబమునకు శౌరీ. 218

వెను, వెన్ను, వీఁపు అన పృష్ఠమునకు పేళ్లు. కొప్పరము, అఱక, పుత్తి, మూపు అనఁగా స్కంధమునకు పేళ్లు. పిఱుఁదు, పిఱ, పిఱ్ఱ అన నితంబమునకు పేళ్లు.

క. చనునాఁ జన్నన గుబ్బయ
నను చాఁచియనఁగ బహువచనంబున పాలిం
డ్లన కుచసంజ్ఞయు; చనుమొన
యన చూచుకవృత్తనీలమగు మధువైరీ. 219

చను, చన్ను, గుబ్బ, చాచి, బ॥ పాలిండ్లు అన కుచమునకు పేళ్లు. చనుమొన అన చూచుకముచుట్టువుండు నీలవర్ణమునకు పేరు.

క. కాను బొగడ యంచును చ
న్మోమును చన్మొనయు బొడ్డె మొన చన్ముక్కున్
నామములు చూచుకమునకు
సామజరాడ్వినుతనామ సంగరభీమా. 220

కాము, బొగడ, అంచు, చన్మోము, చన్మొన, బొడ్డె, మొన, చన్ముక్కు అనఁగా చూచుకమునకు పేర్లు.

సీ. అంగుళిసంజ్ఞ వేలనఁగ వ్రేలనఁగ; నం
గుష్ఠంబుసంజ్ఞ యంగుటము బొటన
వేలు పెద్దనవ్రేలు వెలసె; తర్జనినామ
వివరంబు చూపుడువ్రేలనంగ
జుత్తనవేలన జుట్టనవ్రేలన;
దనరె మధ్యాంగుళమునకు నడిమి
వ్రే; లనామికసంజ్ఞ విలసిల్లె భువి; దబ్బ
వే; ల్కనిష్ఠకపగు పిల్లవ్రేలు
గీ. నాఁగ చిటివేలు చిటికెన నాఁగ; నఖము
గోరనఁగ పేరునొందె; నంగుష్ఠ తర్జ
నికిని మధ్యభాగముపేరు నెగడె దనుజ
వంశమర్దన యుప్పలవాయినాఁగ. ౨౨౫

వేలు, వ్రేలు అన అంగుళము పేళ్లు. అంగుటము, బొటనవేలు, పెద్దనవ్రేలు అన అంగుష్ఠమునకు పేళ్లు. చూపుడువ్రేలు, జుత్తనవ్రేలు, జుట్టనవ్రేలు అన తర్జనికి పేళ్లు. నడిమివ్రేలు అన మధ్యాంగుళము పేరు. దబ్బవ్రేలు అన అనామికము పేరు. పిల్లవేలు, చిటివేలు, చిటికెన అనఁగా కనిష్ఠమునకు పేళ్లు. గోరు అనఁగా నఖము పేరు. ఉప్పలవాయి అనఁగా అంగుష్ఠతర్జనీమధ్యభాగమునకు పేరు.

గీ. దోయిలియు పట్టిలియు నాఁగ దోసిలియన
నంజలికిపేళ్లు; కొడిదిలియన కొణిదిలి
యనఁగ చేరయునాఁ బ్రతాఖ్యలు; పిడికిలి
గుప్పిలియు పిడినాఁగ నిక్షబ్జమానా. ౨౨౬

రంధ్రమగును; ముక్కట్టన గాజలె భువి
నాంధ్రమున ముఖవైఖరి కాఖ్యశౌరి. ౨౩౦॥

సోణము అన నాసామూలమునకు పేరు. సోడు, చోడు, ... బ్రహ్మరంధ్రమునకు పేర్లు. ముక్కట్టు అన ముఖవైఖరి పేరు.

క. పలుకప్పన పెదవియనం
బలుచెరయన మోవినాఁగ వాతెరయనఁ బ
ల్లవులనయనఁగ వాతెఱయన
నలినాయతనేత్ర యధర నామంబులగుఁ. ౨౩౧॥

పలుకప్పు, పెదవి, పలుచెర, మోవి, వాతెర, పల్లవులు, వాతెఱ అనఁగ అధరమునకు పేర్లు.

క. గరువనఁగను చెక్కిలియన
చెరపయు చెక్కనఁగ చెక్కు చెంపయనంగా
బరగె కపోలాఖ్యలు ని
ద్ధర దాఘువ దవుడ గౌడ తాలువు పేర్లు. ౨౩౨॥

గరువు, చెక్కిలి, చెరప, చెక్కు, చెంప అనఁగా కపోలమునకు పేర్లు. దాఘువ, దవుడ, గౌడ అన తాలువు పేర్లు.

గీ. పణఁతనా పడఁతియు బహువచనమందు
కటమరలునాఁగ హనువౌను; గడ్డమయన
వెలసె చుబుకంబు; చెలిమెయు సెలవి సృక్వ
మౌను; పలు పల్లు రదనాఖ్యలౌ మురారి. ౨౩౩॥

పణఁత, పడఁప, ... కటమరలు, అనఁగా హనువు పేర్లు. గడ్డమయిన చుబుకము పేరు. చెలిమె, సెలవి అన సృక్వము పేర్లు. పలు, పల్లు అన రదనము పేర్లు.

నాఁగ జానుగు నాఁ జెవి నాఁగ లాఁగ
రియన కర్ణంబునకుఁ బేళ్లు కృష్ణవర్ణ. 237

గొంతుపంత, అపగుంటు, నాసిః, అనఁగ కంఠశిరో[illegible] పేళ్లు. [illegible] జానుగు, చెవి, లాఁగరి అనఁగా కర్ణము పేళ్లు.

గీ. గిల్లచూపును మెల్లియు గిల్లకన్ను
నాఁగ కేకరాహ్వానః; కణఁత కడఁత
యనఁగ భువిని శిరఃపార్శ్వాహ్వానః;
కొలికి నాసికాగ్ర భాగాక్షికోణంబు పేరు. 238

గిల్లచూపు, మెల్లి, గిల్లకన్ను అనఁగా కేకరము పేళ్లు. కణఁత, కడఁత అన శిరఃపార్శ్వము పేళ్లు. కొలికి అనఁగా నేత్రాగ్రము పేరు.

కం. నెఱికలనఁగ నెరులనఁగను
వెఱికలనం గురులనంగ నెంద్రుకలనఁగన్
వఱలెను కేశాభిఖ్యలు
కతివేలుప! బొచ్చు నింద్యగత రోమాళిన్. 239

నెఱికలు. నెరులు, వెఱికలు, కురులు, నెంద్రుకలు అన కేశము పేళ్లు. బొచ్చు, అన నింద్యగతమైన రోమాళి పేరు.

గీ. కురులు ముంగురులనఁగను కుంతలములు
వేనలియు కీలుజడనాఁగ వేణిసంజ్ఞ;
కూఁకటియు పిల్లజుట్టన కాకపక్ష
సంజ్ఞ; సిక సిగనాఁ శిఖసంజ్ఞ శౌరి. 240

కురులు, ముంగురులు, అన కుంతలముల పేళ్లు. వేనలి, కీలుజడ అన వేణి పేళ్లు. కూఁకటి పిల్లజుట్టు అన కాకపక్షము పేళ్లు. సిక, సిగ అన శిఖ పేళ్లు.

గీ. కొప్పు జడ వేనలియు మూల క్రొవ్వెదయుఁ దు
ఱుముమునాఁగను కబరిపేరైవఱలె; సూనె
ముడియు వేనలినాఁగ క్రొమ్ముడియు కీలు
గంటునాఁగను ధమ్మిల్లమౌ కమలనాభ. 241

కొప్పు, జడ, వేనలి, మూల, క్రొవ్వెద, తుఱుము అనఁగా కబరి పేర్లు. సూనెముడి, వేనలి, క్రొమ్ముడి, కీలుగంటు అనఁగా ధమ్మిల్లము పేర్లు.

క. తొడవన నగయన సొమ్మన
తొడుపన రవణంబనంగ త్రొవ్వన్న మఱిం
దొడగన దొగ్గన తెలుఁగున
నడరెను భూషణముపేళ్లు హాటకచేలా. 242

తొడవు, నగ, సొమ్ము, తొడుపు, రవణము, త్రొవ్వ, తొడగ, తొగ్గు అనఁగా భూషణము పేర్లు.

చ. కులగిరిధీర! కమ్మలును కుంటెనకుచ్చులు బావిలీలు జం
పులు బవిరెల్ మఱిన్ పడగపూలును పంజులకమ్మలింక గో
లుసులు జుమికీలు ప్రోగులును లోలకులొంపులు గుమ్మతీలుపం
జులు మఱికమ్మపంజులన సొంపుగ స్త్రీతతి కర్ణభూషలౌ

కమ్మలు, కుంటెనకుచ్చులు, బావిలీలు, జంపులు, బవిరెలు, పడగపూలు, పంజులకమ్మలు, గొలుసులు, జుమికీలు, ప్రోగులు, లోలకులు, ఒంపులు, గుమ్మతీలు, పంజాలు, కమ్మపంజాలు అను స్త్రీ కర్ణభూషణముల పేళ్లు.

క. ధర నాసాభూషణము
క్కరయును ముక్కఱయు ముక్కుకమ్మయనఁగ ముం

గఱియన ముకుపోగన బే
సరియన నాసాళిఁజెల్లె సారసనాభా. 244

ముక్కెర, ముక్కఱ, ముక్కుకమ్మి, ముంగఱ, ముకుపోగు, బేసరి అన నాసాభూషణముపేర్లు,

క. నెలవంక సూసకము జా
బిలిపువు చిన్నిపువును జడబిల రాకిడియుం
దలమానికంబనంగను
వెలసె శిరోభూషణాళి భేదములగుచున్ 245

నెలవంక, సూసకము, జాబిలిపువ్వు, చిన్నపువ్వు, జడబిల్ల, రాకిడి, తలమానికము, అన వేశ్వరశిరోభూషణముల పేర్లు.

క. ముంగాముఱారి కడియము
ముంగాముఱువును మురుగును ముంగాముఱెమున్
ముంగముఱెము సూడిగమును
ముంగముఱా మనఁగ కటకమునకునభిఖ్యల్. 246

ముంగాముఱారి, కడియము, ముంగాముఱువు, మురుగు, ముంగాముఱెము, ముంగముఱెము, సూడిగము, ముంగముఱాము అనఁగా కటకమునకు పేర్లు.

గీ. బాజుబందులు పోఁచీలు పట్టెలు ముఱి
డీగొలుసులు నొత్తులును పాటీలు బొద్దు
లనఁగ హస్తభూషణములౌ; నంగుళీయ
మునకునుంగ్రంబు నుంగరమును సికాయు. 247

బాజుబందులు, పోఁచీలు, పట్టెలు, ముఱిడీగొలుసులు, ఒత్తులు పాటీలు, బొద్దులు అన హస్తభూషణవిశేషములు ఉంగ్రము, ఉంగరము, సికా, అనఁగా అంగుళీకము పేర్లు.

ఆ. వె. అందెపాగడంబు నందియ పాడగ
మనఁగ నూపురాఖ్యలౌను; జంకి
యలుననంగ బిరుజులన గజ్జెలన కింకి
ణీకి నభిఖ్యలౌను నీలదేహ. 248

అందె, పాగడము, అందియ, పాడగ అన నూపురము పేళ్ళు. జంకి
యలు, బిరుజులు, గజ్జెలు అనఁగా కింకిణినామములు

ఆ. వె. సరిగె యొత్తు మాలె సరి సోఁగు క్రోవయు
దండ తావళంబు దామమౌను;
తాళి పతక మింక తాళీయనంగను
తరళమునకు పేళ్లు పరమపురుష. 249

సరిగె, ఎత్తు, మాలె, సరి, సోఁగు, క్రోవ, దండ, తావళము అన
దామము పేళ్ళు. తాళి, పతకము, తాళీ అన తరళము పేళ్ళు.

సీ. చెంపసరి గాడసరమును చెంపకల్లి
నాఁగ పడగలదండ బన్నసరి ముత్తె
సరియు హారవిశేషముల్; విరిసరియును
మాలె దండయునాఁ బుష్పమాల శౌరి. 250

చెంపసరి, గాడసరి, చెంపకల్లి, పడగలదండ, బన్నసరి, ముత్తెసరి
అనఁగా హారవిశేషముల పేళ్ళు. విరిసరి, మాలె, దండ అన పుష్పమాలిక
పేళ్ళు.

క. నేవడమన మానికపుం
దావడమన బన్నసరము నా గుబ్బసరిన్
నేవళమన నేహారము
నా విలసిల్లె మణిహారనామములు హరీ. 251

సేవడము, మాణిక్యపుఁదావడము, ఒన్నసరము, గుబ్బసరి, సేసరము సేహారము అన మణిహారము పేళ్ళు.

క. సరిపణి యుత్త్రాడముఁగా
సరిపెణ యును నానుక్రోవి సరడు సరిపణీ
పరగెను భువి తెలుఁగున హాత
ముర గళభూషావిశేషముల నామంబుల్. 252

సరిపణి, ఉత్త్రాడములు, సరిపెణ, నానుక్రోవి, సరడు, సరిపణి అనఁగా కంఠభూషణవిశేషముల పేళ్ళు.

క. కటినుత యొడ్డాణమున క
మరు నొడిదారంబు తీఁగ మటి మొలనూల్
మ్మరు మొలకట్టొడికట్టన
హారువ్రగ తెలుఁగునను మేఖలాఖ్యలు ధరణిన్. 253

ఒడ్డాణము, కమరు, ఒడిదారము, తీఁగ, మొలనూలు, కమ్మరు, మొలకట్టు, ఒడికట్టు అన మేఖల పేళ్ళు.

గీ. హావణికయనంగ కైసేతయనఁగ నొప్పి
దంబు సింగారము కయిసేతయున పాట
న యన హావణింపు నాఁగను నలిననాభ
యాంధ్రమున నలంకారాఖ్య లలరెభువిని. 254

హావణిక, కైసేత, ఒప్పిదము, సింగారము, కయిసేత, పాటన, హావణింపు అనఁగా అలంకారమునకు పేళ్ళు.

ఉ. పావడ బట్టకప్పడము వల్వము పుట్టము దుస్తు పాతనే
రావళి చీర హేరవళి ప్రాఁతయు వీణము కోక వల్వ సె

లా పలుపంబు పల్ప్వి కపళంబును స్సుగడితం బనంగ పే
ర్లొ పరిధాన వస్త్రమున కాంధ్ర పదావళి నిర్ధరార్థలిన్. 255

పావడ, జక్తీ, కక్షపటము, పల్వాణము, ఫుట్టము, దుప్పు, పాంత, హారా నళి, చీర, హారావళి, ప్రావలి, కిమాసు, టాగ్ వీసెనాము, కోక, వల్వ, సేలా, పలువము, పల్వా, కపగము, స్సుడిపము అనంగా వస్త్రములపేళ్లు.

క. జరి జలతారును తగటీ
జరబాజును తగటు తిగటి జంటీయు జర్
బురుసా మాతాబి సరిగ
జరతయు నాఁగనకతంతు సంజ్ఞలు శౌరీ. 256

జరి, జలతారు, తిగటి, జరబాజు, తగటు, తగటి, జంటీ, జరీ, బురుసా, మాతాబి, సరిగ, జరత అనంగా కనకతంతువుపేళ్ళు.

సీ. కుశినీయు పట్టును బతినీ యనంగ కౌ
శేయ నామంబులై చెలఁగెఁ; దాపి
తా వెలిపట్టును తాపిత నా శ్వేత
కౌశేయమున కభిఖ్యలగు; నెఱ్ఱ
పట్టు బుర్నా రక్తవర్ణకౌశేయమై
తనరెను పేళ్లు; మాంబాళి మాడ
ఖంబును మాదావళంబు మాదావళి
పచ్చపట్టున పీతవర్ణచీన
గీ. చేలమగు; సకలాతును సాలువయును
సాలు సాల్వాయు రాంకవాఖ్యాళియౌను;
రేటమున గెంటమనఁగను రెంటమనఁగ
ద్వంద్వ తంత్వంబరముపేళ్లు దానవారి. 257

కుతినీ, పట్టు, బతినీ అన కౌశేయముపేళ్ళు. తాపితా, వెలిపట్టు, తాపిత అనఁగా శ్వేతకౌశేయముపేళ్ళు. ఎఱ్ఱపట్టు బుర్సా (రూ) బురుసా అనఁగా రక్తకౌశేయముపేళ్ళు. మాందాళి, మాదళము, మాదావళము, మాదాళి, పచ్చపట్టు అనఁగ పీతకౌశేయముపేర్లు. సకలాతు, సాలువ, సాలు, సాల్వ, అనఁగా రాంకవముపేర్లు. చేఁటము, గెంటము, రెంటము అనఁగా జమిలినేత ద్వంద్వతంత్వంబరముపేర్లు.

క. కంబళియన గొంగడియన
కంబడియన వెలసెపేర్లు కంబళమునకున్
శంబరరిపుజనకా మో
దంబున నేరాజు కనక తంత్వంబరమౌ. 258

కంబళి, గొంగడి, కంబడి అనఁగా కంబళముపేర్లు. నేరాజు అనఁగా కనకతంత్వంబరముపేరు.

గీ. దట్టమనఁ గాగరయు నంగదట్టమనఁగ
పావడయనఁ దాబందన పరికిణియని
యనఁగ నెఱికయు చల్లాడమనఁగ నొప్పె
వలిభయుత వలయాకార వస్త్రమునకు. 259

దట్టము, గాగర, అంగదట్టము, పావడ, తాబందు, పరికిణి, నెఱిక, చల్లాడము అనఁగా వలిభయుతవలయాకారవస్త్రమునకు [లంగా]ను పేర్లు.

పంచపాదిగీ. చీర దువ్వల్వ కోకయు జేబు జీబు
నాఁగ. స్త్రీబంధనాంబర నామములగు;
కుప్పసము చన్నుకట్టును కువసము చను
గప్పుచన్నులుపును రైక కంచెలయును
అవిక నాఁ గంచుకముపేర్లు భవవినాశ. 260

చీర, పచ్చడ్డా, కోక, జేబు, జేబు అన స్త్రీ బంధించుకొను వస్త్రము పేళ్లు
కుప్పసము, రవ్విగట్టు, కంచుకము, చనుకట్టు, సొమ్మలావు, రైక, అవికె
అన కంచుకంబు పేళ్లు.

క. వలిపంబన కోకయనఁగ
జిలుగన సాలువమనంగ జల్లనఁగ నటికా
వెలిపంబన వలువయనం
గులపర్వతధర భువిని దుకూలముపేళ్లున్. 261

వలిపము, కోక, జిలుగు, సాలువము, జల్లి, వెలిపము, వలువ
అనఁగా దుకూలము పేళ్లు.

గీ. దుప్పటియు దుప్పటీయన దువ్వాలువయు
వైరవాసంబునాఁగ జామారునాఁగ
నౌను సెల్లాయు పోతువయనఁగ దుప్ప
టంబనంగ నుత్తరీయమూ నంబుజాక్ష. 262

దుప్పటి, దుప్పటీ, దువ్వాలువ, వైరవాసము, జామారు, సెల్లా, పో
తువ, దుప్పటము అనఁగా ఉత్తరీయము పేళ్లు.

గీ. వసుధ చింగన నిత్యైకవచనమందు
నెఱియు నెఱికయు పింజెనా నిత్యబహువ
చనమునందున కుచ్చెళ్ళు ననఁగ రింగు
లనఁగ వలిభాహ్వయంబులు వనజనాభ. 263

చింగు, నిత్యైకవచనమున నెఱి, నెఱిక, పింజె, నిత్యబహువచనమున
కుచ్చెళ్ళు, రింగులు అనఁగా వలిభముల పేళ్ళు.

గీ. పయ్యఁట పయ్యెఁట పయ్యెద పైఁట పయిఁట
చెలఁగె నంశుకమై; కొంగు చెంగును చెఱఁగు

గనఁగ చేలాంచలము; నీవికాఖ్యలొనసు
భువి వలపుకీలు గనయంబు ఘోఁకముఁడియు. 264

పయఁట, పయ్యెఁట, పయ్యెద, సెఁట, పయిఁట అన అంచలముపేళ్ళు. కొంగు, చెంగు, చెఱఁగు, అన చేలాంచలముపేళ్ళు. వలపుకీలు, గనయము, ఘోఁకముడి అనఁగా నీవికిపేళ్లు.

గీ. బొట్టు తిలకంబగు; పుదియబొట్టు పూర్వ
పుండ్రమగా; మోదమన జలపోతి నాఁగ
నౌను జంటీయు స్వర్ణలేప్యంబు లత్తు
కయన పారాణినా నలక్తకము శౌరీ. 265

బొట్టు అనఁగా తిలకముపేరు. పుదియబొట్టు అన పూర్వపుండ్రముపేరు. మోదము, జలపోత, జంటీ అనఁగా స్వర్ణలేప్యము (మొలాము) పేళ్లు. లత్తుక, పారాణి అన అలక్తకముపేళ్లు.

క. పడకయు పానుపు పఱుపును
దడిబంబును మెత్త సెజ్జ తలిపంబు మఱిక
పడుకయు పక్క యు పఱుపన
నడరెను శయ్యాఖ్యలగుచు నంబుజనాభా. 266

పడక, పానుపు, పఱపు, దడిబము, మెత్త, సెజ్జ, తలిపము, పడుక, పక్క, పఱుపు అన శయ్యకుపేళ్లు.

క. అరపయు కంకటి కంగటి
పరియంకము పానుపనఁగ పర్యంకంబౌ;
నరయఁగ మంచము పలకయు
పరగ తెలుఁగునందు స్వల్ప పర్యంకంబౌ 267

అడప, కంకటి, కంగటి, పర్యంకము, పాన్పు అన పర్యంకము పేర్లు, మంచము, పట్టె అనఁగా స్వల్పపర్యంకము పేర్లు.

గీ. తేఁడు తెన్నుండు తొన్నుండు తెండు తొంగు
పండు పన్నుండు పవళించు పవ్వళించు
పవ్వడించు పరుండును పండుకొనన
వెలసె శయనించుటకు పేర్లు వేదవేద్య — 268

తేఁడు, తెన్నుండు, తొన్నుండు, తెండు, తొంగు, పండు, పన్నుండు పవళించు, పవ్వళించు, పవ్వడించు, పరుండు, పండుకొను అన శయనించు పేర్లు.

క. డేరా గొల్లెన పీడు గు
డారము గూడారమును గుడారును మఱియుఁ గా
డేరెజ చప్పరము గూ
డారును వేలంబునాఁ బటకుటీరంబౌ. — 269

డేరా, గొల్లెన, పీడు, గుడారము, గూడారము, గుడారు, డేరెజ చప్పరము, గూడారు, వేలము అనఁగా పటకుటీరము పేర్లు.

గీ. పృథ్వి నవగోజ పెన్వోడు పెద్దవేల
మనఁ మహద్గూహ్యమౌను; జవనిక గండ
పడము తెరయనఁగా కాండపటమగు; పట
కుడ్యమునకు సరాతియౌ కోమలాంగ. — 270

నవగోజ, పెన్వోడు, పెద్దవేలము అనఁగా మహద్గూహ్యము పేర్లు. జవనిక, గండపటము, తెర అనఁగా కాండపటమునకు పేర్లు, సరాతి అన పటకుడ్యము పేరు.

క. వనరుహలోచన యుల్లడ
యనఁగను మేల్కట్టునాఁగ నగు చందువనాఁ
గను చందువా యనఁగ తెలుఁ
గున నుల్లాభంబు పేళ్లు కుంభినివెలసెన్. 271

ఉల్లడ, మేలుకట్టు, చందువ, చందువా అనఁగా ఉల్లాభము పేళ్ళు.

క. తలయంపి జీనపటమును
తలాడయును బిల్లదిండు తల్గడ గ్రిందున్
దలగడయు బటువుబిల్లయు
నలరుచు నుపధానమౌను హాటకచేలా. 272

తలయంపి, జీనపటము, తలాడ, బిల్ల, దిండు, తల్గడ, గ్రిందు, తలగడ, బటువుబిల్ల, అన ఉపధానము పేళ్లు.

పంచపాదిక. ఒఱగుబిల్ల దురాడంబు నొరగు బిల్ల
యొఱగు బాలీసు లోడన నొప్పు మత్త
వారణము పేళ్లు; తెలుఁగు నవఱలెను తల
యంపినాఁగను తల్లఁపియన తలాఁపి
యన శిరస్థానమున కాఖ్యలౌను శౌరి. 273

ఒఱగుబిల్ల, దురాడము, ఒరగు, బిల్ల, ఒఱగుబాలీసు. లోడు అనఁగా మత్తవారణము పేళ్ళు. తలయంపి, తల్లఁపి, తలాఁపి అనఁగ శిరస్థానమునకు పేళ్ళు.

క. గంబురమును చలియిసుకయు
గంబూరము కప్పురంబు కర్పము నెలయున్
గంబూర గంబురాయును
గంబుర కపురంబనంగ కర్పూరంబౌ 274

క. చెందిరమన చందురమన
సింధురమన చంద్రమనఁగ సిందూరము పెం
పొందెను; పీఁటయనఁగ పే
రొందెను పీఠంబు భువిని యురగశయానా. 278

చెందిరము, చందురము, సింధురము, చంద్రము అనఁగా సిందూరము పేళ్ళు. పీఁట అన పీఠము పేరు.

పంచపాదిగీ. దివిటు దిబ్బెంబు దీవియ దివ్వెయు దివె
దివ్య జోతియనంగను దీపమౌ; జ
వాజినా జవాదియన జవ్వాజినా జ
వాదు జవ్వాదు నాఁగ జవ్వాదియనఁగ
సంకుమదమున కాఖ్యలౌ సారసాక్ష. 279

దివియ, దిబ్బెము, దీవియ, దివ్వె, దివె, దివ్య, జోతి అన దీపము పేళ్లు. జవాజి, జవాది, జవ్వాజి, జవాదు, జవ్వాదు, జవ్వాది అన సంకుమదము పేళ్లు.

గీ. తమ్మలపుటాకు తెలనాకు తమలపాకు
కమ్మెరాకును తెల్లనాకి... నగు
నాగవల్లీదళంబు; తద్భాగబంధ
నమగు మావటమన మోద నాఁగ శౌరి. 280

తమ్మలపుటాకు, తెలనాకు, తమలపాకు, కమ్మెరాకు, తెల్లనాకు అన నాగవల్లీదళము పేళ్లు. మావటము, మోద అన తద్భాగబంధనము (తములపాకులకట్ట) పేళ్లు.

గీ. అడపమన సంబెళయన వక్కాకుసంచి
యనఁగ తాంబూలపటపేటికౌను; తబుకు

క. జోటిపని పైసరంబును
కూటమి మసకంబు రంతు గూడ రతికిఁ బే
ర్లౌటయు; మగపాడియు పై
కూటమి మగలాగనఁగ నగు నుపరతి కిలన్. 285

జోటిపని, పైసరము, కూటమి, మసకము, రంతు అన రతిక్రియకు పేర్లు. మగపాడి, పైకూటమి, మగలాగు అన ఉపరతికి పేర్లు.

పంచపాది గీ. మసకఁగొనును గండాడన మహిఁ రమించు
పేర్లు; వెలిగ్రుక్క లోగ్రుక్క వెలసె మణిత
మగుచు; మసకంబునాఁ గెలవన రతేచ్ఛ;
పొలయలుక నెయ్యపుటలుక చెలఁగె బ్రణయ
కోపమునకు నభిఖ్యలం గోమలాంగ. 286

మసకఁగొను, గండాడు అన రమించు పేర్లు. వెలిగ్రుక్క, లోగ్రుక్క అన మణితము పేర్లు. మసకము, కెలవు అన రతేచ్ఛకు పేర్లు. పొలయలుక, నెయ్యపుటలుక అనఁగా ప్రణయకోపము పేర్లు.

గీ. అలముకొను కౌఁగిలింతన నలము కవుఁగి
లింపునాఁగను పేర్లు నాలింగనమున
కగును; పలుకెంపు పల్లొత్తునాఁగ దెలుఁగు
నందు దంతక్షతంబున కాఖ్యలు హరి. 287

అలముకొను, కౌఁగిలింత, అలము, కవుఁగిలింపు అన ఆలింగనము పేర్లు. పలుకెంపు, పల్లొత్తు అనఁగా దంతక్షతమునకు పేర్లు.

క. నెలకూనలు చిట్టంటులు
నెలవంకలు గోటిగిట్లు నెలతిల్లలు నా

బిలిబుడంతలు గోటిచెనకు
లలరె నఖక్షతములగుచు నమరనుతాంఘ్రీ		288

నెలకూనలు, చిట్టాంటులు, నెలవంకలు, గోటిగీట్లు. నెలపిల్లలు, జాబిలిబుడుతలు, గోటిచెనకులు అనఁగా నఖక్షతముల పేర్లు.

గీ. అమమునా నొక్కునాఁగ నొత్తనఁగ పీడ
నాఖ్యలగు; గీఱు ఱక్కున నగును రేఖ
పేర్లు తోఁగూడి కుంతలిఖల్లోత్తరంగ
వసుధ నాంధ్రమున మనుష్యవర్గ ముగిసె.		289

అమరు, నొక్కు, ఒత్తు అనఁగా పీడనమునకు పేర్లు. గీఱు, ఱక్కు అన రేఖకు పేర్లు.

---

## బ్రహ్మవర్గ

క. వంగడమున కొలమనఁగను
వంగసమున సంతునాఁగ వంశముపేర్లౌ;
రంగ ద్రాక్షసరాజవి
భంగా బాఁపన యనంగ బ్రాహ్మణకులమౌ.		290

వంగడము, కొలము, వంగసము, సంతు అనఁగ వంశము పేర్లు. బాఁపన అన బ్రాహ్మణకులము పేరు.

క. బాఁపనివాఁ డిరుపుట్టువు
బాఁపనుఁడును నేలవేల్పు పాఱుఁడును మఱిక్

బాఁపనయు పాఱువాఁడన
బాఁపఁడు బొమ్మఁడనఁగను బ్రాహ్మణుఁడు హరీ.

బాఁపనివాఁడు, ఇరుపుట్టువు. బాఁపనుఁడు, నేలవేల్పు, పాఱుఁడు బాఁపనయు, పాఱువాఁడు, బాఁపఁడు, బొమ్మఁడు అన బ్రాహ్మణునిపేళ్లు

గీ. బాఁపతియు పాఱుటక్కయు బాఁపనక్క
పాఱుత యనంగ బ్రాహ్మణభామపేళ్లు;
జన్నమన గంగియన యజ్ఞసంజ్ఞ; హోమ
మునకు వేలమియగు; యాజకునకు నొజ్జ. 292

బాఁపత, పాఱుటక్క, బాఁపనక్క, పాఱుతి అన బ్రాహ్మణస్త్రీ పేళ్లు. జన్నము, గంగి అన యజ్ఞముపేళ్లు. వేలమి అన హోమముపేరు. ఒజ్జ అన యాజకునకు పేరు.

క. ఆపోసనమని యనఁగా
నాపోసానమన ధరణి నాపోశనమగు;
నాపైపై హారఁబట్టిన
నాపోశించుటకుపేరు హాటకచేలా. 293

ఆపోసనము, ఆపోసానము అన ఆపోశనము పేళ్లు. నాఁబట్టు అనఁగా ఆపోశించు పేరు.

గీ. పృథ్వి జన్నపుటొజ్జనా ఋత్విగాఖ్య
యలరె; ఇగిరిక యివిరికయన హవిస్సు;
చిదుగు వేలమి కట్టెనాఁ జెలఁగి సమిధ
లమ్యొ; సోమాసియన సోమయాజిపేరు. 294

జన్నపుటొజ్జ అన ఋత్విక్కునిపేరు. ఇగిరిక, ఇవిరిక అన హవిస్సు పేళ్లు. చిదుగు వేలిమి, కట్టె అన సమిధపేళ్లు. సోమాసి అన సోమయాజి పేరు.

బాసవాలు, రుసి, నిరాహారి, జోగి, తపసి, జపధారి, అన ఋషికిఁ బేర్లు. బోడ, కావితాల్పు, సన్నాసి, విన్నాణి అనఁగా యతికిఁ బేళ్ళు.

క. వడుగును వడుపు తిడుపుదా
ల్పుడు మెణకరి బొమ్మచారి ముంజీఁడు మఱిఁ గా
వడుగఁడును గోచిబాఁపఁడు
నడరెను భువి బ్రహ్మచారి కాఖ్యలయి హరీ 299

వడుగు, వడుపు, తిడుపుదాల్పు, మెణకరి, బొమ్మచారి, ముంజీడు, వడుగడు, గోచిబాఁపఁడు అనఁగా బ్రహ్మచారికిఁ బేళ్ళు.

గీ. గేస్తునాఁ గాఁపనంగ గృహస్థుపేర్లు;
లంబి లంబీయు తెంబి కుటుంబమౌను;
ప్రాచితమన ప్రాయశ్చిత్త భావమౌను;
బొటియచూలినాఁ వాల్మీకివఱలె శౌరి. 300

గేస్తు, కాఁపు, అనఁ గృహస్తుపేళ్ళు. లంబి, లంబీ, తెంబి అన కుటుంబము పేళ్ళు. ప్రాచితను అన ప్రాయశ్చిత్తము పేరు. బొటియచూలి అన వాల్మీకుల పేరు.

గీ. జడయు తిరినాఁగ జటపేర్లు; జడలచుట్ట
చొళియమును చొళ్ళె మనఁగను తెనుఁగు పదము
నిలఁ జెలఁగె జటాశిఖ పేళ్ళు; నిట్టితోలు
నాఁగ కృష్ణాజినము పేరు నలిననాభ. 301

జడ, తిరి అన జటకుఁ బేళ్ళు. జడలచుట్ట, చొళియము, చొళ్ళెము అనఁగా జటాశిఖకు పేళ్ళు. ఇట్టితోలు అన కృష్ణాజినము పేరు.

గీ. కత్తుపాలకు కత పాల కక్కుపాల;
దండమునకు లాతాము లాతము; కమండ

లంబునకును జాఁదియన కంబళినాఁజె;
క్షౌరమునకు కొఱుగు కోఁగు క్షౌరములాంగ 302

కకపాల, కకళ-పాల అను కృష్ణపాలపేళ్ళు లాతాము లాఁచము. అను దంపము పేళ్ళు. జాకి అను కమండలము పేరు. కొఱుగు కోఁగు అను క్షౌరము నకుఁ బేళ్ళు

క. చెఱువంబన చెర్వుయనం
జెయిదియు పనిచెయ్వనంగ చెప్పంగనగాఁ
జెయువని యనఁగా పనిపేళ్ళు
దయ వికచాంబుజహస్త పదా కర్మాఖ్యల్ 303

చెయిదము, చెయ్యి, చేయుట, పని, చెయ్వు, చేయువు, చెయువు అనఁగా కర్మపేళ్ళు.

సీ. జందియము జన్నిదంబును జందెమనఁగ
జంధ్యమునకు నామంబులౌ; జడకమనఁగ
బొంతనాఁగను కుచ్చులిగంత నాఁగ
కంథకు నభిఖ్యలౌ నీలకంధరాంగ. 304,

జందియము, జన్నిదము, జందెము, అను జంధ్యము పేళ్లు, జడకము బొంత, కుచ్చులి, గంత అను కంథ పేళ్ళు

గీ. పోటముంజియు గోణంబు పుట్టగోఁచి
గోవణంబును గోణాము గోసి గోఁచి
బొట్టమును కచ్చడంబును పొట్టము తడ
పనఁగ కౌపీనమున కాఖ్యలౌను శౌరి 305

పోటముంజి, గోణము, పుట్టగోఁచి, గోవణము, గోణాము, గోసి, గోఁచి, బొట్టము, కచ్చడము, పొట్టము, తిడపు అను కౌపీనము పేళ్ళు

గీ. గాసమెఱ యారగింపును గాఱి తిండి
యన నాహారమున కాఖ్యలయ్యె; నిలియు
నిట్టు నిప్పస్తు నంకను నిట్రు మఱి యు
పాసమన పస్తనా నుపవాసమిూను 306

గాసము, ఎఱ, ఆరగింపు, గాఱి, తిండి అన ఆహారముపేర్లు. ఇట్టి
నిట్టు, నిప్పస్తు, నంకను, నిట్రు, ఉపాసము, పస్తు అన ఉపవాసము పేర్లు.

గీ. ఆకలియును గొదయునను నంగదయును
క్షుధకు నాఖ్యలగును; వటించుటన నుపవ
సించుటకు పేరు; వాకలిసేసెన నాకలి
గొనె నాకొనె నాఁగ క్షుధగొను పేర్లౌ 307

ఆకలి, గొద, అంగద అనఁగా క్షుధకుఁ బేర్లు. వటించు అన ఉప
వసించుటపేరు. ఆఁకలిసేసె, ఆఁకలిగొనె, ఆఁకొనె అనఁగా క్షుధగొను పేర్లు

గీ. దప్పి దగ దూప నీర్వట్టు దప్పి నీరు
వట్టు దప్పిక యనఁగ పిపాసయౌను;
దూపటిల్లన దూపించు దూపలునన
దప్పిగొనన దాహముగొను కొప్పు పేరు. 308

దప్పి, దగ, దూప, నీర్వట్టు దప్పి నీరువట్టు, దప్పిక అన పిపాసకు
పేర్లు. దూపటిల్లు, దూపించు, దూపిలు, దప్పిగొను అన దాహముగొను పేర్లు.

గీ. పెండ్లియన చెట్టబట్టన పెండిలియన
దనరె నుద్వాహమునకును; తాలిబొట్టు
నాఁగ మినుకన మూసకనాఁగ తాలి
యనఁగ మంగళసూత్రమౌ ననుర వారి. 309

యనఁగ జోత్రంబు జోహారన జోతయన
గను జోతామన దండమనఁగ మ్రొక్క
డనఁగ శెంకణమని యనఁగ జేజేయన
మొక్కనఁగను కేలుమొగ్గనాఁగ
కై మోడుపన నమస్కారంబునకు బేళ్లు;
చెంగనాల్ గొబ్బిళ్ళు చిన్నవువులు

గీ. కేకసలు గిడిగిల్లు డింగిల్లును కయి
చాపులును కేలుదోయిల్లు చాఁగిలింత
లేటికోళ్లెఱఁగుళ్ళన నిల నమస్సు
భేదమునకు నభిఖ్యలౌ వేదవేద్య! 313

జోహారువు, జోహారు, జోహారువు, కోవు, ఒకిగ, జోత్రము, జోహారు జోత, జోతాము, దండము, మ్రొక్కడు, శెంకణము, జేజే, మ్రొక్క. కేలుమొగ్గ అనఁగా నమస్కారమునకుఁ బేర్లు. చెంగనాలు, గొబ్బిళ్లు, చిన్నవు వులు, కేకసలు, గిడిగిల్లు, డింగిల్లు, కయిచాపులు, కేలుదోయిళ్లు, చాఁగి లింతలు, ఏటికోళ్లు, ఎఱగుళ్లు, అనఁగ నమస్కారవిశేషముల పేరులు.

గీ. ఎఱఁగనఁగ మ్రొక్కనియనఁగ నెఱఁగనంగ
నగు నమస్కరించుటకాఖ్య లాంధ్రమునను
బాఁపనకులపు చేరువపల్కులుగల
బ్రహ్మవర్గ మ్ముగిసె స్వర్గపాలపత్తు. 314

ఎఱఁగు, మ్రొక్కు, ఎఱఁగు అనఁగా నమస్కరించుటపేర్లు.

బ్రహ్మవర్గు ముగిసెను.

---

## క్షత్రియ వర్గ

సీ. అరసు దేవర యొడయఁడు సామి యేలిక
యొడయుఁడు ఱేఁడు రాయఁడును జియ్య
యెకిమీఁడు పాదుసా యేలినవాఁడును
పుడమిఱేఁడును మన్నియఁడును రావు
మన్నీడు మన్నెడు మన్నెకాఁడును దొర
నేలతాలుపు దణి నేలఱేఁడు
నాయఁడు మన్నియ నాయకుఁడును పాదు
సాహి యనఁగ రాజసంజ్ఞలు; ప్రభు
గీ. వును ప్రతాపి ప్రతాప సమర్థనాఖ్య; మణెప
కాఁడు నా ప్రభువన నధికారి తెలుఁగు
నందు; రారాజు రాఱేఁడనంగ చక్ర
వర్తి కలదెను నామాళి వాసుదేవ. 315

అరసు, దేవర, ఒడయఁడు. సామి, ఏలిక, ఒడయుఁడు, ఱేఁడు, రాయఁడు, జియ్య, ఎకిమీఁడు. పాదసా, ఏలినవాఁడు. పుడమిఱేఁడు, మన్నియఁడు, రావు, మన్నీడు, మన్నెడు, మన్నెకాఁడు, దొర, నేలతాలుపు, దణి, నేలఱేఁడు. నాయఁడు మన్నియ, నాయకుఁడు, పాదుసాహి, అనఁగా రాజుపేళ్లు. ప్రభువు, ప్రతాపి, ప్రతాప అన సమర్థునిపేళ్లు. మణెపకాఁడు, ప్రభువుఅనఁగా అధికారిపేళ్లు. రారాజు, రాఱేఁడుఅనఁగ చక్రవర్తిపేళ్లు

గీ. పుడమి గొంతి కుంతియగును; వడముడి వలి
మొలక తోఁటేటిబొజ్జ భీమునకుఁజెల్లె;

కఱ్ఱి వివ్వచ్చు క్రీడియు కవ్వడియన
ఫల్గునుఁడు; ద్రోవదియును ద్రౌపది మఱియగు. 316

గొంతి అన కుంతికి పేరు, వడముడి, వలిమొనగాఁడు, గొఱ్ఱెపోతు, అనఁగా భీమునికి పేళ్లు. కఱ్ఱి, వివ్వచ్చు, క్రీడి, కవ్వడి, అనఁగా అర్జునుని పేళ్లు. ద్రోవది అన ద్రౌపదికిఁ బేరు

క. చనువన నాయకరంబన
మణిగము పాపత్తెమనఁగ మన్నెఱికెమనన్
మణివిడంబు పారుపత్తెం
బనఁగా నధికారమునకు నాఖ్యలు వెలయున్. 317

చనువు, నాయకరము, మణిగము, పాపత్తెము, మన్నెఱికెము, మణివిడము, పారుపత్తెము అనఁగా అధికారమునకుఁ బేళ్లు

గీ. రాచయనఁగను రాయనఁగ రాజసంజ్ఞ;
బుజముపుట్టువు నాఁ రాచపుట్టువనఁగ
రాచవాఁడన క్షత్రియవ్రాతము; తగ
వరియు తీర్పరి న్యాయాధిపతికి పేళ్లు. 318

రాచ, రా అన రాజసంజ్ఞకుఁ బేళ్లు. బుజముపుట్టువు, రాచపుట్టువు రాచవాఁడు అన క్షత్రియునిఁ బేళ్లు. తగవరి, తీర్పరి అన న్యాయాధిపతికిఁ బేళ్లు

క. ఏలుబడి యేలుటయునన
పాలనమునకాఖ్యలౌను; పాలించుటకున్
నేలుకొను నేలుననఁ మని
పాలితపద! యొజ్జనాఁగ పాఠోపాహితుఁడౌ 319

ఏలుబడి, ఏలుట అనఁగా పాలనమునకుఁ బేళ్లు. ఏలుకొను, ఏలు అనఁగా పాలించుటకుఁ బేళ్లు. ఒజ్జ అన పాఠకునిఁ బేరు.

క. పెగడయన న్మంత్రియన
ప్రెగడయు హేజీబనంగ ప్రెగ్గడయనఁగా
నగు మంతన ప్రెవడయనన్
నగరాడ్ధర! ముఖ్యమంత్రి నామంబులగున్ 320

పెగడ, మంత్రి, ప్రెగడ, హేజీబు, ప్రెగ్గడ, మంతన, ప్రెవడ అను మంత్రికిఁ బేర్లు.

గీ. మండెమన మాడెమనఁగను మండలాధి
పతి ధరామండలము; పిడివాటు నాఁగ
నగు నొడంబడికయు నాఁగ నగును రాజ
శాసనమున కభిఖ్యలు శ్యామలాంగ 321

మండెము, మాడెము అనఁగా మండలాధిపతి చేయు భూమికిఁ బేర్లు. పిడివాటు, ఒడంబడిక అనఁగా రాజశాసనమునకుఁ బేర్లు.

గీ. ధర దణాపెద్ద దళవాయి దళవరి గమి
కాఁడు దడవాయి చేరువకాఁడును పడ
వాలు మొనకాఁడు దొరయు పడాలును దడ
వరి దణాయఁడు సేనాధిపతికిఁ బేర్లు. 322

దణాపెద్ద, దళవాయి, దళవరి, గమికాఁడు, దడవాయి, చేరువకాఁడు, పడవాలు, మొనకాఁడు, దొర, పడాలు, దడవరి, దణాయఁడు అను సేనాధిపతికిఁ బేర్లు.

గీ. అవని కటుక కట్టుక నకీబనఁగ నిత్య
బహువచనమున కోలలవారనంగ
నగును వేత్రహస్తులు; ప్రతీహారుఁడగును
గొల్ల పడిహారి పణిహారి కోమలాంగ. 323

కటుక, కట్టుక, నకీబు ని॥ బ॥ కోలలవారు అన వేత్రహస్తునిఁ పేర్లు. గొల్ల, పడిహారి, పణిహారి అనఁగా ప్రతీహారుని పేర్లు.

గీ. లేఁక సుండఁడు బోడిక లెంక బంటు
వరవుఁడును డింగరీఁడన భటునికాహ్వ
యంబులొప్పను; బానిసీఁడనఁగను పడి
గాపునా సేవకుని పేళ్లు గాఁ లోల 324

లేఁక, సుండఁడు, బోడిక, లెంక, బంటు, వరవుఁడు, డింగరీఁడు అనభటుని పేర్లు. బానిసీఁడు, పడిగాపు అన సేవకుని పేర్లు

క. పగవాఁడు గొట్టు మాఱ్తుఁడు
పగతు పవతు దాయ గొంగ బరిమాఱుతుఁడున్
పగదారి సూడు వెట్టం
బగు బహువచనమునను పగఅన శత్రువుఁడా. 325

పగవాఁడు, గొట్టు, మాఱ్తుడు, పగతు, పవతు, దాయ, గొంగ, బరి, మాఱుతుఁడు, పగదారి, సూడు, వెట్టము, ని॥ బ॥ పగలు అన శత్రువునిఁ పేర్లు

మ. అమరేంద్రాశ్రితపాద! కూర్మి చెలి నేయంబంటుపొంతంబు నే
స్తము చెల్మిం జెలికారమున్ జెలిమియున్ సంగాతముం బొందు నె
య్యమియున్ సంగడి నంటు ప్రేముడియు నెయ్యంబున్మరిన్ సంగడం
బను రేన్ క్షోణిని స్నేహనామములు నాంధ్రాభ్యాస వా
క్యంబులన్. 326

కూర్మి, చెలి, నేయము, అంటు, పొంతము, నేస్తము, చెల్మి, చెలికారము, చెలిమి, సంగాతము, పొందు, నెయ్యమి, సంగడి, నంటు, ప్రేముడి నెయ్యము, సంగడము అనఁగా స్నేహమునకుఁ పేర్లు

కం. చెలిమరి నెయ్యరి నెయ్యుఁడు
చెలి సఖుఁడును సంటుకాఁడు చెలిమీఁ సుహృ
ద్దల రుద్దికాఁడు మిత్త్రుఁడు
చెలికాఁడును పొందుకాఁడు స్నేహితునాఖ్యల్. 327

చెలిమరి, నెయ్యరి, నెయ్యుఁడు, చెలి, సఖుఁడు, సంటుకాఁడు, చెలిమీఁడు, సుహృద్దు, సౌహృద్దికాఁడు, మిత్త్ర, చెలికాఁడు. పొందుకాఁడు అన స్నేహితుని పేర్లు

గీ. ఆప్తతకును పల్లాయన మగును; మందె
మేలమగు ద్వేషమున కీసుమీఱి పేరు;
కంటు నొడ్డారమును సూడు కంటకంబు
పగయనంగ శత్రుత్వమౌ పంకజాక్ష. 328

పల్లాయనము అన ఆప్తత పేరు. మందెమేలము అన ద్వేషమునకుఁ బేరు. కంటు, ఒడ్డారము, సూడు, కంటకము, పగ అన శత్రుత్వముఁ బేర్లు

గీ. జోస్యమన వేలుపనఁగను జ్యోతిషంబు;
జోసి జోస్యుఁడనంగను జ్యోతిషుండు;
తెరువరియు బాటసారియు తెర్వరియన
పథికునకుఁ బేళ్లు చెల్లును పద్మనాభ. 329

జోస్యము, వేలుపు అన జ్యోతిషము పేళ్ళు. జోసి, జోస్యుఁడు అన జ్యోతిషుని పేళ్ళు. తెరువరి, బాటసారి, తెర్వరి అనఁగా పథికుని పేళ్ళు.

గీ. వ్రాఁతసాకిరియనఁగను వ్రాఁతకాఁడ
నఁగను వాయసకాఁడననగుచు లేఖ
కునకుఁ బేళ్లును; వ్రాయసమనఁగ వ్రాఁత
యనఁగ లేఖనమునకౌను హరిముకుంద. 330

వ్రాఁతసాకిరి, వ్రాఁతకాఁడు, వ్రాయసకాఁడు అనఁగా లేఖకునకుఁ బేళ్ళు. వ్రాయసము, వ్రాఁత అన లేఖనము పేళ్ళు.

గీ. వేగునాఁ గోటినా వార్త వెలసెఁ; గొట్టి
కాఁడు వేగరియును వేగుకాఁడు దాడి
కాఁడు కోటికాఁడు మఱి కోటికాఁడనంగఁ
జెలఁగి యపసర్పునకుఁ బేళ్లు జెల్లె శౌరి. 331

వేగు, కోటి అన వార్త పేళ్లు. కొట్టికాఁడు, వేగరి, వేగుకాఁడు, దాడికాఁడు, కోటికాఁడు, కోటికాఁడు అన అపసర్పుని పేళ్ళు

సీ. ఉక్కడీఁడును బంటు నెక్కటీఁడును బంటు
మాసటి దునెదారి మాసటీఁడు
మగఁడు పోటరి పోటుమగఁడు దునేదారి
వాఁడిమగండును వాలుమగఁడు
మొక్కలి గండఁడు మొనకాఁడు నెఱసరి
వజ్జ్రీఁడు సరదారు ప్రాయికాఁడు
వజ్జీరుఁడును జోదు ప్రాయిఁడును వజీరు
నాఁగ శూరునకగు నామపంక్తి

గీ. దావరీఁడు దావరియనఁ దనరె వీరు
నకును; గండరగండఁడు నాఁగ వీరు
గ్గలె నతిశూరునకు; నెడకాఁడు తార్పు
వాఁడు కాలరియన దూతవఱలె శౌరి.

ఉక్కడీఁడు, బంటు, నెక్కటీఁడు, బంటు, మాసటి, దునెద మాసటీఁడు, మగఁడు, పోటరి, పోటుమగఁడు, దునేదారి, వాఁడిమగఁడ వాలుమగఁడు, మొక్కలి, గండఁడు, మొనకాఁడు, నెఱసరి, వజ్జ్రీఁడు,స

వారు, ప్రాయికాఁడు, వజ్జీరుఁడు, జోదు, ప్రాయిగాఁడు, వజీరు అన శూరు
నకుఁ బేళ్ళు. దావకీఁడు, వావరి అనఁ బిరుసునకుఁ బేళ్ళు. గండరగండఁడు అనఁ మహా
శూరునకుఁ బేరు. ఎదకాఁడు, తార్పుగాఁడు, కాలరి అనఁగ హంతకుఁ బేళ్ళు.

క. పెంజేరము పెండారము
పెండెము పెండియము గండపెండారంబున్
పెంజెరిమన తెలుఁగున బ్రా
హ్మండావన! బిరుదనూపురాభిఖ్యలగున్ 333

పెండేరము, పెండారము, పెండెము, పెండియము, గండపెండారము, పెండెరిము అనఁగా బిరుదనూపురము పేళ్ళు.

గీ. కట్నమును కాన్క పోరచి కట్టనంబు
పావడము సూడిదయు నలుపా యులుపయు
దరిసెనము నుడుగరయును దర్శనంబు
కానికయునంగ నుపహారమౌను దేవ. 334

కట్నము, కాన్క (కానుక), పోరచి, కట్టనము, పావడము, సూడిద, నలుపా, ఉలుప, దరిసెనము, ఉడుగర, దర్శనము, కానిక అనఁగా ఉపహారము పేళ్ళు.

ఆ వె. అప్పనంబనంగ కప్పంబునాఁ బంజి
యనఁగ పలచమనఁగ నరియనంగ
పగిదినాఁగ మఱియు పన్నన కానుక
నాఁగ రాజకరము నాగశయన. 335

అప్పనము, కప్పము, పంజి, పలచము, అరి, పగిది, పన్ను, కానుక అన రాజకరము పేళ్ళు.

గీ. గద్దె సింగపుఁబీఁటయు గద్దియ యన
నలరి సింహాసనంబుఁ గొను; గొడుగు
ఛత్రమగును; జాలీ జంపు జల్లి లాల
సరియు జాలరు లాలంబు ఝుల్లరియగు. 336

గద్దె, సింగపుఁపీట, గిద్దియ అనఁగా సింహాసనము పేళ్ళు. గొడుగు అనఁగా ఛత్రమునకుఁ బేరు. జాలీ, జంపు, జల్లి, లాలసరి, జాలరు, లాలము అన ఝుల్లరి పేళ్ళు.

పంచపాది గీ. సురటి సురటీయు సీవిరి సూరెపాను
నాఁగ తాళవృంతము; జల్లినాఁగ జల్లె
డెయ్యుఁ వీచోపులన సీవిరియుఁ మఱియు
సాగె వింజామరంబు వింజామరయనఁ
జెల్లె చామరనామముల్ శేషశయన 337

సురటి, సురటీ, సీవిరి, సూరెపాను అన తాళవృంతము పేళ్ళు. జల్లి, జల్లెడె, బ॥ వీచోపులు, వి॥ సీవిరి, వింజామరము, వింజామర అనఁగా చామరము పేళ్ళు.

చ. పముజు దడంబు రాణువయు పాళియముం జదలంబు దండు బ
ల్గము పరి యెట్టపోగు బలగంబును సంగడమున్ దణా పటా
లముదుముదారుకొమ్ము నుదళంబును వెల్లువమూఁక వాఁగుపా
ళెము మొనపంజు తత్తబడ లీలను సైన్యము పేళ్లు మాధవా

పముజు, దడము, రాణువ, పాళియము, చదలము, దండు, బల్గము, పరి, ఎట్టపోగు, బలగము, సంగడము, దణా, పటాలము, దుముదారు, కొమ్ము, దళము, వెల్లువ, మూఁక, వాఁగు, పాళెము, మొన, పంజు, తత్తబడ అన సైన్యము పేళ్ళు.

గీ. ఆరెకుఁడునాఁగ తలవరియును తలారి
నాఁగ నారక్షకున కాఖ్యలౌను; కాలి
బంటు కాల్బానిసియును కాల్బలము కాల్వూ
రు నడజోదును కాలరియుఁ బదాతి. 339

ఆరెకుఁడు, తలవరి, తలారి అనఁగా ఆరక్షకుని పేళ్ళు. కాలిబంటు, కాల్బానిసి, కాల్బలము, కాల్వూరు, నడజోదు, కాలరి అన పదాతి పేళ్ళు.

గీ. ఎక్కుడుమొకంబు నేనిక యేనుఁగు బలు
హజ్జమొకమును గౌరును హస్తి గవుసు
చేఁగలమొకంబు మఱి గబ్బిచెవిమొకము
వెంటద్రాగుడనఁగ గజమునకుఁ బేరు. 340

ఎక్కుడుమొకము, ఏనిక, ఏనుఁగు, బలుహజ్జమొకము, గౌరు, హస్తి, గవుసు, చేఁగలమొకము, గబ్బిచెవిమొకము, వెంటద్రాగుడు అనఁగా గజము పేళ్ళు.

గీ. మదగజమునకు మస్తియు మదపుటేనుఁ
గనఁగ నామంబులగు; గజహస్తమునకు
చెయ్యి తొండంబు కేలనఁజెల్లెను; పరి
కాఁడు పట్టపేనుఁగు భద్రగజముపేళ్లు. 341

మస్తి, మదపుటేనుఁగు అనఁగా మదగజము పేళ్ళు. చెయ్యి, తొండము, కేలు అనఁగా కరిహస్తము పేళ్ళు. పరికాఁడు, పట్టపేనుఁగు అన భద్రగజము పేళ్ళు.

గీ. మాఁగటీఁడు మావంతుఁడును మావటి బరి
కాఁడు మావంతు మావటివాఁడు నాఁగ

హాస్తిపకునాఖ్యలై చెల్లె; నంకుసమన
నంకుశమునకు నామధేయంబు శౌరి. 342

మావటీఁడు, మావతు, మావటివాఁడు, బరికాఁడు, మావంతు, మావటి అనఁగ హాస్తిపకుని పేళ్లు. అంకుసము అన అంకుశము పేరు.

క. ఆమన మస్తన మత్తన
నామికయన క్రొవ్వన మద మగు; తోత్రమునకు
న్నామంబులు బరిగోలయు
నా మాధవ బహువచనమునను సిల్లనఁగన్. 343

ఆము, మస్తు, మత్తు, ఆమిక, క్రొవ్వు అనఁగా మదము పేళ్ళు. బరిగోల, బ॥ సిల్లు అనఁగా తోత్రము పేళ్ళు.

సీ. తట్టువ తత్తడి తట్టువంబు గుఱంబు
బాబా తురికి జక్కి వారువంబు
గోడా హుమావును గుఱ్ఱంబు నడగఁడు
తేజీ కిలాతంబు తేజి కుదిర
వార్వంబును హుమాయి వారంబనంగను
తురగనామంబులై తొంగలించె;
కత్తలానియనంగ కత్తళఁడనఁగను
కర్తలాణమునకాఖ్యలు తనర్చె;
గీ. నత్తడియనంగ గోడికయనఁగ బడబ
యగును; సాంబ్రాణి సామ్రాణియనఁగ నుత్త
మాశ్వనామంబులు; రవగాలన రవాలు
నాఁగ నశ్వగతిపేళ్లు నాగశయన. 344

తట్టువ, తత్తడి, తట్టువము, గుఱము, బాబా, తురికి, జక్కి, వారువము, గోడా, హుమావు, గుఱ్ఱము, నడగండు, తేజీ, కిలాతము, తేజి, కుదిరం, వార్వము, హుమాయి, వారము అన తురగము పేళ్ళు. కత్తలాని, కత్తళండు అన కర్తలాణము పేళ్ళు. అత్తడి, గోడిక అన బడబ పేళ్ళు. సాంబ్రాణి, సాబ్రాణి అన ఉత్తమాశ్వము పేళ్లు. రవగాలు, రవాలు అన అశ్వగతి పేళ్ళు.

ఆ. వె. అంకెవన్నె వన్నెయనంగ నశ్వారోహ
సాధనంబగు; కయిజాయనంగ
నౌను తెలుంగునను ఖలీనాంతవాలాగ్ర
బంధనంబుపేరు పరమపురుష. 345

అంకెవన్నె, వన్నె అన ఆశ్వారోహసాధనము పేళ్ళు. కయిజా అనంగా ఖలీనాంతవాలాగ్రబంధనము పేరు.

గీ. కళ్లియంబును కళ్యంబు కళ్లెమనంగ
నగు ఖలీనాఖ్యలును; లాడమనంగలాళ
మన ఖురాంకితలోహసాధనము పేళ్లు;
గొరపమనంగను పేరౌను ఖురపమునకు. 346

కళ్లియము, కళ్యము, కళ్లెము అనంగ ఖలీనము పేళ్ళు. లాడము, లాళము అనంగా ఖురాంకితలోహసాధనము పేళ్ళు' గొరపము అన ఖురపము పేరు.

క. పల్లనయన పల్లంబన
పల్లనమన తెలుంగునందు పల్యాయనమౌ;
నుల్లారన సగతనంగా
పుల్లాంబురుహేక్షణ కుథమునకు నభిఖ్యల్. 347

పల్లన, పల్లము, పల్లనము అనంగా పల్యాయనము పేళ్ళు. ఉల్లారు, సగతు అన కుథమునకు పేళ్ళు.

గీ. వాగె నా వల్గయగు; మొగనడమనఁగ
జాలరన జల్లినా లాలసరియనఁగ
నగు కుధాంచలఝల్లరియగు; మఱి సకి
లింత సగిలింతనా హేష వంతుకెక్కె. 348

వాగె అన వల్గపేరు. మొగనడము, జాలరు, జల్లి, లాలసరి అనఁగ కుధాంచలఝల్లరి పేళ్ళు. సకిలింత, సగిలింత అన హేషకు పేళ్ళు.

గీ. ధర కరాళించు సకిలించు దనరె తెలుఁగు
నందు హేషించుటకు; బండి నాఁగ గాడి
యనఁగ తేరన కంచరమనఁగ కచ్చ
డంబనంగను శకటమా నంబుజాక్ష. 349

కరాళించు, సకిలించు అన హేషించుటకు పేళ్ళు. బండి, గాడి తేరు, కంచరము, కచ్చడము అనఁగా శకటము పేళ్ళు.

గీ. అరదమనఁగను తేరననౌ రథంబు;
తేరుకాఁడన రథికుఁడౌ; తేరు పూను
పరియనంగను సారథివఱలె; గీరె
కల్లు కలు కన్ను నాఁగ చక్రంబు పేళ్లు. 350

అదరము, తేరు అన రథము పేళ్ళు. తేరుకాఁడు అన రథికుని పేరు. తేరు పూన్పరి అన సారథి పేరు. గీరె, కల్లు, కలు, కన్ను అన చక్రము పేళ్ళు

గీ. అందలము పల్లకీయు పల్యంకి కాఖ్య
లగును; పన్నాగమనఁగ పల్యంకికాచ్ఛ
దనమగును; ముసనాబన దనరె యాప్య
యానపార్శ్వభాగాచ్ఛాదనాంబరంబు. 351

అందలము, పల్లకీ అన పర్యంకి పేళ్ళు. పన్నాగము అన పర్యంకిపైకప్పు పేరు. ముసనాబు అన యాప్యయానమునకీలుభాగముకప్పుతెర పేరు.

క. యతినుతపడ రౌతన రా
వుతునా సాదారనఁగ ద్వ్రుతునాఁగను రా
హుతునా రాహుత్తనఁగను
క్షితి వాహారోహకునకు జెల్లును పేళ్ళే. 352

రౌతు, రావుతు, సాదారు, ద్వ్రుతు, రాహుతు, రాహుత్తు అనఁగా వాహనారోహకుని పేళ్ళు.

గీ. ఎక్కిరింతయు నెకిరింత యెక్కుడును ప
టానియును వాహనంబుపేళ్ళను; జోదు
దొరయు నుక్కలుఁడన యోధ పరఁగు; జెట్టి
మాసటీఁడు మాసటినాఁగ మల్లుఁడౌను. 353

ఎక్కిరింత, ఎకిరింత, ఎక్కుడు, పటాని అన వాహనము పేళ్ళు. జోదు, దొర, ఉక్కలుఁడు అన యోధ పేళ్ళు. జెట్టి, మాసటీఁడు, మాసటి అన మల్లుని పేళ్ళు.

గీ. నెట్టెమును గుండుపాగయు నెట్టియమన
నగు శిరోవేష్టన; మఱి లాగు గుడిఁగియు చ
లాడమును చల్లడంబు చల్లాడమనఁగ
జానుమితవస్త్రకవచంబు సారసాక్ష. 354

నెట్టెము, గుండుపాగ, నెట్టియము అనఁగా శిరోవేష్టనము పేళ్ళు. లాగు, గుడిగి, చలాడము, చల్లడము, చల్లాడము అన జానుమితవస్త్రకవచము పేళ్ళు.

క. ఉయ్యెలయనఁగ నుయేలయు
నుయ్యలనా లాలియనఁగ నూయేలయునా
నుయ్యేలయన నుయాలయు
నుయ్యాలయనంగ డోలకొప్పె నభిఖ్యల్. 355

ఉయ్యెల, ఉయేల, ఉయ్యల, లాలి, ఊయేల, ఉయ్యేల, ఉయాల, ఉయ్యాల అన డోలకు పేళ్ళు.

క. వనజాక్ష జిరాయన జో
డన కత్తళమనఁగ చట్టయనఁగను జీరా
యన బొందళమన మేమజు
వన మజువన బొందడమన నగు కవచంబుల్. 356

జిరా, జోడు ,కత్తళము, చట్టె, జీరా, బొందళము, మేమజువు మజువు, బొందడము అనక వచము పేళ్ళు.

ఉ. న్యాయముమీఱ వస్త్రకవచాఖ్యలు నంగియు కుప్పసంబుచో
క్కాయియు కూసము న్మఱిచోకా కుపసంబును మేనికప్పుచొ
క్కా యరచట్టయు న్మఱిచోగా నిడుచట్టయనంగచొక్కచొ
క్కాయయు కుప్పసంబనఁగ గ్రాలునుధారుణి యందుమాధవా.

అంగి, కుప్పసము, చొక్కాయి, కూసము, చోకా, కుపసము, మేనికప్పు, చొక్కా, అరచట్ట, చోగా, నిడుచట్ట చొక్క, చొక్కాయ, కుప్పసంబు అనఁగా వస్త్రకవచము పేళ్ళు.

క. టోపియనఁగ తాజనఁగను
తోపియు కుళ్ళాయవంగ తొప్పియనంగా

నాపై కుళ్ళాయయనం
గా పటకృతమకుటమౌను కాంచనచేలా. 358

టోపి, తాజు, తోపి, కుళ్లా, తొప్పి, కుళ్లాయ అన పటకృతమకుటము పేళ్ళు.

క. బొమిడికము బొమ్మిడికమును
బొమిడీకము బొమ్మిడీకమును సీసకముఁ
బొమికంబు బొమ్మికంబును
బొమిడిక నాఁగను కిరీటమునకాఖ్యలగున్. 359

బొమిడికము, బొమ్మిడికము, బొమిడీకము, బొమ్మిడీకము, సీసకము బొమికము, బొమ్మికము, బొమ్మిడిక అన కిరీటము పేళ్ళు.

గీ. ప్రోఁగు పోఁగును తమ్మంటు నాఁగ కుండ
లాఖ్యలగును; సందిడి దండయనఁగ సంది
కడియమున సందిదండనాఁగ మఱి బాహు
పురియనంగ కేయూరమౌ పుణ్యపురుష. 360

ప్రోఁగు, పోఁగుఁ,తమ్మంటు అన కుండలము పేళ్ళు. సందిడిదండ, సంది కడియము, సందిదండ, బాహుపురి అనఁగా కేయూరము పేళ్ళు.

గీ. ఇల తలాటంబనఁగ తురాయియు తురాయ
నంగ మకుటాంకకనకసూనంబు పేళ్లు;
డాలువారు చిల్లోటియు డాలు కేడె
మరిగ హారిగయనఁగ ఖేటకాఖ్యలు హరి. 361

తలాటము, తురాయి, తురా అనఁగా మకుటాంకకనకసూనము పేళ్లు. డాలువారు, చిల్లోటి, డాలు, కేడెము, అరిగ, హారిగ అనఁగ ఖేటకము పేళ్ళు.

సీ. జంజాడి యడిదంబు జముదాడి జంజాళి
తరవలి వేడంబు తరవరియును
కగ్గంబు వేలంబు కరవాలు కిరుసును
మోహదా పట్టియమును పటాయు
కత్తి పట్టెంబు తేగాకత్తి వాలును
నారాజియును కరాచూరియును క
రాచురి తేగా నరాజీ మఱియును నా
రాజీయు పట్టాన రాజియనఁగ
గీ. ఖడ్గమున కభిధానముల్; ఖడ్గముష్టి
పేళ్లుజెల్లును జరనాఁగ పిడియనంగ
పరుఁజునాఁగను నెమ్మిలిపరుఁజునాఁగ
నౌను గాజాపరుంజన దానవారి. 362

జంజాడి, అడిదము, జముదాడి, జంజాళి, తరవలి, వేడము' తరవరి, కగ్గము, వేలము, కరవాలు, కిరుసు, మొహదా, పట్టియ, పటా, కత్తి, పట్టెము, తేగాకత్తి, వాలు, నారాజీ, కరాచూరి, కరాచురి, తేగా, నరాజీ, నారాజీ, పట్టా, నరాజి అన ఖడ్గమునకుఁబేళ్ళు. జర, పిడి, పరుఁజు, నెమ్మిలిపరుఁజు, గాజాపరుంజు అనఁగా ఖడ్గముష్టికిపేళ్ళు.

క. సురెనాఁగ చూరకత్తియు
సురియయు చూరీయనంగ చురకత్తియనం
జురయనఁగ, చూరియనఁగను
ఛురికాభిఖ్యలుదనర్చు సూరినుతాంఘ్రీ 363

సురె, చూరకత్తి, సురియ, చూరీ, చురకత్తి, చురి, చూరి అనఁగా ఛురికకుపేళ్ళు.

క. పిడెమనఁగను వంకిణియన
పిడియంబన బాఁకనంగ వెలసె మఱిసుషు ము
ప్ఫిడినా వంకియనఁగ మును
బడెవక్రచ్ఛురికపేళ్లు భవగిరివజ్రీ. 364

పిడెము, వంకిణి, పిడియము, బాఁకు, సుష్ఫిడి, వంకి అనఁగా వక్రచ్ఛురికపేళ్లు.

గీ. గుమితినాగుమ్మితియనంగ గుప్తఖడ్గ
మౌ కటారన చికటారియన కటారి
యనఁగ చిక్కటారియనంగ నా కటారి
మునకు తెలుఁగున నామముల్ మునివిలోల. 365

గుమితి, గుమ్మితి అన గుప్తఖడ్గముపేళ్లు. కటారు, చికటారి, కటారి, చిక్కటారి అనఁగా కటారమునకుఁ బేళ్లు.

గీ. కొఁఅడునాఁగ సామంతరాగోలనాఁగ
నుండసురియనాఁగ సబిడీయుఁ సిరాణి
యనఁగ వాయిదారయనంగ దనరె ఖడ్గ
భేదమునకు నభిఖ్యలు వేదవేద్య. 366

కొఁఅడు, సామంతరాగోల, ఉండసురియ, సబిడీ, సిరాణి, వాయిదార అన ఖడ్గవిశేషములపేళ్లు.

గీ. తుప్పెకో ల్ముల్కి కట్టియ కోల గసిక
యంబును లకోరియను జిరాయమ్ము చిల్కు
సరడు జీరా లకోరీయు గోరక తూఁపు
నారసము బరిగోలయనంగ శరము. 367

కుప్పెకోలు, ములికి, కట్టియ, గసిక, కోల, అంబు, లకోరి, జిరా, అమ్ము, చిలుకు, సరడు, జీరా, లకోరీ, గొరక, తూఁపు, నారసము, బరిగోలు అన శరముపేళ్లు.

గీ. అంపకోలయు చిల్కు దోఁటమ్ము బొట్టె
కోలయును మఱి నెలవంకకోల మఱియు
గన్నెరాకమ్మనంగను కమలనాభ
శరవిశేషంబులకుపేళ్లగుఁగాగ ధరణి. 368

అంపకోల, చిలుకు, దోఁటమ్ము, బొట్టెకోల, నెలవంకకోల, గన్నెరాకమ్ము అనఁగా శరవిశేషములకుఁబేళ్లు.

గీ. అలుగు చిల్లాణమును కైదు వల్లు కయిదు
వ యన బాణఫలాఖ్యలవని; ధనుస్సు
పేళ్లు సింగాణి సింగిణి విలు మఱియును
సింగిణీ సింగిడియనంగ శేషశయన. 369

అలుగు, చిల్లాణము, కైదువు, కయిదువ అన బాణఫలముపేళ్లు. సింగాణి, సింగిణి, విలు, సింగిణీ, సింగిడి అన ధనుస్సుపేళ్లు.

గీ. అల్లెయన గొనయంబన నల్లియయన
నారియన నెక్కుడనఁగ మోపునాఁగ నెక్కు
డనఁగ మౌర్వికి పేళ్లొప్పె; నరియనంగ
బాణసంధానమునకౌను పంకజాక్ష. 370

అల్లె, గొనయము, అల్లియ, నారి, ఎక్కు, మోపు, ఎక్కుడు అన మౌర్వి పేళ్లు. అరి అన బాణసంధానముపేరు.

గీ. పింజయన శరపుంఖంబుపేరు; వింటి
నవుము పిడికట్టు లస్తకనామమౌను;
కొప్పనఁగ కోపనఁగ వింటికొనయనంగ
గనయమనఁగను ధన్వాగ్రమునకు బేళ్లు. 371

పింజ అన శరపుంఖము పేరు. వింటినమ్ము, పిడికట్టు అన లస్తకము పేళ్ళు. కొప్పు, కోపు, వింటికొన, గనయము అన ధన్వాగ్రము పేళ్ళు.

క. గుఱి సూటినాఁగ లక్ష్యము;
గుఱివెట్టన లెప్పమనఁగ గుఱ్ఱ్వెట్టనఁగన్
గుఱికొనుసన లెప్పయనన్
వఱలెను లక్షించుటకును వాసవవినుతా. 372

గుఱి, సూటి అన లక్ష్యము పేళ్ళు. గుఱివెట్టు, లెప్పను, గుఱ్ఱ్వెట్టు, గుఱికొను, లెప్ప అన లక్షించుటకు పేళ్ళు.

గీ. దెప్పమన కూటలక్ష్యంబునొప్పు; తూఁపు
దెబ్బ యేటన శరహతి కబ్బెపేళ్లు;
దనరె శింజినీసంధానమునకు నెక్కి
డనఁగ మోపెట్టునా మోపిడనఁగఁ జెల్లు. 373

దెప్పము అన కూటలక్ష్యము పేరు తూఁపుదెబ్బ, ఏటు అన శరహతికి పేళ్ళు. ఎక్కిడు, మోపెట్టు, మోపిడు అనఁగా శింజినీసంధానము పేళ్ళు.

క. బత్తళికయు తరకసమును
బత్తడికయు దొనయు పొదియు పాణివడంబున్
బత్తళియు తరకసాయన
నత్తెను తూణీరమునకు నాఖ్యలు శౌరీ. 374

బత్తళిక, తరకసము, బత్తడిక, దొన, పొది, పొణివడము, బత్తళి, తరకసా అనఁగా తూణీరమునకుఁ బేళ్ళు.

క. తెలుఁగున నీటియ బరిచి స
బళమును కొంతంబు నీఁటె బరిచీ మఱియ
త్తలమును డొంకెన దొంకెన
చెలఁగెను కుంతలము పేళ్లు చిన్మయమూర్తీ. 375

ఈటియ, బరిచి, సబళము, కొంతము, ఈఁటె, బరిచీ, అత్తలము, డొంకెన, దొంకెన అన కుంతలము పేళ్ళు.

గీ. నేజమనఁగ నేజాయన నేజనాఁగ
చిల్లకోలయనంగను జెలఁగె తోమ
రాఖ్యలై; లౌడినా లౌణియనఁగ గుదియ
బరిసనాఁగను జెల్లెను పరిఘమునకు. 376

నేజము, నేజా, నేజ, చిల్లకోల అన తోమరము పేళ్ళు. లౌడి, లౌణి, గుదియ, బరిస అనఁగా పరిఘమునకు పేళ్ళు.

గీ. కూచినా వాఁడినాఁగను క్రూరన పద
ననఁగ నైశిత్యమగును; వాయనఁగ వాద
రయనఁగా జెల్లు ఖడ్గధారకును; వాలి
కయును వాలారు వాఁడినాఁగను శితంబు. 377

కూచి, వాఁడి, క్రూరు, పదను అనఁగా నైశిత్యమునకుఁ బేళ్ళు. వా, వాదర అనఁగా ఖడ్గధారకు పేళ్ళు. వాలిక, వాలారు, వాఁడి అన నిశితము పేళ్ళు.

గీ. పదను సేయును తీడును వాఁడిసేయు
ననఁగ శితకృత్యమగు; గనిబన నొఱయన

ఖడ్గకోశంబగును; బాణగణముపేరు
జల్లె సంపఱియనఁగను శేషశాయి.                379

పదనుసేయు, తీడు, వాఁడిసేయు అనఁగా శస్త్రకృత్యము పేళ్ళు. గవిబు, ఒఱ అన ఖడ్గకోశము పేళ్ళు. అంపఱి అన బాణగణము పేరు.

శా. పోరాటన్న దురంబనం గలఁకనాఁ బోట్లాటనా నన్నినాఁ
బోరాటంబనఁగా వెసంకువయనం బోటన్న నాలంబు కం
గారన్నం గలనన్న నా పదవనాఁ గయ్యంబనంగా ననిం
బోరుకానాఁగను కంగిసన్న జగడంబుం జివ్వనా యుద్ధమౌ.

పోరాట, దురము, కలఁకు, పోట్లాట, అన్ని, పోరాటము, వెసంకువ, పోటు, ఆలము, కంగారు, కలను, పదప, కయ్యము, అని, పోరు, కంగిస జగడము, చివ్వ అనఁగా యుద్ధమునకుఁ బేళ్ళు.

క. పోరాటను జగడము నా
ర్వేరము మాఱాట యారివేరంబు మఱిన్
మారాట మటాటమనన్
శ్రీరమణా కలహమునకు చెలఁగె నభిఖ్యల్.                380

పోరాట, జగడము, ఆర్వేరము, మాఱాట, ఆరివేరము, మారాట, మటాట అన కలహము పేళ్ళు.

సీ. ఉత్తరచ్ఛదార్క్కరం బుప్పరించన కంద
ణంబు చాంగణ కందడంబు నొంటి
యడుగు గత్తెర యెడమడువు పరువడియు
విసరుమొనయు సరిబిత్తరంబు
వరసింగమును కళవర ముప్పళించును
చడికియు జోడింపు చప్పళింపు

కన్నాతయు తిణింగి కాసెనిల్కడ గళ
కత్తెర కొక్కిస గరిడియనఁగ
గీ. మల్లబంధవిశేషనామములసంజ్ఞ
కలిగె; నఱుకు పరువడియు గాయమాన
మనఁగ శస్త్రవిద్యావిశేషాఖ్యలగుచు
వెలసె బాలపురాధీశ వేంకటేశ. 381

ఉత్తరడొక్కరము, ఉప్పరించు,కందణము,చాంగణ,కండడము,ఒంటి యడుగుఁగత్తెర, ఎడమడువుపరువడి, విసరుమొన, సరిబిత్తరము, నరసింగము, కళవరము, ఉప్పళించు, చడికి, జోడింపు, చప్పళించు, కన్నాత, తిణింగి, కాసెనిల్కడ, గళకత్తెర, కొక్కిస, గరిడి అనఁగా మల్లబంధవిశేషముల పేళ్ళు. నఱుకు, పరువడి, గాయమానము అనఁగా శస్త్రవిద్యావిశేషము పేళ్ళు.

గీ. మల్లడించు మల్లాడును మల్లడిగొను
పెనఁగులాడును పెన్నును పెనఁగొను మెలి
గొను ముడివడును ముప్పిరిగొను పెనంగు
మెలయునా బాహుయుద్ధకృత్యములసె శౌరి. 382

మల్లడించు, మల్లాడు, మల్లడిగొను, పెనఁగులాడు, పెన్ను, పెనఁగొను మెలిఁగొను, ముడివడు, ముప్పిరిఁగొను, పెనఁగు, మెలయు అన బాహుయుద్ధము సేయుటకు పేళ్ళు.

క. మెలయునన లాగులాటయు
మలయుటయును మల్లటయును మల్లాటయునన్
మెలియయును పెనఁగులాటయు
చెలఁగెను భువిబాహురణము చిన్మయమూర్తీ. 383

మెలయు, లాసులాట, మలయు, మల్లట, మల్లాట, మెలియ, పెనఁగులాట అన బాహుయుద్ధమునకు పేళ్ళు.

గీ. ఎడ తెఱఁగు తీఱు పొందును ముడియనంగ
సంధికగు; గెల్పు గెలువంబు జయముపేళ్లు;
విఱుగు డోటము నోటోడు విఱుగు బన్న
మనఁగ నపజయమునకాఖ్యలౌ మురారి. 384

ఎడ, తెఱఁగు, తీఱు, పొందు, ముడి అన సంధికి పేళ్ళు. గెల్పు, గెలువము అన జయముపేళ్ళు. విఱుగుడు, ఓటము, ఓటు, ఓడు, విఱుగు అన అపజయము పేళ్ళు.

గీ. భంగపఱచుటకును జెల్లు చెంగగొట్టు
నొడుచు నోడించుననపేళ్లు; నుగ్గుడనఁగ
గడవనఁగ మేరయనఁగను గరుసన మరి
యాదనాఁగను జెల్లె మర్యాదకు హరి. 385

చెంగగొట్టు, ఒడుచు, ఓడించు అనఁగా భంగపఱచుటకు పేళ్ళు. ఉగ్గుడు, గడువు, మేర, గరుసు, మరియాద అన మర్యాద పేళ్ళు.

క. రాపిడియన నొరయికనాఁ
రాపన నొరపిడియనంగ రాయిడియనఁగన్
జాపనఁగ రుద్దుడనఁగను
రాపుడునా ఘర్షణంబు రాజీవాక్షా. 386

రాపిడి, ఒరయిక, రాపు, ఒరపిడి, రాయిడి, జాపు, రుద్దుడు, రాపుడు అన ఘర్షణము పేళ్ళు.

గీ. అప్పళించుననంగనౌ నప్పళింత
యనఁగ నౌ మల్లచఱపన ననని తెనుఁగు

నను భుజాస్ఫాలనంబయ్యె; నత్త్రైమనఁగ
హస్తకవచంబునకుఁబేరు హరిహయనుత. 387

అప్పళించు, అప్పళింత, పల్లచఱపు అనఁగ భుజాస్ఫాలనము పేళ్ళు. అత్త్రైము అన హస్తకవచము పేరు.

గీ. రాయి ప్రాము ఱాచును రాచును కరి
సించు రుద్దనఁగాను కర్షితము పేళ్లు;
సంకులమునకు దొమ్మియు సందడియును
క్రందు కయ్యంబనంగను కమలనాభ. 388

రాయి, ప్రాము, ఱాచు, రాచు, కరిసించు, రుద్దు అన కర్షితము పేళ్ళు. దొమ్మి, సందడి, క్రిందుకయ్యము అనఁగ సంకులయుద్ధము పేళ్ళు.

గీ. ధరణి పోటోగ్గునాఁగ యుద్ధప్రయత్న
మౌను; సూయాణమన యుద్ధయాత్ర పేరు;
మునుము పడవలమన సైన్యముఖమునకు; స
హాయమగు తోడు బాసట సాయమనఁగ 389

పోటొగ్గు, రూ॥ పోటోగు అన యుద్ధప్రయత్నము పేరు. సూయాణము అన యుద్ధయాత్ర పేరు. మునుము, పడవలము అన సైన్యముఖము పేళ్ళు తోడు, బాసట, సాయము అన సహాయము పేళ్ళు.

గీ. వెఱపు నంజిక యంజల్కు వెఱ యుళుకన
భయమునకు; వీఁక వీఁగును బహువచనము
నందు దిక్కుమొగంబులునాఁగ దిక్కు
మొగములనఁగ పలాయనమునకు పేళ్లు. 390

వెఱపు, అఁజిక, అంజు, అఱుకు, వెఱ, అళుకు అన భయమునకు పేళ్ళు. వీఁక, సీఁగు, బ॥ దిక్కుమొగంబులు, దిక్కుమొగములు అన పలాయనమునకు పేళ్ళు.

సీ. ఈడాడు డీకొను దాడియాడును తాకు
చెనకు నెదుర్చును చెనయు తొడరు
మార్కొట్టు మెడ్డొడ్డు మార్కొను దీకొను
మాఱొడ్డు మొగకొను మాఱువెట్టు
తక్కరిం చెద్రుచు వక్కళిం చెదురుచు
ముదళించు వీడ్వడు మోహరించు
దొరలు ముదలకించు మఱి వీడుపడు మాఱు
కొను పరిఘూర్ణించు కొమ్ముకెక్కు
గీ. ననఁగ ప్రతిఘటించుటకాఖ్యలౌను; కాలు
ద్రవ్వనాఁ గ్రాల్కొనఁగ కాల్ద్రవ్వనఁగ
కాలుకొననను కాలూదన కాలుకొల్పు
నాఁగ కలహప్రియమునకు నామపంక్తి. 391

ఈడాడు, డీకొను, దాడియాడు, తాకు, చెనకు, ఎదుర్చు, చెనయు తొడరు, మార్కొట్టు, మెడ్డొడ్డు, మార్కొను, దీకొను, మాఱొడ్డు, మొగకొను, మాఱువెట్టు, తక్కరించు, ఎద్రుచు, వక్కళించు, ఎదురుచు, ముదళించు, వీడ్వడు, మోహరించు, దొరలు, ముదలకించు, వీడుపడు, మాఱుకొను, పరిఘూర్ణించు, కొమ్ముకెక్కు అనఁగా ప్రతిఘటించుటకుఁ బేళ్ళు. కాలుద్రవ్వు, క్రాల్కొను, కాల్ద్రవ్వు, కాలుకొను, కాలూదు, కాలుకొల్పు అనఁగా రణోద్యుక్తోత్సాహమునకుఁ బేళ్ళు.

క. అడ్డంకి యాఁక యంకిలి
యడ్డము మఱి యడ్డపాటు నాటంకము సుం

కేడ్డము మన్నయు తగులం
బొడ్డుకొనె నిరోధనాఖ్యలొప్పి మురారీ. 392

అడ్డంకి, ఆఁక, అంకిలి, అడ్డము, అడ్డపాటు, ఆటంకము, సుంకు, ఎడ్డము, మన్న, తగులము అన నిరోధనము పేళ్ళు.

గీ. నెట్టనయును వాలాయంబు నెట్టమనఁగ
వెలసె ననివార్యమున; కాఁక పెట్టు డెక్క-
ప డరిఁగొను తడక ట్టరిపడన నింక
మించె నాఁకట్టునా నిరోధించుటకును. 393

నెట్టన, వాలాయము, నెట్టము అనఁగా అనివార్యము పేళ్ళు. ఆఁకపెట్టు, డెక్కపడు, అరిఁగొను, తడకట్టు, అరిపడు, ఆఁకట్టు అన నిరోధించుటకు పేళ్ళు.

క. విలుకాఁడు నంపకాఁడన
విలుఁదాల్పన వింటివాఁడు విల్కాఁడనినం
జెలఁగె ధనుర్ధారికి నా
ఖ్యలు; నుక్కఱనాఁగ శౌర్యమణఁగుట పేరా. 394

విలుకాఁడు, అంపకాఁడు, విలుదాల్పు, వింటివాఁడు, విల్కాఁడు అనఁగా ధనుర్ధారికి పేళ్ళు. ఉక్కఱ అన శౌర్యమణఁగుట పేరు.

క. అలకువ మాఱుమొగంబును
సొలపు మడువు లేటమొగము సొలయిక కొంకుం
జెలఁగె మఱియు నోహాటఁగ
బలరె పరాఙ్ముఖము పేళ్లు హాటకచేలా. 395

అలకువ, మాఱుమొగము, సొలపు, మడువు, లేటమొగము, సొలయిక, కొంకు, ఓహాటము అన పరాఙ్ముఖము పేళ్ళు.

సీ. కొంకన స్రుక్కన కుఱియ్యన నోహటి
ల్లన చెంగునాఁగ సాలయు నఁగ
పిఱుతీయునాఁగను పిఱుత్రివ్వుచన మఱి
పిఱుతివియుననంగ పిఱువడనన
పుయిలోటనాఁగను పుయిలోడఁ గనఁగను
వట్రించునాఁగను వట్రిల్లుననఁ
వెనుదీయునఁ జాడుగన నోహటించన
పుయిలోటమన పరాఙ్ముఖమగుటకు
గీ. నామములగు; సేనావ్యాపనమునకలరు
తరుమునా డీకొనుననంగ పరవనంగ
పరువునాఁగను కవియునాఁ బర్వనంగ
పేళ్లు తెలుఁగున కోటిరవిప్రకాశ. 396

కొంకు, స్రుక్కు, కుఱియ్యు, ఓహటిల్లు, చెంగు, సాలయు, పిఱుతీయు, పిఱుతివ్వుచు, పిఱుతివియు, పిఱువడు, పుయిలోటు, పుయిలోడు, వట్రించు, వట్రిల్లు, వెనుదీయు, జాడుగు, ఓహటించు, పుయిలోటము అనఁగా పరాఙ్ముఖమగుటకు పేళ్ళు. తరుము, డీకొను, పరవు, కవియు, పర్వు అనఁగా సేనవ్యాపించుటకు పేళ్ళు.

గీ. ముట్టడము ముట్టడియు లగ్గ ముట్టణంబు
శత్రుదుర్గావరితసైన్యసంజ్ఞ; మొగ్గ
రంబె మోఁరయు నొడ్డును మొగరంబు నొడ్డ
నంబు మోహరమనఁగ వ్యూహంబు పేళ్లు. 397

ముట్టడము, ముట్టడి, లగ్గ, ముట్టణము అన శత్రుదుర్గావరితసైన్యమునకుఁ బేళ్ళు. మొగ్గరము, మొన, ఒడ్డు, మొగరము, ఒడ్డనము, మోహరము అన వ్యూహము పేళ్ళు.

గీ. దుమ్ము త్రుమ్ము దుమారంబు దుమన ధూళి
యగును; డాలు పడగ టెక్కియంబు టెక్కె-
మన పతాకాఖ్యలౌ; సిడెమన కురుగడ
యనఁగ జెండాయనఁగ ధ్వజాఖ్యలగును. 398

దుమ్ము, త్రుమ్ము, దుమారము, దుము అన ధూళి పేళ్లు. డాలు, పడగ, టెక్కియము, టెక్కెము అనఁగా పతాకము పేళ్ళు. సిడెము, కురుగడ, జెండా అన ధ్వజము పేళ్ళు.

పంచపాది గీ. చేవ తట్టుస తాలిమి చేగ తెంపు
తెగువ మెఱవడి దిటమును తేఁకువ బర
వసము గాతు పటూరి దీమసము మొక్క-
లంబు మున్నెరకయు దీవసంబనంగ
ధైర్యమునకు నభిఖ్యలౌ దానవారి. 399

చేవ, తట్టుస, తాలిమి, చేగ, తెంపు, తెగువ, మెఱవడి, దిటము, తేఁకువ, బరవసము, గాతు, పటూరి, దీమసము, మొక్కలము, మున్నెరక, దీవసము అనఁగా ధైర్యమునకుఁ బేళ్ళు.

గీ. అవని పిఱికికండయు నధైర్యంబు సంజ్ఞ
యలరె; నాకరమనఁగ నౌ నాగ్రహంబు
సంజ్ఞ; యోట నోటాఱు నిస్సత్త్వసంజ్ఞ
యగును; మడిమంచ బలహీనమౌ మురారి. 400

ఉ. నారదజీవనా! కలితనం బొఱపున్ వడిపెంపు గోహరిన్
బీరము సోమముం బొనుపు వీఁకయు నెడ్డెఱయున్ వటారియున్
వీఁకయు సోమయున్ నెజియు వీకునుదండియు ప్రాయినాఁగ గో
హారియు పంతమున్మగఁటిమన్న పరాక్రమ నామధేయముల్

కలితనము, ఒఱపు వడి, పెంపు, గోహరి. బీరము, సోమము, పొను
పు, వీఁక ఎడ్డెఱ, వటారి, వీఁక, సోమ, నెజి, వీకు, దండి, ప్రాయి, గోహరి,
పంతము, మగఁటిమి అనఁగా పరాక్రమము పేళ్ళు.

గీ. గండు డగర తుటారియు దండిపోటు
మగఁటిమన్న పౌరుష్యనామంబులౌను;
వెనుక నాఁగ నండ యనుసన వెంబడియనఁ
జెల్లు ననుగతిశాఖ్యలై శేషశాయి. 402

గండు, దగర, తుటారి, దండి, పోటు, మగఁటిమి అన పౌరుష్యము
పేళ్ళు. వెనుక, అండ, వెంబడి అన అనుగతికి పేళ్ళు.

క. వాఁడియు మగఁటిమినా మగ
పాడియు నగ్గలిక నాఁగ వడినాఁ బోటున్
వాఁడిమి డాకయు నుక్కన
నా డంబున శౌర్య మవని హాటకచేలా. 403

వాఁడి, మగటిమి, మగపాడి, అగ్గలిక, వడి, పోటు, వాఁడిమి,
డాక, ఉక్కు అనఁగా శౌర్యమునకు పేళ్ళు.

క. ఇల నుత్సాహపరచుటకు
వెలసెను పురికొలుపునాఁగ పెడరేఁచన నె
క్కులుపెట్టు నెత్తుపెట్టన
కొలుపన దీకొనునవనంగ నెక్కొడవనఁగన్. 404

పురికొల్పు, పెదరేచు, ఎక్కులుపెట్టు, ఎత్తుపెట్టు, ఎసకొలుపు, డీకొను ఎక్కాడు అన ఉత్సాహపఱచుటపేళ్ళు.

క. కళ చొక్కు స్రుక్కు సొరుగును
సొలిమిడి యరచావు సొమ్మ సొగియిక సొగయుఁ
సొలయును సొగపుననంగను
చెలఁగి భువి మూర్ఛపేళ్లు జెల్లెముకుందా. 405

కళ, చొక్కు, స్రుక్కు, సొరుగు, సొలిమిడి, అరసావు, సొమ్మ సొగియిక, సొగయు, సొలయు, సొగపు అన మూర్ఛపేళ్ళు.

పంచపాది గీ. సొరుగు బాహిరపోవును సొలయును కొఱ
వోవు సొగయును బిమ్మిటివోవనంగ
నగును మూర్ఛిల్లుటకును; చావనఁగ మృతికి
నెసఁగె; కొఱప్రాణమనఁగ కుట్టుసురనంగఁ
దనరె కంఠగతప్రాణమునకు శౌరి. 406

సొరుగు, బాహిరవోవు, సొలయు, కొఱవోవు, సొగయు, బిమ్మిటవోవు అనఁగా మూర్ఛిల్లుటకు పేళ్ళు. చావు అన మృతికి పేరు. కొఱప్రాణము కుట్టుసురు అన కంఠగతప్రాణము పేళ్ళు.

సీ. ఇలుగును కెడయిక యీల్గును కడచను
కడతేఱు కూలును కడచు క్రుంకు
తుదిముట్టు తెగటాఱు దోరు పిలుకుమారు
కడగొట్టు నీలుగు కెడయు గిట్టు
పొరిమాలు మడియును పొరిపోవు క్రుందును
రూపఱు భ్రష్టును ర్భూపుమాయు

నుక్క. మడఁగు డింకు నుక్కు గీటడఁగును
గండడఁగును తెగు గంతుకొనును
గీ. మనుఁగు రూపడంగు మ్రగ్గును సమయును
పెద్దనిదురవోవు పిలుకుమాలు
మక్కు బిద్దునాఁగ మహిమృతించుట కాఖ్య
లలరె శ్రీకళత్రి యబ్జనేత్ర. 407

ఇలుగు, కెడయిక, ఈల్గు, కడచను, కడతేఱు, కూలు, కడచు, క్రుం కు, తుదిముట్టు, తెగటాఱు, దోరు, పిలుకుమాయు, కనగొట్టు, ఈలుగు, కెడయు, గిట్టు, పొరిమాలు, మడియు, పొరవోవు, కుర్రిందు, రూపఱు, చచ్చు, రూపుమాయు, ఉక్కుమడఁగు, డింకు, ఉక్కు, గీటడఁగు, గండడఁగు, తెగు, గంతుకొను, మనుఁగు, రూపడంగు, మ్రగ్గు, సమయు, పెద్దనిద్దురవోవు, పిలుకుమాలు, మక్కు, బిద్దుఅనఁగా మృతించుటకుఁ బేళ్ళు.

సీ. కడుపును నుఱుమాడు కెడపు చట్టలుచీరు
చదుపును కూల్చును చమరు తునుము
తెగఁజూచు త్రుంచును తెగటార్చు త్రెక్కొను
మట్టుపెట్టును కసిమసగు తున్మ
బలివారు సరిగొను బలిపెట్టు పొలికొను
రూపుఁబాపును వంతుబాపు చంపు
దోరుచు పొరిమార్చు తునుమాడు పరిమార్చు
నఱుపు నామమడంచు నఱుము సంపు
గీ. మన్నిగొను రూపడఁచు పొరిమాలుచు ఁబొలి
పుచ్చు తెగటాఱుచును పొరిపుచ్చు పిలుకు

మార్చునన మృతిఁబొందించుమాటలగును
తెలుఁగుబాసను మునిలోల దీనపాల 408

కడపు, పుఱుమాడు, కెడపు, చట్టలు-చీరు, చదుపు, కూల్చు, చమరు, తునుము, తెగఁజూచు, త్రుంచు, తెగటార్చు, త్రెక్కొను, మట్టుపెట్టు, కసిమసగు, తున్మ్రు, బలివారు, సరిగొను, బలిపెట్టు, పొలిగొను, రూపుఁబాపు, వంతుబాపు, చంపు, దోరుచు, పొరిమార్చు, తునుమాడు, పరిమార్చు, సుఱుపు, నామమడఁచు, నుఱుము, సంపు, మన్నిగొను, రూపడఁచు, పొరిమాల్చు, పొలిపుచ్చు, తెగటారుచు, పొరిపుచ్చు, పిలుక్కు-మార్చు అనఁగా మృతిబొందించుటకు పేళ్ళు.

సీ. ఉజ్జగి ల్లోరసి ల్లుడివోవు నెడగిల్లు
నొదుఁగు నొదుఁగుపడు నోరసింపు
సంబరి యోసరు సంబడి యెడయు పే
ర్చెత్తు బగళము కేడించు ప్రిదులు
తలఁగు తెఱలఁబాఱు తొలఁగు తెరలు తగ్లు
పాయు నూడనిబాడు పాయగిల్లు
జీరువాఱును పాచు చెంగు తొలంగును
జడియును విరియును బెడఁకు మఱియు

గీ. తలవునాఁగ తలంగన దారిబట్టు
నన బెడంకన నోసరిల్లని యుఁగ
నొను గెంటననొను పేళ్ళపసరిల్లు
టకును జెల్లెను దేవతానికరపాల. 409

చెండాడు, చెండుబెండాడు, చెలగు, తున్మ్రు, చెల్గు, నఱకు, నుగ్గాడు, మురికొను, తుండించు, చెండు, నఱుకు, తునుమాడు, వందఱలాడు, మోద్పఱచు, తునుము, పరిమార్చు, పాలాడు, కసిమెసఁగు, చక్కు-సేయు, ఉత్తరించు, తఱుగు అనఁగా ఖండించుటకు జేళ్ళు. తెసమడచు, రేసుగుడచు అనఁగా నశింపసేయుటకు పేళ్ళు.

గీ. ఆయామును కీలకము గుట్టు గాయకంబు
 కీలు మారాము లోచెయ్యి కిటుకు నొలవు
 నెఱను కొఱసంది గుఱికొండి వఱలెభువిని
 మర్మమునకునభిఖ్యలు మదనజనక. 412

ఆయము, కీలకము, గుట్టు, గాయకము, కీలు, మారాము, లోచెయ్యి కిటుకు, ఒళవు, నెఱను, కొఱసంది, గుఱికొండి అనఁగా మర్మమునకు బేళ్ళు.

గీ. ఆయువునకు నుగంబౌను; ప్రాణమునకు
 నుసుఱు మన్ని మిడుకు జెల్లెను; సబ ॥ బడు
 గనఁగ శవము; జీవస్థానమునకు నెఱను
 గురుసు గుఱికొండినాఁగను పరమపురుష 413

ఊగము అనఁగా ఆయువునకు పేరు. ఊసుఱు, మన్ని, మిడుకు అన ప్రాణము పేళ్ళు. సబము, బడుగు అన శవము పేళ్ళు. నెఱను, గురుసు, గుఱికొండి అనఁగా జీవస్థానమునకు పేళ్ళు.

గీ. బందె చెఱ యాఁక నాఁగ నిర్బంధ సంజ్ఞ
 జెల్లె; చెఱసాల గిడ్డఁగి చెఱయు బంది
 గంబు గండారునాఁగ నామంబులడరె
 నంబుజోదర కారాగృహంబు పేళ్లు. 414

బండె, చెఱ, అఁక అన నిర్బంధము పేళ్ళు. చెఱసాల, గిడ్డంగి, చెఱ, బందిగము, గండారు అనఁగా కారాగృహము పేళ్ళు.

గీ. బండగొనె చెఱపెట్టెను బందిగమిడె
ననఁగ నిర్బంధపెట్టుటకౌను రాచ
చేరికగలపల్కులతఁడఁజేరి తెనుఁగు
బడసి ముగిసెను క్షత్రియవర్గ మిట. 415

బండగొనె, చెఱపెట్టె, బందిగమిడె అనఁగ నిర్బంధపెట్టుట పేళ్ళు.

క్షత్రియవర్గు ముగిసెను.

---

# వైశ్యవర్గు

క. బేరియు తోడపుట్టనఁగ బె
హారియు కోమటియనంగ బేహారినా బే
హారియు బచ్చన సంపా
సారియు సెట్టియన వైశ్యసంజ్ఞ మురారీ. 416

బేరి, తోడపుట్టు, బెహారి, కోమటి, బేహారి, బేహారి, బచ్చు, సంపాసారి, సెట్టి అన వైశ్యునకుఁ బేళ్ళు.

గీ. బేరమన బెహారంబన బేహారమన
నెగడ బేహారమనఁగ వాణిజ్యసంజ్ఞ;
యెరవు పరపత్తెమును రోయి పొరచియు మఱి
చేబదులునాఁగఁజెల్లె యాచితకమునకు. 417

బేరము, బెహారము, బెహరము, బేహారము అన వాణిజ్యము పేళ్ళు. ఎరువు, పరపత్తెము, రోయి, పొరచి, చేబదులు అన యాచితకము పేళ్ళు.

గీ. అచ్చుదలనాఁగ రవడినా నప్పనంగ
ఋణము; వడ్డి తమానంబు వృద్ధికాను;
పెచ్చనఁగ నెచ్చుపెచ్చన సొచ్చెమనఁగ
నౌధనాధికమునకు మురాసురారి 418

అచ్చుదల, రవడి, అప్పు అనఁగా ఋణము పేళ్ళు, వడ్డి, తమానము అన వృద్ధికి పేళ్ళు. పెచ్చు, ఎచ్చుపెచ్చు, సొచ్చెము అనఁగా ధనాధికము పేళ్ళు

క. మకరాంకజనక రోనాఁ
గ కుదువనా గిరవనఁగ నగావనఁగా నా
హాకమన రోయికునఁగ నా
యకమనఁగా బంధకమునకౌ నామంబుల్. 419

రో, కుదువ, గిరవు, అగావు, ఆహాకము, రోయి, ఆయకము అనఁగా బంధకము పేళ్ళు.

గీ. ఆరుకలు నారుగలు నాళ్లు నౌను కోద్ర
వంబు; సజ్జలు గంటెలు కంబులనఁగ
కంగుభేదంబు; కొఱ్ఱలనంగ కొఱల
నంగ నొప్పెను భువిని బ్రియంగు సంజ్ఞ. 420

ఆరుకలు, ఆరుగలు, ఆళ్లు అనఁగా కోద్రవముల పేళ్ళు. సజ్జలు, గంటెలు, కంబులు అన కంగు పేళ్ళు. కొఱ్ఱలు, కొఱలు అన ప్రియంగువు పేళ్ళు.

సీ. ఇప్పపూరాజనా లేనుఁగుకొమ్ములు
నాకుసన్నఁబులు నాబ్రెగడలు

కప్పురబోగులు కస్తురిపట్టియల్
        కత్తిమల్లెలు చిటిముత్తెములును
రామసాగరములు రాజనములు తీవె
        సరులు ముస్తెలు ముత్తెసరులు తెక్క
పాయలు నక్కుళ్లు బంగారుతీగెలు
        మదనగందులు తీగమల్లియలును
గీ. కాకితెక్కలు చిటిపూలు గరుడసరులు
చందమామపువ్వులు నాగసాగరాలు
పాలమీఁగడలును సుకవాసులనఁగ
ధాన్యభేదంబులై యొప్పు దానవారి. 421

ఇప్పపూరాజనాలు, ఏనుఁగుకొమ్ములు, అనసన్నములు, అర్కెఁగడలు, కప్పురబోగులు, కస్తురిపట్టెలు, కత్తిమల్లెలు, చిటిముత్తెములు, రామసాగరాలు, రాజనములు, తీవెసరులు, ముస్తెలు, ముత్తెసరులు, తెక్కపాయలు, అక్కుళ్లు, బంగారుతీఁగెలు, మదనగందులు, తీఁగమల్లెలు, కాకితెక్కలు, చిటిపూలు, గరుడసరులు, చందమామపూలు, నాగసాగరాలు, పాలమీఁగడలు, సుకవాసులు అనఁగా ధాన్యభేదముల పేళ్ళు.

గీ. ఆవ లావాలు సానువులనఁగ సర్ష
కంబులగు; సెనగలు చణకంబులగును;
నూలు నువులన తిలలగును; వెలిగార
మనఁగ గవ్వచౌకమన టంకణంబుపేళ్లు. 422

ఆవలు, ఆవాలు, సానువులు అనఁగా సర్షకముల పేళ్ళు. సెనగలు అన చణకము పేరు. నూలు, నువులు అన తిలల పేళ్ళు. వెలిగారము, గవ్వ చౌకము అనఁగా టంకణము పేళ్లు.

గీ. కరిసనంబును సేద్యంబు కర్సనంబు
కమతమును కమ్మతము కృషికమరె పేళ్లు;
కమ్మతీఁ డరకాఁడును కమతకాఁడు
కరిసనీఁడన పేళ్లొప్పు కర్షకునకు. 423

కరిసనము, సేద్యము, కర్సనము, కమతము, కమ్మతము అన కృషికి పేళ్ళు. కమ్మతీఁడు, అరకాఁడు, కమతకాఁడు, కరసనీఁడు అన కర్షకునకు పేళ్ళు.

గీ. ఆబరము సని సస్సెంబు పైరు పయిరు
నాఁగ సస్యంబు; పాటకట్టనాఁగ పొట్ట
కట్టయు వరిపొట్టయు పాటకఅయనంగ
కలమగర్భంబునకు పేళ్లు కల్మషారి. 424

ఆరబము, ససి, సస్సెము, పైరు, పయిరు అనఁగా సస్యంబునకు పేళ్ళు. పాటకట్ట, పొట్టకట్ట, వరిపొట్ట, పాటకఅ కలమగర్భము పేళ్ళు.

పంచపాది గీ. తనరు మడి పొలమనఁగ కేదారభూమి;
చెలఁగె గుడ్డంబు పొలమన ఫలితభూమి;
గనిమనా వరుజనఁగ నొడ్డనఁగ నొను
క్షితిని కేదారకస్వల్పసేతువగుచు
బరగె; మునికోల ములుగోల ప్రాజనమగు. 425

మడి, పొలము అన కేదారభూమి పేళ్ళు. గుడ్డము, పొలము అన ఫలితభూమి పేళ్ళు. గనిమ, వరుజు, ఒడ్డు అనఁగా కేదారకస్వల్పసేతువు పేళ్ళు. మునికోలఁ ములుఁగోల అన ప్రాజనము పేళ్ళు.

పంచపాది గీ. నాగెలన కొంట్రకైదువునాఁగ దుక్కి-
వాలు నాగలి నాఁగేలు వఱలె హాలము;
నేరరక మడఁక యు బద్ధవృషహాలంబు;
వల్లెయనఁ ద్రాడఁగను వల్లియయన
రజ్జువగు; కొడవలి లవిత్రంబు పేరు. 426

నాఁగెలు, కొంట్రకైదువు, దుక్కి-వాలు, నాఁగలి, నాఁగేలు అన హాలము పేళ్ళు. ఏరు, అరక, మడఁక అన బద్ధవృషహాలము పేళ్ళు. వల్లె, త్రాడు, వల్లియ అన రజ్జువు పేళ్ళు కొడవలి అన లవిత్రము పేరు.

గీ. కందు బాణలి బంగల కంచుకట్టు
మంగలంబన భ్రాష్ట్రమౌ; మఱిహసంతి
కౌను కుంపటి వయ్యందియనఁగఁ పేళ్లు;
మూఁకుడనఁగ శరావమౌ మునివిలోల. 427

కందు, బాణలి, బంగల, కంచుకట్టు, మంగలము అన భ్రాష్ట్రము పేళ్ళు. కుంపటి, వయ్యంది అన హసంతి పేళ్ళు. మూఁకుడు అన శరావము పేరు.

క. కుండ పరఁటి ప్రవ్వ పనఁటి
బాండువ కొడు మలికి పంటి బాన మఱువనాఁ
భాండమగును; పింగాణియు
మొండుకొనెఁ ధరణి చీనమృత్పాత్ర హరీ. 428

కుండ, పరఁటి, ప్రవ్వ, పనఁటి, బాండువ, కొడుము, అలికి, పంటి, బాన, మారువ అన భాండము పేళ్ళు. పింగాణి అన చీనామృత్పాత్రి పేరు.

గీ. గాదె రంజణి కాఁగును గాజె రంజ
ణయనఁ జెల్లు నలంజర నామపంక్తి;

చెంబు జారీ గరగ గిండి తంబుగయును
సగ్గెడయు గలఁతియనాఁగ స్వల్పపాత్ర. 429

గాదె, రంజణి, కాఁగు, గాజె, రంజణ అనఁగా అలంజగము పేళ్ళు. చెంబు, జారి, గరగ, గిండి, తంబుగ, సగ్గెడ, గలఁతియ అన స్వల్పపాత్రము పేళ్ళు.

క. అరివాణము పేలా డ
బ్బుర గిన్నియ గిన్నెయును డబుర చిందుప ద
బ్బుర కోర దబురయనఁగా
మురదనుజవిఘాలఘషక మునకు సభిఖ్యల్ 430

అరివాణము, పేలా, డబ్బుర, గిన్నియ, గిన్నె, డబుర, చిందుప, దబ్బుర, కోర, దబుర అన చషకమునకుఁ బేళ్ళు.

క. ఇలభోజనపాత్రయగుఁ
దళిగయు కంచంబు తట్టె తలియు తెలియయుం
దలె యరివాణము పళ్లెము
తళియయు పళ్లెరమనంగ దగు పళ్యమనఁ. 431

తళిగ, కంచము, తట్టె, తలియ, తెలియ, తలె, అరివాణము, పళ్లెము తళియ, పళ్లెరము, పళ్యము అన భోజనపాత్ర పేళ్ళు.

గీ. ఒందడము దొంతి దొంతర బందలంబు
నాఁగ ఘటపరంపరరాజినామములగు;
దొంతరయనంగ వరుసనాఁ దొంతియనఁగ
వెలసె భువిపరంపరసంజ్ఞ వేదవేద్య. 432

బందడము, దొంతి, దొంతర, బందలము అన ఘటపరంపరపంక్తికి పేళ్ళు. దొంతర, వరుస, దొంతి అనఁగా పరంపర పేళ్ళు.

గీ. సన్నెకలు సనె సనెకల్లు సాన సన్నె
సన్నియయు ననఁగ శాణమౌ; చట్టువంబు
గరిఁటెనాఁగ బొన్నట్టన గంటెనాఁగ
యబకనాఁగ నగపనాఁగ నగును దర్వి. 433

సన్నెకలు, సనె, సనెకల్లు, సాన, సన్నె, సన్నియ అన శాణము పేళ్లు. చట్టువము, గరిఁటె, పొన్నట్టు, గంటె, అబక, అగప అన దర్వి పేళ్ళు.

గీ. సాద మోమటి బువ్వ ప్రసాద మోయి
రము పసాదము బోన మోరెమును వంట
కంబు దోమటి కూడోగిరంబనంగ
నన్నమగు; రెల్లనాఁ మెతుకనఁగ కణము. 434

సాదము, ఓమటి, బువ్వ, ప్రసాదము, ఓయిరము, పసాదము, బోనము, ఓరెము, వంటకము, దోమటి, కూడు, ఓగిరము అన అన్నము పేళ్ళు; రెల్ల, మెతుకు అన కణము పేళ్ళు.

గీ. బొనసంబును వంట సువారమనఁగ
పచనమునకౌను పే; ళ్లాడబాల బోన
కాఁడు వంటరియును వంటవాఁడు కుండ
గోకరి యనంగ నగు పాచకునకుఁ బేళ్లు. 435

బొనసము, వంట, సువారము అనఁగా పచనమునకుఁ బేళ్ళు. ఆడబాల, బోనకాఁడు, వంటరి, వంటవాఁడు, కుండగోకరి అన పాచకునకుఁ బేళ్ళు.

గీ. ఖండశర్కరకా పులకండయనఁగ
కండచక్కెరనాఁగను కండయనఁగ;
కూర్చికకు జున్నునంగను కురుజనంగ
దనరెఁ; మజ్జిగ చల్లనాఁ దక్రమగును. 436

పులకండము, కండచక్కెర, కండ అనఁగ ఖండశర్కరకు పేళ్ళు. జున్ను, కురుజు అన కూర్చికకు పేళ్ళు. మజ్జిగ, చల్ల అన తక్రము పేళ్ళు.

గీ. త్రైరు పెరుఁగును తయిరన దధికిపేళ్లు;
పాలనఁగ పంకమనఁగను పాఁడినాఁగ
క్షీరసంజ్ఞ; వెన్నయన మిసిమియనంగ
తెలుఁగునను నవనీతమగు దేవదేవ. 437

త్రైరు, పెరుఁగు, తయిరు అన దధికి పేళ్ళు. పాలు, పంకము, పాఁడి అన క్షీరముల పేళ్ళు. వెన్న, మిసిమి అనఁగా నవనీతము పేళ్ళు.

గీ. అంబకళమన నంబలియనఁ నవాఁగు
వౌ; పయశ్శర్కరికి బూదయనఁగ పాల
గరగనాఁ జెల్లెఁ; లాజలకొ బొరుగు లనఁగ
పేలలనఁగ పేలాలన ప్రేలలనఁగ. 438

అంబకళము, అంబలి అన అవాగువు పేళ్ళు. బూద, పాలగిగిగ అన పయశ్శర్కరికి పేళ్ళు. బొరుగులు, పేలలు, పేలాలు, ప్రేలలు అన లాజల పేళ్లు.

గీ. మెసఁగు మెసవు పసాపడు మెక్కు గ్రోలు
తినును [illegible] ; తిండియు నెర

యనఁగ సాపాటునా బోనమనఁగ బూతి
యనఁగ నారోగణమన భోజనముపేళ్లు. 439

మెసఁగు, మెసవు, పసాదము. మెక్కు, గ్రోలు, తిను అన భుజించుట పేళ్ళు. తిండి, ఎర, సాపాటు, బోనము, బూతి, ఆరోగణము అన భోజనమునకుఁ బేళ్ళు.

గీ. గ్రోలనఁగ ద్రావునాఁగ ద్రెక్కొనుటనంగ
నాను పానముసేయుట కాంధ్రమునను
గుక్కనా మ్రింగనంగ ద్రెక్కొనుననంగ
కముచునా గుక్కిలియనంగ కబళనంబు. 440

గ్రోలు, త్రాగు, ద్రెక్కొను అన పానముసేయుట పేళ్ళు. గుక్కు, మ్రింగు, ద్రెక్కొను, కముచు, గుక్కిలి అన కబళనము పేళ్ళు.

క. వనజాక్షా మెలకువయన
మనికియనఁగ బ్రతుకనంగ మనుగడయనఁగన్
మనునా బ్రదిమియనఁగ బ్రదు
కన జీవనమునకుఁ బేళ్లు హాటకచేలా. 441

మెలఁకువ, మనికి, బ్రతుకు, మనుగడ, మను, బ్రదిమి, బ్రదుకు అనఁగా జీవనము పేళ్ళు.

గీ. గొల్ల కీలారి ప్రేఁడును గొల్లవాఁడు
గొల్లఁడు కిలారియనఁగను గోపకుండు;
ప్రేఁత మంద ప్రోయాలును వేఁత గొల్ల
తయును గొల్లదినా గోపికయగు శౌరి. 442

గొల్ల, కీలారి, వ్రేఁడు, గొల్లవాఁడు, గొల్లఁడు, కిలారి అన గోపకుని పేళ్ళు. వ్రేఁత, మందప్రోయాలు, వేఁత, గొల్లత, గొల్లసి అన గోపికకుఁ బేళ్ళు.

గీ. గొల్లనా వ్రేయనంగను గోపకులము;
పసియనంగను పశ్వాఖ్యపరగె; ఘోష
మునకు కీలారమన మందయన కిలార
మనఁగ తొఱ్ఱుపట్టనఁ జెల్లు వనజనాభ. 443

గొల్ల, వ్రే అన గోపకులము పేళ్ళు. పసి అన పశువు పేళ్ళు. కీలారము మంద, కిలారము, తొఱ్ఱుపట్టు అన ఘోషమునకుఁ బేళ్ళు.

క. నఱ్ఱియు మొదవన నావన
తొఱ్ఱనఁగను గిడ్డియనఁగ తొడుకనఁగ మఱి
కుఱ్ఱియనఁగ నాబసియన
చిఱ్ఱున సురభికినిఁ బేళ్లు జెల్లె ముకుందా. 444

నఱ్ఱి, మొదవు, ఆవు, తొఱ్ఱు, గిడ్డి, రూ॥ గిడిపి, తొడుస, కుఱ్ఱియ, ఆబసిఅనఁగా సురభికి పేళ్ళు.

గీ. అఱ్ఱి యొఱ్ఱియ పోట్లావు నఱవ నఱ్ఱి
నాఁగ కరటకుఁ బేళ్లగు; నఱ్ఱియు గడి
పోతు మఱి ముడిగిబ్బ యాఁబోతు నాల
పోతునాఁగను గోవృషంబునకు పేళ్లు. 445

అఱ్ఱి, ఒఱ్ఱియ, పోట్లావు, అఱవ, నఱ్ఱి అన కరటకు పేళ్ళు. నఱ్ఱి గడిపోతు, ముడిగిబ్బ, ఆఁబోతు, ఆలపోతు అన గోవృషభము పేళ్ళు.

గీ. గోద యెద్దును గిబ్బయు గోణి గిత్త
కోడెనా వృషభంబగు; దూడ క్రేపు
లేగ గోవత్సనామావళియగు; కవ్వ
మనఁగ తఱిగోలనా మంథమగుమురారి 446

గోద, ఎద్దు, గిబ్బ, గోణి, గిత్త, కోడె అన వృషభముపేళ్ళు. దూడ, క్రేపు, లేగ అన గోవత్సముపేళ్ళు. కవ్వము, తఱిగోల అన మంథముపేళ్ళు,

గీ. అఁకత్రాడనఁగ తఱిత్రాడనఁగ త్రిప్ప
త్రాడనంగ మంథరరశ్మిదనరె; చిలుకు
నాఁగ త్రచ్చనయన తఱినాఁగ తరుచు
నా మథించుట కాఖ్యలౌ నలిననాభ. 447

అఁకత్రాడు, తఱిత్రాడు, త్రిప్పుత్రాడు అన మంథరశ్మికిపేళ్ళు; కవ్వపుత్రాడు. చిలుకు, త్రచ్చు, తఱి, తరచు అన మథించుటపేళ్ళు.

గీ. మేఁక వేఁటయు చింబన మేషమాను;
వేఁట చింబోతు పొట్టేలు వేఁటపోతు
నాఁగ ఛాగంబగును; గొఱ్ఱెనాఁగ గొఱియ
గొఱ్ఱియయునంగ నేడకగోపబాల 448

మేఁక, వేఁట, చింబు అన మేషముపేళ్ళు. వేఁట, చింబోతు, పొట్టేలు, వేఁటపోతు అన ఛాగముపేళ్ళు. గొఱ్ఱె, గొఱియ, గొఱ్ఱియ అన ఏడకపేళ్ళు.

గీ. ఏడిక పొటేలు పొట్టేలు నేడి తగరు
వేఁటయును గొఱ్ఱెపోతన వెలసె నేడ

కంబు నామూళి; గాడిదె గాలిగాఁడు
నాఁగ గార్ధభమగు భోగిభోగశయన. 449

ఏడిక, పొటేలు, పొట్టేలు, ఏడి, తగరు, మేఁక, గొర్రెపోతు అన ఏడకము పేళ్ళు. గాడిద, గాలిగాఁడు అన గార్ధభము పేళ్లు.

క. లొట్టియనా నొంటియనా
లొట్టేనుఁగు లొట్టిపిట్ట లొటిపిటయనఁగన్
లొట్టపిటయనంగను లొటి
పిట్టయనఁగ నుష్ట్రమునకు పేళ్లు మురారీ. 450

లొట్టియ, ఒంటియ, లొట్టెనుఁగు, లొట్టిపిట్ట, లొటిపిట, లొట్టిపిట్ట లొటిపిట్ట అన ఉష్ట్రమునకు పేళ్లు.

పంచపాదిగీ. విలువ వెలనాఁగ మూల్యంబు పేళ్ళు; సంచ
కరువు సంచకరము సంచకారమనఁగ
సంచకరమౌను; గడన రజనయనంగ
జెలఁగె సంపాదనము; కూడువలయనంగ
లాభమునకాఖ్య మన్మథలలితదేహ. 451

విలువ, వెల అన మూల్యము పేళ్ళు. సంచకరువు, సంచకరము, సంచకారము అన సంచకరము పేళ్ళు. గడన, రజన అన సంపాదనము పేళ్ళు. కూడువల అన లాభము పేరు.

గీ. పైక మాస్తి బండారంబు బండవలము
పసిఁడి బండారమును లిబ్బి బండరువును

కాసు పిడిముడి సొమ్ము రొక్కంబు నెలగ
మొల్లము లపక ముడుపన వెల్లె ధనము. 452

పైకము, ఆస్తి, బండారము, బందవలము, పసిండి, బండారము, లిబ్బి, బందవున్న, కాసు, పిడిముడి, సొమ్ము, రొక్కము, నెలగ, మొల్లము, లపక, ముడుపు అన ధనము పేళ్ళు.

సీ. ఉదిరి చిన్నిదమును హొం పైఁడి సంచంబు
బంగారు బంగరు బంగరంబు
జాళువా పుత్తడి జాలువా పుత్తళి
బంగార మపరంజి బంగరువును
పొన్ను కడాని పొన్నంబును పసిండి
పయిడి కుందనమును పసిడి హొన్ను
నా వెసంగును స్వర్ణనామధేయంబులౌ;
పరకు తగడునా సువర్ణపత్ర

గీ. మగును; పూదియనాఁ బూదిగను యనఁ జెల్లె
కనక గుళికాఖ్యలై; మడికాసు వెండి
నాగ రజతాఖ్యలౌ రత్నంబు మిన్న
మానికము వాసిపూసనా మణికి పేళ్ళు. 453

ఉదిరి, చిన్నదనము, హొం, పైఁడి, సంచము, బంగారు, బంగరు, బంగరము, జాళువా, పుత్తడి, జాలువా, పుత్తళి, బంగారము, అపరంజి, బంగరువు, పొన్ను, కడాని, పొన్నము, పసిండి, పయిడి, కుందనము, పసిండి హొన్ను అన సువర్ణము పేళ్ళు. పరకు, తగడు అన స్వర్ణపత్రము పేళ్ళు.

పూదియ, పూదె అన కనకగుళిక పేళ్ళు. మడికాసు, వెండి అన రజతము పేళ్ళు. రతనము, మిన్న, మానికము, వానిపూస, రూ॥ పూస అన మణికి పేళ్ళు.

క. మగతాయి మూలరాయియు
మగతా మఱి రవయును మగ మానికమనఁగా
నగు వజ్రము; నీలమణికి
నగు గోదుపన కప్పుతాయి యనఁగ మురారీ. 454

మగతాయి, మూలతాయి, మగతా, రవ, మగమానికము అన వజ్రము పేర్లు. గోదుపు, కప్పుతాయి అన నీలమణి పేర్లు.

గీ. కెంపుమానికమును తమ్మికెంపు నాఁగ
పద్మరాగమణికి పేళ్లు బరగెను; పులు
తిండి తాయి పుల్లంటుతా తెనుఁగునందు
నింద్రనీలమణికిసంజ్ఞ యింద్రపాల. 455

కెంపు, మానికము, తమ్మికెంపు అన పద్మరాగమణి పేర్లు. పులుతిండి తాయి, పుల్లంటుతా అనఁగా ఇంద్రనీలమణి పేర్లు.

గీ. మరకతమునకుఁ బేళ్ళొప్పు గరుడపచ్చ
పచ్చ పేరోదము కిరీటిపచ్చ పులుఁగు
తాయి పేరోజమనఁగ; రవాయి కృత్రి
మమణిపేరగు సురపాల మానిలోల. 456

గరుడపచ్చ, పచ్చ, పేరోదము, కిరీటిపచ్చ, పులుఁగుతాయి, పేరోజము అన మరకతము పేరు. రవాయి అన కృత్రిమమణి పేరు.

పంచపాదిసీ. ఆణిపూస ముత్తెంబు సుప్పాణిముత్తి
యంబు చినుకుఁబూసయును ముత్యము సుపాణి
యనఁగ మౌక్తికనామధేయంబు; పవడ
మనఁగ మెఱుఁగుఱిక్క పగడమనఁగ విద్రు
మంబుపేళ్లగు సురపక్షయంబుజాక్ష. 457

ఆణిపూస, ముత్తెము, సుప్పాణి, ముత్తియము, చినుకుఁబూస, ముత్యము, సుపాణి అన మౌక్తికము పేళ్లు. పవడము, మెఱుఁగుఱిక్క, పగడము అనఁగా విద్రుమము పేళ్లు.

గీ. పిల్లికన్నతనంబన్న బేరుజెల్లె
భువిని వైడూర్యమునకును; పొద్దుగల్లు
నాఁగ సూర్యకాంతిమణికి నామమగును;
పటికమన పలుగనఁగను స్ఫటికమగును. 458

పిల్లికన్నతనము అన వైడూర్యము పేరు. ప్రొద్దుగల్లు అన సూర్యకాంత మణి పేరు, పటికము, పలుగు అన స్ఫటికము పేళ్లు.

క. నెలచట్టు చలువఱాయియు
నెలఱా మఱి చందుఱాయి నెలచల్వయు జా
బిలిరాయనఁగా తెలుఁగున
నలరెను శశికాంతమణికి హాటకచేలా. 459

నెలచట్టు, చలువఱాయి, నెలఱా, చందురాయి, నెలచల్వ, జాబిలిరా అన చంద్రకాంతము పేళ్లు.

గీ. అవని రుదురక్క రుదురాక యనఁగఁ బేళ్లు
వెలసె రుద్రాక్షకై; యిడ్డెనలును కుడుము
లుండ్రములు మఱి యుండ్రాళ్లు నొప్పె మోద
కాఖ్యలై; పాసెమన పాయసాన్నమగును. 460

రుదురక్క, రుదురాక అన రుద్రాక్షపేర్లు. ఇడ్డెనలు, కుడుములు, ఉండ్రములు, ఉండ్రాళ్ళు అన మోదకముపేర్లు. పాసెము అన పాయసాన్నముపేరు.

గీ. కుధరరాష్ట్ర గుజ్జెన గూళ్లనంగ
బాల్యకేళికావాగువౌ; భక్ష్యభేద
ములగు నిడికుడుకలు నవుగులు కజాయ
ములును బొబ్బట్లు కర్జకాయలును శౌరి. 461

గుజ్జెనగూళ్ళు అన బాలికలు కేళియందువండెడి అవాగువు పేరు. ఇడి కుడుంకలు, అవుగులు, కజాయములు, బొబ్బట్లు, కర్జకాయలు అన భక్ష్యభేదముపేళ్ళు.

సీసమాలిక. అఱ సగంబును సామ సగ సాయనఁగ నర్ధ
మొప్పొందు నొక్కటి యొకటివంచ
యొక్కటి వంచంబు నెక్కంబు వంచినా
నేకంబగును; రెండు నిరుదు గదువ
యన ద్వయంబగు; తిగయన తివనా మూఁడు
నాఁగ త్రయము నాల్గు చవును
తీవంచ యుడ్డ చౌ తిగవంచ యుడ్డా యు
నఁగ చతుర్థముపేళ్లు నెగడె; నైదు

నరపది చవ్వంచ యఱపది యేనన
వెలసె పంచకమయ్యె; బేత్రి యారు
దుగమూఁడునా షట్కమగు; సతా సత యేడు
సత్తాయనఁగను సప్తకంబు;
నెనిమిదియును దచ్చి యిరుచౌకమన నష్ట
కమ్మగు; ముత్తిగ తొమ్మిదియన
నవసంఖ్యకివియౌనునామాళి; యీరేను
పదినాఁగ దశకమైపరగెను; పద
కొండు నేకాదశముండెపేర; నిరాయు
బార పన్నెండు నీరాయు బద్ర
బారాయనంగను ద్వాదశమగు; పద
మూఁడు త్రయోదశమునకుఁబేరు;
పద్నాలు గిరేడు పరగె చతుర్దశం
బునకగును; పదియేననఁగనయ్యె
పంచదశంబును; పదహారును పదారు
పదియారునాఁగను బరగె షోడ
శం; బగు పదియేడు సప్తదశంబు; ము
య్యారు పద్దెన్మిది యష్టదశము;
నెసఁగె పందొమ్మిది యేకోనవింశతి;
యిరువది యిరువయి యిరుపదియన

గీ. వఱలె వింశతి; నూఱన పందనాఁగ
నగు శతంబు; వే వెయి వేయి యన సహస్ర

మునకునగు; సున్న బుజనాఁగ బొట్టనంగ
బిందువునకునభిఖ్యలౌ కంధరాంగ. 462

అఱ, సగము, సాము, అర, సా అన అర్థము పేళ్ళు. ఒండు, ఒక్కటి ఒకటి, వంచ, ఎక్కటి, వంచము, ఎక్కము, వంచి అన ఏకము పేళ్ళు. రెండు ఇరు, దుగ, దువ అన ద్వయము పేళ్ళు. తిగ, తివ, మూఁడు అన త్రయము పేళ్లు. నాల్గు, చవుసు, తీవంచ, ఉడ్డ, చౌ, తిగవంచ, ఉడ్డా అన చతుర్థము పేళ్ళు. ఐదు, అరపది, చవ్వంచ, అఱపది, ఏను అన పంచకము పేళ్ళు. జేత్రి, అరు, దుగమూఁడు అన షట్కము పేళ్ళు. సతా, సత, సత్తా అన సప్తకము. ఎనిమిది, దచ్చి, ఇరుచౌకము అన అష్టకము. ముత్తిగ, తొమ్మిది అన నవసంఖ్య. ఈరేను, పది అన దశకము. పదకొండు అన ఏకాదశము. ఇరారు, బార, పన్నెండు, ఈరారు, బద్ర, బారా అన ద్వాదశము. పదమూఁడు అన త్రయోదశము. పద్నాల్గు, ఈరేడు అన చతుర్దశము. పదియేను అన పంచదశము. పదహారు, పదారు, పదియారు అన షోడశము పేళ్ళు. పదియేడు అన సప్తదశము. ముయ్యారు, పద్దెన్మిది అన అష్టదశము. పందొమ్మిది అన ఏకోనవింశతి. ఇరువది, ఇరువయి, ఇరుపది అన వింశతి. నూఱు, వంద అన శతము పేళ్ళు. వే, వెయి, వేయి అన సహస్రము. సున్న, బుజ, బొట్టు అన బిందువు పేళ్ళు.

గీ. అడపమును సంచి సంచీయు హడపమనఁగ
జెల్లు పటపేటికకును; నిచ్చెనయు తాప
వెలసెనిశ్రేణి; వ్రేఁకంబు వ్రేఁకనయును
బరువునా భారమై వైశ్యవర్గముగిసె. 463

అడపము, సంచి, సంచీ, హడపము అన పటపేటిక పేళ్ళు. నిచ్చెన, తాప అన నిశ్రేణిపేళ్ళు. వ్రేఁకము, వ్రేఁకన, బరువు అన భారమునకు పేళ్లు.

వైశ్యవర్గ ముగిసెను.

## శూద్రవర్గ.

గీ. కాలిపుట్టువు బలిజెయు కాఁపు కలప
తాల్పు నాఁడవాఁడన దఁగె శూద్రు
నకు నభిఖ్యలు; మాకరినాఁగ మాల
కరియనఁగ మాలికునకు నాఖ్యలు మురారి. 464

కాలిపుట్టువు, బలిజె, కాఁపు, కలపతాల్పు, నాఁడువాఁడు అన శూద్రునకుఁ బేళ్ళు. మాకరి, మాలకరి అన మాలికునకు పేళ్ళు.

క. పంచాణమువాఁడనఁగా
నంచులవాఁడనఁగ శిల్పికౌ నామంబుల్;
కుంచియనా వాఁగలియుఁ
గుంచెయనం గలమనఁగ నగును తూలికకున్. 465

పంచాణమువాఁడు, అంచులవాఁడు అనఁగ శిల్పికి పేళ్ళు. కుంచియ, వాఁగలి, కుంచె, కలము అన తూలికకు పేళ్ళు.

క. బొమయనఁగ బొమ్మయనఁగ ప
తిమయనఁగ సకినయనఁగ బ్రతిమయగున్; పంచా
ణము కొఱ చిత్తరువనఁగా
పంచాయుధశిల్పమునకుఁ బరగె నభిఖ్యల్. 466

బొమ, బొమ్మ, పతిమ, సకిన అనఁగా ప్రతిమకు పేళ్ళు. పంచాణము, కొఱ, చిత్తరువు, రూ॥ చిత్తరు అన శిల్పమునకు పేళ్ళు.

గీ. కమ్మరీఁడును కమ్మరి కమరవాఁడు
నాఁగ లోహకారకునామములు చె

లఁగె; వడ్లోజనంగ వడ్లంగినాఁగ
వడ్లవాఁడు వడ్రంగినా వర్ధకికగు. 467

కమ్మరీఁడు, కమ్మరి, కమరవాఁడు అనఁగ లోహకారకుని పేళ్లు వడ్లోజు, వడ్లంగి, వడ్లవాఁడు, వడ్రంగి అనఁగా వర్ధకి పేళ్ళు.

గీ. స్వర్ణకారకుఁడగు నగసాలె కొమ్ము
కాఁడు సొన్నారియును కమ్మటీఁడనంగ
కీలమునకగు గసి మేకు చీలయనఁగ
క్రకచమునకౌను అంపంబు కరగసమున. 468

అగసాలె, కొమ్ముకాఁడు, సొన్నారి, కమ్మటీఁడు అన స్వర్ణకారకుని పేళ్ళు. గసి, మేకు, చీల అన కీలము పేళ్ళు. అంపము, కరగసము అన క్రకచము పేళ్లు.

గీ. మూస క్రోవియనంగను మూష పేళ్లు;
దాయి దాకలి డాకలి దాఁగలియన
నగు నిఘాతికకును; క్రోవి యండె గొట్ట
మనఁగ నాళంబునకుఁ జెల్లు వనజనాభ. 469

మూస, క్రోవి అన మూష పేళ్ళు. దాయి, దాకలి, డాకలి, దాఁగలి అన నిఘాతిక పేళ్ళు. క్రోవి, అండె, గొట్టము అనఁగా నాళము పేర్లు.

గీ. కమ్మటంబన నుదురన కమటమన న
ఘను కలాదవహంతి; యాస్ఫోటినికిని
సాగె బరమా యనఁగ పిడిసానయనఁగ;
మించె చిప్పె చెక్కనఁగ ఛేదించుటకును. 470

కమ్మటము, కుదురు, కమటము అనకలాదహసంతికిఁ బేర్లు. బరమా పిడిసాన అన ఆస్ఫోటనికి పేళ్ళు చివ్వ, చెక్కు అన భేదించు పేళ్ళు.

పంచపది గీ. గండరువు పడియచ్చనంగను ప్రతికృతి
ముద్రసాధనకగు పేళ్లు; పొదుగు తాపు
చెక్కు తాపించు నాఁగ ఖచించుటకగు
తరువడియు తఱిమెన తఱి తనరెదారు
ముఖమధనసాధనముపేళ్లు మునివిలోల 471

గండరువు, పడియచ్చు అన ప్రతికృతిముద్రసాధనము పేళ్ళు. పొదుగు, తాపు, చెక్కు, తాపించు అన ఖచించుట పేళ్ళు. తరువడి, తరిమెన, తఱి అనఁగా దార్వాదిమథనసాధనముఁ బేళ్ళు.

క. చిందుగ మజ్జగ పెట్టియ
మందస బదరికము పెట్టె మంజప మఱియుఁ
మందసమును సందుగయును
చిందువనా పేఁటికకును జెల్లెమురారీ. 472

చిందుగ, మంజగ, పెట్టియ, మందస, బదరికము, పెట్టె, మంజస, మందసము, సందుగ, చిందువ అన పేటిక పేళ్ళు.

గీ. బరణి పూాసె కరాటంబు కరవటమన
భరణిపేళ్లౌను; కరసాన పట్టుసాన
సాన యన వజ్రభేదితశాణమగును;
జాటి చబుకు తఱట నాఁగ కశకును పేర్లు. 473

బరణి, ఫూనె, కరాటము, కిరవటము అన భరణిపేళ్ళు. కరసాన, పట్టుసాన, సాన అన వజ్రభేదతశాణముపేళ్ళు. జాటి, చబుకు, తఱట అన కశపేళ్ళు.

గీ. కుమ్మరీఁడు కుమ్మరినాఁగ కుంభకార
కాహ్వయంబులు; కచ్చివాఁడనఁగ సాలె
వాఁడు సాలీఁడనఁగ తంతువాయిపేర్లు;
గొఱకుఁడన నీచునకుపేరు కోమలాంగ. 474

కుమ్మరీఁడు, కుమ్మరి అన కుంభకారకునిపేర్లు. కచ్చివాఁడు, సాలెవాఁడు, సాలీఁడు అన తంతువాయిపేర్లు. గొఱకుఁడు అన నీచునిపేరు.

గీ. వసుధ మేగీఁడు కుట్రపువాఁడునాఁగ
నగును వస్త్రచ్ఛదకున కాఖ్యలును; రేవఁ
డనఁగ జావడీయు మెడవాలనఁగ చాఁక
లియన రజకుఁడు సారసనయనయుగ్మ. 475

మేగీఁడు, కుట్రపువాఁడు అన వస్త్రచ్ఛదకునిపేర్లు. రేవడు, జావడి, మెడవాలు, చాకలి అన రజకునిపేర్లు.

గీ. మంగలియును మంగలవాఁడనంగ క్షౌర
కుండగును; తంటసంబును తండసంబు
నాఁగ కుటలికకొప్పె; నేనాది కోయ
యనఁగ గిరివానమృగయునికయ్యె పేళ్లు. 476

క. కొరవంజి యెఱుక పినుఁగే
కరి బోయఁడు బోయయుఁ జొఱకాఁడు పిలుఁగు వేఁ
కరి యెఱుకు వేఁటగిరి యన
బరగెను లుబ్ధకునిపేళ్లు పావనచరితా. 477

కొరవంజి, ఎఱుక, పినుఁగు, ఏకరి, బోయఁడు, బోయ, పిలుఁగు, చొఱగాఁడు, వేఁకరి, ఎఱుకు, వేఁటగిరి అన లుబ్ధకునికిఁ బేర్లు.

గీ. చెంచునా శబరుండగు; చెంచెతయన
సింగినా శబరస్త్రీకి జెల్లెఁ బేళ్లు;
బోయెతయు నెఱుకుదియును బోయతయన
నగు కిరాతకులస్త్రీకి నిగమవేద్య. 478

చెంచు అన శబరుని పేరు. చెంచెత, సింగి అన శబరస్త్రీకిఁ బేర్లు, బోయెత, ఎఱుకుది, బోయత అనఁగా కిరాతస్త్రీకిఁ బేర్లు.

క. బోయీఁడాయన జాలరియన
బోయియు బెస్తయనఁనొప్పు భువి కైవర్తుం
డై; యురియు గుబ్బికయు వల
నా నుచ్చనగాను జువ్వనా వాగురయా. 479

బోయీఁ, జాలరి, బోయి, బెస్త, రూ॥ బెస్తవాఁడు అన కైవర్తుని పేర్లు. ఉరి, గుబ్బిక, వల, ఉచ్చు, జువ్వ అన వాగుర పేర్లు.

ఆ. వె. బూటకంబు టక్కు బూకె బూమియు బూమె
బేడిజంబు భేలు వేడబంబు

మైదు మతకమనఁగ మాయయగుఁ; జియ్యనాఁ
గను దనర్చు మాంసఖండమునకు. 480

బూటకము, టక్కు, బూక, బూమియ, బూమె, బేడిజము, బేలు, వేడబము, మైదు, మతకము అన మాయపేర్లు. చియ్య అన మాంసఖండము పేరు.

గీ॥ ఎఱచి కలిమంబు నంజుడు నీరువు పొల
పొలసు పెరసనఁగా మాంసములరె; కఱ్ఱు
కుట్లు కఱకుట్లు కఱుకుట్లగును శలాక
కలిత పక్వమాంసంబగు కమలనాభ. 481

ఎఱచి, కలిమము, నంజుడు, ఈరువు, పొల, పొలసు, పెరసు అన మాంసము పేర్లు. కఱ్ఱుకుట్లు, కఱకుట్లు, కఱుకుట్లు అన శలాకపూరిత పక్వ మాంసము పేర్లు.

పంచపది గీ॥ నల్ల నెత్తురు నెత్రును నలయనంగ
రక్తమగు; కోపునాఁగ సారాయియనఁగ
మధురసంబగు; కలు కల్లు మఱియు చొక్కు
నీరు బహువచనము వెఱ్ఱినీళ్ళనంగ
మదిరపేళ్ళగు తెలుఁగున మదనజనక 482

నల్ల, నెత్తురు, నెత్రు, నల, అన రక్తము పేళ్ళు. కోపు, సారాయి అన మధురసము పేళ్ళు. కలు, కల్లు, చొక్కునీరు, ని॥ బ॥ వెఱ్ఱినీళ్ళు అన మదిర పేళ్ళు.

గీ॥ తరువు జత జోక యొర వీఁక వరుస సవతు
నాఁగ సామ్యంబు; మాఱట నాఁగ మాఱు
నాఁగ ప్రతిబింబమౌ; పోలి కయిన పోని
నాఁగ ననుకారమునకౌను భోగిశయన; 483

తరువు, జత, జోక, ఒర, వీఁక, వరుస, సవతు అన సామ్యము పేళ్లు మాఱట, మాఱు అన ప్రతిబింబము పేళ్ళు. పోలిన, పోని, అన అనుకారము పేళ్ళు.

కం॥ తరము సవతు సాటిక యెన
సరి యుద్దియు నీడు జోడు సాటియు దీటుం
బురుడను గలమును పాటియు
బర గెసమానంబు పేళ్లు భవవనదహనా. 484

తరము, సవతు, సాటిక, ఎన, సరి, ఉద్ది, ఈడు, జోడు, సాటు దీటు, పురుడు, అనుగలము, పాటి అన సమానము పేళ్ళు.

కం॥ సరిమాఁగు నెత్తువచ్చును
దొరయును సోమించు నెత్తు తూఁగు నెనయుగుఁ.
సరిపడు నుద్దిపడును వా
దరించన సమానమగుట దనరె ముకుందా. 485

సరిమాఁగు, ఎత్తువచ్చు, దొరయు, సోమించు, ఎత్తు, తూఁగు, ఎన యగు, సరిపడు, ఉద్దిపడు, బాదరించు అన సమానమగుట పేళ్ళు.

గీ॥ బూమెనా మాఱటయనంగ బూమియనఁ
నవ్యవేషంబునకుఁ బేళ్ళు నవనితనరు;

దొరయు పురుడించు పోలనఁ బరగె ననుక
రించుటకు; పొడపెట్టు సూచించుటకును. 486

బూనె, మాఱట, బూమియ అన అన్యవేషము పేళ్ళు. తనరు, దొరయు, పురుడించు, పోలు అన అనుకరించుట పేళ్ళు. పొడపెట్టు అన సూచించుట పేరు.

ఉ॥ అడపొడ పోలికిం బొలకు వన్నమఱిఁ సవడింక యీగడన్
సడి సవ మాద్రి మాదిరియు సవ్వడి పోలిక పోల్కి జాడ పో
బడి పొలముం దరంబు మఱిపారువయున్ బడికోల సంచు పో
వడియన సూచనాఖ్యలగు వారిజలోచన యాంధ్రభాషలోన్

అడపొడ, పోలిక, పొలకువ, సవడి, ఈగడ, సడి, సవ, మాద్రి, మాదిరి, సవ్వడి, పోలిక, పోల్కి, జాడ, పోబడి, పొలము, తరము, పారువ, బడికోల, సంచు, పోవడి అనఁగా సూచన పేళ్ళు.

గీ॥ జూదమన ద్యూతమునకాఖ్య; జూదరియన
నెగడె కితవుని పేరయ్యె; పగడసాల
యనఁగనగును సోళాడొప్పి యనఁగ నెత్త
మనఁగ ద్యూతభేదములకు నాఖ్యలగును. 488

జూదము అన ద్యూతము పేరు. జూదరి అనని కితవుని పేరు, పగడసాల, పోళాడొప్పి, నెత్తము అన ద్యూతభేదమునకు పేళ్ళు.

బాళియు నెత్తపుఁబలకయు
పాళియనఁగనొప్పు శారిఫలమునకాఖ్యల్. 489

పాళియ, పలక, పాళియము, నెత్తపలక, పాళి నెత్తపుఁబలక పాళె అనగా శారిఫలము పేళ్ళు.

గీ॥ నట్టునాఁ బాఁచికయు సారెనాఁగ బహువ
చనముగను కవఱలు నష్టసాళ్ళు నామ
రులన నక్షములగు; పణాఖ్యలగు నెత్త
కమ్మయన పందెమనఁగ నెత్తమ్మనంగ. 490

నట్టు, పాఁచిక, సారె, ని॥బ॥ కవఱలు, అష్టసాళ్ళు, నామసులు, అన అక్షములకు పేళ్ళు. నెత్తకమ్మ, పందెము, నెత్తము అనఁగా పణము పేళ్ళు.

గీ॥ కాయనాఁగను సారెనాఁగను తెలుంగు
నందు ద్యూతకేళీసాధనంబుపేళ్ళు;
వేఁట విడివేటయును డేగవేఁటయనఁగ
శ్యేనమృగయకు పేర్లౌను శేషశాయి. 491

కాయ, సారె అన ద్యూతకేళీ ఫలము పేళ్ళు. వేట, విడివేట, డేగ వేఁట అన శ్యేనమృగయకు పేళ్ళు.

గీ॥ వేఁటనా వెంటనాఁగ నాఖేటమాను
తీపుత్రా డొడ్డిత్రాడన తెలుఁగునను మృ
గవ్యసాధనాభిఖ్యలు గలిగె; దోర
మనఁగ శ్యేనాంఘ్రిబంధరజ్జ్వాఖ్య శౌరి. 492

వేఁట, వెంట అన ఆఖేటము మృగయ పేళ్ళు. తీపుత్రాడు, ఒడిత్రాడు అన మృగవ్యసాధనమగురజ్జువు పేళ్ళు. దోకము అన శ్యేనాంఘ్రిబంధనరజ్జువు పేరు.

గీ॥ జమటపాతయనంగను జాడ తెల్పె
శ్యేననఖరాగ్రరక్షణపాణికవచ
మునకు; మఱియును తోపారమును తొపార
మనఁగ శ్యేనముఖకవచమగును శౌరి 493

జమటపాత అన శ్యేననఖరాగ్రరక్షణార్థమైన పాణికవచము పేరు తోపారము, తొపారము అన శ్యేనముఖకవచము పేళ్ళు.

గీ. క్షోణిఁ వేఁపన కుక్కనా శునకమయ్యె
జాగిలంబు నుడుపకుక్కనాఁగ మొఱస
డంబనఁగ వేఁటకుక్కనా డంబుమీఱె
విశ్వకద్రువునామము ల్విశ్వగర్భ

వేఁపు, కుక్క, అన శునకము పేర్లు. జాగిలము, ఉడుపకుక్క, మొఱసదము, వేఁటకుక్క అన విశ్వకద్రువు పేర్లు.

గీ. నడికియు యనంగను మఱినడి కేయనగ
శునకగళబద్ధశృంఖలకును వరవనఁగ వరవు
డనఁగ దాసికినా కొలుచనఁగ నోల
గిడమనాఁగను జెల్లె సేవించుటకును.

పంచపదిగీ॥ వరవుడంబన దాస్యంబువఱలె; నూడి
గంబు నూడియమనఁగ నూడెంబనంగ
నొప్పు పరిచర్య; కామటి యూడిగీఁడుఁ
పారికాపుఁను పనివాఁడుపాలివాఁడు
నాఁగ కర్మకరునిపేళ్లు నలిననాభ 496

వరవుడము అన దాస్యము పేరు. ఊడిగము, ఊడియము, ఊడెము, అన పరిచర్యపేర్లు. కామాటి, ఊడిగీడు, పారికాపు, పనివాడు, పాలివాఁడు అన కర్మకరుని పేర్లు.

గీ. ఈంద్ర కబ్బిలియును గౌఁడు నీడిగయన
శౌండికునకునభిఖ్యలౌ; సాహిణియును
మందడీఁడును సాహిణీ మఱియు గులప
గుఱపువాఁడన మందురకుండు శౌరి. 497

ఈంద్ర, కబ్బిలి, గౌడు, ఈడిగ అన శౌండికునకు పేర్లు- సాహిణి, మందడీడు, సాహిణీ, గులప, గుఱపువాఁడు అన మందురకుని పేర్లు.

కం. ఆసాదియు గూబటియును
గోసఁగిపాణసియు మాల గొడగయనఁగా
నా సురియాళ్లును మాదిగ
నాసురయాళ్లునుగొడారి నా బుల్కసుఁడా 498

ఆసాది, గూబతి, గోసఁగి పాణసి, మాల, గొడగర, సురియాళు మాదిగ, సురయాళు, గొడారి అన పుల్కసుని పేర్లు.

సీ. దొంగ తెక్కలికాఁడు దొంగ యెల్లాపియు
దొరకోలు సన్న్యాసి దోఁపికాఁడు
బందికాఁడును మ్రుచ్చు బరికాఁడు దోఁపరి
దొరకు సన్న్యాసియు దోఁపుకాఁడు
పచ్చెకాఁడును ముచ్చు బరి తెరవాటీఁడు
దాపరి మునుముచ్చు దోపరీఁడు
చేవాడకాఁడు ముచ్చిలికాఁడు మ్రుచ్చుగో
రయన నామాళి చోరకున కౌను;

గీ. దాఁపరము దొంగరికమును దోఁపిడియును
మోస తెరవాటు తెక్కలి మ్రుచ్చిలియును
మ్రుచ్చిమి పిసాళమును దోఁపుడు పచ్చెము మఱి
దోఁగురనఁగ చోరత్వమా భోగిశయన 499

దొంగ, తెక్కలికాడు, దొంగ, ఎల్లాపి, దొరకోలు సన్న్యాసి, దోఁపికాఁడు, బందికాఁడు, మ్రుచ్చు, బరికాడు, దోపరి, దొరకు, సన్న్యాసి, దోఁపుకాఁడు, పచ్చెకాఁడు, ముచ్చు, బరి, తెరవాటీఁడు, దాపరి, మునుముచ్చు దోఁపరీఁడు, చేవాడకాఁడు, ముచ్చిలికాఁడు, మ్రుచ్చు,గోర అనచోరకుని పేర్లు. దాఁపరము, దొంగరికము. దోపిడి, మోస, తెరవాటు, తెక్కలి, మ్రుచ్చిలి, మ్రుచ్చిమి, పిసాళము, దోపుడు, పచ్చెము, దోగురు అనచోరత్వము పేర్లు.

గీ. దోఁచు కొల్లాడు మ్రుచ్చిలు దొంగలించు
నాఁగ తస్కరించుటకు పేళ్లను; దొడ్డ
కొల్ల వెల్లడి చూఱయు కొలుపిటి
నాఁగనగు సభ్యవస్కంధనంబు పేర్లు. 500

దోఁచు, కొల్లాడు, మ్రుచ్చిలు, దొంగలించు, అన తస్కరించు పేళ్లు
వొద్ద, కొల్ల, వల్లడి, చూఱ, కోలు, వీటి, అన అపహృత స్కంధమున పేళ్లు.

గీ. నెగడె యడిగట్టు యడియొత్తు నిత్యబహువ
చనమునందు సంబాళిగల్ సంబవులును
పావకోళ్లు పాగాలు పావాలు నింక
పావలు మఱిసమ్మాళిగల్ పాదుకలును. 501

అడిగట్టు, అడియొత్తు, ని॥బ॥ సంబాళిగలు, సంబవులు, పావకోళ్ళు- పాగాలు, పావాలు, పావలు, సమ్మాళిగలు, అన పాదుకల పేళ్ళు.

గీ. మలకడంబను చెప్పన మఱియు బహువ
చనమునందున వాళ్లన సంబవులన
దనరె నోరచ్చులనఁగ నుద్దాలనంగ
మల కడాలన పాదరక్షలకుఁబేళ్లు. 502

మలకడము, చెప్పు, ॥ని॥బ, అరవాళ్ళు, సంబవు, ఓరచ్చులు ఉద్దాలు, మలకడాలు అన పాదరక్షల పేర్లు.

కం. తెనుఁగున పాష్ణి త్రములకు
దనరెను పాపోసనంగ దగుముచ్చెయనం
గను పాయపోసు బహువ
చనమున సమ్మాళిగలన జగతి వెలుంగెన్. 503

పాపోసు, ముచ్చె, పాయపోసు,॥ని॥బ సమ్మాళిగలు అన పాష్ణిత్ర లకు పేర్లు.

కం. కమలాయతేక్షణ కడా
సమసఁగ తోలుకయు కళవసమసంగ
కళాసమసఁగ తోలసఁగ కడవ
సమసంగను గరుసనంగ చర్మముపేళ్లౌ. 504

కడాసము, తోలుక, కళవసము, కళాసము, తోలు, కడవసము, గరుసు అన చర్మముపేర్లు.

గీ. గారడము కనుకట్టనంగ నగునింద్ర
జాలవిద్యకుపేళ్లును; జగతినిపారి
పాలియు గావన బలిపేళ్లుగలిగి వెలుగ
శూద్రవర్గముగించితి సుందరాంగ. 505

గారడము, కనుకట్టు, అన ఇంద్రజాలవిద్య పేరు. పారి, పాలి, గావు, అన బలి పేర్లు.

శూద్రవర్గు ముగిసెను.

మాలినీ వృత్తము. జలదతులితకాయా శర్వదేవేంద్రగేయా
జలరుహదళనేత్రా సజ్జనస్తోత్రపాత్రా
కలుషనిచయదూరా కంథిజాచిత్తచోరా
దళితరిపుశిరోధీ దానవౌఘావరోధీ.

శ్రీమతేరామానుజాయనమః.

# ఆంధ్రపదనిధానము.

## తృతీయకాండము.

## విశేష్యనిఘ్నవర్గ.

క. శ్రీరమణీచపలాగం
భీరోక్తిస్తనితగరిమ పృథులకృపాధా
రా రసపంపాతావళి
శౌరివలాహకము భక్తసస్యముఁ బ్రోచున్. 1

వ. అవధరింపుము. తృతీయకాండంబునంగల విశేష్యనిఘ్నం
బాది వర్గుల వివరించెద.

గీ. భువిని పెద్దయు బాబన పూజ్యుఁడగును;
మాఁటినంగ యనంగను మత్తికాఁడు
నాఁగ కాముకి; పులసరి ఱాఁగయు మురి
కాఁడు తఱుసరియన గర్వి కమలనేత్ర. 2

పెద్ద, బాబు అన పూజ్యునిపేళ్ళు. మాటినంగ, మత్తికాఁడు అనఁగా కాముకిపేళ్ళు. పులసరి, ఱాఁగ, మురికాఁడు, తఱుసరి అనఁగా గర్వికిపేళ్ళు.

సీ. అడిగొట్టు కల్లరి యాఱజాతి యణఁకుఁడు
చెన్నఁటి యేతరి చెనఁటి యాక
తాయ యులిపి పెఱఁగాడు యాలరి గండ్రి
యుక్కివుడును కేడ యులిపిగొట్టు

గొంటు చిలుమువాలు గొంటరి టకటొంకు
నాలిబూతిము తుల్వ నాలిముచ్చు
గుడుసరి బేలరి కూళుఁడు గట్టివా
కల్లరీఁడును మఱి సుళ్లమారి
గీ. కావరీఁడన కుత్సితభావకుఁడగు;
కఱటి టాటోటుకాఁడు టక్కరియు మోస
కాఁడు లయకారి తక్కిడికాఁడు ఠక్కు
డనఁగ తక్కరినా వంచకునకు బేళ్లు. 3

అడిగొట్టు, కల్లరి, అఱజాతి, అణఁకుఁడు, చెన్నఁటి, ఏతరి, చెనఁటి, ఆకతాయ, ఉలిపి, పెఱఁగాయ, ఆలరి, గంద్ర, ఉక్కిరివుడు, శేడ, ఉలిపి గొట్టు, గొంటు, చిల్మివాలు, గొంటరి, టకటొంకు, నాలిబూతము, తులువ, నాలిముచ్చు, గుడుసరి, బేలరి, కూళుఁడు, గట్టివ, కల్లరీఁడు, సుళ్లమారి, కావరీఁడు అన కుత్సితునకు బేళ్ళు. కఱటి, టాటోటుకాఁడు, టక్కరి, మోస కాఁడు, లయకారి, తక్కిడికాఁడు, ఠక్కుఁడు, తక్కరి అన వంచకుని పేళ్ళు

సీ. ఆకతాయ బిగాది యువదగాఁకి గరాసు
తూఁడరి తుంటరి దుండగీఁడు
తూఁటరి దుడుకడు తులువ పలువ జాఁగ
పలుగాకి పోడువడు ప్రల్లదీఁడు
పోలువ వెంబరవిత్తు పోడువచెరికి దోసి
పల్గాకి సరకడు ప్రల్లదుండు
సటమటీఁడు చెనంటి యాఱవ వెంబర తిప్ప
కాయనా దుష్టుఁడా; కట్టిఁడి చెడ

గీ. చలపకారియు చలపాది చలమఱియుఁ
నౌను మాత్సర్యశీలునకాఖ్య లవని;
చలముకొను చలపట్టును చలపాడుచు న
నంగ మాత్సర్యవంతుఁడౌ సరునిపేళ్లు.

చలపకారి, చలపాది, చలమరి అనఁగా మాత్సర్యశీలుని పేళ్ళు. చల ముకొను, చలపట్టు, చలపాడుచు అన మాత్సర్యముకలవాని పేళ్ళు.

గీ. కలహశీలుఁడు కలపసగంపనాఁగ
నౌను క్రయ్యాలక్రచ్చనాఁ నౌనుపేళ్లు;
వేఱిడియన వేడఁగునాఁగ వీఱిఁడియుఁ
జెల్లె నజ్ఞానునకుపేళ్లు శేషశయన. 8

కలపసగంప, క్రయ్యాఁక్రచ్చ అనఁగా కలహశీలునకు, శీలురాలకు పేళ్ళు. వేఱిడి, వేడఁగు, వీఱిఁడి అన అజ్ఞానుని పేళ్ళు.

ఆ. వె. చలపకారియనఁగ చలపాదియనఁగను
మచ్చరీఁడనంగ మచ్చరియన
చలమరియన నుర్వివెలసె ద్వేషికభిఖ్య
లగుచు దనుజవైరి యాంధ్రిమునను. 9

చలపకారి, చలపాది, మచ్చరీఁడు, మచ్చరి, చలమరి అన ద్వేషికి పేళ్ళు.

గీ. వసుధలో సిగ్గుమాలినవాఁడు నాఁగ
గండనాఁగ లజ్జావిహీనుండుతనరె;

పాలసుఁడు, మోఱకుఁడు, పెచ్చారి, మొఱకుఁడు, మోఱకు, పెళుచు, ఉక్కిడు, మొఱకు, మంకు అన మూర్ఖుని పేళ్ళు.

ఉ. వెంగలినాఁగఁగూళుఁడును వెక్కలియున్మడియుండుముల్చయున్
వెంగళియన్న నా వెకలి వేదుఱునా మఱి యబ్బకాఁడునా
వెంగలివిత్తు బొప్పఁడును బేలయు నుక్కిడికాఁడనంగ నా
నంగజకోటిరూప భువియాంధ్రపదావళి మూఢనామముల్.

వెంగలి, కూళుఁడు, వెక్కలి, మడియఁడు ములుచ రూ॥ సుల్చ, వెంగళి, వెకలి, వేదుఱు, అబ్బకాఁడు, వెంగలిత్తు, బొప్పఁడు, బేల, ఉక్కిడికాఁడు అన మూఢుని పేళ్ళు.

గీ. అభయునకు వెఱపిఁడియనఁగనౌను; ధైర్యు
నకునభిఖ్యలు గుండాయనంగ తెంప
రియన దిట్టఁడునా నుటంకియన గాళ
కుండనఁగ దిట్టనా నుటంకుపలుకనగు. 15

వెఱపిడి అన అభయుని పేరు. గుండా, తెంపరి, దిట్టఁడు, ఉటంకి, గాళకుఁడు, దిట్ట, ఉటంకు అన ధైర్యుని పేళ్ళు.

గీ. జాణ నెప్పరి నేర్పరి జాణఁడు నెఱ
వాది గాళకుఁడును బోటి వలఁతి దంట
ప్రోడ వటుగ తవరయును ప్రోడడనఁగ
ప్రౌఢునకు బేళ్లువెల్లును భవవినాశ. 16

జాణ, నెప్పరి, నేర్పరి, జాణఁడు, నెఱవాది, గాళకుఁడు, బోటి వలఁతి, దంట, ప్రోడ, వటుగ, తవర, ప్రోడఁడు అన ప్రౌఢుని పేళ్ళు.

గీ. అళుకరియు కోచనాఁగ భయస్వంతు డగు;
నాగడీఁ డీబరియునకార్యకుఁ; డొళవరి
యాణికాఁడన మర్మజ్ఞుఁడౌను; బీద
పేదయనఁ దరిద్రునిపేళ్లు వేదవేద్య. 17

అళుకరి, కోచ అన భయశీలుని పేళ్ళు. ఆగడీఁడు, ఈబరి అన అకార్యకుని పేళ్ళు. ఒళవరి, ఆణికాఁడు అన మర్మజ్ఞుని పేళ్ళు. బీద, పేద అన దరిద్రుని పేళ్ళు.

గీ. భువిని దుశ్శీలునకు జెల్లు పోకిరియన
యొఱటునా సారదోఁకినా నొఱపిడియన
కల్లరియనంగ పావినాఁగను; మఱి యతి
భుక్తునకు తిండిబోతు నాబూతికాఁడు. 18

పోకిరి, ఒఱటు, సారదోఁకి, ఒఱపిడి, కల్లరి, పావి అన దుశ్శీలుని పేళ్ళు. తిండిబోతు, ఆబూతికాఁడు అన అతిభుక్తుని పేళ్ళు.

గీ. కొంచెగాఁడు కించుఁడు కించు క్రించు సన్న
గాఁడు పులుమానిసియు ననంగనగు నల్పు
నకు పేళ్లొరుదలకాఁడు కొండియుఁడును
కొండెగాఁడనఁగ పిశునకుండు శౌరి. 19

కొంచెగాఁడు, కించుఁడు, కించు, క్రించు, సన్నఁగాఁడు, పులుమానిసి అనఁగా అల్పునికి పేళ్ళు. ఒరుఁదలకాఁడు, కొండియుఁడు, కొండెగాఁడు అన పిశునకుని పేళ్ళు.

గీ. తోండు తోండోరుసోమరి దుండుబలియు
నలుచు బయ్యాఁడు వెరవిడియనఁగ మందుఁ
డగు; నవఘుళుఁడు వెరవరియనఁగ వ్యాప
కుండు; బందాయనఁగ బంధకునకుఁ జెల్లు. ౨౦

తోండు, తోండోరు, సోమరి, దుండుబలి, అలుచు, బయ్యాఁడు, వెర
విడి అన మందుని పేరు. అవఘళుఁడు, వెరవరి అన వ్యాపకుని పేళ్లు. బందాయి
అన బంధకుని పేరు.

గీ. పాదలియు తూబ బ్రాబయు బట్టగుత్తు
తజ్జ తజ్జన నీచుఁడుఁదన రెభువిని;
వాతరట్టు ప్రేలరియును వదరుబోతు
నాఁగ జల్పాకునకు పేళ్ళు నలిననాభ. ౨౧

పాదలి, దూబ, బ్రాబ, బట్టగుత్తు, తజ్జ, తజ్జు అన నీచుని పేళ్లు. వాతి
రట్టు, ప్రేలరి, వదరుబోతు అన జల్పాకుని పేళ్లు.

క. ధర రూపసి చెన్నుఁడు నొఱ
పరి చెలువుఁడు గొనబుకాఁడు బాగరియును రూ
పరి గోటుకాఁడు వఱి యొన
పరియు నెలమికాఁడను మనుబఁడె సుందరుఁ డై. ౨౨

రూపసి, చెన్నుఁడు, ఒఱపరి, చెలువుఁడు, గొనబుకాఁడు, బాగరి,
రూపరి, గోటుకాఁడు, ఒనపరి, ఎలమికాఁడు రూ॥ ఎమ్మెకాఁడు అన
సుందరుని పేళ్ళు.

గీ. ఒరువు డెడవాఁడు పెరవాఁడు నొరుఁడు జాతి
యనఁగ నన్యునిపేళ్లొప్పు; ననువరి యుప
మరి యొడికము నెప్పరి నేరుపరి యనంగ
నగు నుపాయశాలికిపేళ్లు హరిహయనుత, 23

ఒరువుఁడు, ఎడవాఁడు, పెరవాఁడు. ఒరుఁడు, జాతి అన అన్యునిపే ళ్ళు. అనువరి, ఉపమరి, ఒడికము, నెప్పరి, నేరుపరి అన ఉపాయశాలిపేళ్ళు,

పంచపాది. గీ. త్రిమ్మరీఁడు త్రిమ్మలకాఁడు త్రిమ్మరియును
త్రిప్పరియనంగ సంచారి తెలుగునందు;
నత్తుఁడు తగినవాఁడన నుత్తముఁడగు;
నన్నెకాఁడన జెల్లు నన్యాయకారి
యలరె కట్టుపకాసునా నచలుడు హరి. 24

త్రిమ్మరీఁడు, త్రిమ్మటకాఁడు, త్రిమ్మరి, త్రిప్పరి అనసంచారిపేళ్లు. ఉత్తుడు, తగినవాఁడు అన ఉత్తముని పేళ్ళు. అన్నెకాఁడు, అన అన్యాయకారిపేరు. కట్టుపకాసు రూ॥ కట్టిపకాసు అచలుని పేరు.

గీ. దిట్ట యుఱియ గద్దరికాఁడు దుష్టుఁడగును;
బిత్తలియు నుచ్చమల్లియు పేళ్లు నగ్న
కకగు దిసమొలవాఁడనంగనగు బిత్త
లి యనవో దిగంబరునకు నయగుణాఢ్య. 25

దిట్ట, ఉఱియ, గద్దరికాఁడు అన దుష్టునిపేళ్ళు. బిత్తలి, ఉచ్చమల్లి అన నగ్నకపేరు, దిసమొలవాఁడు, బిత్తలి అన దిగంబరుని పేళ్ళు.

గీ. అంగమొలనాఁగ దిసమొలయనఁగ
దిస్సమొలయనఁగ బిత్తలయనఁగ నల దిగంబ
రత్వమున కభిఖ్యలును; తరపన గెబ్బ
నాఁగ పరిహరించుటకౌను ; లిననాభ. 26

అంగమొల, దిసమొల, దిస్సమొల, బిత్తల అన దిగంబరత్వము పేళ్ళు. తరపు గెబ్బ అన పరిహరించు పేళ్ళు.

గీ. నంగయనఁగను తాటయనంగ నంగ
నాచియన తనుకును టక్కునాఁగ పేళ్ళు
కపటచిత్తునకగు; మొనకాడనంగ
గండడన మేటరియన ముఖ్యుండు శౌరి. 27

నంగ, తాట, నంగనాచి, తనుకు, టక్కు అన కపటఅంతస్సుగల వానికి పేళ్ళు. మొనకాఁడు, గండడు, మేటరి అనఁగా ముఖ్యునకుఁ బేళ్ళు

క. ఆడియేఁడును బంకుముచ్చన
నడియరియును పిలుఁగును పినుఁగన లోభికి పే
ళ్లడరెను; మోపరియాఁగం
దొడరెను భారకునకాఖ్య దురితవిదూరా 28

ఆడియఁడు, బంకుముచ్చు, అడియరి, పిలుఁగు పినుఁగు అన లోభికి పేళ్ళు. మోపరి అన భారకుని పేరు.

గీ. క్షోణి తెనుఁగున చేపట్టు కుంచమనన
భీష్టకామప్రదాయికి పేరుజెల్లె;

మతకరియనంగ మాయలమారియనఁగ
వెలసె మాయావినామముల్ వేదవేద్య. 29

చేపట్టు కుంచము అన అభీష్టకామప్రదాయి పేరు. మతకరి, మాయల మారి అన మాయావి పేళ్ళు.

పంచపాది. గీ. అంగవించు తఱియు మఱి యతకరించు
మట్టుమిగులు మిక్కిలి వాలుమట్టు మీఱు
నెసరు పైకొను ములుసూపు నేసరు జవ
దాటు నొత్తరించును మీఱు తలకడుచన
నాఖ్యలు నతిక్రమించుటకయ్యె శౌరి. 30

అంగవించు, తఱియు, అతకరించు, మట్టుమిగులు, మిక్కిలి, వాలు, మట్టుమీఱు, ఎసరు, పైకొను, ములుసూపు, ఏసరు, జవదాటు, ఒత్తరించు మీఱు, తలకడుచు అన అతిక్రమించుట పేళ్ళు.

గీ. ఒలుచు నంకించు గిలుబాడు నొడగొలుకొను
నటమటించు నడవు కవ్వ నడగొలుకొను
కొల్లలాడు మరియు లాగుకొను పఱిగొను
నాచికోలు నపహరించు నామములగు. 31

ఒలుచు, అంకించు, గిలుబాడు, ఒడగలుకొను, అటమటించు, సడవు కవ్వ, అడగొలుకొను, కొల్లలాడు, లాగుకొను, పఱిగొను, నాచికోలు, అన అపహరించుటకు పేళ్ళు.

ఆ.వె. ఒత్తరించు నట్టుము నొత్తును మొగరించు
నా సతిక్రమించు నామములగు;
నంకకాఁడనంగ నగు పామరుఁడు; బెండ
గిలు ప్రయాణమగుటకలరె శౌరి. 32

ఒత్తరించు, అట్టుము, ఒత్తు, మొగరించు అన అతిక్రమించు పేళ్ళు. అంకకాఁడు అన పామరుని పేరు. బెండగిల్లు అన ప్రయాణమగుట పేరు.

క. వనజాక్షా తొడుకును దూఁ
కొను గెబ్బును కనుచు నందుకొను క్రోలును చే
కొను సేకరించు నం సఁ
గ సగు గ్రహించుటకు పేళ్లు గలిగె తెలుఁగునన్. 33

తొడుకు, దూఁకొను, గెబ్బు, కనుచు, అందుకొను, క్రోలు, చేకొను, సేకరించు, అందు అన గ్రహించుటకు పేళ్ళు.

గీ. లంగగొను దుంకు దూఁకును జంగగొనును
గంతుఁగొను పుటమెగయును కడచు దాఁటు
పరిసెనము తటియును బహువచనమందు
చెంగనాలన లంఘించుచేష్టకగును. 34

లంగఁగొను, దుంకు, దూఁకు, జంగగొను, గంతుఁగొను, పుటమెగయు కడచు, దాఁటు, పరిసెనము, తటియు, ని-బ॥ చెంగనాలు అన లంఘించు పేళ్ళు.

గీ. అంగనాఁగను గంటన జంగనాఁగ
లంగనాఁగను దాటన లాఁగనంగ
లంఘనమునకభిఖ్యలౌ; లాఁగమనఁగ
లాఁగియన లివయనఁగను లఘువుపేళ్లు. 35

అంగ, గంతు, పంక, లంగ, దాఁటు, లాఁగు అన లంఘనము పేళ్ళు. లాఁగము, లాఁగి, లివ అన లఘువు పేళ్ళు.

సీ. అల్లకల్లోలంబు హల్లకల్లోలంబు
తాఱుమాఱును విటతాటనంబు
విటతట్టు నకటవికటము తాటాదూట
మును చిదిగొదయనఁగ పల్ల
టయనఁగను విటతాటంబన వ్యత్యస్త
మునకు; సంజ్ఞ లగు తడబడ యనఁగ పల్ల
టిల్లును తడబాటు జల్లను వ్యత్యాస
పడుటకు నామాళి పరగె; వీట

గీ. తటము వీటతాటము వీటతాటనంబు
తల్లక్రిందు తలకెడవు తల్లకెడవు
పృథ్వినుత్క్రమమగు; భయపెట్టుటకును
పేళ్లు సంకించు జళిపించు జెల్లె శౌరి. 36

అల్లకల్లోలము, హల్లకల్లోలము, తాఱుమాఱు, విటతాటనము, విటతట్టు, అకటవికటము, తాటాదూటము, చిదిగొద, పల్లటి, విటతాటము, అన వ్యత్యస్తము పేళ్ళు. తడబడు, పల్లటిల్లు, తడబాటు అన వ్యత్యాసపడుట

పేళ్ళు. వీటతటము, వీటతాటము, వీటతాటనము, తల్లక్రిందు, తలకెడపు, తల్లి కెడవు అన ఉత్క్రమమగుట పేళ్ళు. అంకించు, జళిపించు అన భయపెట్టుటకు పేళ్ళు.

గీ. ఊను తలకొను మోచును పూను తాల్చు
తావుకొనును సవదరించు తాలుచును వ
హించుటకు బేళ్లగును; హావణించు చాతు
పరిఢవించు ధరించగు భవవినాశ. 37

ఊను, తలకొను, మోచు, పూను, తాల్చు, తావుకొను, సవదరించు తాలుచు అన వహించు పేళ్ళు. హావణించు, చాతు, పరిఢవించు అన ధరించు పేళ్ళు.

క. పుటమిని తవణించును భ్రమా
స్పడునన మానుపడు చెట్టుపడుననగను రా
పడు పుల్లపడుననంగను
దొడరెకు స్తంభించుటకును దురితదూరా. 38

తవణించు, భ్రమాస్పడు, మానుపడు, చెట్టుపడు, రాపడు, పుల్లపడు అన స్తంభించుట పేళ్ళు.

క. చాటువపయున గోసనయున
చాటు నుపచరించుననఁగ చాటించుననన్

నేటుగ ప్రకటించుట కే
ర్పాడయ్యె విశేష్యనిఘ్నవర్గిల ముగిసెన్.                    39

చాటువ, గోసన, చాటు, ఉపచరింను, వాటించు అన ప్రకటించుటకు పేళ్ళు.

విశేష్యనిఘ్నవర్గ ముగిసెను.

# సంకీర్ణవర్గ.

గీ. మాసటియు మిన్న మిహి తలమానికంబు
బంతి కన్నాకు మేటి మేల్బంతి మీస
రము నిగారము నిగరము రకమును తల
కట్టనఁగ శ్రేష్ఠమునకభిఖ్యలు ముకుంద.                40

మాసటి, మిన్న, మిహి. తలమానికము, బంతి, కన్నాకు, మేటి, మేల్బంతి, మీసరము, నిగారము. నిగరము, రకము, తలకట్టు అనఁగా శ్రేష్ఠమునకు పేళ్ళు.

క. ఒరవన జితమన నుటిదియు
తిరమనఁగా బేళ్లు జెల్లు స్థిరమునకును; తా
వరమన స్థిరమైనది; యు
స్థిరమునకు నభిఖ్యయదుప జెల్లు మురారీ.                41

ఒరవు. జితము, ఉటిది, తిరము అనఁగా స్థిరమునకు పేళ్ళు. తావరము అన స్థిరమైనది. అదుప అన అస్థిరము పేరు.

క. జితపడు కుదు రిరవారును
జితించు నిరువుకొను ననఁగ స్థిరపడుట; పతి
వ్రతమున కీలువనఁగ మగ
రతమనఁగా పేళ్లుజెల్లు నాత్మజవైరీ. 42

జితపడు, కుదురు, ఇరవారు, జతించు, ఇరువుకొను అన స్థిరపడుట పేళ్లు. ఈలువు, మగరతము లన పతివ్రతము పేళ్లు.

గీ. మహినిచీఁకటితప్పన మఱివెలిచవి
యనఁగ అంకన జారత్వమునకుఁ బేళ్లు;
బైసుకయన ప్రతిజ్ఞకాహ్వాయముచెల్లె;
బోమనఁగ బలత్కారమౌ భోగిశయన. 43

చీఁకటితప్పు, వెలిచవి, అంకు అనఁగా జారత్వముపేళ్లు. బైసుక అన ప్రతిజ్ఞపేళ్లు. బోము అన బలత్కారముపేరు.

క. చుమ్మనఁగ చూడుమాయన
చుమ్మీయని చూడ్మనంగ చువ్వేయు చూపే
చుమ్మియన చూడుమీయన
సుమ్మీ సువ్వేయన నతిసుర పశ్యాఖ్యల్. 44

చుమ్మ, చూడుమా, చుమ్మీ, చూడ్మ, చువ్వే, చూపే, చుమ్మి, చూడుమీ, సుమ్మీ, సువ్వే అన పశ్యము పేళ్లు.

గీ. కూర్పనఁగ పోహణయనంగ కూరుపనఁగ
పొసగెసందర్భ సంజ్ఞలై; పోహణించు

ననఁగ నెడకట్టు ఖాఁగను తెనుఁగుబాన
నకలుషాత్మ సందర్భించుటకును పేళ్లు.

కూర్పు, పోహళ, కూరుపు, అనఁగ సందర్భము పేళ్లు పోహణించు, ఎడకట్టు, అనఁగా సందర్భించుటకు పేళ్లు.

గీ. అంటసిల్ల త్తుకలయిక యంట క్రయ్యు
పొందు పెనకువయనఁగను పొందిక మఱి
యొరుము పెనఁగును దనివును సొరగు హత్తు
నాఁగ మేళనమునకౌను నలిననాభ. 46

అకటసిల్లు, అత్తు, కలయిక, అంట, క్రయ్యు, పొందు, పెనకువ, పొందిక, ఒరుము, పెనఁగు, దనివు, సొరగు, హత్తు, అన మేళనము పేళ్లు.

క. అనగన దొరలన తొడరన
దనివన సక్తమగు పేళ్లుదనరెఁ; వాటమ
న్నను సక్తమైనదియు సో
మన నాసక్తంబు పేళ్లు హాటకచేలా. 47

అనగు, దొరలు, తొడరు, దనివు, అన సక్తమగు పేళ్లు, వాటము, అన సక్తమైన దాని పేరు. సోము, అన సక్తము పేరు.

సీ. అండ యందిక గెడ యఱుత యొలయు చెంత
కడ కుఱఁవలి యఱు గరిడి దండ

యందుపాటును చేర్వ యందుబడియు తఱి
సంగడి డగ్గఱ సంగడంబు
జంట చేయలతియు సరస వద్దను ప్రోల
తారసమును దరి దగ్గఱయును
మందట పొరుగును మందల దాపును
చేరువ పజ్జయు చెంగలియును
గీ. చేరుగడయును మరియొద్ద చేరికయును
పొంత యరతయనంగను పొసగ తెనుఁగు
పలుకులను భువిలోనసమీపంబు పేళ్లు
బాలనగరేశ భవనాశ నీలకేశ. 48

అండ, అందిక, కెడ, అఱుత, ఒలయు, చెంత, కడ, కుఱుఁగలి, అఱు, గరిడి, దండ, అందుపాటు, చేర్వ, అందుబడి, తఱి, సంగడి, దగ్గఱ, సంగడము, జంట, చేయలతి, సరస, వద్ద, ప్రోల, తారసము, దరి, దగ్గఱ, మందట, పొరుగు, మందల, దాపు, చేరువ, పజ్జ, చెంగలి, చేరుగడ, ఒద్ద, చేరిక, పొంత, అరత అన సమీపము పేళ్లు.

మ. కినియుం దారసమన్న తారసిలునాఁ గిట్టన్న తారన్న దా
కొనునన్నఁ దఱియున్గదింగఁ యుతార్కొల్పన్న నాతారసిం
చనఁగాఁ దార్కొనుడాయుతారుకొనునాఁ గ్రాయునాదారసి
ల్లనగాఁ దాకొనునాఁగ నాపొలయునాఁ నాఁగా సమీపించుటల్.

కినియు, తారసము, తారసిలు, కిట్టు, తారు, దాకొను, తఱియు, కదియు, తార్కొల్పు, తారసించు, తార్కొను, డాయు, తారుకొను, దాయు, తారసిల్లు, డాకొను, పొలయు అనఁగా సమీపించుట పేళ్లు.

క. వాచారన వాచఱమన
వాచాఱపమనిన భువిని పరివేదనపే
ళ్లౌ; చేఁకురించు చీఁకన
నౌ చంద్రార్కాక్షయుగళి యంధత్వంబుల్. 50

వాచారు, వాచఱము, వాచాఱపము అన పరివేదన పేళ్లు. చీఁకురించు చీఁకు అన అంధత్వము పేళ్ళు.

గీ. మంతనప్రసిద్ధి పేరు; మిమ్మటమనంగ
మిక్కుటంబ పేళ్లొప్పిమెలఁగె నుద్ధ
తంబు; గూఢమునకు గాయకంబుజెల్లె;
పిండమా గద్ద గర ముద్ద పిండిలియన. 51

మంతు అన ప్రసిద్ధి పేరు. మిమ్మటము, మిక్కుటము అనఁగా ఉద్ధతము పేళ్ళు. గాయకము అన గూఢము పేరు. గద్ద, గర, ముద్ద, పిండిలి అనఁగ పిరి దము పేళ్ళు.

క. ఇల గడితంబును దప్పము
దళసరి చిక్కనయు విరివి దండడి తఱుచుల్
దళమును దట్టము తఱచన
చెలఁగెను స్నిగ్ధంబు పేళ్లు చిన్మయమూర్తీ. 52

గడితము, దప్పము, దళసిరి, చిక్కన, విరివి, దండడి, తఱుచు, దళము దట్టము ,తఱచు అనఁగా స్నిగ్ధము పేళ్ళు.

క. కడయన్న దవ్వు దావన
యెడమనఁగను దాయనంగ నెడయు దవనఁగా
నెడవనిన కెళవనంగను
బుడమిని దూరంబునకును పొనఁగెను పేళ్లై. 53

కడ, దవ్వు, దావు, ఎడము, దా, ఎడ, దవు, ఎడవు, కెళవు, అన దూరము పేళ్ళు.

గీ. కాలియము సోఁకుఁడనఁగను గాలియనఁగ
బూతమనఁగను డగరయు బూచియనఁగ
మరులనంగ నగామన మహిబిశాచ
మునకు నభిధానములు జెల్లెవనజనాభ. 54

కాలియ, సోఁకుఁడు, గాలి, బూతము, డగర, బూచి, మరులు, నగాము అన పిశాచము పేళ్ళు.

పంచపాది. గీ.వసుధఁ గైపదమనఁ గయిపదమనంగ
జెల్లె పద్యసమస్యకు పేళ్లు; వెక్క
సంబు గగనమనఁగ దుర్లభంబుపేళ్లు
నలరె నపహారణమునకు గిలుబన నగు
నాఁచనంగ నపహారించు నామమగును. 55

కైపదము, కయిపదము అన పద్యసమస్యకు పేళ్ళు. వెక్కసము, గగనము అన దుర్లభము పేళ్ళు. గిలుబు అన అపహారణము పేరు. నాఁచు అన అపహారించు పేరు.

పంచపాది. గీ. ఊఁత కైలాగు కయిదండ యూఁతఁగోను న
నంగ హస్తావలంబమునకు నభిఖ్య
లడరె మట్టాడు నడచును నడుచనంగ
నడరె గమనించుపేళ్లు; పోకడయు నడక
నడ నడపు పోకయన గమనంబుపేళ్లు. 56

ఊఁత, కైలాగు, కయిదండ, ఊఁతఁగోను అన హస్తావలంబము పేళ్ళు. మట్టాడు, నడచు, నడుచు అన గమనించుట పేళ్ళు. పోకడ, నడక, నడ, నడచు, పోక అన గమనము పేళ్ళు.

సీ. అక్కజం బగ్గలం బడర మీఁఱం బొఱ్ఱు
కడిమి కడిఁది యొడ్డు గమిక మేవు
మెంపు తఱుచు గుర్వు మేలు మొల్లము లాఁతు
పెలుచ యిట్టల మెస పెల్లు బెడగు
మలచ మెక్కువ పెల్లు వలదు వైమాలంబు
వెగ్గలం బనయంబు వెక్కసంబు
మిక్కిలి యురవును మీఁదుమిక్కిలి గొప్ప
హురుమత్తు వావిరి యుక్కడంబు

గీ. నెరవు పెలుచన తోరంబు నెరపు మీఁటు
బలము హుర్మత్తు దళము నిట్టలము నుబ్బ
కంబు నుగ్గడువును ముమ్మరంబు నెక్కు
డనఁగ నధికంబుపేళ్లను వనజనాభ. 57

అక్కజము, అగ్గలము, అదనము, ఈఱము, ఒఱ్ఱు, కడిమి, కడిందీ, ఒడ్డు, గమకము, ఏపు, మెండు, తఱచు, గుర్వు, మేలు, మొల్లము, లాఁతు, పెలుచ, ఇట్టలము, ఎస, పెల్చ, బెడగు, మలచము, ఎక్కువ, పెల్లు, వలదు, వైమాలము, వెగ్గలము, అనయము, వెక్కసము, మిక్కిలి, ఊరవు, మీదు మిక్కిలి, గొప్ప, హురుమత్తు, వావిరి, ఊక్కడము, నెరవు, పెలుచన, తోరము, నెరపు, మీటు, బలము, హుర్మత్తు, దళము, నిట్టలము, ఉబ్బకము, ఉగ్గడువు, మామ్మరము, ఎక్కుడు అనఁగా అధికమునకు పేళ్ళు.

గీ. నిడివి వాలిక నిడుపును నిడుద సోగ
వాలు నాదీర్ఘమునకగు; బలియు బలప
డనఁగ దృఢమగుటకుపేళ్లు; నబ్బరంబు
నా నపారంబునకుపేరు నలిననాభ. 58

నిడివి, వాలిక, నిడుపు, నిడుద, సోగ, వాలు అన దీర్ఘమునకు పేళ్ళు. బలియు, బలపడు అన దృఢమగుట పేళ్ళు. అబ్బరము అన అపారము పేరు.

క. నెరవును పఱపును వెడలుపు
వరళియును వెడల్పు వితివి వలము వెణఁదయుఁగా
గరువము వెడఁదయు నిమ్మును
విరివియు వింగడమనంగ విస్తారంబౌ. 59

నెరవు, పఱపు, వెడలుపు, వరళి, వెడల్పు, వితివి, వలము, వెణఁద. గరువము, వెడఁద, ఇమ్ము, విరివి, వింగడము అన విస్తృతి విస్తారము పేళ్ళు

క. వలుదయు తోరము లావన
బలితంబును వల్ద దొడ్డు బంబయునంగా

వలమును బూరయనంగను
చెలఁగెను స్థూలంబుపేళ్లు చిన్మయమూర్తి. 60

వలుద, తోరము, లావు, బలితము, వల్ద, దొడ్డు, బంబ, వలము, బూర అనఁగా స్థూలముపేళ్ళు.

గీ. మట్టము సపాటయును సరిమట్టసము స
పాటమన సమానముపేళ్లుబరగె; రిప్పు
వెలితినాఁ గ్వచిత్తూనత్వమై వెలసె; నెఱియ
నంగ పూర్తికిపేరు భుజంగశయన. 61

మట్టము, సపాట, సరి, మట్టసము, సపాటము అన సమానముపేళ్ళు. రిప్పు, వెలితి అన క్వచిత్తూనత్వమైనదానిపేళ్ళు. నెఱి అన పూర్తికిపేరు.

సీ. కడమ యసదు కుందు కడఁబడు దిగువాయి
కొదవ యొచ్చెము తగ్గు కొఱఁత కొదుక
యఱఁ గొఱతయు గ్రించు గఱగొఱయును కొద
కుదియును కించును [illegible]ఱుచ కొఱయు
తఱుఁగు ముక్కిడి నన్న తఱువు కనీసంబు
పొచ్చెంబు లొజ్జను లొచ్చు బెరికి
తగ్గుదలయు మఱి తక్కువయనఁగను
తెనుఁగుమాటల న్యూనమునకు బేళ్లు

గీ. తొచ్చెమును లొజ్జ లులివడు తొచ్చియంబు
చిలపినాఁగ నికృష్టమై చెలఁగెకొంత

కొండొకయున క్వచిత్కాలమండ్రు కుఱుచ
పొట్టి నన్నయనఁగ హ్రస్వమునకు బేర్లు. 62

కడమ, అసదు, కుందు, కడఁబడు, దిగువాయ, కొదవ, ఒచ్చెము, తగ్గు, కొఱఁత, కొదుక, అఱ్ఱగొరత, క్రించు, గఱగొఱ, కొద, కుదియు, కించు, కుఱుచ, కొఱ, తఱుఁగు, మ్రుక్కడి, నన్న, తఱువు, కనీసము, పొచ్చెము, లొజ్జు, లొచ్చు, బెరికి, తగ్గుదల, తక్కువ అనఁగా న్యూనమునకు పేర్లు. తొచ్చెము, లొజ్జు, ఉలివడు, తొచ్చియము, చిలిపి అన నికృష్టము పేర్లు. కొంత కొండొక అన క్వచిత్కాలము పేర్లు. కురుచ పొట్టి నన్న అన హ్రస్వము పేర్లు.

క. చిన చిన్ని చిఱుత చిటుయున
చిని కొండిక చిట్టి బుచ్చి చికిచికియనఁగఁ
పిన పిన్న పిల్ల కొండొక
యనఁగ కనిష్టంబుపేర్లు హాటక చేలా. 63

చిన, చిన్ని, చిరుత, చిటి, చిని, కొండిక, చిట్టి, బుచ్చి, చికిచికి, పిన పిన్న, పిల్ల, కొండొక అన కనిష్టము పేర్లు.

సీ. అలఁతి యలక యెలె యలుప మించుక యీరు
చిఱువు కొంచము లేత చిఱుత నుంత
యలకన కింగిరి యసదు తోఁద్రము కొద్ది
బుడిబుడి యినుమంత చిడుగు కసిడి
కీసర గుడిగుడి కీస కొంచియమును
నఱుజు సన్నంబును ముఱియు చిలిపి

పొటుపొటు సనకంబు గిటగిట చిటుపొటు
కుఱకుఱ కిముడు తక్కుఱయు వెడయు

గీ. తనియు సైకమనఁగ నల్పమునకు బేర్లు;
కొంత కొంతయు కొంచము కొంచమనఁగ
పాటపాట యనంగను బరగెపేర్లు
నిలక్వచిత్క్వ చిత్తున కాఖ్యలలరె శౌరీ. 64

అలఁది, అలక, ఎల, అలుపము, ఇఁచుక, ఈరు, చిఱువు, కొంచెము లేత, చిరుత, నుఁత, అలకన, కింగిరి, అసదు, తోడెము, కొద్ది, బుడిబుడి, ఇసుమంత, చిడుగు, కసిడి, కీసర, గుడిగుడి, కీస, కొంచియము, నఱుజా, సన్నము, ము , చిలిపి, పొటిపొటి, సలికము, గిటగిట, చిటుపొటు, కుఱకుఱ కిముడు తక్కుఱు, వెడ, తనియు, సైకము అన అల్పము పేర్లు. కొంత, కొంత, కొంచెము కొంచెము, పాటపాట అన క్వచిత్క్వ పేర్లుచిత్తు పేళ్ళు.

కం. నలికము దడివము దలిమము
వలిపెము రవ జంపు వల్ప వల్పము నలియుఁ
జిలుఁగు గిటగిటన జిల్గన
దనరెను సూక్ష్మంబుపేళ్ళు తామరసాక్షా. 65

నలికము, దడివము, దలిమము, వలిపెము, రవ, జంపు, వల్ప, నవల్పము, నలి, జిలుఁగు, గిటగిటన (రూ) గిటగిబని జిల్గు అనగా సూక్ష్మము పేళ్ళు.

క. ముడుఁగును పొల్లువడును పొలు
వడు ప్రిదులును తగ్గు వ్రట పడు స్రుక్కును పొ

ల్పడు సగ్గు స్రగ్గు నెతుబోం
వడరెను క్షీణమునకిల విహంగతురంగా. 66

ముడుఁగు, పొల్లుపడు, పొలువడు, ప్రిదులు, తగ్గు, వట్టిపడు, స్రుక్కు, పొల్పడు, సగ్గు, స్రగ్గు, ఎతుబోవు అన క్షీణము పేళ్ళు.

గీ. అక్కళించన తగ్గించు ననఁగ మట్టు
చేయునన ప్రేళ్లు క్షీణము సేయుటకును
చెలఁగె రవపాళమనఁగ మిక్కిలిజిలుంగు
నాఁ సుసూక్ష్మముపేళ్లొను నలిననాభ. 67

అక్కళించు, తగ్గించు, మట్టుచేయు అన క్షీణముసేయుటకు పేళ్లు రవపాళము, మిక్కిలిజిలుఁగు అనఁగా సుసూక్ష్మము పేళ్లు.

క. బూరటిలు నిండుకొను నిం
పారు నెరయు జొబ్బిలు నిను పారు నెరవునిం
డారును పిక్కటిలనఁగా
నారదనుత పూర్ణమగుట నామములు భువిన్. 68

బూరటిల్లు, నిండుకొను, నింపారు, నెరయు, జొబ్బిలు, నినుపారు, నెరవు, నిండారు, పిక్కటిలు అన పూర్ణమగుటకు పేళ్ళు.

గి. నిండనఁగ రెప్పమనఁగను నెరయుననఁగ
నారనఁగ పూర్ణమునకునామాళి నెరవు
నింపనఁగను పూర్ణించుటాసంపతిల్లు
ననఁ సమృద్ధమగుటకాఖ్య వనజనాభ. 69

నిండు, నెప్పము, నెరియు, అరు అన పూర్ణమగుటకు పేళ్ళు. నెరవు, నింపు అన పూర్ణించుపేళ్లు. సంపత్తిల్లు అన సమృద్ధమగుట పేరు.

గీ. ఒదుగు బడియన పుంజినా నొదుగనంగ
పెంపనఁగ తోరహత్తన సొంపును పస
యనఁగ సంపనఁగ సమృద్ధమునకు పేళ్లు
ముగియు మూడనఁగ సమాప్తమునకు పేళ్లు. 70

ఒదుగుబడి, పుంజి, ఒదుగు పెంపు, తోరహత్తు, సొంపు పస సంపు అన సమృద్ధముపేళ్ళు: ముగియు, మూఁడు అన సమాప్తముపేళ్లు.

క. అరుదెంచును విచ్చేయును
తరలును వేంచేయు పోవు తారుసరించుం
బరియును విజయముచేయును
ధరణిం గచ్ఛాఖ్యలగును ధర్మచరిత్రా. 71

అరుదెంచు, విచ్చేయు తరలు, వేంచేయు, పోవు, తారు సరించు పరియు, విజయముచేయు అన గచ్ఛతికి పేళ్లు.

గీ. అరుగుదెంచన విచ్చేయుననఁగ వచ్చు
నాఁగ విజయము సేయుననఁగ నగు నరు
దెంచనఁగను వేంచేయునాఁ దెనఁగునందు
నాగతమునకు పేళ్లొప్పె నంబుజాక్ష. 72

అరుగుదెంచు, విచ్చేయు, వచ్చు, విజయముచేయు అరుదెంచు వేంచేయు అన ఆగతము పేళ్లు.

క. తిరుగు తలారించును క్ర
మ్మరుమళ్లును మడఁగు మగుడు మసలును మఱలున్
మరలుననఁ బ్రవక్రించుట
కిరవయ్యెను తెలుఁగుబాస నిద్ధర శౌరీ 73

తిరుగు, తలారించు, క్రమ్మరు మళ్ళు మడఁగు, మగుడు, మసలు, మఱలు అన వక్రించుటకు పేర్లు.

గీ. తూఁకొనును చొచ్చుననఁగను దూఱునన ప్ర
వేశమునకౌ ప్రవేశించుపేళ్లు పొలయు
ననఁగ నొలయుననఁగ నాంధ్రమందు జెల్లె
తవనయన క్షుప్తకాలమౌ భవతివినాశ. 74

తూకొను, చొచ్చు, దూఱు అన ప్రవేశమునకు పేర్లు పొలయు, పొలయు అన పరివేశించుపేర్లు. తవన, అన క్షుపకాలము పేరు.

ఆ. వె. వెలలు బయలుదేలు వెడలుననఁగ నిర్గ
మించుపేను మఱకటించు కిఱుకు
ముఱకటంబు త్రిప్పు మురియు నంకించన
జెల్లెను భ్రమరించు పేళ్లుశౌరి. 75

వెలలు బయలుదేలు, వెడలు అన నిర్గమించుపేర్లు మఱకటించు కిఱుకు, ముఱకటము త్రిప్పు, మురియు, అంకించు అన భ్రమరించుపేర్లు.

గీ. పరగె తిరుగు వట్రిల్లన భ్రమముపేళ్లు
వేడెమనఁగ మండలగతిపేరు చిమ్ము

దిరుగుడునగను గిరగిరదిరుగుడనఁగ
నెగడె మండలగతి గమనించుపేళ్లు. 76

తిరుగు, పల్టిల్లు అన భ్రమము పేర్లు, వేడెము అన మండలగతి పేరు చిమ్ముఁదిరుగు గిరగిరఁదిరుగు అన మండలగతి గమనించు పేరు

సీ. పరిఁగొనుననఁ గువ్వ కరిఁగొనుసన గుండు
కొనుసన దిరుగన పెనకువయున
చుట్టువాఱనఁగను సుడిఁగొనుననఁ గువ్వ
కోలాకొనుసన క్రిచ్చుకొనుననంగ
వేఁడ్రపెట్టనఁగను వేండించుసన గిఱి
కొనుననగను పొదిఁగొనుననంగ
స్రుక్కునా పొలయునా సుడియుననఁగ ప్రమ్ము
నన పెనఁగన క్రిచ్చుననఁగ బలయు

గీ. సనగ చుట్టుకొనన నాం భ్రమమునను పేళ్ల
గాంచె మండలగత్యావరించుటకును
వలగునును డాపరించన వెలసె పేళ్లు
ధర ప్రదక్షించుటకును కంధరశరీర. 77

పరిఁగొను, గువ్వకరిఁగొను, గుండుకొను, తిరుగు, పెనకువ, చుట్టువాఱు, సుడిఁగొను, గువ్వకోలాకొను క్రిచ్చుకొను, వేఁడ్రిపెట్టు, వేడించు గిఱికొను పొదిఁగొను, స్రుక్కు, పొలయు, సుడియు, ప్రమ్ము, పెనఁగు క్రిచ్చు, బలయు, చుట్టుకొను అన మండలగత్యావరణము పేర్లు. వలఁగొను డాపరించు అన ప్రదక్షించు పేర్లు.

సీసమాలిక. అంకిలి యక్కిలి యదవదయారివే
రము తికమక యుత్తలమును గలబ
యటిముటి లొగ్గిడి యాశ్వేరమును కొంద
లము కలఁత కలవరముఁను గొడవ
కలఁగుండు కలకువ కలపనఁ బిండియు
గగ్గోలు గబ్బాటు కళవళంబు
కలఁక తుందుడుకును కలుచ చోపుడనంగ
క్షోభంబునకు పేర్లు; కొందలపడు
కొందలపాటును కొందలించును లొగ్గి
డిల్లు తెరలు దురపిల్లు తలరు
కలగుండుగును నింక కలఁగు కొరాకూర
మును తెగచును పొటివోవు కలఁత
బడును తెరివడును కలగంబారుననఁగ
క్షోభ వడుపేళ్ళుజెల్లెను; క్షోభపడిన
దానికాహ్వాయములు నొప్పె తటమట యన
గ తలబీకన కాయనాఁగను మురారి. 78

గీ. పొరలు కూరట తొల్లును పొర్లు దొర్లు
ననఁగ లుంఠనసంజ్ఞయా సంకమనఁగ
బరగ నాక్షేపమున కాఖ్య పదరు ననఁగ
వెలసె ధరణినాక్షేపించుపేరు శౌరి. 79

అంకిలి, అక్కిలి, అదవద, ఆరివేరము, తికమక, ఉత్తలము, గలబ
అటిముటి, మ్రొగ్గిడి, ఆశ్వేరము, కొందలము, కలఁత, కలవరము, గొడవ

కలఁగుండు, కలకువ, కలపనఁబింది, గగ్గోలు గప్పాటు కళవళము కలఁక, కుందుడుకు కలుచ, చోపుడు అన క్షోభము పేర్లు.

కొందలపడు, కొందలపాటు, కొందలించు, లొగ్గిడిల్లు, తెరలు, దరపిల్లు, తలరు, కలగుండుగొను, కలఁగు కారాకూరము, తెగచు, పొటి పోవు, కలఁతఁబడు, తరివసు, కలగంబారు అన క్షోభపడు పేర్లు.

తటమట, తలబీకనకాయ అన కోపపడినదాని పేర్లు. పొఁగులు, కూరట, డొల్లు, పొర్లు, దొర్లు అన లుంఠనము పేర్లు అంకము అన ఆక్షేపము పేర్లు. పదరు అన ఆక్షేపించు పేరు.

గీ. చాచునన పచరించన చాపుననఁగ
నొగ్గుననఁగ ప్రసారాఖ్యలొప్పు నంకె
యనగ నంకియయన వశమునకు పేర్లు
నంతకం బంతునాఁగనా నాతమునకు. 80

చాచు, పచరించు, చాపు, ఒగ్గు అన ప్రసారము పేర్లు అంకె అంకియ అన వశమునకు పేర్లు అంతకము, అంతు అన అసాంతము పేర్లు.

క. నడపన మనువన నడుపన
నడువడియన వెంటనాగ నడవడియన పో
కడయు మెలకువయు పోకయు
నడతయనంగా ప్రవర్తనము పేర్లు మారీ. 81

నడపు, మనువు, నడుపు, నడువడి, వెంట, నడవడి, పోకడ, మెలకువ, పోక, నడత అన ప్రవర్తనము పేర్లు

క. మెలఁగు పచరించుచును పరిడ
విలు నుపచారించుపరిడ వించును మను వ
ట్రిలు పరగు వఱలు ప్రబ్బును
మెలయుననఁ ప్రవర్తిలుటకు మేదినిపేర్లౌ. 82

మెలఁగు, పచరించు, పరిఢవిల్లు పచరించు, పరిఢవించు, మను, వట్రిలు, పరగు, వఱలు, ప్రబ్బు, మెలయు అన ప్రవర్తిల్లు పేర్లు,

గీ. ఊఁగులాడన నూఁగననూవన నసి
యాడుననగను తుంపెసలాడనంగ
నూఁకయనఁగ నూఁగాడన నొప్పుభువిని
పేర్లు నాందోళనము నకు వేదవేద్య. 83

ఊఁగులాడు, ఊఁగు, ఊవు, అసియాడు. తుంపెసలాడు, ఊఁక, ఊఁగాడు అన ఆందోళనము పేర్లు.

క. గునిసాడన తుంపెసలా
డన పువ్వాటనఁగ గునిసి యాడనతూఁగా
డన కదలాడన నూఁగా
డననాందోళించుపేళ్ళు హాటక చేలా. 84

గునిసాడు, తుంపెసలాడు, పువ్వాటు, గునిసియాడు, తూఁగాడు, కదలాడు, ఊఁగాడు అన ఆందోళించు పేర్లు.

సీ. అసియాడు నటమట యాదలు నల్లలలాడు
నల్లాడు కదలిక యల్లలాడు

పల్లటి యుఱియాడు తల్లడం బదరును
బిత్తరం బులివును బెళకు బెడకు
మినుకు తుంపెసలును త్రొనకు తలఁకు గెంటు
కుదు లిసిగింతలు కదలు తమకు
చిందును నుక్కటి చెదరునసంగను
చలనంబునకు నభిఖ్యలు వహించె;
గీ. చెల్లచెదరనఁ మిక్కిలి చెదరుననఁగ
నిత్యబహువచనంబున నెలవుకొనెను
గ్రక్కసిలనంగ నివిమూడు గలిగెనధిక
చలనమునకు నభిఖ్యలు సారసాక్షి. 85

అసియాడు, అటమట, ఆదలు, అల్లిలలాడు, అల్లాడు, కదలిక, అల్లలాడు, పల్లటి, అఱియాడు, తల్లడము, అదరు, బిత్తరము, ఉలివు, బెళకు, బెడకు, మినుకు, తుంపెసలు, త్రొనకు తలఁకు, గెంటు, కుదులు, ఇసిగింతలు, కదలు, తమకు, చిందు, నుక్కటి, చెదరు అన చలనము పేర్లు. చెల్లచెదరు, మిక్కిలి, చెదరు, ని బ॥ గ్రక్కసలు అన అధికచలనము పేర్లు.

సీ. కుదిలక యూటాడు కదలు తుప్పలుదూలు
తలఁకించు బెగ్గిలు తలఁకు తలరు
తూఁగు తుంపెసలాడు తుంపెసలు గిలియు
తమకించు గొటించు తమకు తఱలు
చంగలించును గెంటు జవ్వాడు తెమలును
కత్తరిలును గ్రాలు కసరు పదరు

చిట్టాడు నట్టాడు చిందిలు తోలకాడు
నడయాడు సురగును బెడఁకు వీఁగు

గీ. తొనఁకు వీఁగియాడు తోలఁకు సలించన
నగుచలించు పేళ్లు నవని; వెడఁగు
పాటనగ వెడగురుపాటనఁగా జడ
త్వంబునొందు పేళ్ళు వాసుదేవ. 86

కుదిలిక, ఊటాడు, కదలు, తుప్పలుదూలు, తలఁకించు, బెగ్గిలు, తలఁకు, తలరు, తూఁగు, తుంపెసలాడు' తుంపెసలు, గినియు, తమకించు గొంటించు, తమకు, తఱలు, చంగలించు, గెంటు, జవ్వాడు, తెమలు కత్తెరిల్లు, క్రాలు, కసరు, పదరు, చిట్టాడు, నట్టాడు, చిందిలు, తోలకాడు, నడయాడు, సురగు, బెడఁకు, వీఁగు, తొనఁకు, వీఁగియాడు తొలఁకు, సలించు అన చలించు పేర్లు. వెడఁగుపాటు, వెడగురు పాటు అన జడత్వము పేర్లు.

సీ. కుదుకనగోలన గుబుసన కల్లనా
దటమట నాఁగను తటవటయన
బెల్లినా లయనాఁగఁ బెల్లింపనఁగ మోస
మనఁగి లూలామానమనఁగ జూటు
దనమన దబ్బుఅయన జజారయనంగ
వెడ్డన కుదుపన వేడబమన
టాటోటనంగను తాటోటనంగను
డంబన జూటన తవళియనఁగ

టక్కనఁగను జజ్జరయన తక్కిడియన
మొఱఁగనంగ తెక్కలియన మోసయనఁగ
వంచనాభిఖ్యలై భువివఱలె తెనుఁగు
బాసను భవాంబునిధితరిపాదయుగళ.  87

కదుకనఁగోలు, గుబును, కల్ల, కటకుట, తటవట, జెల్లి, అయ, జెల్లింపు, మోసము, లూలామానము, బొటడనము, దబ్బఱ, జజాఁగ, వెద్దు, కుదుపు, వేడబము, టాటోటు, తాటోటు, డంబు, జూటు, కవలి టక్కు, జజ్జర, తక్కిడి, మొఱఁగు, తెక్కలి, మోస అనగా వంచనకు పేళ్ళు.

సీ. ఉలయునా నురియునా నూటించనంగను
కన్నుమొఱంగన కనుమొఱఁగన
అటమటించనఁగను తటమటించనఁగ క
న్నొత్రఅగన కికురన మొఱఁగనంగ
కనుమూయుననఁగను కన్నుబ్రామనంగను
కిక్కరించనఁగను కిక్కరనఁగ
కికురువెట్టనఁగను గినుమాడుననఁ నలి
వాడన నగుచు జాటాడన కికు
గీ. రించనఁగ గినుమన కికురింతయనఁగ
కిక్కురింతయనంగను కికురుపడుచు
ననఁగ దాగురించనఁగ పేళ్లలరె తెనుఁగు
నందు వచించుటకు ముచికుందవరద.  88

ఊలయు, ఊరియు, ఊటించు, కన్నుమొఱుగు, కనుమొఱఁగు, అట మటించు, తటమటించు, కన్నొత్రఅఁగు, కికురు, మొఱఁగు, కనుమూయు, కను

బ్రామ, కికు్కరించు, కికు్కగు, కిసురువెట్టు, గినుమాడు, ఉలివాడు, జూటూ డు, కికురించు, గినుము, కికురింత, కికు్కరింత, కికురుపడుచు, దాగురించు అనఁగా వంచించుట పేళ్ళు.

ఉ. ఆవడి రాయిడిన్ రహటు హోవడిచీఁదఱయుం గడిందియున్
హోవళి లూటియున్ సిలుగు నావలియుం బులుగాకువేకరం
బావళిక్రందు రట్టును గోహోరును రాటన భూతలంబునన్
పావననామసంచయ యుపద్రవ సంజ్ఞలకున్ దెనుంగునన్.

ఆవడి, రాయిడి, రహటు, హోవడి, చీఁదఱ, కడిఁది, హోవళి, లూటి, రూ॥ లూటీ, సిలుగు, ఆవలి, పులుఁగాకు, వేఁకరము, ఆవళి, క్రందు, రట్టు, గోహోరు, రాటు అనఁగా ఉపద్రవము పేళ్ళు.

గీ. ధరణి హోరామియన నుపద్రవము సేయు
పనికిపేరగు; కవబిడ్డలనఁగ కవల
నంగ నమడలునాఁగ జోడనఁగ యమము
పేళ్ళుజెల్లెను హతదైత్య వేదవేద్య. 90

హోరామి అన ఉపద్రవము సేయుననిపేరు. కవబిడ్డలు, కవలు, అమడలు జోడు అన యమము పేళ్ళు.

సీ. వమ్మన కుందేటికొమ్మన నిప్పచ్చ
రంబనంగను లేబరంబనంగ
చెన్నఁటియనఁగను చెనఁటియనంగను
తెక తేరయనఁగను తేరనాఁగ

బీజన నీటన కాఱనఁగను విత్తా
యన విత్తయన రిత్త యనఁగ వయ్య
మనఁగ పచ్చనపాఁడన వెడఁదన వాయ
మనఁగను దోయివి యనఁగ సున్న
గీ. యనఁగ బోరచియనఁగ శూన్యంబుపేళ్లు;
వెంబడించెద్దు నెయిదన విలసిలె నను
గామికాఖ్యలగుచు; పర్వ కవియు కలియ
జను పరుగు పరువన ప్రధావనముఁ జెల్లు. 91

సమ్మ, కుందేటికొమ్ము, నిప్పచ్చరము, లేబాసు, నెన్నంటి, నెనటి, తెకలేర, తేప, బీజు, ఈటు, కాఱు, విత్తా, విత్త, రిత్త, వయ్యము, పచ్చనపాడు, వెడ, వాయసు, దోయివి, సున్న అన శూన్యము పేళ్ళు. వెంబడించు, ఎద్దు, ఎయిదు అన అనుగామి పేళ్ళు. పర్వు, కవియు, కలియజను, పరుగు, పరువు అన ప్రధావనము పేళ్ళు.

క. వనజాక్షా యెగుచన నెవు
చనఁగను చోపనఁగను తఱుమనఁగను కొప్ప
న్నను పాఱవోలనంగను
దనరె ప్రధావింపసేయు తనమాలర్థవమునకా. 92

ఎగుచు, ఎవుచు, చోపు, తఱుము, కొప్పు, పాఱవోలు అన ప్రధావింపసేయుటకు పేళ్ళు.

క. తనివన నాదటవోవన
తనివియు నాపోకయనఁగ తన్వియు నాపో

వన తఃపన తృప్తికి తను
పన తనునాఁ దృప్తిసేయు భానుముకుందా. 93

తనివు, అడటవోవు, తనివి, ఆపోక, తన్వి, ఆపోవు, తనుపు అనఁగా తృప్తికి పేళ్ళు. తనుపు, తను అన తృప్తిసేయుట పేళ్ళు.

క. తనియుసన తుప్పటిల్లన
తనివోవన తనిచనునన తన్వారుననఁగా
దనుపారన తనిసనునన
దనరెను తృప్తిపడుపేళ్లు తామరసాక్షా. 94

తనియు, తుప్పటిల్లు, తనివోవు, తనిచను, తన్వారు, తనుపారు, తనిసను అన తృప్తిపడు పేళ్ళు.

క. బరువడి పదఁపడి యింకను
మరియు పదంపడియు వెండి మఱియనఁగానై
బరగెను పునరభిధానము
లరె పగటన సొంపనంగ లావణ్యాఖ్యల్. 95

బరువడి, పదపడి, ఇంక, మరియు, పదంపడి, వెండి, మఱి అన పునః పేళ్ళు. పగటు, సొంపు అన లావణ్యము పేళ్ళు.

క. చెలువం బంగము హజాసును
చెలువు మురువు సిస్తు జాను సింగారము కో
మలికము చందము సొబఁగన
వెలసెను శృంగారమునకు పేళ్లు ముకుందా. 6

చెలువము, అంగము, హశాను, చెలువు, మురువు, సిస్తు, జాను, సింగారము, కోమలికము, చందు, సొబఁగు అన శృంగారముపేళ్ళు.

సీ. అవుసన నౌసన హశాసన నంగన
యమరికనాఁగ సోయగమనంగ
కైపన నొఱపన కోపన దుస్తన
గరగరికయనఁగ కయిపునాఁగ
హావుసన నెఱియన సంగంబనంగ నొ
య్యారంబనఁగ బెడగారునాఁగ
సౌరన చెన్నునా సవురన సంచన
వింగడంబనఁగ నొప్పిదమనంగ

గీ. నయమనంగను సొగసన నయ్యయనంగ
నందమన బెడఁగనఁగను సుందరంబు
దనరెఁ హారువనఁగా చమత్కారమునకు
నామమగు మునిహృదయాభిరామనామ. 97

అవుసు, ఔసు, హశాసు, అంగు, అమరిక, సోయగము, కైపు, ఒఱపు, కోపు, దుస్తు, గిరగరిక, కయిపు, హావుసు, నెఱి, అంగము, ఒయారము, రూ॥ ఒయ్యారము, బెడగారు, సౌరు, చెన్ను, సవురు, సంచు, వింగడము, ఒప్పిదము, నయము, సొగసు, నయ్య, అందము, బెడఁగు అన సుందరముపేళ్ళు. హారువు అన చమత్కారమునకుఁ బేరు.

సీ. అరజంబన కొమరన నొడికంబన
నింపునా నిమ్మన నించనఁగ

ననుఁగన కలికినా ననుపన చిన్నారి
పొన్నారియనఁగను పొన్నారియన
చిన్నినాఁ మానన చిన్నారియనఁగను
పొన్నారినాఁగను తిన్ననాఁగ
సజ్జకంబుఁగను సౌరన నింబన
నెయ్యమి నాఁగను నెయ్యమనఁగ

గీ. గొనబునాఁగను హాఁవన గోవయనఁగ
ప్రన్ననయనంగ చిన్నరి పొన్నరియనఁ
చినియనఁగ నొప్పిదమన తీపనఁగ బెడఁగ
నఁగ మనోహారమునకౌను ఖగతురంగ. 98

అరజము, కొమరు, ఒడికము, ఇంపు, ఇమ్ము, ఇంచు, అనుగు, కలికి, అనుపు, చిన్నారిపొన్నారి, పొన్నరి, చిన్ని, మాను, చిన్నారి, పొన్నారి, తిన్న, సజ్జకము, సౌరు, ఇంబు, నెయ్యమి, నెయ్యము, గొనబు, హాఁవు, గోవ, ప్రన్నన, చిన్నరిపొన్నరి, చిని, ఒప్పిదము, తీపు, బెడఁగు అన మనోహారము పేళ్లు.

క. భువిలోన శేవ రాణయు
రవణను పోఁడిమియు పోఁడి రమణయు వలపుల్
హావణున విన్నాణమును న
లువునానగు నంచితాఖ్యలును మురవైరీ. 99

శేవ, రాణ, రవణ, పోఁడిమి, పోఁడి, రమణ, వలపు, హావణి, విన్నాణము, నలువు అన అంచితమునకుఁ బేళ్లు.

సీ. ఎనయు నందును కూడు నెయిదు దూఁకొనునగు
నడరు రక్కొను మూఁడు హత్తు నత్తు
నుడ్డాడెలయు చొప్ప డొలయు తొడరు తేరు
చెందొనరును కూరు నొందు నొదవు
తన్కు తనుకు పన్ను దనుకు మేకొను నూను
పాటించు తలకొను పడయు పొఱయు
పొరయు కుదురు కను బెరయు పొందును బెర
కొఱలు పైకొను నొట్టుదొఱయు పొనరు

గీ. ముడివడును మొలతెంచును మొనయుతొట్ట
గిల్లు పన్నుపడును నివ్వటిల్లు కలుఁగు
ననఁగ ప్రాపించుటకు బేళ్ళు తెనుఁగునందు
గలిగె కందాంగ భవభంగ ఖగతురంగ. 100

ఎనయు, అందు, కూడు, ఎయిదు, దూఁకొను, అగు, అడరు, రక్కొను, మూఁడు, అత్తు, హత్తు, ఉడ్డాడు, ఎలయు, చొప్పడు, ఒలయు, తొడరు, తేరు, చెందు, ఒనరు, కూరు, ఒందు, ఒదవు, తనుకు, తన్కు, పన్ను, దనుకు, మేకొను, ఊను, పాటించు, తలకొను, పడయు, పొఱయు, పొరయు, కుదురు, కను, బెరయు, పొందు, బెర, కొఱలు, పైకొను, ఒట్టు, దొఱయు, పొనరు, ముడివడు, మొలతెంచు, మొనయు, తొట్టగిల్లు, పన్నుపడు, నివ్వటిల్లు, కలుఁగు అన ప్రాపించుటకు పేళ్ళు.

గీ. ననుచునాఁగను తీపారుననఁగ సొగియు
ననఁగ హరువన నింపితమన నభీష్ట
మునకు బేళ్ళు వెల్లాటకమును వెలడియు
వెల్లడియన ప్రసిద్ధికి బేళ్ళు వెలసె. 101

ననుచు, తీపారు, సొగియు, హరువు, ఇంపితము అన అభీష్టమునకు పేళ్ళు. వెల్లాటకము, వెలడి, వెల్లడి అనఁగా ప్రసిద్ధికి పేళ్ళు.

పంచపాదిగీ. అమరు నలరారు నొప్పారు నలరు తలరు
పొసఁగు నెలరారు నిగుడును పోలు తనరు
పొలుపొనరు తవణిల్లొప్పు పొల్పును పొస
రారును రహించు రాణించుఁ నఁగ పూజ్య
మునకు బేళ్ళొప్పె మానిహృద్వనజభృంగ. 103

అమరు, అలరారు, ఒప్పారు, అలరు, తలరు, పొసఁగు, ఎలరారు నిగుడు, పోలు, తనరు, సొలుపు, ఒనరు, తవణిల్లు, ఒప్పు, పొల్పు, పొస రారు, రహించు, రాణించు అన పూజ్యమునకు పేళ్ళు.

సీ. ఈడేరుననఁగను మూఁడన నెక్కన
కొనసాగునన తలకూర్చుననఁగ
నెఱవేరుననఁగను నివ్వటిల్లనఁగఁ జే
కూఱుననంగ చేకుఱునన తల
కూడుననఁగ సమకూడుననఁగ సమ
కూరుననఁగ దొరకొనుసన నొడ
గూడుననఁగ నొనగూడుననంగ పొ
బడుననంగను నెఱిపడుననంగ

గీ. నలవడుననఁగ ననువుపడనఁగను సమ
కట్టనఁగ ముగియును కడముట్టునఁగ

నివ్వటిలునాఁగ భువిలోన నెగడెఁ దెలుఁగు
నందు సిద్ధించుటకుపేళ్ళు కందమూర్తి. 103

ఈడేరు, మూఁడు, ఎక్కు, కొనసాగు, తలకూర్చు, నెఱవేఱు, నివ్వటిల్లు, చేకూఱు, చేకుఱు, తలకూడు, సమకూడు, సమకూరు, దొరకొను, ఒడగూడు, ఒనగూడు, ప్రాబడు' నెఱిపడు, అలవడు, అనువుపడు, సమకట్టు, ముగియు, కడముట్టు, నివ్వటిల్లు అనఁగా సిద్ధించుపేళ్ళు.

గీ. సజ్జకట్టును ముస్తీదు సజ్జ యాయి
తంబు నాయిత్తమనఁగ సిద్ధంబుపేళ్లు
పన్ను సమకట్టు నాయితపఱచు ననువు
పఱచు నలవఱునన సిద్ధపఱచుపేళ్లు. 104

సజ్జకట్టు, ముస్తీదు, సజ్జ, ఆయితము, అయిత్తము అన సిద్ధముపేళ్ళు. పన్ను, సమకట్టు, అయితపరుచు, అనువుపరుచు అన సిద్ధపరుచుపేళ్ళు.

గీ. ఒప్పు చక్కఁబడును గిట్టు నురువడు పొసఁ
గైరకొను నెఱవేరును తీరు నెఱయు
ననఁగ ననుకూలమగు నాహ్వాయములు సడ్డ
అక్క ఱపనితీఱమియు కార్యంబుపేళ్లు. 105

ఒప్పు, చక్కఁబడు, గిట్టు, ఉరువడు, పొసఁగు, అయిరకొను, నెర వేఱు, తీరు, నెఱయు అన కార్యానుకూల్యమగుటకుపేళ్ళు సడ్డ, అక్కఱ. పని, తీరమి అన కార్యముపేళ్ళు.

క. పుడమిని దృశ్యమగుట కగ
పడునన నగ్గపడు నగ్గ పాటనగను కో
ల్పడునన కోలుపడఁ గను
పడునన పేళ్లొప్పె ఘోర పాతకనాశా. 106

అగపడు, అగ్గపడు, అగ్గపాటు, కోల్పడు, కోలుపడు, కనుపడు అన దృశ్యమగుటకు పేళ్ళు.

ఆ॥ వె॥ తారకాణయనఁగ తార్కాణయనఁగను
కరియనంగ తారకాణమనఁగ
నగ్గము సరిదాకు నఁ గుఱియనఁగ దృ
ష్టాంతమునకు పేళ్లు సారసాక్ష. 107

తారకాణ, తార్కాణము, కరి, తారకాణము, అగ్గము, సరిదాకు, గుఱి అనఁగా దృష్టాంతముపేళ్ళు.

క. వనజాక్ష యుపాయముపే
ళ్ళైన రెనుపమవలను వజ్జ యొరపును కీల్ నె
ప్పును మేవడి తెరకువ యి
మ్ములును మఱిదీమసము వైనము వెరవనఁగన్. 108

ఉపమ, వలను, వజ్జ, ఒరపు, కీలు, నెప్పు, మేవడి, తెరకువ, ఇమ్ము, దీమసము, వైనము, వెరవు అన ఉపాయముపేళ్ళు,

క. ధారుణి వయ్యాళియు నసి
వారును చరలాట మీరు వాఱబిసీలున్

స్వారి వయాళి వలయిక ప
చేరమన విహారమునకుఁ జెల్లె మురారీ. 109

వయ్యాళి, అసివారు, చగిలాటము, ఈరువాలు, అనిసీలు, స్వారి వయాళి, వలయిక, పచేరము అన విహారము పేళ్ళు.

సీ. క్రుమ్మరుననఁగను గ్రుమ్మరిల్లనఁగను
కుమ్మరుననఁగను త్రిమ్మరనఁగ
పోలయుననంగను పొలసాడుననఁగను
మట్టాడుననఁగను మసలుననఁగ
మిట్టాడువనఁగను మిడుకుననంగను
చెరలాడుననఁగను తిరుగుననఁగ
నడయాడునన తారనంగను పరఁగన
మెలగుమెలంగన నలరెసంచ

గీ. రించుటకుపేళ్లగును విహరించుటకును
దనరె యట్టాడు చెరలాడుననఁగ భువిని
మలయునన మెలకువయన పొలయికయన
నలరె సంచారమునకభిఖ్యలు మురారి. 110

క్రుమ్మరు, క్రిమ్మరిల్లు, కుమ్మరు, త్రిమ్మరు, పోలయు, పొలసాడు, మట్టాడు, మసలు, మిట్టాడు, మిడుకు, చెరలాడు, తిరుగు, నడయాడు, తారు, పరఁగు, మెలగు, మెలంగు, అనఁగా సంచరించు పేళ్ళు. అట్టాడు, చెరలాడు అన విహరించు పేళ్ళు మలయు, మెలఁకువ, పొలయిక అనఁగా సంచారము పేళ్ళు.

గీ. అణఁకువయు కుఱుమట్టంబు నడఁకువయును
మందటయు మేవడియు నతమందుపేళ్లు
జరగె తెక్కలిపాటు విపత్తుపేరు
నిచ్చలం బప్పసంబన నిత్యమునకు. 111

అణఁకువ, కుఱుమట్టము, అడఁకువ, మందతట్టు, మేవడి అన విన్నపము పేళ్ళు. తెక్కలిపాటు అన విపత్తుపేరు. నిచ్చలము, అప్పసము అన నిత్యము పేళ్ళు.

గీ. నేయమన చక్కటియనంగ నెఱియనంగ
న్యాయమున కాహ్వాయము లవనాయమనఁగ
నన్నెమన నపపాడినా నమరెనాహ్వా
యంబు లన్యాయమునకు విహంగతురగ. 112

నేయము, చక్కటి, నెఱి అన న్యాయముపేళ్ళు అవనాయము, అన్నెము, అపపాడి అన అన్యాయముపేళ్ళు.

సీ. కసమసయనఁగను కసిమసియనఁగను
కళవళమనఁగను కపరమనఁగ
తడవాడుననఁగను తత్తఱమనఁగను
జూకించుననఁగను జూఁకయనఁగ
తొట్రుపాటనఁగను తొసఁకన తొట్రిన
బమ్మెరపోకనా బమ్మెరయన
సంబరంబనఁగను సంబ్రమనంగను
మొలవన క్రేటన మేల్పనంగ

గీ. పదటమన చిడిముడినాఁగ పదటనంగ
తమకమన తికమకయన తత్తఱయన
తొడియనఁగ దిగ్గనయనంగ తొందరయన
సంభ్రమముపేళ్లుజెల్లెను సారసాక్ష. 113

కసమస, కసిమసి, కళవళ, కపరము, లడవాడు, తత్తఱము, జాకించు
జాఁక, తొటుపాటు, తొనఁకు, తొట్రు. బెమ్మరపోక, బెమ్మర, సంబ్ర
మము, సంభ్రమము, మెలపు, క్రేఁటు మెల్పు, పదటము, చిడిముడి, పదటు.
తమకము, తికమక, తత్తఱ, తొడి, దిగ్గన, తొందర అన సంభ్రమముపేళ్ళు.

కం. తడఁబడు దిమ్మయు దిమ్మను
తడఁబాటును వీడువడును తట్పాడును వీ
డ్పడు నివ్వెఱ నివ్వెఱఁగు వె
గడు తబ్బిబు నివ్వెరయన గను భ్రాంతికినా. 114

తడఁబడు, దిమ్మ, దిమ్ము, తడఁబాటు, వీడువడు, తట్టాడు, వీడ్పడు
నివ్వెఱ, నివ్వెఱఁగు, వెగడు, తబ్బిబు, నివ్వెర అన భ్రాంతికిపేళ్ళు.

సీ. బాతల్లించనఁగ నబ్బాలాకుననఁగను
తడబడుననఁగను తొడరుననఁగ
బొమ్మరవోవన బొమ్మరిల్లన బడి
వడఁకన చిట్టలు వొడచుననఁగ
తత్తఱపడునన తేఱలఁ తలరన
క్రాలనకౌరలన బ్రమయుననఁగ

తొట్రుల్లునఁగను తొడివడునఁగను
సంభ్రమించుటపేళ్లు జగతినొప్పె
గీ. యలపడఁ నలవాటన నబ్బెసమున
నామకంబులభ్యాసంబునకును పొన్న
యనఁగ పొవయన దృగ్గోచరాఖ్యలాంధ్ర
మం దసడ్డ యశ్రద్ధాఖ్య కంద దేహ. 115

బొతళించు, అబ్బాలాడు, తలఁబడు, తొడరు, బొమ్మరవోవు, బమ్మరిల్లు, బుడివడు, చిఱ్ఱుబడుచు, తత్తఱపడు, తఱలు, క్రాలు, కెరలు, బ్రమయు, తొట్రిల్లు, తొడివడు అన సంభ్రమించు పేళ్ళు అలపడు, అలవాటు అబ్బెసము అన అభ్యాసము పేళ్ళు పొన్న పొన అన దృగ్గోచరము పేళ్ళు అసడ్డ అన అశ్రద్ధ పేరు.

ఉ. తునియయనంగ బిల్లయన తుండనవ్రక్కయనంగముక్కయ
న్ననుమఱితూటనా మురియనాఁగనుతుండెమనంగతుండనా
దునుకయనంగవ్రయ్యయనత్రుంపుడనంగనుతుండమన్నత్రుం
పనఁగనుపేళ్లు ఖండమునకయ్యె భవాంబ్ధితరీపదంబుజా. 116

తునియ, బిల్ల, తుంటు, వ్రక్క, ముక్క, తూఁట, మురియ, తుండెము, తుండ, తునుక, వ్రియ్య, త్రుంపుడు, తుండము, త్రుంపు, అనఁగా ఖండము పేళ్ళు.

క. పలుకులు తుందునుకలు చిదురు
పలు తుత్తునియలును చిదురుపలు మఱి తుందు

న్కలు నఱవఱలు చిదురలన
నలరె సుసూక్ష్మశకలముల కాఖ్యలు శౌరి. 117

పలుకులు, తుండుముకలు, చిద్రుపలు, తుత్తునియలు, చిదురుపలు, తుండునక్కలు, అఱవఱలు, చిదుకలు అన సుసూక్ష్మశకలము పేళ్ళు.

గీ. చిదురుపయనంగ రవనాఁగ చిదురనాఁగ
నణువు పేళ్ళు; పొడియు నురుమనఁగ నుఱుము
నాఁ దుమురన చూర్ణంబు; చూర్ణంబు సేయు
పేళ్ళు నుఱుమాడు నుఱుమన వెలసె శౌరి. 118

చిదురుప, రవ, చిదుర అన అణువు పేళ్ళు. పొడి, నురుము, నుఱుము, తుమురు అన చూర్ణము పేళ్ళు. నుఱుమాడు, నురుము అన చూర్ణము సేయు పేళ్ళు.

గీ. ఇండె చీలిక చీరిక యిడుపు పాయ
పరియ వ్రప్పను బ్రద్దనఁగ పఱియ యనఁగ
దనరె నాస్ఫోటనము పేళ్ళు; తునుకలగును
ద్రుంగుననఁ ఖండములగుట తోఁచె పేళ్ళు 119

ఇండె, చీలిక, చీరిక, ఇడుపు, పాయ, పరియ, వ్రప్పు, బ్రద్ద, పఱియ అన ఆస్ఫోటనము పేళ్ళు. తునుకలగు, ద్రుంగు అన ఖండములగు పేళ్ళు.

గీ. తెగుట ముఱియును ఖండితమగుట కొప్పె
వెదకు తడవుడు నెమకును వెతకు వెనకు

సరయుననఁగ నన్వేషించుబరగె; నెందు
ననఁగ శుష్కించుటకుపేరు దనుజవైరి. 120

తెగు, మరియు అన ఖండితమగు పేళ్ళు. వెదకు, తడవుడు, సెమకు, వెతకు, వెనకు, అరయు అన అన్వేషించుటకుఁ పేళ్ళు ఎండు అన శుష్కించుటకు పేరు,

గీ. కలిగెబహువచనమున శుష్కంబుపేరు
నరవరలనంగజెల్లె నొ; నలదు కలుకు
మేఁగు పూయును మ్రేఁగును మ్రేవనంగ
నలరె లేపనమునకాఖ్య లంబుజాక్ష. 121

అరవరలు అన బహువచనమున శుష్కంబు పేరు. అలదు, కలుకు, మేఁగు,పూయు, మ్రేఁగు, మ్రేవు అన లేపనము పేళ్ళు.

గీ. అలముకొను క్రమ్ము పురి యఱు మలయు లాచు
కలయు పురికొను పైకొను కవియు తఱుము
కమియు డీకొను నిగు డఱుక్రిమ్మనంగ
నాక్రమణమునకాఖ్యలౌ నంబుజాక్ష. 122

అలముకొను, క్రిమ్ము, పురి, అరుము, అలయు, లాచు, కలయు, పురికొను, పైకొను, కవియు, తరుము, కమియు, డీకొను, నిగుడు, అరు, క్రమ్ము, అన ఆక్రమణము పేళ్ళు.

క. అలమనఁగ కమియుననగా
నలముకొనన కవియుననఁగ నఱుక్రమ్మనఁగం

గలయునన సక్తసుగుపే
ళ్లలరె; యసము చనువనంగ ననురాగంబౌ. 123

అలము, కమియు, అలముకొను, కవియు, అరుక్రమ్మ, కలయు అన సక్తమగుపేళ్ళు. అసము, చనువు అన అనురాగము పేళ్ళు.

గీ. అలవి తరము వసము తలమనఁగ శక్య
మునకభిఖ్యలు; పసవోవునన వసపడు
ననఁగ శక్యమగుటసంజ్ఞ; యరిది డెప్ప
రంబు తలముదప్పన నశక్యంబుపేళ్లు. 124

అలవి, తరము, వసము, తలము అన శక్యమునకు పేళ్ళు. పసవోవు వసపడు అన శక్యమగుటపేళ్ళు. అరిది, డెప్పరము, తలముదప్పు అన అశక్యము పేళ్ళు.

క. వనరుహలోచన! యవఘుళ
మన పొలపంబన పిసాళి యన పంచారం
బన కారాటయునఁగ పస
రన నెరపన వ్యాపనమున కాఖ్యలు శౌరీ. 125

అవఘుళము, పొలపము, పిసాళి, పంచారము, కారాట, పసరు, నెరపు అన వ్యాపనము పేళ్ళు.

సీ. ఒలయును కడలొత్తు కలఁగొను చెరలాడు
చిందును పసరించు జీరువారు

నిగిడాఱు సోమించు నిగుడు వొంపిరివోవు
వెదజల్లు మట్టాడు వెల్లివిరియు
తీఁగెలువాఱును తివురుకట్టును విజ్జ
తొట్టును నివ్వటిల్ తొట్టుకొనును
పరఁగు ఱంపిలు పర్వుఁ బఱఁగు పరవు తార
సిల్లు పొలయు పిక్కటిల్లు ప్రబ్బు

గీ. బలకరించు కడలుకొను మలయు బెలయు
బెరయు సందుకొనును వెలవిరియు నెఱయు
విరియఁబాఱు ననంగను వెలసియొప్పె
నాంధ్రమున ప్రసరించుట కాఖ్యలగుచు. 126

ఒలయు, కడలొత్తు, కలఁగొను, చెరలాడు, చిందు, పసరించు, జీరువాఱు, నిగిడాఱు, సోమించు, నిగుడు, వొంపిరివోవు, వెదజల్లు, మట్టాడు, వెల్లివిరియు, తీఁగెలువాఱు, తివురుకట్టు, విజ్జు, తొట్టుఁ నివ్వటిలు, తొట్టుకొను, పరఁగు, ఱంపిలు, పర్వు, పఱఁగు, పరవు, తారసిల్లు, పొలయు, పిక్కటిల్లు, ప్రబ్బు, బలకరించు, కడలుకొను, మలయు, బెలయు, బెరయు, సందుకొను, వెలివిరియు, నెఱయు, విరియఁబాఱు అన ప్రసరించుటకు పేళ్ళు.

గీ. క్షితిని నెఱపన వ్యాపింపనేయుఁగాన;
కంచుమించనఁగా పటాపంచమనఁగ
నా పటాపంచయనఁ నభిఖ్యలు నగోచ
రంబునకుఁ జెల్లె మునిపక్ష యంబుజాక్ష. 127

నెరపు అన వ్యాపింపజేయుటకు పేర్లు కంచుమిన్నసు, పటాపంచలు. పటాపంచ అన అగోచరము పేళ్ళు.

క. ఆరతియనఁగా మంగళ
హారతియు నివాళి మంగళారతియనఁగా
హారతియు నివాళికయన
నీరాజనమునకుఁ బేళ్లు నెగడెను ముకుందా. 128

ఆరతి, మంగళహారతి, నివాళి, మంగళారతి, హారతి, నివాళిక అన నీరాజనము పేళ్ళు.

క. ఉద్యోగము నుద్యమము కడఁకయు
కదలికయును తొడరు కణఁక గమకమనంగా
కదలును నెత్తికోలను పాటిలెను
యత్నంబు పేళ్లు భుజగశయనా. 129

ఉద్యమము, ఉద్యమి, కడఁక, కదలిక, తొడరు, కణఁక, గమకము, కదలు ఎత్తికోలు అన యత్నము పేళ్ళు.

పంచపది॥ కొ: కొనకొను. దొరకొను తలకొనును తివురు
గొనకొనను పయికొను గుఱికొను గొదకొను
తఱిఁగొనును కడఁగు గుంకించు పెఱఁగు పెటఁ
బెట్టి తొడరెత్తికొను నొడికట్టును గమ
కించు ననబేళ్లు చెల్లు యత్నించుటకును. 130

కొనకొను, దొరకొను, తలకొను, తివురు, గొనకొను, పైకొను, గుఱికొను, గొదకొను, తఱిఁగొను, కడఁగు, గుంకించు, పెఱఁగు, పెటబెట్టు, తొడరు, ఎత్తికొను, ఒడికట్టు, గమకించు అన యత్నించుటకు పేళ్ళు.

గీ. వసుధ నవచాట మేమరుపాటు నదిరి
పాటదురుగడ యద్దిరిపాటనంగ
నగు నకస్మాత్తునకు పేళ్లు. నపరిమితము
నకు నవారి యవ్వారియనంగ శౌరి. 131

అవచాటము, ఏమరుపాటు, అదిరిపాటు, అదురుగడ, అద్దిరపాటు అను ఆకస్మికము పేళ్ళు. అవారి, అవ్వారిఅన అపరిమితము పేళ్ళు.

గీ. ఆదుకొనుమనన పాటించుమనఁగ నాల
కించు నాలించుమనన నాదరించుపేళ్లు
గరగరని గరగరకయు గరగరయును
వెలఁదయిన నిర్మలముపేళ్లు వేదవేద్య. 132

ఆదుకొను, పాటించు, ఆలకించు, ఆలించు అన ఆదరించు పేళ్ళు. గరగరని గిరగరక, గరగర, వెలది అనఁగ నిర్మలము పేళ్ళు.

సీ. గారాబమనఁగను గఱువమనఁగ గొప్ప
తనమనఁగను దొడ్డతనమనంగ
గారవంబనఁగను గారామనఁగ నుబ్బు
కంబన వాసినా గారమనఁగ
పెరిమెయనంగను పెంపన పెమ్మెనా
మలపనంగను మించుదలయనంగ
మించునననంగను మిండఁడనఁగ బటా
బూరమనంగను గారబమన

గీ. మేలిమియునంగ లావన మెండనంగ
దళమునంగను దొడ్డనా దళసరియన
పంతనంగను లంబనఁ బరగు పేళ్లు
గౌరవమునకు తెనుఁగున కమలనాభ. 133

గారాబము, గఱువము, గొప్పతనము, దొడ్డతనము, గౌరవము, గారాము, ఉబ్బకము, హాసి, గారము, పెరిమె, పెంపు, పెమ్మె, మలపు, మించుదల, మించు, మిండఁడు, బిగాబూరము, గారబము, మేలిమి, లావు, మెండు, దళు, దొడ్డ, దళసరి, పంతు, లంబు అనఁగా గౌరవము పేళ్లు.

క. గనుపయును గఱువయును పఱి
యును మలచమనంగ గొప్పయన పెడయన దొ
డ్డన దొడ్డనాఁగ రపణం
బన దండియనంగ నాఖ్య లగు ఘనమునకున్. 134

గనుప, గఱువ, పఱి, మలచము, గొప్ప, పెడ, దొడ్డు, దొడ్డరపణము దండి అన ఘనమునకు పేళ్లు.

గీ. ఆలమును కన్నడయు మందిమేలమనఁగ
క్రేణిసేయును క్రేడించు కేరడమన
కన్నళవు తెగడన నుపేక్షకునభిఖ్య
లగు; సరకు సడ్డయనఁగ లక్ష్యమునకౌను. 135

ఆలము, కన్నడ, మందిమేలము, క్రేణిసేయు, క్రేడించు, కేరడము. కన్నళవు, తెగడు అన ఉపేక్షకు పేళ్లు. సరకు, సడ్డ అన లక్ష్యమునకు పేళ్లు

గీ. ఉరవనంగ నుఱవునాఁగ నుచితమలరె
నిలువడియు మంచినడతయు నిల్వడియన
సచ్చరితమయ్యె; నిడుగడ నుచ్చరింప
తెలుఁగున నసూయపేరగు జలజనాభ. 136

ఉరవు, ఉఱవు అన ఉచితమునకు పేళ్ళు. ఇలువడి, మంచినడత, ఇల్వడి అన సచ్చరిత్రకు పేళ్ళు. ఇడుగడ అన అసూయ పేళ్ళు.

గీ. తలఁపనంగను జ్ఞప్తికిదనరె నావ
పాటునసఁగను జ్ఞప్తికివచ్చుపేరు
నుక్కయుబ్బయు వావిరియమ్మయనఁగ
నూష్మమునకు నభిఖ్యలా సరగశయన 137

తలపు అన జ్ఞప్తికి పేరు. ఆవపాటు అన జ్ఞప్తికివచ్చు పేరు. ఉక్క, ఉబ్బ, వావిరి, ఉమ్మ అనఁగా ఊష్మమునకు పేళ్ళు

క. ఇమిడికయును కుదిరిక మే
డము పొందిక యొనరు సంగడం బొప్పిక పొం
కము చేరిక యావటమున
గ్రమమున ననుగుణము పేళ్లు కర్బురచేలా.

ఇమిడిక, కుదిరిక, మేడము, పొందిక, ఒనరు, సంగడము, ఒప్పి పొంకము, చేరిక, ఆవటము అన అనుగుణము పేళ్ళు.

గీ. ఇదిగో తీసికొనన నింక యిందమనఁగ
నగు నిదం గ్రాహ్యమున కాఖ్యలయ్యె నీఁత

యీనుటయు నీనికయునంగ నిలపశుప్ర
సూతిపేళ్ళగు మునిపాల సుగుణశీల 139

ఇదుగోతీసుకో, ఇందకు అన ఇదం(గాహ్యామునకుపేళ్ళు. ఈఁత, ఈనుట, ఈనిక అన పశుప్రసూతికి పేళ్ళు,

క. ఇసడిల్లు కళాసించుచు
విసుగును వేసారు డయ్యు వేసరు డయ్యుక్
విసుమాలన భవహతసా
హాస నిర్వేదించుపేళ్ళు నలరె తెనుఁగునక్ 140

ఇసడిలు, కళాసించు, విసుగు, వేసారు, వేసగు, డయ్యు, డయ్యు విసుమాలు అన నిర్వేదించుటకు పేళ్ళు.

సీ. ఈడేఱు నెచ్చిరి ల్లెచ్చిర్లు కొనలిడు
రెక్కొను కొనలొత్తు నిక్కు నిట్టు
యేదును తలయెత్తు నెచ్చిఱు నొదలును
కోల్కొను కొనసాగు కోలుకొనును
రక్కొను పురడించు పిక్కటిల్లు రహించు
పొంపిరివోవును పొటకరించు
పొదలు పురాయించు పొదలాడు పెంపగు
ప్రదలు మూరింబోవు ప్రబ్బునెగడు

గీ. హెచ్చినులు అంపిలును పెరు గొదగు తీఁగ
సాగు రెక్కోలు రేకెత్తు నరగు తొంగ

లించు రూపగు మఱియు రాణించు ననఁగ
వెలసె వర్ధిల్లుటకు పేళ్లు వేదవేద్య. 141

ఈడేఱు, ఎచ్చిరిల్లు, ఎచ్చిఱ్లు, కొనలిడు, రెక్కొను, కొనలొత్తు, పొక్కు, నిట్టవేదు, తలయెత్తు, ఎచ్చఱు, ఒదలు, కోల్కొను, కొనసాగు, నిలుకొను, రక్కొను పురడించు, పిక్కటిల్లు, రహించు, వొఁసిరివోవు, పోటకరించు, పొదలు, పురాయించు, పొదలాడు, పెరపగు ప్రదలు మీఱు, సోవు, ప్రబ్బు, నెగడు, హెచ్చిలు, అంపిలు, పెరుగు, ఎదుగు, తీఁగసాగు, రెక్కొలు, రేకెత్తు, సరగు, తొంగలించు, రూపగు. ఉరాణించు, రూ॥ ఉరణించు అన వర్ధిల్లు పేళ్లు.

గీ. హెచ్చనఁగ పొడలికయన నెచ్చనఁగ
వర్ధనము పేళ్లు; చేఁగ చేవయన సార
మౌను; బెండన నిస్సారమౌను మఱియు;
మైవడియు నియ్యకోలు సమ్మతికి పేళ్లు. 142

హెచ్చు, పొదలిక, ఎచ్చు అన వర్ధనము పేళ్లు. చేగ, చేవ అన సారమునకు పేళ్లు. బెండు అన నిస్సారము పేరు. మైవడి, ఇయ్యకోలు అన సమ్మతికి పేళ్లు.

గీ ఇచ్చగించన క్రోలన నియ్యఁగొనన
నియ్యకోలన మేకొను నిచ్చఁగొనున
నంగ మెయికొను నొడఁబడు నాఁగ సమ్మ
తించుటకు పేళ్లు దనరెను దీనపాల. 143

ఇచ్చగించు, క్రోలు, ఇయ్యఁగొను, ఇయ్యకోలు, మేకొను, ఇచ్చఁగొను, మెయికొను, ఒడఁబడు అన సమ్మతించు పేళ్లు.

గీ. ఇలను సందుకొను పరిగ్రహించుటలరె;
నీఱతాఱలు మొఱకొను కాఱు చిడిపి
పరుసముచు బెట్టిదము గొడ్డ పలుసమనఁగ
పరుషమునకునభిఖ్యలు పరమపురుష. 144

సందుకొను అన పరిగ్రహించుపేరు. బ॥ ఈఱతాఱలు, మొఱకు కాఱు, చిడిపి, పరుసము, బెట్టిదము, గొడ్డ, పలుసము అన పరుషమునకు పేళ్ళు

చ. కడిఁదియనంగ మొప్పియయు కక్కసయుఁగా గఱకన్న
మొప్పెనాఁ
జడమున బిర్సనం గరకసా బిరుసుఁగా దురుసన్న పెల్చని
గ్గడి గడుసన్న బెట్టిదము కక్కరముఁగా బిఱుసన్న గట్టినాఁ
జెడిదము గ్రక్కసంబనఁగ పేర్లిలలో కఠినంబునకా హరీ. 145

కడిఁది, మొప్పియ, క్రక్కస, కసు, మొప్పె, జడము, బిర్సు, కరకసా, బిరుసు, దురుసు, పెల్చ, నిగ్గడి, గడుసు, బెట్టిదము, కక్కరము, బిఱుసు, గట్టి, జెడిదము, గక్కసము అనఁగా కఠినమునకు పేళ్ళు.

క. జవరన నయగారంబును
నవకంబును మెత్తపాటు నొరును మెదువుఁగా
మపసు మవ్వము మెత్తన
నవురనియనఁగా మృదుత్వనామములు హరీ. 146

జవరన, నయగారము, నవకము, మెత్తపాటు, నొరు, మెదువుఁ వవము, మవ్వము, మెత్తన, నవురు అన మృదుత్వముపేళ్ళు.

క. చెమ్మయు తడి పంకైనయున
తెమ్మయు నీమిరియు చొదుకు తేమయనంగం
నెమ్మన పదనన నార్ద్రి
త్వమ్మునకు నభిఖ్యలగును దనుసుతవైరీ. 147

చెమ్మ, తడి, పంకైన, తెమ్మ, ఈమురి, చొదుకు, తేమ, నెమ్మ
పదను అనఁగా ఆర్ద్రిత్వమునకు పేళ్ళు.

గీ. వాఁక నెరి యీఱతాఱలు వక్కరంబు
వంకరయు నెఱి మలకనా వక్రమునకు
దనరె; నున్నన నునుపు నిద్దంబు నున్ను
మఱియు నిద్దాయనంగను మసృణమగును. 148

వాఁక, నెరి, బ॥ ఈఱతాఱలు, వక్కరము, వంకర, నెఱి, మలక
అన వక్రమునకు పేళ్ళు. నున్నన, నునుపు, నిద్దము, నున్ను, నిద్దా అన మసృ
ణము పేళ్ళు. మసృణము.

క. వరగిరిధర యీఱంబు గు
మురు దప్పము దళము దడము మొల్లమియును పొం
పిరియును కద్దుము కాఱు గు
బురు దట్టంబనఁగ సాంద్రమునకు నభిఖ్యల్. 149

ఈఱము, గమురు, దప్పము, దళము, దడము, మొల్లమి, పొంపిరి,
కద్దుము, కాఱు, గుబురు, దట్టము అన సాంద్రమునకు పేళ్ళు.

గీ. ఎత్తరవు తనరువు కొవ్వు రెత్తరంబు
వీక యెగుడు పొడుగు నిక్కు వీకు క్రెళ్లు
మిట్ట మిడియు నుత్రాణియు మిఱ్ఱు నిక్కు
డనఁగ నున్నతమున కాఖ్యలౌను శౌరి. 150

ఎత్తరవు, తనరవు, కొవురు, ఎత్తరసు, వీఁక, ఎగుడు, పొడుగు-నిక్కు, వీకు, క్రెళ్ళు, మిట్ట, మిడి, ఉత్రాణి, మిఱ్ఱు, నిక్కుడు అని ఉన్నతమునకు పేళ్ళు.

క. గుండ్రనయన బటువనఁగా
గుండ్రంబన వట్రయనఁగ గుడుసును వట్రం
బుండ్రంబన వట్రువయన
గుండ్రయనన్ వర్తులంబు కుంజరవరదా. 151

గుండ్రన, బటువు, గుండ్రము, వట్ర, గుడుసు, వట్రము, ఉండ్రము వట్రువ, గుండ్ర అన వర్తులము పేళ్ళు.

గీ. కాపుగడ యుక్కణము కుయ్యి కావలియును
మనుపు బలకరమును కుయి తోనయనంగ
పొసఁగె రక్షణమునకును; ప్రోచు ప్రోది
ప్రోవనఁగ పోషణముపేళ్లు పుణ్యచరిత. 152

కాపుగడ, ఉక్కణము, కుయ్య, కావలి, మనుపు, బలకరము, కుయి తోన అన రక్షణపేళ్ళు. ప్రోచు, ప్రోది, ప్రోవు అన పోషణముపేళ్ళు.

గీ. సామజావన యోమన సాఁకునసఁగ
ప్రోదిగొనుసన కాఁచునాఁ బ్రోదిసేయు
ననఁగ రక్షించుపేళ్ళొప్పి నాంధ్రభాష;
నుల్లజంబనఁగ సహింపనొల్లనిదియు. 153

ఓము, సాఁకు, ప్రోదిఁగొను, కాచు, ప్రోదిసేయు అన రక్షించిపేళ్ళు.
ఉల్లజము అన సహింపరానిదానిపేరు.

క. జడనిధి శయనా దొరలును
కెడయికయును డుల్లు త్రెళ్ళు కెడవును డులుచుం
గెడయును చిందును డొల్లును
పడు రాలును తొరఁగునసఁగ పతసముపేళ్లో. 154

దొరలు, కెడయిక, డుల్లు, త్రెళ్ళు, కెడవు, డులుచు, కెడయు
చిందు, డొల్లు, రాలు, తొరఁగు అన పతనముపేళ్ళు.

క. విడివోవనఁగా యీడన
సడలన నూడన ప్రిదులన జాఱునసంగ
విడివడునసంగ నగులనఁ
దొడరె గళదభిఖ్యలవని తోయజనాభా. 155

విడివోవు, ఈడు, సడలు, ఊడు, ప్రిదులు, జాఱు, విడివడు-
అగులు అన జారిపడుటకుపేరు.

గీ. ఉట్టనఁగ తొంగళించన నురలన తొరఁ
గనఁగ గీలన తొట్టన చినుకన దిగు
వాఱనంగ జల్లించన కాఱనంగ
జొబ్బిలనఁగ స్రవించుచొ సుందరాంగ. 156

ఉట్టు, తొంగళించు, ఉరలు, తొరఁగు, గీలు, తొట్టు, చినుకు దిగువాఱు, జల్లించు. కాఱు, జొబ్బిలు అన స్రవించు పేళ్ళు.

గీ. విరియఁబాఱును విడు వీడు విరియు వదలి
పడుననఁగ పేళ్లును ముక్తపాతమునకు;
నుజ్జనంబన తఱలన నులుచు విడుపు
నా నురువు నులుపన మోచనంబు శౌరి. 157

విరియఁబాఱు, విడు, వీడు, విరియు, వదలిపడు అన ముక్తపాతము పేళ్ళు. ఉజ్జనము, తఱలు, ఉలుచు, విడుపు, ఉరువు, ఉలుపు అన మోచనము పేళ్ళు.

క. వసధిశయన వదలన వ
ద్దన మానన విడువన వదులన మామాయ
న్నను మానుమానసంగను
తెనుఁగున త్యజియించుపేళ్లు తెల్లమియయ్యెఁ. 158

వదలు, వద్దు, మాను, విడువు, వదులు, మామా, మానుమాను అన వర్జించు పేళ్ళు.

గీ. ఇలను జీరాడు తారాడు నీదులాడు
జీరులాడు వ్రేలాడన చెలఁగె లంబి
తమునకాఖ్యలగుచు; హస్తతాడనమున
కలరె చప్పట్లు కేకిసలనఁగ శౌరి. 159

జీరాడు, తారాడు, ఈదులాడు, జీరులాడు, వ్రేలాడు అన లంబితమునకు పేళ్ళు. చప్పట్లు, కేకిసలు అన హస్తతాడనము పేళ్ళు.

క. ఉలకనయన చులకనయన
నెలిదము నేలిదము నులక యొల్లిదమనఁగన్
సుళువన నన్ననయనఁగ
సులభమున కభిఖ్యలయ్యె సూర్యవనపదా. 160

ఉలకన, చులకన, ఎలిదము, ఏలిదము, ఉలక, ఒల్లిదము, సుళువు, నన్ననన అన సులభము పేళ్ళు.

గీ. అగవనఁగ కొఱయనఁ బెరుకనఁగ వెంట
యనఁగ చక్కటునాఁ బ్రయోజనము పేళ్లు;
నాగడంబన తీఁపురమన నవగడ
మనఁగ నప్రయోజనమున కాఖ్యలలరె. 161

అగవు, కొఱ, బెరుకు, వెంట, చక్కటి అన ప్రయోజనము పేళ్ళు. ఆగడము, తీఁపురము, అవగడము అన అప్రయోజనము పేళ్ళు.

క. ఊఱడిలుటయనఁగా మఱి
యూఱటయన నుపశమనకు నొప్పెను పేళ్లై;
యూఱడిలన నూరార్చన
నూఱడు నూరాఱుచనఁగ నుపశమిలుటకా. 162

ఊఱడిలు, ఊఱట అన ఉపశమన పేళ్ళు. ఊఱడిలు, ఊరార్చు, ఊఱడు, ఊడాఱుచు అన ఉపశమిల్లుట పేళ్ళు.

గీ. అంచియయు నంచెయన ఘట్టమౌను క్రుంకు
నాఁగ తొప్పదోఁగన దోఁగునాఁగ వ్రేలు
ననఁగ గ్రుక్కన బ్రుంగన మునుకనంగ
మునుగనంగను మగ్నత్వమునకు పేళ్లు. 163

అంచియ, అంచె అన ఘట్టము పేళ్ళు. క్రుంకు, తొప్పదోఁగు, దోఁగు, వ్రేలు, గ్రుక్కు, బ్రుంగు, మునుకు, మునుఁగు అన మగ్నత్వము పేళ్ళు.

గీ. తేలునఁనగ ప్లవంతియౌ; తికమకలగు
ననఁగ నగుతొట్రుపాటన నలరె నుద్వ్యా
గుడుపనఁగ బహువచనంబుగూడి సగిస
మగిసలన బంధితశ్వాసమగ్నమగును. 164

తేలు అన ప్లవంతికి పేరు. తికమకలగు, తొట్రుపాటు, ఉద్వ్యాగుడుపు బ॥ సగిసమగిసలు అన బంధితశ్వాసమగ్నము పేళ్ళు.

సీ. ఊసరిల్లుననంగ నూచబోననంగ
నొగుడు కఱచునన నూఁచపడన

వక్కనఁగ వీకబాఱునసంగను  
క్రియ్యనసంగను గ్రుయ్యనఁగ  
బక్కటిల్లన గ్రాడుపడునసంగను వగ్గు  
నసఁగను సన్నగిల్లనఁగ డయ్యు  
నంగను వట్టుసి నకనకల్ బడునన  
నలరె కృశించుట కాఖ్యలవని;

గీ. బడుగుబడున నసారవునాఁ బడువనఁగ  
బడుగునన కృశ్యంబునకాఖ్యలడరె; బొక్క  
ణంబనఁగ బొంకడంబన నంబుజాక్ష  
వెలసెను విభూతిసంచికాఖ్యలు తెలుఁగున. 165

ఊసరిల్లు, ఊఁచఁబోవు, ఒడుగు, కఱచు, ఊఁచబడు, వక్కు, వీక బాఱు, క్రియ్యు, క్రుయ్యు, బక్కటిల్లు, గ్రాడుపడు, వగ్గు, సన్నగిల్లు, డయ్యు, వట్టు,నకనకల్పడు అన కృశించుటపేళ్ళు.బడుగుబడు,సారవు,బడువు, బడుగు అన కృశము పేళ్ళు. బొక్కణము, బొంకణము అన విభూతిసంచి పేళ్ళు.

క. అనుగల మొద్దిక యొందిక  
యనవాటము వంటుపాకమనఁగ సమేళం  
బనఁగ సరాగం బొదవన  
ననుకూలమునకు నభిఖ్య లలరె మురారీ. 166

అనుగలము, ఒద్దిక, ఒందిక, వాటము, వంటు, పాకము, సమేళము, సరాగము, ఒదవు అన అనుకూలము పేళ్ళు.

క. మనసిజజనకా వల్లప
డన సరిపడు సంబళించుననన నౌను పొసం
గన పొందుపడన వాటప
డన ననుకూలించుపేళ్లు నలరెముకుందా. 167

వల్లవడు, సరిపడు, సంబళించు, పొసఁగు, పొందుపడు, వాటపడు అనఁగా అనుకూలించు పేళ్ళు.

గీ. లేక యుల్లాకు కిల్లాకు రేక జాబు
చీటియన పత్రికకు బేళ్లుజెల్లె భువిని;
యేలియనఁ కృత్రిమమునకు నెసఁగె; వంటు
కామియన ప్రతికూలమగా కంతుజనక. 168

లేక, ఉల్లాకు, కిల్లాకు, రేక, జాబు, చీటి అన పత్రికకు పేళ్ళు. ఏలి అన కృత్రిమము పేరు. వంటుకామి అన ప్రతికూలము పేరు.

పంచపాది. గీ. సవరయును సవరణయును చక్కఁబడన
నయమునకు బేళ్లు; నెఱవేర్పు నాఁగ నెరప
నంగ సవరణసేయుననఁగను నెఱ
వేఱుచన చక్కఁబఱచునాఁ వెలసెపేళ్లు
నయముసేయుటకొప్పె పన్నగశయన. 169

సవర, సవరణ, చక్కఁబడు అన నయమునకు పేళ్ళు. నెఱవేర్పు, నెరపు, సవరణసేయు, నెఱవేఱుచు, చక్కఁబఱచు అవ నయముసేయుట పేళ్ళు.

ఆటవెలది. ఎట్టకేని యెట్టకే లెట్టకేలకు
నన నతిప్రయాసమునకుఁ బేళ్లు
బరగె; వాలెమనఁగ వాలాయమనఁగ న
వశ్యమునకుఁబేళ్లు వాసుదేవ. 170

ఎట్టకేని, ఎట్టకేలు, ఎట్టకేలకు అనఁగా అతిప్రయాసముపేళ్ళు. వాలెము, వాలాయము అనఁగా అవశ్యముపేళ్ళు.

సీ. ఒఱపన జీనినా నోగితంబనఁగను
చొక్కటయనంగను సుద్దమనఁగ
చొక్కాటమనఁగను చొక్కారమనఁగ చొ
కాటంబనఁగ చొకారమనఁగ
చొక్కతరంబన చొక్కంబనంగ ని
గారంబనంగ జగాయనంగ
నాణెంబనఁగ జగ నాఁ నాడెమన చందు
నాఁగను వావిరినాఁగ స్వచ్ఛ

గీ. మునకుఁబేళ్లొప్పు; యుత్తనమునకు రోత
యేవ యెబ్బెఱికము వాజ యొఱబఱికము
సెగ్గమేఁవంబు సెగ్గనఁ జెలఁగెపేళ్ళు;
దేవురనఁగ దీనత్వమౌ దేవదేవ. 171

ఒఱపు, జీని, ఓగితము, చొక్కట, సుద్దము, చొక్కాటము, చొక్కారము, చొకాటము, చొకారము, చొక్కతరము, చొక్కము, నిగారము, జగా, నాణెము, జగ, నాఁడెము, చందు, వావిరి అన స్వచ్ఛమునకుఁబేళ్ళు.

కోత, ఏవ, ఎబ్బెటికము, వాజ, ఎఱబటికము, సెగ్గము, ఏవము, సెగ్గు అన అర్తనమునకుఁ బేళ్ళు. దేవురు అన దీనత్వము పేరు.

క. దనుజారి యెరవనఁగ వెఱ
యన పెరయన లాఁతియనఁగ యన్నెమనఁగ వే
రనఁగా వింతయనఁగ మా
ఱనఁగా నన్యమునకాఖ్యలగు నాంధ్రమునన్. 172

ఎరవు, వెఱ, పెర, లాఁతి, అన్నెము, వేరు, వింత, మాఱు అన అన్యము పేళ్ళు.

గీ. ఎనిక యెన్నిక లెక్కనాఁ గణనమయ్యె;
నెన్నునాఁగ గణించుట; నెడయిక నెడ
బాటనంగ వియోగమౌ; కూటమియన
కూడికయన సంయోగమౌ కోమలాంగ. 173

ఎనిక, ఎన్నిక, లెక్క అన గణనము పేళ్ళు. ఎన్ను అన గణించుట పేళ్ళు. ఎడయిక, ఎడఁబాటు అన వియోగము పేళ్ళు. కూటమి, కూడిక అన సంయోగము పేళ్ళు.

గీ. బెడిసె బుసిపోయె చెడియెను చెడెననంగ
నాశమగు పేళ్లు; చెడ్డతనంబు సెబ్బ
చెడుగు సాకంబు సాకును సెబ్బరయన
దుష్టమునకు నభిఖ్యలౌ దురితదూర.

బెడిసె, బుసిబోయె, చెడియె, చెడె అన నాశమగుపేళ్ళు. చెడ్డతనము, సెబ్బ, చెడుగు, సాకము, సాకు, సెబ్బర అనదుష్టత్వముపేళ్ళు.

క. చెడుపని తలమాటును పో
కడ పెంపును వేరువిత్తు కాడు చెడుగు త్రుం
గుడు రుత్త చేటుపొలయిక
తొడరెను నాశంబుపేళ్లు తోయజనాభ. 175

చెడుపని, తలమాటు, పొకడ, పెంపు, వేరువిత్తు, కాడు, చెడుగు త్రుంగుడు, రుత్త, చేటు, పొలయిక అనఁగా నాశనముపేళ్ళు.

సీ. ఎత్తువోవుఁ నంగ నేదన కడచన
కడవోవు ననఁగను కడచనునన
సమయునాఁ గచ్చువిచ్చయ్యెనాఁ బ్రుయ్యునాఁ
రూపుమాయుననంగ రూపఱునన
మచ్చుమాయుననంగ మలుగన గిట్టన
పఱివోవునన కోలుపడన త్రుంగు
నన మారిఁబోవన నాఱుమూడయ్యెనా
గను మాలునాఁ బ్రుగ్గునఁగ పఱియు

గీ. ననఁగ పొలియును పొలివోవునన పొకారు
ననఁగ రూపడగును తీఱుననఁగ మాఱు
నంగ పోకాడు పోకారునాఁగ రూపు
సెడుననఁగ చెడుననఁగ వశించుపేళ్లు. 176

ఎత్తువోవు, ఏదు, కశచు, కడపోవు, కడచను, సమయు, గచ్చువిచ్చ లొయ్యి, బ్రుయ్యి, రూపుమాయు, రూపఱు, మచ్చిమాయు, మలుగు, గిట్టు, పటివోవు, కోలుపడు, రూ॥ కోల్పడు, త్రుంగు, మూరిఁబోవు, అఱుమూడవు, మాలు, బ్రమగ్గు, పరియు, పొలియు, పొలివోవు, పొకారు, రూపడగు, తీఱు, మాఱు, పోకాడు, పోకారు, రూపుపెడు, చెడు అన నశించు పేళ్ళు.

గీ. చెఱుచునాఁ లసుకన పరిసేయుననఁగ
నుఱిచియాడనఁగ పొరిగొనుసన నాశ
మొనరుచుటకౌను; ముంగోలు మొదటిదియన
ప్రాథమికమునకాఖ్యలౌ భవవినాశ. 177

చెఱుచు, లసుకు, సరిచేయు, నుఱిచియాడు, పొరిగొను అన నాశ మొనర్చుటకు పేళ్ళు. ముంగోలు, మొదటిది అన ప్రాథమికమునకు పేళ్ళు.

గీ. పేదఱిమి నెవ్వ పేదర్మి బీదతనము
సీద్ర మెద్దడి లేవడి సీదరంబు
లేమి నిప్పచ్చరంబును లేమిడియన
దనరె దారిద్రమున కాఖ్యలై మురారీ. 178

పేదఱిమి, నెవ్వ, పేదర్మి, బీదతనము, సీద్రము, ఎద్దడి, లేవడి, సీద రము, లేమి, నిప్పచ్చరము, లేమిడి అనఁగా దారిద్రమునకుఁ బేళ్ళు.

గీ. కలిమి పోఁడిమి సిరి లచ్చి కల్మియనఁగ
నెనఁగె సంపత్తుపే; ల్గోట యేటమనఁగ

పక్షమున; కేటవాలన పక్షపాత
మునకు; మ్రింగన కబళించుదనరె శౌరి. 179

కలిమి, పోఁడిమి, సిరి, లచ్చి, కల్మి అన సంపత్తుపేళ్ళు. ఏట, ఏటము అన పక్షమునకుపేళ్ళు. ఏటవాలు అన పక్షపాతముపేరు. మ్రింగు అన కబళించుపేరు.

క. ఎరవు విరిపాటు లవలవ
మెరమెర విజ్జోడు వేఱిమియు వేఱును వెం
పర యెడ వాసియు పొరువును
బెరుకును తేఱడమనంగ భేదముపేళ్లౌ. 180

ఎరవు, విరిపాటు, లవలవ, మెరమెర, విజ్జోడు, వేఱిమి, వేఱు, వెంపర, ఎడ, వాసి పొరువు, బెరుకు, తేఱడము అన భేదముపేళ్ళు.

పంచపాది గీ. అగలుచన చిట్లుముట్లాడుననఁగ వ్రచ్చు
ననఁగ వేటాడు మ్రేండించుననఁగ చీల్చు
ననఁగ చించన భేదించుటొనరె; మాఱు
పడును గాతుకలఁగు వేఱుపడుననంగ
భేదపడుపేళ్లు కుండలిభిత్తురంగ. 181

అగలుచు, చిట్లుముట్లాడు, వ్రచ్చు, వేటాడు, మ్రేండించు, చీల్చు, చించు అన భేదించుపేళ్ళు. మాఱుపడు, గాతుకలఁగు, వేఱుపడు అన భేదపడుటకుపేళ్ళు.

పంచపాది గీ. ఏస లాఁత వళావళి యెసఁగు డాక
హావణి లేత్రెఱ వీఁక యేపారు కైపు
మెఱవడియును సోమించు చిందఱయు నిగుడు
కొప్పరంబును గుంపెన కొప్పరింత
యన విజృంభణమునకాఖ్యలగు ముకుంద. 182

ఏస, లాఁత, వళావళి, ఎసఁగు, డాక, హావణిల్లు, ఏత్రెఱ, వీఁక, ఏపారు, కైపు, మెఱవడి, సోమించు, చిందఱ, నిగుడు, కొప్పరము, గుంపెన, కొప్పరింత అన విజృంభణము పేళ్ళు.

సీ. ఎసకరిం చెసరేఁగు నేపారు నొడికార
•మొదలు అంపి ల్లేను కదురు కెరలు
కసిమసఁగొను కేరు కొసరు కేరుపు రెచ్చు
ఱేయు పొంపిరివోవు రేయు చిఱుము
రేఁగు పురాణించు రేఁచు మిటారించు
కేరించు గొదకొను కెరలుపొడచు
మసఁగొను పురణించు మసఁగు పురాయించు
చెలరేఁగు పొంగారు చెంగళించు
గీ. మూరిబోవును తనరుచు పొలుగు తిమురు
తవరు లాయు కెలయు మెండుకొను తనర్చు
జువ్వరించును విక్కునాఁ నివ్వటిల్లె
ధర విజృంభించుటకు పేళ్లు దానవారి. 183

ఎసకరించు, ఎసరేఁగు, ఏపారు, ఒడికారము, ఒదలు, అంపిల్లు, ఏచు, కదురు, కెరలు, కసిమసఁగొను, కేరు, కొసరు, కేరుపు, రెచ్చు, ఱేయు,

పొంపిరివోవు, రేయు, చిలుము, రేఁగు, పురాణించు, రేచు, మిటారించు కేరించు, గొదకొను, కెరలువడచు, మసఁగొను, పురడించు, మసఁగు, పురా యించు, చెలరేఁగు, పొంగారు, చెంగలించు, మూరిఁబోవు, తనరుచు పొఱుగు, తిమురు, తనరు, వలాయు, కెలయు, మెండుకొను, తనర్చు, జూవ రించు, వికుర్వ అన విజృంభించుటకు పేళ్ళు.

గీ. తిగియు తివియు నుసుము రెమ్మ తిగుచు లాగు
నొడియునాఁగ నాకర్షించుటొప్పు; తావ
లమన పట్టుగొమ్మయనంగ నమరె భువిని
పేళ్లు నాధారమునకును వేదవేద్య. 184

తిగియు, తివియు, నుసుము, రెమ్మ, తిగుచు, లాగు, ఒడియు అన ఆకర్షించు పేళ్ళు. తావలము, పట్టుగొమ్మ అన అధారము పేళ్లు

గీ. అలరె మోట కపిలె జలయంత్రమునకు
పేళ్లు; కన్నె క్రొత్త యన నవీనమునకు;
పాఁతయన తుకాటమన పురాతనమగు;
బిద్దెమన భిన్నమగు ఫణిభిత్తురంగ. 185

మోట, కపిలె అన జలయంత్రము పేళ్ళు. కన్నె, క్రొత్త అన నవీనము పేళ్ళు. ప్రాఁత, తుకాటము అనపురాతనము పేళ్ళు. బిద్దెము అన భిన్నము పేరు

క. కరదివ్వియ దివటీయన
కరదివియయు దివ్వటీయు కరదివెయనఁగాఁ

కరదివ్వెయనఁగ తెలుఁగున
కరదీపికపేళ్లుదనరె కల్మషహరణా. 186

కరదివ్వియ, దివటీ, కరదివియ, దివ్వటీ, కరదివె, కరదివ్వె అనక దీపికపేళ్ళు.

గీ. గండునా సత్తయనఁగ డగరయనంగ
త్రాణనా, బలిమియనంగ దగరయనఁగ
సత్తువయు బల్మియనఁగను సత్తనంగ
బలమునకుబేళ్లుజెల్లెను పద్మనాభ. 187

గండు, సత్త, డగర, త్రాణ. బలిమి, దగర, సత్తువ, బల్మి, సత్తు అన బలమునకుపేళ్ళు.

గీ. బల్లిదంబన బలయుత వస్తువగును;
బెడియునన సొగులనఁగను వికలమునకు;
మూలముట్టన నామూలమునకు; నెగ్గు
నిగ్గనఁగ నిర్వహిలుటకు నెగడెపేళ్లు. 188

బల్లిదము అన బలయుత వస్తువుపేరు. బెడియు, సొగులు అన వికలముపేళ్ళు. మూలముట్టు అన ఆమూలముపేరు. నిగ్గు, నెగ్గు అన నిర్వహిల్లుటపేళ్ళు.

గీ. ఉటిది యెత్తిలి బిగితంబు నొటుపు నేటు
బెట్టు బటువు సదాటును బిట్టు లవణి
బిగువు గుత్తంబు బింకంబు బిఱ్ఱన దృఢ
మగు; దొసఁగు నెడయన విఘ్నమగుటకొప్పె. 189

ఉఱిదిది, ఎత్తిలి, బిగితము, ఒఱపు, బెట్టు, బటువు, సదాటు, బిట్టు, లవణి, బిగువు, గుత్తము, బింకము, బిఱ్ఱు అన దృఢమునకు పేళ్ళు. దొసఁగు, ఎడ అన విఘ్నమగుటకు పేళ్లు.

గీ. తనరె తూఁటాడు జర్జరితంబు పేరు;
దాపరము దాపురము ప్రాప్తికౌ; పొసఁగన
దొరకొనును చిక్కనఁగను దొరకునన ల
భించుటౌ; నీఁగునన నివర్తించు పేరు. 190

తూఁటాడు అన జర్జరితము పేరు. దాపరము, దాపురము అన ప్రాప్తికి పేళ్ళు. పొసఁగు, దొరకొను, చిక్కు, దొరకు అన లభించు పేళ్లు. నీఁగు అన నివర్తించు పేరు.

క. మునినుత తొప్పలుదొరలు
ననఁగను కోటానకోట్లునన రామునిదా
డినఁగను త్రవ్వితండం
బనఁగ నసంఖ్యకునభిఖ్యలౌ మురవైరీ. 191

తొప్పలుదొరలు, కోటానకోట్లు, రామునిదాడి త్రవ్వితండము అన అసంఖ్యకు పేళ్ళు.

గీ. ఇత వితము హితవన నయ్యె హితము; సాజ
మన స్వభావంబు; సోదియయనఁగ సోదె
యన భవిష్యత్ప్రశ్న; తీలనఁగ యడక
మనఁగ నయ్యెనంతర్ధానమునకు బేళ్లు. 192

ఇతవు, ఇతము, హితవు అన హితము పేళ్లు. సాజము అన స్వభావము పేరు. సోదియ, సోదె అన భవిష్యత్ప్రశ్నము పేళ్లు. తీలు, అడకము అన అంతర్ధానము పేళ్లు.

గీ. మూరుకొనును మూచూచును మూర్కొనునన
వెలసె మూర్ధమాఘ్రాణించు పేళ్లు; తెలుపి
యెడ యనఁగ నవకాశమా నెచ్చు తచ్చు
వాసినాఁ దారతమ్యంబు వాసుదేవ. 193

మూరుకొను, మూచూచు, మూర్కొను అన మూర్ధమాఘ్రాణించు పేళ్లు తెలుపి, ఎడ అన అవకాశము పేళ్ళు. ఎచ్చుతచ్చు, వాసి తారతమ్యము పేళ్ళు.

సీసమాలిక. అక్కిబిక్కిరిదండ యప్పచ్చి దూబూచి
యాలంకిగుడి యంజి యుప్పచి సిరి
సింగణాలావత్తి సిరిసింగణావత్తి
కుందెనగుడి యుప్పు గుంద మిఱికి
యోటిల్లు చిందఱ యువ్వాలపోటి కం
బాలాట గంజనగాలు దూఱు
దుంకెన తనుబిల్ల తూనరతుక్కంబు
బిత్తి గొబ్బియు తన్నుబిళ్ళ యక్కి
బిక్కిదండయు నోడుబిల్ల బహువచనం
బున తూరకోల లచ్చనలు కుంది
కాళ్ళు కుప్పిలు పింపిళ్ళు దాఁగనమూఁత
లచ్చనకాయలు నమ్మనలును

దాఁగిలిముచ్చులు దాఁగుడుమూఁతలు
గుడిగుడిగుంచాలు గూనవాలు
నుప్పనఁబట్టెలు నోమనగుంటలు
గొబ్బిళ్లు నచ్చనగుండ్లు కుప్పి

గీ. గంతులు లాలంకలును దాఁగురింతలు గుజ
గుజ్జరేకులు జాబిళ్ళు గుంజమల్లు
గీరనంగింజలన నలరారెపేళ్లు
శ్రీప బాలికా క్రీడా విశేషములకు. 194

అక్కచిక్కరిదండ, అప్పచ్చి, దూబూచి, ఆలంకిగుడి, అంజి, అప్పచి, సిరిసింగణాలావతి రూ॥ సిరిసింగణాలవత్తి, సిరిసింగణావత్తి, కుందెనగుడి, ఉప్పుగుందము, ఇతికి, ఓటిల్లు, చిందఱి, ఊవ్వాలపోటి, కంబాలాట, గంజనగాలు, దూఱదుంకెన, తనుబిల్ల, తూనరతుక్కము, బిత్తి, గొబ్బి, తన్నుబిల్ల, అక్కచిక్కదండ, ఓడుబిల్ల బ॥ తూరకోలలు' అచ్చనలు, కుందికాళ్ళ కుప్పిలు, పింపిళ్ళు, దాఁగనమూఁతలు, అచ్చనకాయలు, అమ్మనలు, దాఁగిలిముచ్చులు. దాఁగుడుమూఁతలు, గుడిగుడిగుంచాలు, గూనవాలు, ఉప్పనఁబట్టెలు, ఓమనగుంటలు, గొబ్బిళ్లు, అచ్చనగుండ్లు, కుప్పిగంతులు, ఆలంకలు, దాఁగురింతలు. గుజగుజ్జరేకులు, రూ॥ గుజగుజరేకులు, జాబిళ్ళు, గుంజమల్లు, గీరనగింజనలు అన బాలికాక్రీడావిశేషముల పేర్లు.

గీ. క్రమ్మి గుడికొను ముసు రామకవియు ముసరు
మూఁగబాఱును మూఁగు దిమ్ముగొని యావ
రించుటకుఁ బేళ్ళగును; సుతాళించనంగ
దృష్టిద్రిప్పుటనామమహా కృష్ణవర్ణ. 195

కరిమ్మ, గుడికొను. ముసుగు, ఆముకవియు, ముసరు, మూఁగబాఱు, మూఁగు అన గుంపుగనావరించుటపేళ్ళు. సురాళించు అన దృష్టిద్రిప్పుట పేరు.

గీ. ఉవ్వునఁగ విసరనఁగను ఊావనంగ
ఉప్పనంగను ప్రక్షేపమొప్పు; వెక్క-
సంబనంగ నశక్యనామంబు; మొట్టి
మొటికి నౌకు క్వచిల్లోపమునకు బేళ్లు 196

ఉవ్వు, విసరు, ఊావు, ఉప్పు అనఁగా ప్రక్షేపముపేళ్ళు. వెక్క-సముఅన అశక్యముపేరు. మొట్టి, మొటికి, నవుకు అన క్వచిల్లోపముపేళ్ళు.

క. ఇల గెంటు త్రోయు నెట్టన
చెలఁగి జడియున పసరింప జేయుటపేళ్లౌ;
తొలఁగన తలఁగవ తలవన
నలరె నపసరిల్లుపేళ్లు హాటకచేలా. 197

గెంటు, త్రోయు, నెట్టు. జడియు అన అపసరింపసీయుపేళ్ళు. తొలఁగు' తలఁగు, తలవు అన అపసరిల్లుపేళ్ళు.

గీ. కడపనఁగ త్రోలుననఁగను కెడపనంగ
వెలుచనఁగ చోదనత్వమా బీగమనఁగఁ
దాళమునకాఖ్యయగు: కుంచెకోలయనఁగ
నంకుటంబన కుంచికాఖ్యలుముకుంద 198

కడపు, త్రోలు, కెడపు, వెలుచు అన చోదనత్వముపేళ్ళు. బీగము అన తాళముపేరు, కుంచెకోల, అంకుటము అన కుంచికకుపేళ్ళు.

గీ. చిక్కు చికమక జిలుఁగును జిలువుమలఁక
వరకు నులియును స్రుక్కును వరను మఱియు
తనకలియును వేళాకోలమనఁగ పేళ్లు
దవరి కేశాదిసంకీర్ణమునకు శౌరి. 199

చిక్కు, చికమక, జిలుఁగు, జిలువు, మలఁక, వరకు, నులి, స్రుక్కు, వరను, తనకలి, వేళాకోలము అన కేశాదిసంకీర్ణము పేళ్ళు.

క. అచ్చుదల యచ్చివ చ్చయి
వచ్చన పూర్వానుకూల్య వాసనపేళ్లౌ;
నచ్చుప డేర్పడుననఁగా
నిచ్చలు నియమింపుపేళ్లు నిర్మలచరితా. 200

అచ్చుదల, అచ్చివచ్చు, అయివచ్చు అనపూర్వానుకూల్యవాసన పేళ్ళు. అచ్చుపడు, ఏర్పడు, అన నియమింపుపేళ్ళు.

క. ఎనయునన కల్పుకోలని
యన నచ్చికబుచ్చికయని యన పేళ్ళగు మే
ళనకృత్యమునకు సాగర
తనయాకుచకుంభ గంధధవళోరస్కా. 201

ఎనయు, కల్పుకోలు, అచ్చికబుచ్చిక అన మేళనకృత్యము పేళ్లు.

గీ. మ్రొగ్గు మడఁగు మడుఁగు వంగు మొగ్గతిల్లు
వ్రాలు మోకరిలనఁగ నమ్రంబుపేళ్లు;
సూరిగిల్లొరగును ప్రక్కసోలుడనఁగ
పార్శ్వనమ్రిత్వమున కౌను పావనాఖ్య. 202

ప్రెగ్గు, మడఁగు, మడుగు, వంగు, మొగ్గతిల్లు, వ్రాలు, మోకరిల్లు అన నమ్రము పేళ్ళు. మూకరిల్లు, ఒరగు, ప్రక్కసోలుడు అన పార్శ్వనమ్రిత్వము పేళ్ళు.

గీ. మున్నడియును మున్నాడియు ముందుగనవఁ
దనరె ప్రథమతికాఖ్యలై; మునుపడు మును
కోలు ముందు పడును మునుకొను మునుచన
దనరె కార్యావలంబితమునకు శౌరి. 203

మున్నడి, మున్నాడి, ముందుగ అన ప్రథమతకు పేళ్ళు. మునుపడు, మునుకోలు, ముందుపడు, మునుకొను, మునుచు అనఁగా కార్యావలంబము పేళ్ళు.

గీ. కలుగడయనంగ నగునుండ్రకోవియనఁగ
నగును చేఁగట్టియనఁగను హస్తదండ
మునకభిఖ్యలు; పట్టు బచ్చెనయుఁ బూఁత
యనఁగ కుడ్యలేపనమగు దనుజవైరి. 204

కలుగడ, ఉండ్రకోవి, చేఁగట్టి అన హస్తదండకు పేళ్ళు. పట్టు బచ్చెన, పూఁత అనఁగా కుడ్యలేపనము పేళ్ళు.

క. ఉబ్బును పోటు విరియు పుట
ముబ్బు నుబుకు వెల్లివిరియు నుప్పొంగుటయుఁ
నిబ్బరికించును పొంగన
నుబ్బతిలనఁ దెలుఁగునందు నుల్బణమగుటా. 205

ఉబ్బు, పోటు, విరియు, పుటముబ్బు, ఉబుకు, వెల్లివిరియు, ఉప్పొంగు, నిబ్బరికించు, పొంగు, ఉబ్బతిల్లు అన ఉల్బణమగుటకు పేళ్ళు.

క. అడఁగన మందటిలనఁగఁ దో
గడు క్రుంగును మట్టుపడనఁగను తాఁ అనఁగన్
మఱుఁగన డిందన సగ్గన
నడరెను క్రుంగన నిరుల్బణాఖ్యలు శౌరీ. 206

అడఁగు, మందటిల్లు, తోఁగడు, క్రుంగు, మట్టుపడు, తాఁఅు, మఱుఁగు, డిందు, సగ్గు, క్రుంగు అన నిరుల్బణము పేళ్ళు.

క. అంబుజలోచనయుగ! ది
ట్టంబన గద్దఱియనఁగ తుటారియనఁ దుటా
రంబన దిట్టయు డంకత
నంబన దార్ఢ్యంబుపేళ్లు నాళీకాక్షా. 207

దిట్టము. గద్ద , తుటారి, తుటారము, దిట్ట, డంకతనము అన దార్ఢ్యతము పేర్లు.

క. తిరికయన మెలికయనఁగను
పిరియన తాళికయనంగ పెననా మెలినాఁ
బురియన మలఁకయనంగను
సరసుఁగొనెం బాశతంతు సంకీర్ణంబై. 208

తిరిక, మెలిక, పిరి, తాళిక, పెన, మెలి. పురి, మలఁక అన పాశతంతుసంకీర్ణతమునకు పేర్లు.

క. తూకము పూపును పూనిక
యూఁకువ మొనసేయు బోగు నొడవును మొగియుం
దూకును తాచును తలయును
మేకోలన నుద్యమమగు మేదిని శౌరీ. 209

తూకము, పూపు, పూనిక, ఊఁకువ, మొనసేయు, బోగు, ఒడవు, మొంగి, తూకు, తాచు, తల, మేకోలు అన ఉద్యమము పేళ్లు.

గీ. ఊఁకువగు తాచు పాల్పడు నూఁకు నుసలు
పూను పూన్కొను తూకొను మొనయు నొగ్గు
మొగియు తక్కొను వసిఁగొను మొనకొను మఱి
మేకొను మెయికొనునన నుద్యమించు పేళ్లు. 210

ఊఁకువ, తాచు, పాల్పడు, ఊఁకు, నుసలు, పూను, పూన్కొను, తూకొను, మొనయు, ఒగ్గు, మొగియు, తక్కొను, వసిఁగొను, మొనకొను, మేకొను, మెయికొను అన ఉద్యమించు పేళ్ళు.

గీ. పొందుకొను నిల్కడయును నెప్పుకొను నెట్టు
కొను నిలుచు పాదుకొను నట్టుకొను నెలకొను
తావుకొనును నెక్కొలనఁ దనరె పేళ్లు
స్థాయిఁగొనుటకు మానిహృజ్జలజమిత్ర. 211

పొందుకొను, నిల్కడ, నెప్పుకొను, నెట్టుకొను, నిలుచు, పాదుకొను, నట్టుకొను, నెలకొను, తావుకొను, నెక్కొలు అన స్థాయిగొనుటకు పేళ్ళు.

గీ. ఎచ్చరిక యెచ్చరింతయు హెచ్చరిక బ
రాబఁరిక హెచ్చరింత బరాబరి యనఁ
దఁ రి నవధానమునకు; మాకొను ననంగ
కఱచు ననఁగ దష్టించుటౌ కమలనాభ. 212

ఎచ్చరిక, ఎచ్చరింత, హెచ్చరిక. బరాబగిక, హెచ్చరింత, బరాబరి అన అవధానము పేళ్ళు, మాకొను, కఱచు అన దష్టించు పేర్లు,

గీ. ఎరఁగ ననఁగ డిగ్గన దిగ్గన నెఱఁగ నంగ
వెలసె భువి నవతీర్ణించు పేళ్లు; నెక్కు
డ ననఁగ నారోహణము; మాలుగ ననఁగ ప్రాలు
మాలు సోమరితనమన మందబుద్ధి. 213

ఎరఁగు, డిగ్గు, దిగ్గు, ఎరఁగు అనఁగా అవతీర్ణునకు పేళ్ళు. ఎక్కుడు అన ఆరోహణమునకు పేరు. మాలుగు, ప్రాలుమాలు, సోమరితనము అన మందబుద్ధి పేళ్ళు.

చ. మొఱఁగన లాఁచునాఁ బొరయు పొంచిక నాఁగను పొంచు డుక్కనన్
మఱుపడు డాఁగు డొంగ ననఁగ మాటుపడన్న నుదాఁగు దొంగనన్
మఱుఁగగు నోలమాసగొను మాటగు దూకొను తాఱు నాఁగనై
వఱలె తిరోహితంబగుచు వాసవవందిత పాదపంకజా. 214

గీ. చాటసంగను మఱుఁగన మాటనంగ
గూఢమునకు నభిఖ్యలగును; మఱియును
నచ్చికయు నచ్చిగయునాఁగ నమ్మికయన
నమ్మకం బాత్మనిశ్చయనామములగు 215

చాటు, మఱుఁగు, మాటు అనఁగా గూఢమునకు పేళ్ళు. నచ్చిక, నచ్చిగ, నమ్మిక, నమ్మకము అన ఆత్మనిశ్చయము పేళ్ళు.

క వనజాక్షా యడరిన పద
రన వస్త్రప్రీతివేగమగు నాంధ్రార్థం
బున నిట్టిపదసమూహము
గాని సంకీర్ణమనువర్గు గానయిది శౌరీ. 216

అడరు, పదరు అన వస్త్వపేక్షావేగము పేళ్ళు.

సంకీర్ణవర్గుముగిసెను.

---

# నానార్థవర్గు

గీ. అంకణంబన గేహకత్యకు చతుశ్శ
వస్థళంబునకగు; బహువచనమగుచు
నంకపాంకములన కోపమగు విరోధ
మునగు మఱియు నంకాపాంకములు నవియగు. 217

అంకణము అన గేహకత్యకు చతుశ్శవస్థలంబునకుఁ బేరు. అంకపాంకములు అంకాపాంకములు అన కోపమగును. విరోధమగును.

గీ. పృథ్వినంకించుటన రఘళిపించుటొప్పు
నపహరించుటకును భ్రామయంబు నుల్ల

సిల్లుటకుఁజెల్లు క్రీడింప సేయుటకగు
నడయనఁగ పిండమగు మఱి యాకృతియగు. 218

అంకించు అన ఝళిపించు, అపహరించు, భ్రామయము, ఉల్లసిల్లి క్రీడింపసేయుట పేరు. అడ అన పిండము, ఆకృతి అగును.

క. బుధనుతయంకిలియన నా
పదకును క్షోభము నిరోధవర్గంబున; కం
గదయన దుఃఖోత్సాహా
క్షుధాపద మఱి విప్లవంబు కోపముచెల్లుఁగా 219

అంకిలి అన ఆపద, క్షోభము, నిరోధము అగును. అంగద అన దుఃఖము, ఉత్సాహము, క్షుధ, ఆపద, విప్లవము, కోపము అగును.

క. అంగడియన నాపణమగా
నంగడియనఁగా ప్రతోళి యగు సభపేరా
నంగడియన నావేశన
మంగడియన న్యాయసభకు నాఖ్యనురారీ. 220

అంగడి అనఆపణము, ప్రతోళి, సభ, ఆవేశనము, న్యాయసభ అగును.

ఆ. వె. అంగవింపనంగనగు నుత్సహించు న
తిక్రమించుటకును; తెనుఁగునందు
నంగమంగనంగ నగు నివి రెండు సుం
దరము విధముపేరు దైత్యదమన. 221

అంగవింపు అన ఉత్సహించు, అతిక్రమించు అగును. అంగము అంగు అన సుందరము, విధము' అగును

క అంచన నాజ్ఞాపించుట
కంచన చరమంబు విధమునౌ నరమునకౌ
నంచన కుడ్యార్థస్థల
మంచన వస్త్రాగ్రమునకునౌ మురవైరీ. 222

అంచు అన ఆజ్ఞాపించు, చెఱగు, పథము, అరము, కుడ్యాగ్రస్థలి, వస్త్రాగ్రము అగును

గీ. అండయన ననుగతిసమీపాశ్రయముల
కెసఁగె; నండఁగొన నాశ్రయించు టాల
సించుటౌ; నందుననఁగ గ్రహించుటకును
మఱియు బ్రాపించుటకుఁ జెల్లు మాధవాఖ్య. 223

అండ అన అనుగామి, సమీపము, ఆశ్రయము అగును. అండఁగొను అన ఆశ్రయించు, ఆలసించు అగును. అందు అన గ్రహించుట ప్రాపించుట అగును.

క. అక్కజమున నాశ్చర్యం
బక్కజమనగా నశక్య మధికమునకు జె;
ల్లక్కయనం బూజ్యస్త్రీ
యక్కయనఁగ భగినికౌను హాటకచేలా. 224

అక్కజము అన ఆశ్చర్యము, అశక్యము, అధికము అగును. అక్క అన భగిని, పూజ్యస్త్రీ అగును

క. అంటన స్పర్శించుటకౌ
నంటన సంయోగమునకు నగు స్నేహంబౌ;
నంటయనఁగ వాక్సూచన
యంటయనఁగ పర్ణపాత్రి కగు పిండలికౌ. 225

అంటు అన స్పర్శించు, సంయోగము, స్నేహము అగును. అంట అన వాక్యసూచన, పర్ణపాత్రి, పిండలి అగును.

గీ. అంతరువనంగ తారతమ్యంబునకును
మఱి పిధానస్థలమునకు బరగెభువిని;
యక్కఱయన నవశ్యకార్యం బపేక్ష
శ్రద్ధ కలరెను రణభీమ సార్వభౌమ. 226

అంతరువు, అన తారతమ్యము, పిధానస్థలము అగును. అక్కఱ అన
అవశ్యకార్యము, అపేక్ష, శ్రద్ధ అగును.

క. అగ్గలికయు నుత్సాహం
బగ్గలికయు నతిశయంబు నగు శౌర్యంబౌ;
నగ్గంబన దృష్టంబగు
నగ్గంబనఁగా నధీనమగు మురవైరీ. 227

అగ్గలిక అన ఉత్సాహము అతిశయము శౌర్యము అగును. అగ్గము అన
దృష్టము, అధీనము అగును.

గీ. అగ్గలించన నుత్సహించ నతిశయించు
దనరె; నచ్ఛంబనంగను ధవళమగును
స్వచ్ఛమగు కేవలమగు; నజ్జయనపాద
మునకు సమయమునకుఁజెల్లు దనుజవైరి. 228

అగ్గలించు అన ఉత్సహించు, అతిశయించు అగును. అచ్ఛము అన ధవ
ళము, స్వచ్ఛము, కేవలము అగును. అజ్జ అన పాదము, సమయము అగును.

గీ. అటమటయనంగ వంచనకౌను దుఃఖ
మునకసత్యంబునకు వ్యర్థమునకుఁజెల్లు;
నటమటించన వంచించు నపహరించు
మఱిచలించుటకును జెల్లు మదనజనక. 229

అటమట అన వంచన, దుఃఖము, అసత్యము, వ్యర్థము అగును. అటమ
టించు అన వంచించు, అపహరించు, చలించుట అగును.

క. అడఁగునన నుపశమిల్లుట
కడఁగుననఁగ నమ్రమగుట కగు క్షీణంబౌ
నడఁగునన నశించుటకగు
నడఁగన నాధీనమగుటకౌ మురవైరీ. 230

అడఁగు అన ఉపశమిల్లు, నమ్రమగు, క్షీణమగు, నశించు, అధీనమ

గీ. అడరనఁగ విజృంభించు నతిశయిల్లు
వర్ధిలాధిక్యమగు మఱి త్వరపడుద్య
మించు వ్యాపించు నింక బ్రాపించఁగఁ; నడ
కించన నపహసించు వంచించుటలను.                    231

అడరు అన విజృంభించు, అతిశయిల్లు, వర్ధిల్లు, ఆధిక్యమగు, త్వరపడు, ఉద్యమించు, వ్యాపించు అగును. అడకించు అన పరిహసించు, వంచించు అగును.

గీ. అడిచిపడునన త్వరపడుటౌ జ్వలించు
టౌను; తెనుఁగున భువిలోన నత్తమిల్లు
ననఁగ వ్యాపించు శయనించు నస్తమించు
పార్శ్వగమత్వమున కౌను భవవినాశ.                    232

అడిచిపడు అన త్వరపడు, జ్వలించు అగును. అత్తమిల్లు అన వ్యాపించు, శయనించు, అస్తమించు, పార్శ్వగమగు అగును.

క. అదటనఁగ గర్వమునకును
మదమునకును జెల్లు తెలుఁగు మాటలనెనుచో;
నదవదయన క్షోభంబగు
నదవద వ్యత్యస్తమగును హాటకచేలా.                    233

అదటు అన గర్వము, మదము అగును. అదవద అన గర్వము, మదము అగును.

గీ. అత్తనంగను సంయోగమౌను మిశ్ర
మగును ప్రాప్తించుటకు పేరు; ననయమనఁగ
సతత మామ్రేడితము నవశ్యంబునకును
మఱియు నత్యంతమునకౌను మాధవాఖ్య.                    234

అత్తు అన సంయోగము, మిశ్రమగు, ప్రాప్తించు అగును. అనయము అన సతతము, ఆమ్రేడితము, అవశ్యము, అత్యంతము అగును.

క. అసరన జీవస్థానం
బనకును సంకటము మర్మమునకు తెలుఁగు పే;
రసుఁగన ముఖ్యుండాది
మనోహరమునకును జెల్లు మన్మథజనకా. 235

అసరు అన జీవస్థానము సంకటము మర్మము అగును. అసుఁగు అన ముఖ్యుఁడు, ప్రథమము, మనోహరము అగును.

ఆ. వె, అతకరించఁగ నగు నధీనమున క
తిక్రమించుటకును తెనుఁగునందు;
ననువనఁగ నుపాయమగు విధమగు నవ
కాశయుక్తములగు కమలనాభ. 236

అతకరించు అన అధీనము, అతిక్రమించు అగును. అనువు అన ఉపాయము, విధము, అవకాశము, యుక్తము అగును.

క. అన్ననఁగ స్త్రీ పేరౌ
నన్ననఁగను పారవశ్య మాంధ్రంబున నౌ;
నన్నెంబన నన్యాయం
బన్నెంబన నితరమగును హాటకచేలా. 237

అన్న అన స్త్రీకి, పారవశ్యమునకు పేరు. అన్నెము అన అన్యాయము ఇతరము అగును.

క. అప్పయన మాతృపితృవు
లప్పయనఁగ జ్యేష్ఠభగినికౌ పూజ్యునకౌ
నప్పయన ననుమతియగు;
నప్పనయన నాజ్ఞకౌను హాటకచేలా. 238

అప్ప అన మాతృవు, పితృవు, భగిని, పూజ్యులకు పేరు. అప్పన అన

క. కాంచనచేలా! భువి స్పృశి
యించు భుజాస్ఫాలనము గ్రహించు ఘనము య
త్నించు క్రమించు నివియా
రంచితముగ నప్పళించు ననఁగను బేశా  239

అప్పళించు అన స్పృశించు, భుజాస్ఫాలనము, గ్రహించు, ఘనము యత్నించు, ఆక్రమించు అగును.

సీ. అబ్బురంబనఁగ భయంబు నాశ్చర్యమహా;
నబిసీలు మృగయా విహారమగు ను;
నమరిక యన విధమగు సుందరంబగు;
నరిశరసంధానమగు కరమగు
నమరన నంచితమగు ప్రాప్యమగు సిద్ధ
మగుటకు నగు స్వస్థమగుట కలరె;
యరవాయియనఁగ స్థైర్యంబు సందేహంబు;
నక్కిలి ప్రేమేచ్ఛలందు జెల్లు;
గీ. నరమర యరమరకయు నఱమరయన
వెలసె నివిమూడు సందేహభేదములకు;
నరిదియన దుర్లభము నశక్యంబు దుస్స
హంబునకు జెల్లు మానిహృదబ్జమిత్రి.  240

అబ్బురము అన భయము, ఆశ్చర్యము అగును. అబిసీలు అన మృగయా విహారము అగును. అమరిక అన విధము, సుందరము అగును. అరి అన శరిసంధానము, రాజకరము అగును. అమరు అన అంచితము, ప్రాప్యమగుట, సిద్ధమగుట, స్వస్థమగుట అగును. అరవాయి అన స్థైర్యము, సందేహము అగును. అక్కిలి అన ప్రేమము ఇచ్ఛ అగును. అరమరక, అరమర అఱమర అన సందేహము, భేదము అగును. అరిది అన దుర్లభము, అశక్యము, దుస్సహము అగును.

గీ. అరిగయన ఖేటకము పౌరుషాంకమునకు
నలరె; నఱచన విలపించుటను ఘోష
ణాఖ్యయగు తెనుఁగున; నఱుమనఁగ నాక్ర
మించుటయు ప్రతీక్షించుట మేఘవర్ణ. 241

అరిగ అన ఖేటకము, పౌరుషచిహ్నము అగును. అఱచు అన విలపించుట, ఘోషణ అగును. అఱుము అన ఆక్రమించుట, పరిశీక్షించుట అగును.

క. అఱయన కరాదితలమగు
నఱయన న్యూనంబు సంశయం బర్థంబా
నఱయన భేదము వంచన
యఱనా దోషంబు కోష్ఠమగు మురవైరీ. 242

అఱ అన హస్తాదితలము, న్యూనము, కొఱఁత, సంశయము, అర్థము, భేదము, వంచన, దోషము, కోష్ఠము అగును.

గీ. క్షితిని ఖండించుటకును ధ్వంసించుటకును
చెల్లె తెనుఁగున నఱవఱల్ సేయుననఁగ;
కంఠమౌ సమీపంబగు క్షయముసేయు
టా నశించుట కలరారె యఱన శౌరి. 243

అఱవఱలు అన ఖండించుట, ధ్వంసించుట అగును. అఱు అన కంఠము, సమీపము, క్షయముసేయు, నశించుట అగును.

క. అఱ్ఱాఁకయు నిర్బంధము
నఱ్ఱాఁక పిధానమునకు నలరెను క్షితిలో;
నఱ్ఱాడన విహరించుట
కఱ్ఱాడనఁగా చరించుటౌ మురవైరీ. 244

అఱ్ఱాఁక అన నిర్బంధము, పిధానము అగును. అఱ్ఱాడు అన విహరించుట, చరించుట పేరు.

పంచపాదిగీ. అలఁగనఁగను సంకోచించుటా శ్రమపడు
టాను శోకించుటా; మఱి యలయనంగ
జెల్లెను తరంగమునకు ప్రసిద్ధిదెల్పు
టకును సంబోధనము దెల్పుటకును పేరు
నలఁతి యాపాతమును సూక్ష్మ మల్పమగును. 245

అలఁగు అన సంకోచించుట, శ్రమపడుట, శోకించుట అగును, అల అన తరంగము ప్రసిద్ధిదెల్పుట, సంబోధనముదెల్పుట అగును. అలఁతి అన ఆపాతము. కేలిక, సూక్ష్మము, అల్పము అగును.

గీ. అలఁతయన బాధయగు శోకమా శ్రమమగు;
నలమనఁగ మేళనంబగు నాక్రమించు
టా పరిగ్రహించుటకు పేరౌను మఱియు
చెలఁగె నాలింగనము సేయుటలరి శౌరి. 246

అలఁత అన బాధ, శోకము, శ్రమము పేరు. అలము అన మేళనము, ఆక్రమించు, పరిగ్రహించు, ఆలింగనముసేయు, పేరు

క. అలరారు ప్రకాశించుట
కలరారన నంచితత్వ మగు నలయునన్
వెలసెను నిర్వేదించుట
కలరె శ్రమపడుటకు మాంద్య మగుచు మురారీ. 247

అలరారు అన ప్రకాశించుట అంచితత్వమునకు పేరు, అలయు అన నిర్వేదించుటకు శ్రమపడుటకు మాంద్యమునకు పేరు.

క. అలరన సంతోషించుట
కలరన సంతోషమునకు నగు పుష్పంబా
నలరన వికసించుటకా
నలరు ప్రకాశించునామ మలరె మురారీ. 248

అలరు అన సంతోషించుట, సంతోషము, పుష్పము, వికసించు, ప్రకాశించు, పేరగును.

క. అలరనగ పరిశ్రమమగు
బలమగు శ్రమమగును ధరణి నలవియనంగా
వెలసెను పరిమితశక్యము
నలవడు యుక్తమగు సిద్ధమభ్యాసంబౌ. 249

అలరు అన పరిశ్రమము, బలము, శ్రమము పేరు. అలవి అన పరిమితిశక్యమునకు పేరు. అలవడు అన యుక్తము, సిద్ధము, అభ్యాసము పేరు.

గీ. అలవరించన వహించు నభ్యసించు
సిద్ధపఱచు స్వాధీనముసేయు నయము
సేయుటయు నలంకారము సేయుటకగు
నలుగన తటాక శృంగాంత మాయుధంబు. 250

అలవరించు అన వహించు, అభ్యసించు, సిద్ధపరచు, స్వాధీనము సేయు, నయము సేయు, అలంకారము సేయు అలుగు ఆయుధము; మరగొమ్ము,

క. అసమన కీర్తియు దర్పం
బసమన ననురాగమియ్యో నవఘళమనగా
వెసనధికము వ్యాపనమౌ
నసలనగా మూలధనము నగుపంకంబౌ. 251

అసము అన కీర్తి, దర్పము, అనురాగము అగు. అవఘళము అన అధికము వ్యాపనము పేరు. అసలు అన మూలధనము, పంకము పేరు.

క. ఆఁకయన నిరోధనమౌ
నాకయనంగా నిషేధ మగుబంధనమౌ
నాకన చక్రాంబగు
నాకన లేఖయును పర్ణ మగుదనుజారీ 252

అక అన నిరోధము, నిషేధము, బంధనము పేరు. అక అన చక్రాకారము, (బండిగల్లు) రేఖ, పర్ణము పేరు.

ఆ. వె. ఆటయనఁగ నిందయగు క్రీడనర్తనం
బలరె నాటవెలదియన్న పద్య
భేదమునకు నటికి వేశ్యకు తెనుఁగున
పేర్లుజెల్లె సర్వభిత్తురంగ 253

ఆట నింద, క్రీడ, నర్తనము పేరు. ఆటవెలది అన పద్యభేదము, నటి, వేశ్య పేరు.

గీ. ఆటపట్టన వాసనాట్యస్థలంబు
లాదరువనంగ నాధార మాశ్రయంబు
నానవాలన లాంఛనంబగును తప్త
దుగ్ధములకౌను నామంబు దురితదూర. 254

ఆటపట్టు అన వాసస్థలము, నాట్యస్థలము పేరు. ఆనవాలు అన లాంఛనము, తప్తక్షీరముల పేరు.

క. వినుడానన స్పర్శయు స్వా
దనమును భుజియించుటయును ధరియించుట యా
మనియన వసంతఋతువా
మనియనఁగ సమృద్ధిపేరు మన్మథజనకా 255

ఆను అన స్పర్శ, ఆస్వాదనము, భుజించుట పేరు. ఆమని అన వసంతఋతువు, సమృద్ధి పేరు.

క. ఆరన లభియించుట పే
రారనగా రోమపంక్తి కగుపూరితమా
నారజము కలకలధ్వని
యారజమనగా మనోజ్ఞమగు మురవైరీ. 256

ఆరు అన లభించు, రోమపంక్తి, పూరితము పేరు. ఆఃజము అన కలకల ధ్వని, మనోజ్ఞము పేరు.

సీ. ఆర్వేరమన ద్వేషమగు కలహాంబగు
నారడి నిందకు వ్యర్థమునకు
నాఱునశించుటా నార్ద్రిహారంబున
కుపశమించుట పేరొప్పభువిని
అలియనంగను నాలియనగ హీన
మును దుష్టుండును మందమునఁ జెలంగు
నాలంబునా యుద్ధమౌ నుపేక్షకు జెల్లు
నాపె తాపంబు శ్వాసాఖ్యలేనరు
గీ. నించనంగ మనోజ్ఞమౌ నిక్షువౌను
మఱియు నిచ్ఛించుటకు పేరువఱలె నీంద్ర
యనఁగ నాస్ఫోటనంబునకౌను శల్య
సంధియంత్రంబునకుజెల్లు సారసాక్షు. 257

ఆర్వేరము అన ద్వేషము, కలహము పేరు. అఱు అన నశించుట, ఆర్ద్రి హారము, ఉపశమించుట పేరు. అలి నాలి అన హీనము, దుష్టుండు మందము పేరు. అలము అన యుద్ధము, ఉపేక్ష పేరు. అపె అన తాపము, శ్వాస పేరు. ఇంచు అన మనోజ్ఞము, ఇక్షువు, ఇచ్ఛ జెందుటకు పేరు. ఈంద్ర అన ఆస్ఫోటనము. శల్యసంధికి, అగును.

గీ. ఇచ్ఛయానందమిష్టమౌ నింపనంగ
నెసగె సూచనయును స్థాన మిక్కువనఁగ
నిచ్ఛచిత్తం బభీష్టమౌ నిచ్ఛయనఁగ
కములు సంకట మిఱుకన సారసాక్షు. 258

ఇంపు అన ఇచ్ఛ, ఆనందము, ఇష్టము పేరు. ఇక్కువ అన సూచన, స్థానము అగును. ఇచ్చ అన ఇచ్ఛ, చిత్తము, అభీష్టము పేరు. ఇఱుకు అన క్రమము, సంకటము అగును.

క. ఇగురొత్తననను రక్తం
బిగురొత్తన పల్లవించు నిడుపన్నను బే
రగు నాస్ఫోటనమగుటకు
నగభరణా కుడ్యపార్శ్వ నామంబునకౌ.　　　259

ఇగురు అన అనురక్తము, పల్లవించు పేరగును. ఇడుపు అన ఆస్ఫోటనమగుటు; కుడ్యపార్శ్వమునకు పేరు.

క. ఇమ్మన ననుకూలము పా
యమ్మను స్పష్టంబుసుఖము నామూలము యు
క్తమ్ము విశాలమ్ము మనో
జ్ఞమ్మును స్థానంబుపేరు సారసనాభా.　　　260

ఇమ్ము అన అనుకూలము, ఉపాయము. స్పష్టము, సుఖము, ఆమూలము, యుక్తము, విశాలము, మనోజ్ఞము, స్థానము పేరు.

గీ, ఇముడు నిమిడిక యివి రెండుభుజావధీన
మైనదానికి బేరు బ్రాహ్మణుడు పక్షి
పరగ నిరుపుట్టువందురు పల్లవించు
రక్తమయమగు నిగురించు నుక్తి నిమిడె.　　　261

ఇముడు ఇమిడిక అన భుజావు అధీనమైన దానికి పేరు. ఇరుపుట్టువు అన ద్విజుడు, పక్షి అగు. ఇగురించు అన పల్లవించు, రక్తమయమగు పేరు.

గీ. వసుధ సిలువపడియన సుప్రవర్తనంబు
పరికపలీనత నామమహా మహినియీర

సంబు నీరసయనగ నీర్ష్యంబు ద్వేష
మలరు కోపంబు చెలఁగును జలజనేత్రి. 262

ఇలువడి అన సుప్రవర్తన, కులీనతపేరు. ఈరసము ఈరస అన ఈర్ష్యము, ద్వేషము, కోపము పేరగును.

సీ. ఈరు లి క్షయుస్వల్ప మీాడేఱనంగ సి
ద్ధించుటపేరు వర్ధిల్లుపేరె
బహువచనంబునఁ బడి యీాఱతాఱలు
వక్రంబు నిష్ఠురవాక్యములగు
ఈఱమియన కుంజమింక బాహుళ్యమా
ఈసనకోపమా నీర్ష్యమునకు
నగు నీసడించననగు నర్తనంబు కో
పించుటకు మఱినిందించుటలరు

గీ. నుంకువనగను సమ్మతి యుద్గమంబు
నుక్కుసనఁగ స్థైర్యమగు మృతినొందు పీడ
నంబయ స్సారముసగు శౌర్యంబు నుగ్గ
డించనఁగ వచియించు ధ్వనించుపేరు 263

ఈరు అన లిక్ష, అల్పముపేరు. ఈడేఱు అన సిద్ధించు, వర్ధిల్లు. ఈఱతాఱలు అన ని, బ, వక్రము, నిష్ఠురవచనము. ఈఱమి అన నికుంజము. బాహుళ్యము. ఈసు అన కోపము, ఈర్ష్యము పేరగును. ఈసడించు అన నర్తనము, కోపించు, నిందించుటకు పేరు. ఉంకువ అన సమ్మతి, ఉద్గమము. ఉక్కు అన స్థైర్యము, మృతినొందు, పీడనము, అయస్సారము, శౌర్యము. ఉగ్గడించు అన వచియించు, ధ్వనియించుపేరు.

క. ఉత్తలమన వ్యత్యాసం
బుత్తలమన క్షోభమునకు నొప్పునుత్వరయా
నుత్తలమన పరితాపం
బుత్తలపాటవియె పడుట కొప్పుమురారీ. 264

ఉత్తలను ఉత్తలపాటు అన వ్యత్యాసము, క్షోభము, త్వర, పరితాపము అగును.

సీ. ఉదిరిసువర్ణమా నుదిరితప్తంబగు
నుద్దిసమానమా నుద్దియమము
నుఱుము మేఘధ్వని యుఱుము హుంకారంబు
నురువు పరిహరించు నురువురూప
మబ్బన స్ఖాలించు టుబ్బసంతోష
మురలుసవించుట యురలుచ్యుతము
నుప్పరంబు పరిదిక్కుప్పరంబు గగన
మునికిస్థానంబయ్యె నునికిస్థితియు
గీ నుమ్మడియనంగ నవిభక్తముమ్మడియన
నియమమగు నురియాటనా నెగడెసంశ
యంబు నురియాట యాందోళనంబుపేరు
నుటిదియన స్థిరమునకయ్యె నురుదదృఢము 265

ఉదిరి అన సువర్ణము, తప్తము, ఉద్ది అన సమానము, యమము. ఉఱుము అన మేఘగర్జనము, హుంకారము. ఉరువు అన పరిహరించు, రూపము. ఉబ్బు అన స్ఖాలించు, సంతోషము. ఉరలు అన స్రవించు, చ్యుతమగు. ఉప్పరము అన ఉపరిదిశ, ఆకాశము. ఉనికి అన స్థానము, స్థితి. ఉమ్మడి అన అవిభక్తము, నియమము. ఉరియాట అన సంశయము, ఆందోళనము. ఉటిది అన స్థిరము, దృఢము.

క. ఊరియన నేపక్వమగుటకు
   పరితాపించుటకు కేశ పక్వంబునకున్
   మరియు చలించుట పేరగు
   నరవన నౌచిత్యమధిక ముచితంబునకౌ  266

ఊరియు అన పక్వము, పరితపించు, కేశపక్వము, చలించుటకు పేరు. ఊరవు అన ఔచిత్యము, అధికము, ఉచితముపేరు.

ఆ. వె. ఉలియుఁనన ధ్వనించు చలియించుఁ బూ నూష
   రము కృశత్వ మూషరంబుదనరి
   నూఱటయన నొప్పె నొయ్యన నాశ్వాస
   మునుసహాయమగుచు మునివిలోల  267

ఉలియు అన ధ్వనించు, చలించు అగును. ఊషరము అన కృశత్వము, ఊషరము. ఊఱట అన ఆశ్వాసము, సహాయముపేరు.

క. ఎకసక్కె మెక్కసక్కెము
   నెకసెక్కెంబివియు మూఁడునెసగ తెనుగునన్
   వికటవచన మవమానము
   వికటంబును వంచనకును వెలసి ముకుందా  268

ఎకసక్కెము ఎక్కసక్కెము ఎకసెక్కెము అన వికటవచనము, అవమానము, వికటము, వంచన, అగును.

క. ఎక్కనఁగ నతిశయించుట
   కెక్కన సిద్ధించు వార్ధి యిష్టంబును జె
   ల్లెక్కన పేరిణమునకౌ
   నెక్కటి యసహాయమునకు నేకంబునకౌ॥  269

క: ఏక్కుడనఁగ నారోహణ
మెక్కుడనఁ మార్పి యధిక మెసనుత్కృష్టం
బెక్కుడన వాహానంబగు
నెక్కంబన క్షేత్రిసేతు వేకము పేశా॥ 270

ఎక్కుడు అనఆరోహణను, మార్పి, అధికము, ఉత్కృష్టము, వాహనము పేరు. ఎక్కము అన క్షేత్రిను, సల్పసేతువు, ఏకము,(గనిమ.)

క. ఎగ్గన దూషణ దోషము
నెగ్గనగా నశుభ వాక్కు నెసన శుభంబౌ
నెగ్గన నపరాధంబగు
నెగ్గన నపకారమాను హేమసుచేలా॥ 271

ఎగ్గు అన దూషణ, దోషము, అశుభవాక్యము, అశుభము, అపరాధము అపకారము అగును.

క, ఎడయన స్థానముభేదము
నెడ యవకాశంబు సంధి హృదయము దూరం
బెడ వ్యవహారము విఘ్నం
బెడ నిర్ణయకాలమయ్యె నిభపతివరదా॥ 272

ఎడ అన స్థానము భేదము అవకాశము సంధి హృదయము దూరము వ్యవహారము విఘ్నము నిర్ణయకాలము పేరు.

సీ. వ్యత్యస్తమునకును వైషమ్యమునకు పె
రెడమదుగనజెల్లు నెడమనంగ
నవకాశమగు స్థానమగు నెడరనభగ్న
మగును భంగంబగు నాపదయగు

నెడలుననఁగ కనుబడఁ విసర్జించుట
విచ్ఛిన్నమగుటయు వికలమగుట
ఎత్తికొనుననంగ నెసగె వహించు య
త్నించుటయు నపహరించుటయ్యె
గీ. నలరె నెత్తనగా నుపాయము గ్రహించు
యుద్ధసన్నద్ధమును మరి యున్నతము వ
హించు ప్రుష్పసరము బ్రియత్నించుటకు వి
కారజనితంబునకు పేరు కలుషభంగ, 273

ఎడమడుగు అన వ్యత్యస్థము, వైషమ్యము పేరగు. ఎడము అన అవకాశము స్థానము. ఎడరు అన భగ్నము భంగము ఆపద అగు. ఎడలు అన విసర్జించు, విచ్ఛిన్నమగు, వికలమగు. ఎత్తికొను, అన వహించు, యత్నించు అపహరించు, ఎత్తు అన ఉపాయము గ్రహించు యుద్ధసన్నద్ధము ఉన్నతము వహించు ప్రుష్పసరము ప్రయత్నించు వికారజనితమునకు పేరు,

గీ. ఎత్తికోలన సంకల్ప మిలబ్రయత్న
మెదయనఁగ భయమును పశుబుతువు హృదయ
మయ్యె నెదురు పురోభాగమయ్యెను ప్రతి
వాదియౌ నన్యుఁడౌ హరి వాసుదేవ 274

ఎత్తికోలు అన సంకల్పము, ప్రయత్నము పేరు. ఎద అన భయము, పశుబుతువు, హృదయమునకు పేరు. ఎదురు అన పురోభాగము, ప్రతివాది అన్యుఁడు అగును.

క. ఎనయిక సామ్యము మేళన
మును మరియొద్దడి దరిద్రమునుశూన్యంబౌ
నెనయు నన సామ్యమగుటకు
నెనయుననఁగ మేళనమున కెసగెనుకుందా 275

ఎనయిక అన సామ్యము, మేళనము. ఎద్దడి అన దరిద్రము, శూన్యము పేరు. ఎనయు అన సామ్యమగుట, మేళనము పేరు.

గీ. ఎనిక నా గణనంబున కెనగె మఱియు
నగు చతుర్థంతుకర్మి కాహ్వాయము నెమ్మె
యన విలాసంబునగు మనోహరమగు నెర
యన నహారవ్యసన బలికాఖ్యశౌరి 276

ఎనిక అన గణనము, చతుర్థ్యంతకర్మి పేరు. ఎమ్మె అన విలాసము, మనోహరము పేరు. ఎర అన ఆహారము, వ్యసనము, బలి పేరగును.

క. ఎరగన నవతీర్ణత్వం
బెఱఁగనఁగ నమస్కరించు నెఱగన నివెయకా
నెరవన భేదం బన్యము
నెరవన యాచితకవస్తు వెసగె మురారీ 277

ఎరఁగు ఎఱఁగు అన అవతీర్ణత్వము, నమస్కరించు పేరు. ఎరవు అన భేదము, అన్యము, యాచితక వస్తువును పేరు.

క. ఎరగొను నన భ్రమిఁగుటకౌ
నెరగొను పరవశమగుటకు నెరియు తపింపౌ
నెరియు జ్వలించుట యెఱ్ఱయు
బరగెను కించులము రక్త వర్ణంబునకున్ 278

ఎరగొను అన భ్రమిఁగుట, పరవశము ... ఎరియు అన తపించు, జ్వలించు పేరు. ఎఱ్ఱ అన కించులము, రక్తవర్ణము పేరు.

క. ఎఱక భుజము పత్త్రంబగు
నెఱగొను నన కోపపడుట కెస నరుణత్వం
బెఱుకయు దైవజా వా
క్కెఱుకయు జ్యోత్స్నంబు జాన మెస చిహ్నంబౌ 279

ఎఱక అన భుజము, పక్షిం పక్షముపేరు. ఎఱఁగొను అన కోపపడుట, అరుణత్వముపేరు. ఎఱుక అన దైవజ్ఞావాక్కు, శోస్యము, జ్ఞానముచిహ్నము పేరు.

పంచపాది గీ. ఎలయనగ సాక్షియావనోత్కృష్ట మల్ప
మలరె నెలగోలనంగను కలకలంబు
ప్రాథమికము నగ్రి ప్రసరణము నగ్ర
గమనముగును వర్షాగ్ర నామమగు నెలమి
యన వికాసంబు సంతసమునకుపేరు 280

ఎలఅన సాక్షియావనోత్కృష్టము, అల్పమునకుపేరు. ఎలగోలు అనకలకలము, ప్రాథమికము, (మొదటిది,) అగ్రప్రసరణము, అగ్రగమనము, (ముందు నడచు,) వర్షాగ్రము, మొదటిచినుకులు అగును. ఎలమి అన వికాసము, సంతసము.

క. ఎలుఁగు స్వరము భల్లుకమా
నెలరుచునన నతిశయించు నెస వికసించౌ
నెలయునన ప్రవేశించుట
కెలయునన లభించుటగు నహీశ్వరశయనా 281

ఎలుఁగు అన స్వరము, భల్లుకము. విలరుచు అన అతిశయించు, వికసించు. ఎలయు అన ప్రవేశించు లభించు.

క. ఎల్ల సమస్తం బవధియు
నెల్లియనఁగ ఛత్రమయ్యె నేకవచనమం
దల్లన రేపట యనన
నల్లన నెసయనఁగ నధిక మత్యంతంబౌ 282

ఎల్ల అన సమస్తము, అవధి. ఎల్లి అన ఛత్రము, రేపుపేరు. ఎస అన్న అతిశయము, అత్యంతము.

క. ఎసకంబన నతిశయమగా
నెసకంబనగా విధము విజృంభణమునకా
నెసగన్గ నతిశయించుట
కెసగనగా నంచితత్వ మెసగె మురారీ  283

ఎసకము అన అతిశయము, విధము, విజృంభణమునకు పేరు. ఎసగు అన అతిశయించుట, అంచితత్వము.

క. ఎసరన నతిక్రమించుట
కెసరనన గు పచనజలము నేచుననగ బెం
పెసగె విజృంభించుటకుఁ
వసుధ నతిశయించుటకును వర్ధిల్లుటకుఁ  284

ఎసరు అన అతిక్రమించుట, పచన జలమునకు పేరు. ఏచు అన విజృంభించు, అతిశయించు.

గీ. ఏడ్తెఱ పరాక్రమంబు విజృంభణంబు
నతిశయమున కభిఖ్య యేదనగనా న
శించు శల్యంబు వర్ధిలసేయుట మఱి
యేపన నధికత్వమును విజృంభణంబు  285

ఏడ్తెఱ అన పరాక్రమము, విజృంభణము, అతిశయము. ఏదు అన నశించు, శల్యకము. వర్ధిలసేయు. ఏపు అన ఆధిక్యము, విజృంభణము.

క. ఏరాళమన నసంఖ్యం
బేరాళం బధికమునకు నేర్పడెభువి నే
పారు విజృంభించుట కే
పారు నతిశయించుటను భవగణభంగా  286

ఏరాళము అన అసంఖ్యము, అధికము. ఏపారు అన విజృంభించు, అతిశయించు.

గీ. మహిని యేమరుపా టకస్మాత్తునకును
వంచనకు పేరు జెల్లేవగించుననఁగ
నిందసేయుట కర్తన మొందుటకును
మఱిచ్యుతత్వంబునకుపేరు మదగజనక 287

ఏమరుపాటు అన అకస్మాత్తు, వంచనపేరు. ఏవగించు అన నింద సేయుటకు, అర్తనమొందుటకు, చ్యుతత్వమునకు పేరు.

గీ. ఏసయనఁగ వక్రమగును జృంభణమగు
నైదు పదిసేయుననిపల్కు నపజయము న
మస్కరించుటకును పేరు మరియు నొంజి
లియన దుఃఖంబునకు దుఃఖితయగుశౌరి 288

ఏస యన వక్రము, విజృంభణము పేరు. ఐదు పదిసేయు అన అపజయమునకు, నమస్కరించుటకు పేరు. ఒంజిలి అన దుఃఖము, దుఃఖితకు పేరు.

సీ. ఒందలియన దుఃఖమొప్పు దుఃఖితుడగు
నొక్కలి యుగ్రమా నుగ్రభావ
మొంటరికాడన నొప్పు శూరుడు క్రోధ
మొండన నన్యమై యొప్పు నేక
మొగ్గుప్రసారించు నుద్యమించుట కొగ్గ
మనగదానికి రూపమమర జెల్లె
యొజ్జనా యాజకుండొప్పె పురోహితుం
డొప్పె నుపాధ్యాయు డొప్పెనొచ్చె

గీ. మనగ నవమానమగు న్యూనమునకుజెల్లు
నొడబడిక నిబంధమునకు నొప్పె సమ్మ
తికగు నొడబడునన సమ్మతించుటయును
ఖ్యాల్యసంతోషమొందుటా కోమలాంగ 289

ఒందిలి అన దుఃఖము, దుఃఖితుడు అగు. ఒక్కళి అన ఉగ్రము; ఉగ్రభావము పేరు. ఒంటరికాఁడు అన శూరుడు, వరాహము పేరు. ఒండు అన అన్యము, ఏకమునకు పేరు. ఒగ్గు ఒగ్గము అన ప్రసారించు, ఉద్యమించు పేరు. ఒజ్జ అన యాజకునకు, పురోహితునకు, ఉపాధ్యాయునకు పేరు. ఒచ్చెము అన అవమానమునకు, న్యూనమునకు పేరు. ఒడఁబడిక అన నిబంధనమునకు, సమ్మతమునకు పేరు. ఒడఁబడు అన సమ్మతమగు అనుకూలమగు, సంతోషమొందుటకు పేరు.

క. ఒడగూడన సిద్ధించుట
కొడగూడనగా ప్రవేశమొందుట పేరౌ
నొడయుడన భర్తరాజగు
నొడయుడనగ రూపభేద మొందుటపేరౌ 290

ఒడగూడు అన సిద్ధించుటకు, ప్రవేశించుటకు పేరు. ఒడయుడు ఒడయుఁడు అన భర్తకు, రాజునకు పేరు

క. ఒడి పశుయోనియు నూర్వగు
నొడికట్టన మేఖలయగు నొగి యత్నించా
నొడికంబనగ నుపాయము
నొడికమన మనోజ్ఞమగును యుక్తంబునకౌ 291

ఒడి అన పశుయోనికి, ఊర్వ్యకు పేరు. ఒడికట్టు అన మేఖలకు, యత్నించుటకు పేరు. ఒడికము అన ఉపాయమునకు, మనోజ్ఞమునకు, యుక్తమునకు పేరు.

క. ఒడికారమన విజృంభణ
మొడికారంబనగనొప్పు నుత్సాహంబై
రొడుసుపన లక్ష్యైతలంఘన
మొడుసుపన లాభంబుపేరు నుద్యమమునకౌ 292

ఒడికారము అన విజృంభణము, ఉత్సాహముపేరు. ఒడుపు అన లక్షీకృతము, లంఘనము, లాఘవము, ఉద్యమము పేరు.

గీ. ఒడ్డగిల్లన శీకరాద్యుద్గమంబు
నతిశయించుటకును నామమగును పార్శ్వ
నమ్రమునకయ్యె నొడియునసంగ నుద్గ
మంబు నాకర్షణించుటౌ నంబుజాక్ష! 293

ఒడ్డగిల్లు అన శీకరాది ఉద్గమము, అతిశయించుట, పార్శ్వనమ్రము పేరు, ఒడియు అన ఉద్గమము, ఆకర్షణించుటకు పేరు.

క. ఒడ్డనమన వ్యూహంబగు
నొడ్డనమన ఖేటకమును నొప్పు పణంబౌ
నొడ్డాణమనగ మేఖల
యొడ్డాణము యోగపట్టె యొప్పు ముకుందా! 294

ఒడ్డనము అన వ్యూహము, ఖేటకము. పణము అన పందెము పేరు. ఒడ్డాణము అన మేఖల, యోగపట్టె పేరు.

గీ. ఒడ్డనగ తీరమును పణ ముద్యమంబు
నుద్యమించు నిరోధించు వ్యూహమన్యు
డౌ ప్రసారించు లంఘించు నధికము పణ
మిడుట వాగురయిడుటకౌ జడధిశయన. 295

ఒడ్డుఅన తీరము, పణము, పందెము, ఉద్యమము. ఉద్యమించు నిరోధించు, వ్యూహము, అన్యుడు, ప్రసారించు, లంఘించు, అధికము, పందెమిడుట, వాగురయిడుట పేరు.

గీ. ఒత్తిడియనంగ బాహుళ్యమొప్పు ఘర్ష
ణంబునమరు నొడ్డారంబనంగ ప్రతిఘ

టించు ద్వేషంబు పేరొత్తరించనంగ
నాక్రమించు నతిక్రమించయ్యె శౌరి 296

ఒత్తిడి అన బాహుళ్యము, ఘర్షణము. ఒడ్డారము అన ప్రతిఘటించు, ద్వేషము. ఒత్తరించు అన ఆక్రమించు, అతిక్రమించు పేరు.

క. ఘనమగుట కాక్రమణ ఘ
ర్షణ మృదుబాహుళ్యములకు శంఖాదిరవం
బున కాక్రమించునఖ ఘ
ర్షణమగు సాధించుటకగు రాయొత్తనగ 297

ఒత్తు అన ఘనగుటకు, ఆక్రమణ, ఘర్షణము, మృదువు, బాహుళ్యము, శంఖాదిరవము, ఆక్రమించు, నఖఘర్షణము, సాధించు పేరు.

క. ఒదరన నిందించుటకో
నొదరనగా సంభ్రమించు టొప్పు విజృంభిం
చొదవన నుపయోగించుట
కొదవన సిద్ధించుటకను యుక్తమగుటకో 298

ఒదరు అన నిందించుటకు సంభ్రమించుటకు విజృంభించుటకు పేరు. ఒదవు అన ఉపయోగించుటకు సిద్ధించుటకు యుక్తమగుటకు పేరు.

క. ఒనరిన సిద్ధించుటకో
ననుకూలించుట మనోజ్ఞమగా సమ్మతి క
య్యెను మఱి యొదవు సమృద్ధం
బును వ్యాపించుటకుఁ జెల్లు బుధనుతిచరణా. 299

ఒదరు అన సిద్ధించుటకు అనుకూలించుటకు మనోజ్ఞమునకు సమ్మతికి పేరు, ఒదుపు అన సమృద్ధము వ్యాపించుటకు పేరు.

క. ఒప్పిదమన సుందరమౌ
నొప్పిదమనగా మనోజ్ఞ మొప్పు విధంబౌ
నొప్పమియన నశుభంబౌ
నొప్పమియన దోషమునకు నొప్పు మురారీ. 300

ఒప్పిదము అన సుందరము మనోజ్ఞము విధమునకు పేరు. ఒప్పమి అన అశుభము దోషముపేరు.

క. ఒప్పనఁగ నంచితత్వం
బొప్పనగా సమ్మతించు టొప్పననుకూలిం
చొప్పన సమ్మతి సుందర
మొప్పన నిర్దోషమునకు నొప్పుముకుందా 301

ఒప్పు అన అంచితత్వము, సమ్మతించు. అనుకూలించు. సమ్మతి, దరము, నిర్దోషమునకుపేరు.

క. ఒరయుననఁగ నన్వేషిం
చొరయు విచారించు టాఖ్య యొప్పు పరీక్షిం
చొరయును ఘర్షించుటకౌ
నొర స్వర్ణపరీక్ష సామ్య మొప్పు మురారీ 302

ఒరయు అన అన్వేషించు, విచారించు, పరీక్షించు, ఘర్షించుపేరు. ఒర అన స్వర్ణపరీక్ష, సామ్యమునకుపేరు.

క. ఒఱపన సౌందర్యంబౌ
నొఱపనగ సహాయమునకు యోగ్యంబునకౌ
నొఱపన స్థయిర్యము దృఢమౌ
నొఱపు ప్రతాపంబు తాపమొప్పు మురారీ 303

ఒగఘు అన సౌందర్యము, ఉపాయము, యోగ్యము, స్థైర్యము, దృఢము, ప్రతాపము, తాపము పేరు.

క. ఒఱయన ప్రత్యాకారం
బొఱయన నిచోళంబుపేరు నొఱకము గర్తం
బొఱకము సంకటమునకొ
నొఱగడ్డము సంకటంబు నొప్పవిషమునా 404

ఒఱ యన ప్రత్యాకారము, నిచోళము పేరు. ఒఱకము అన గర్తము సంకటము పేరు. ఒఱగడ్డము అన సంకటము, విషమము పేరు

గీ. ఒఱ్ఱ వక్రింబు సుకతయా నొలయునన ల
భించు వ్యాపించుటకు ప్రవేశించుటకు స
మానమగుట ప్రదక్షించు నూటలొప్పు
మఱియు ననుకూలమునకొను మదనజనక 405

ఒఱ్ఱ అన వక్రము, సుకతఱవు పేరు ఒలయు అవలంభించు వ్యాపించు ప్రవేశించు సమానమగుట ప్రదక్షించుట అనుకూలమునకు పేరు.

క. ఒలుకన వ్యాపించుటకొ
నొలుకనగను పతనమగుట కొప్పు స్రవించా
నొళువన వీణాదండం
బొళువన మర్మం బధీనమ్ములయును శౌరీ 406

ఒలుకు అన వ్యాపించుటకు పతనమగుటకు స్రవించుటకు పేరు. ఒళువు అన వీణాదండము మర్మము ఆధీనము పేరు.

గీ. ఒల్లబోవన మూర్ఛిల్లు టొప్పు మ్లాన
మగుటకయ్యె ననాదరమా నొసంగన

దానమిడుటకు బహుమాన త్యాగములకు
దగు నొసపరి యుత్కృష్ట సౌందర్యులకును 307

ఒల్లఁబోవు అన మూర్ఛిల్లుటకు, మ్లానమగుటకు అనాదరమగుటకు పేరు. ఒసఁగు అన దానమిడుటకు బహుమానమునకు త్యాగమునకు పేరు. ఒసపరి అన ఉత్కృష్టగుణకలదికలవాడు సుందరి సుందరుడు.

క. ఓజయన క్రమము నాజ్ఞయు
నోజ యుపాధ్యాయుడయ్యె నుత్సాహంబా
నోజ స్వభావము భయమగు
నోజయనఁగ విధముపేర హాహా శ్రీరమణా 308

ఓజ అన క్రమము ఆజ్ఞ ఉపాధ్యాయుడు ఉత్సాహము స్వభావము భయము విధము పేరు.

గీ. ఓటమి భయంబు భంగమా నోటయనఁగ
నౌను సంకోచమున నుభయంబునకును
పేరుమరి యోడిగిల్లన వెలసెను ప్రవ
హించగును స్రవించగు ప్రధావించుటగును 309

ఓటమి అన భయము భంగము పేరు. ఓట అన సంకోచము భయము పేరు. ఓడిగిల్లు అన ప్రవహించు, స్రవించు ప్రధావించు పేరు.

క. ఓడన సంకోచించుట
కోడుభయము వపజయత్వ మొందు ప్రధావిం
చోడు ఘటధార పేరోన
గూ డోపికయనఁగ క్షమకగును శక్తికగుణా 310

ఓడు అన సంకోచించు భయము పడు అపజయత్వము ప్రధావించు; కుండలోనగునవాటిచిల్లికి పేరు. ఓపిక అన క్షమకు శక్తికి పేరు.

గీ. ఓలలాడన నోలాడు నోలలార్చు
నఁగ జెల్లెను మగ్నత్వమునుప్లవంతి
యోలియన క్రమమును శుల్క మోవరియన
చంద్రశాలయు గర్భకోష్టంబునమరి 311

ఓలలాడు
ఓలాడు } అన మగ్నత్వము ప్లవంతికి పేరు.
ఓలలార్చు

ఓలి అన క్రమము శుల్కము పేరు. ఓవరి అన చంద్రశాలకు గర్భకోష్టము నకు పేరు.

క. జటజాక్షా బహువచనం
బొలసి శుభాశుభములగును యుక్తాయుక్తం
బులు సంపద్దారిద్ర్యం
బులునగు నోగాములనగ పుణ్యచరిత్రా 312

ఓగాములు అన శుభాశుభములకు యుక్తాయుక్తములకు సంపద్దారిద్ర్యములకు పేరు.

క. కందన నశితం బశితం
బొందుననుటకును తపించుటొప్పను శిశువౌ
కందన పరితాపంబౌ
కందనికర శోభితాంగ గరుడతురంగా 313

కందు అన అశితము అశితమగుట తపించుట శిశువు పరితాపము నకు పేరు.

గీ. కందువయనంగ సాంకేతికంబు ఋతువు
సామ్య మేకాంతమును ప్రదేశంబు విధము

క్రమము సామర్థ్యమును చమత్కారమరాను
కక్కసము కఠినము బాధ కళకుజెల్లు 314

కందువ అన సానికేతికము. ఋజువు సామ్యము ఏకాంతము ప్రవేశము విధము. క్రమము సామర్థ్యము చమత్కారము పేరు. కక్కసము అన కఠినమునకు బాధకు కళకు పేరు.

క. కచ్చన గర్వమపేక్షయు
కచ్చన పుష్పదళ మక్షగమనత్వంబా
కచ్చన శేఖరమునకా
కచ్చడమన శకటమరాను కౌపీనంబా. 315

కచ్చు అన గర్వము అపేక్ష పుష్పదళము అక్షగమనము (సాకెల నడక) శేఖరము (సిగబంతి] పేరు. కచ్చడము అన శకటము కౌపీనము పేరు

గీ. ఆంధ్రమునను కక్ష్యాంబరమరాను కక్ష్య
యరాను కౌపీనమరా కచ్చయనగ భువిని
మించె కటకటంబడన కోపించుటకును
బాధపడుటకు భవనిశా పాళిహేళి 316

కచ్చ అన కక్ష్యాంతరము (కాశ్మి) కక్ష్య కౌపీనముపేరు కటకటబడుట అన కోపించుటకు బాధపడుటకుపేరు.

గీ. కట్టుకయనంగ మాంసవిక్రయుడు వేత్రి
హస్తుడా కటికియనంగ నధికమగును
సాంద్రమగు కట్ట బంధిత సమిధలకును
వఱలె సేతువు సంతాపవాక్కు శౌరి 317

కట్టిక కటిక మాంసవిక్రియుడు వేత్రహస్తుడు. కటికి అన ఆధి
కము సాంద్రము పేరు కట్ట కట్టా అన భారబంధితసమిధలు (కట్టెలమోపు)
సేతువు సంతాపవాక్కు తెల్పునది.

గీ. కట్టనఁగ యూపమును పశుగర్భభరము
బంధము నిబద్ధమగుట సంపాదనంబు
మితియు బద్ధించు బంధించు టతికె మఱియు
మించు నారోపణంబు నిర్మించుటయును 318

కట్టు అన యూపము పశుగర్భము భరము బంధము నిబద్ధమగుట
సంపాదనము మితి బద్ధించు బంధించు ఆరోపణము నిర్మించుటకు పేరు.

గీ. కట్టడయనంగ నియమప్రకారములకు
నమరె కట్టనమన బంధన ముపహార
మగును కట్టుముట్టన నిర్ణయము నివాస
భూమికగు శ్రీహృదంబుజ సీమధామ 319

కట్టడ అన నియమము ప్రకారము పేరు కట్టనము అన బంధనము ఉప
హారము పేరు కట్టుముట్టు అన నిర్ణయము వాసభూమికి పేరు

క. కడయన నంతం బంత్యము
కడయన దూరంబు దిక్కు కడ పార్శ్వంబౌ
కడయన సమీపమునకౌ
కడయన స్థానంబుదనరు కంసవిదారీ 320

కడ అన అంతము అంత్యము దూరము దిక్కు పార్శ్వము సమీ
పము స్థానమునకు పేరు

క. కడచుననఁ నుత్తరించుట
కడచునన గతించుట కధికంబు మృతించౌ

కడచన నతిక్రమించుట
కడచునన నశించుశాను కరివరవరదా 321

కడచు అన ఉత్తరించు గలించు అధికము వ్యతించు అతిక్రమించు నశించుటకుపేరు.

క. కడచనునన మరణించుట
కడచను నశియించుటయును కడచను లంఘిం
చుటను సమాప్తమగుట కగు
కడమయన్ శేషమనాను కడున్యాసంబా 322

కడచను అన మరణించు నశియించు లంఘించు సమాప్తమగుటపేరు కడమ అన శేషము న్యూనముపేరు.

క. కడపన కాలహారణమగు
కడపన మృతిపనియు చోదకత్వము జెల్లన్
కడముట్టన సిద్ధించుట
కడముట్టనగా సమాప్తకంబగుశౌరీ 323

కడపు అన కాలహారణము మృతింపసేయు చోదకత్వము పేరు కడముట్టు అన సిద్ధించు సమాప్తముపేరు.

గీ. మహిని కడతేఱనంగ సమాప్తమగుట
కొను మరణించు నశియించుశాను కడలు
కొనుననంగను వ్యాపించు టుల్బణమగుటకు
నా నతిశయించుటకు దనరారశౌరి 324

క. కడిఁదియన నశక్యంబౌ
కడిఁది యధిక మాపదయగు కఠినత్వముగన్
కడిమియన నతిశయంబగు
కడిమియు నాధిక్యము ప్రియకద్రుమమునకౌ. 325

కడిది అన అశక్యము అధికము ఆపద కఠినత్వము పేరు. కడిమి అన అతిశయము ఆధిక్యము ప్రియకద్రుమము (కడపచెట్టు) పేరు.

సీ. కదురు తంతువు యంత్రకంటకంబగు విజృం
భించు సిద్ధించు త్సహించుబోను
కనలనంగను కోపమునకు కోపించుట
కును జ్వలించుటకు జ్వలనమున కగు
కదలికయన యత్నమొదవె చలనమగు
కతనన చిహ్నమౌ కారణమగు
కనరనంగను హితమును తువరము జెల్లు
కనికరంబనఁగ శోకంబు కరుణ

గీ. కనువనంగ దృష్టించుట దనరె విదిత
మగుట ప్రసవించుటొప్పె నిక్ష్వాదిపర్వ
నేత్రమగును ప్రాపించుటౌ నేత్రమగును
తెనుఁగునందున మానిహృద్వనజమిత్ర. 326

కదురు అన తంతువు యంత్రకంటకము విజృంభించు సిద్ధించు ఉత్సహించు పేరు. కనలు అన కోపమునకు కోపించుటకు జ్వలించుటకు జ్వలనమునకు పేరు. కదలిక అన యత్నము చలనము పేరు. కతము అన చిహ్నము కారణము పేరు. కనరు అన హితము' తువరము పేరు. కనికరము అన శోకము కరుణ పేరు. కను అన దృష్టించు విదితము ప్రసవించు ఇక్ష్వాది పర్వనేత్రము ప్రాపించు నేత్రమునకు పేరు.

గీ. దృష్టిదోషంబునకు మఱిదృష్టికిఁ గను
బాటుజెల్లెను ఖండించు భంగపఱచు
బా కనుపుగొట్టనంగ కన్నాకు ముఖ్యు
డౌను తాంబూలముఖపత్రిమాను శౌగి. 327

కనుబాటు అన దృష్టిదోషమునకు దృష్టికిపేరు. కనుపుగొట్టు అన ఖండించు భంగపఱచు పేరు. కన్నాకు అన ముఖ్యునకు తాంబూలముఖపత్రమునకు పేరు.

గీ. కన్నునగ నేత్రమగు చంద్రకంబు దృష్టి
జాలనేత్రంబగును రథచక్రమగును
మర్దలముఖంబు సూచన మఱియుఁబర్వ
నేత్రిమునకు నభిఖ్యయా నీలవర్ణ. 328

కన్ను అన నేత్రము చంద్రకము దృష్టి జాలనేత్రము రథచక్రము, మర్దళముఖము సూచన (జాడ) పర్వనేత్రము పేరు.

క. కన్నెయన నూతనంబా
కన్నెయన కనిష్ఠమగును కన్యక పేరౌ
కన్నెయు షష్ఠకరాశియు
కన్నెయనం దనయయాను కామిని పేరౌ. 329

కన్నె అన నూతనమునకు కనిష్ఠమునకు కన్యకకు షష్ఠకరాశికి తనయకును కామినికిపేరు.

క. కప్పన దంతక్షతములు
కప్పన ఛాదనము నంధకార మసితియౌ
కప్పెర భిక్షాపాత్రయు
కప్పెరయు కపాలమౌను కందనిభాంగా. 330

సీ. కమరనఁగ దహింపు కటిసూత్రమగు నింక
దహితదుర్వాసన దనరె భువిని
కముచన గబళించు గ్రహించుటౌ కమ
లన తపించుటకు దహనమగుటకు
కమ్మయనంగను కర్ణభూషణమగు
పత్రిక మధురంబు పరిమళమగు
కమ్మరియన లోహకారుడు బాణకా
రుడు కరకర ద్వేషక్రూరములగు
గీ. కరయనఁగ తీవ్రమౌను తీక్ష్ణంబగు కరి
యన నిదర్శనమును సాక్షి యవిధికి వి
సిలె కరాళించుననఁగ హేషించు నింద
సేయుటకు సింహనాదంబు సేయుటకగు. 331

కమర అన దహింపు కటిసూత్రము దహితదుర్వాసనకు పేరు. కముచు అన కబళించు గ్రహించు పేరు. కమలు అన తపించు దహనమగు పేరు. కమ్మ అన కర్ణభూషణము పత్రిక మధురము పరిమళము పేరు. కమ్మరి అన లోహకారుడు బాణకారునిపేరు. కరకర అన ద్వేషము క్రూరము పేరు. కర అన తీవ్రము తీక్ష్ణమునకు పేరు. కరి అన నిదర్శనమునకు సాక్షికి అవిధికి పేరు. కరాళించు అన హేషించు నిందసేయు సింహనాదము సేయుటకు పేరు.

గీ. కఱకిన బరుషవచనమౌ కఠినమౌను
కఱచుననఁగను దష్టంబువఱ లెనభ్య
సించుటౌ కఱతయన దుశ్చేష్టచేష్ట
కఱి యనసితి పశుయోనికో కంధరాంగ. 332

కఱకు అన పరుషవచనము కఠినము పేరు. కఱచు అన దష్టము అభ్యసించుటకు పేరు. కఱత అన దుశ్చేష్ట చేష్టకు పేరు. కఱి అన అసితికి పశుయోనికి పేరు.

క. తృణగేహా గోపనమితికి
పేనుత్రాడాంబునకు కఱవు పేనగాను దుర్బో
ధనమునకును బోధించుట
కును కఱపన జెల్లె కలుష కుంజరసింహా. 333

కఱవు అన తృణగేహానమితికి [యిండ్లుకప్పెడుపలక] త్రాడును పేరు. కఱపు అన దుర్బోధనము బోధించుటకు పేరు.

గీ. కత్తి యసితంబు దండంబు కత్తియనగ
నర్జునుండగు నీలాంగుడౌను కలను
నాగ కలనన ఖలము స్థానంబు యుద్ధ
మౌ కలపతాలువన శూద్రుడగు బలుడగు. 334

కత్తి అన అసితము దండము పేరు. కత్తి అన అర్జునుడు నీలాంగుని పేరు. కలకు కలను అన ఖలము స్థానము యుద్ధము పేరు. కలపతాల్వు అన శూద్రునికి బలునకు పేరు.

ఆ.వె. కలము ద్వాదశాఢక ప్రమాణంబు లే
ఖని తరియగును కలగొనుననంగ
నౌను క్షోభమొందుటౌను వ్యాపించుటౌ
కలుగనంగ రంధ్రములరె గుహాము. 335

కలము అన ద్వాదశాఢకప్రమాణము లేఖిని తరి (ఓడ) పేరు. కలగొను అన క్షోభమొందుట వ్యాపించుట పేరు కలుగు అన రంధ్రము గుహ పేరు.

క. కలవరము చింత క్షోభము
కలికి మనోజ్ఞంబు వనితకలవాడనగా
నిల ధనవంతుం డాప్తుం
డలరె మఱియు శక్తుడగుచు హాటకచేలా. 336

కలవరము అన చింత క్షోభము పేరు. కలికి అన మనోజ్ఞమునకు వనితకు పేరు. కలవాడు అన ధనవంతుడు అప్తుడు శక్తునకు పేరు.

క. కల్లన రథచక్రంబగు
కల్లన పాషాణమగును కల్లనసురయా
కల్ల యసత్యము వంచన
కల్ల పరుషవాక్కు దోషగణమౌ శౌరీ. 337

కల్లు అన రథచక్రము పాషాణము సురకు పేరు. కల్ల అన అసత్యము వంచన పరుషవాక్యము దోషము పేరు.

గీ. కలుచయన క్షోభమగు దోషగణము కోప
మలరు గల్లరియన దోషుడౌ నసత్య
వాదియగు దుష్టునకుపేరు వఱలె కవయ
నంగ మిథునంబు యమళంబు రంగదంగ. 338

కలుచ అన క్షోభమునకు గోషమునకు కోపమునకుపేరు. కల్ల అన దోషునకు అసత్యవాదికి దుష్టునకు పేరు. కవ అన మిథునము యమళము పేరు.

గీ. కవ్వనఁగ కబళించుకు గలిగె పేరు
నపహరించుటకౌ కసటనఁగ కలుష
మౌను మాలిన్యమౌ కసరన చలించు
కోపగించను జంఝయా కోపమగును. 339

కవ్వ అన కబళించు అపహరించు పేరు. కసటు అన కలుషము మాలిన్యము పేరు. కసరు అన చలించు కోపగించు జంఝా(మారుతము) కోపము పేరు.

క. కసుగం దసితియు శిశువగు
కసియన కోపంబు నిచ్ఛ కండూతికగుఁ
కసుగం దధికమ్లానం
బెసగౌ మఱికలపించు పేరు విపతితురంగా. 340

కసుగందు అన అసితి శిశువు పేరు. కసి అన కోపము ఇచ్ఛ కండూతికి పేరు. కసుగందు అన అతిమ్లానము తపించు పేరు.

సీ. కసిమసగనగను ఖండించు మరణ మొం
దించుటకగు విజృంభించుటౌను
కస్తురిపట్టెలు కళుకొత్తి పుష్పవి
శేషమై ధాన్యవిశేషమగుచు
కళయన మూర్ఛయౌ దళమౌను కాంతాళి
మెసగె నక్షమమయ్యు నీర్ష్యయయ్యు
కాపన శూద్రుడౌ కాపురంబగు గృహ
స్థుండు కర్షకజీవితుండు నొప్పె
గీ. కళుకు పక్షివిశేషంబు కాంతి చూర్ణ
మౌను కాకన శూన్యమౌ వ్యర్థమౌను
మఱి తిరస్కారమునకు శ్రమంబునకగు
కానుపన ప్రసవము దృష్టికౌను శౌరి. 34

కసిమసగ అన ఖండించు మరణమొందించు విజృంభించుపేరు. కస్తురిపట్టెలు అన పుష్పవిశేషము ధాన్యవిశేషముపేరు. కళ అన మూర్ఛాస దళమునకుపేరు. కాంతాళము అన క్షమమునకు ఈర్ష్యకుపేరు. కాపు అన శూద్రునకు గాపురమునకు గృహస్థునకు కర్షకజీవితులకుపేరు. కళుకు అన పక్షివిశేషముకాంతి చూర్ణముపేరు. కాకు శూన్యమునకు వ్యర్థమునకు తిరస్కారమునకు శ్రమమునకుపేరు. కానుపు అన- ప్రసవము- దృష్టికిపేరు.

క. కాల మరణ్యము వర్షా
కాల మసితి క్షారవృత్తి కయు వృద్ధాస్యం
బౌలిగ కండూతియుగుఁ
వాలాయము కారనంగ వాసవవరదా. 43

కారు అన కాలము అరణ్యము వర్షాకాలము అసితి క్షారవృత్తిక వృద్ధాస్యము కండూతిపేరు.

గీ. కాలియనగ పరుషము కృషకము స్రవించు.
సాంద్ర మజ్ఞానము కలాదసాధనంబు
వ్యర్థమునకాఖ్య మఱి బహువచన మంట
సిల్లి యన్నృతంబునకుఁజెల్లె శేషశయన. 343

కాలి అన పరుషము కృషకము స్రవించు సాంద్రము అజ్ఞానము కలాదసాధనము వ్యర్థము బహువచనము అన్నృతవాక్యములకు పేరు

గీ. కార్తెయన సూర్యయుక్త నక్షత్రమునకు
పేరగును మఱి కృత్తికానారయుగును
కాలనంగ చతుర్థభాగంబు పదము
దగ్ధమునకౌను దనుజవిదారి శౌరి. 344

కార్తె అన సూర్యయుక్తనక్షత్రము కృత్తికానక్షత్రము పేరు. కాలు అన చతుర్థభాగము పాదము దగ్ధమునకు పేరు.

గీ. అవసకి కింకిరినా కోప మర్తనంబు
కిటుకు కపటంబు మర్మంబు కిసరన శిశు
రోగభేదంబు కోపస్వరూపమౌను
కినియు కోపించు సామీప్యమునకుఁజెల్లు. 345

కింకిరి అన కోపము అర్తనము పేరు. కిటుకు అన కపటము మర్మము పేరు. కిసరు అన శిశురోగభేదము కోపరూపము పేరు. కినియు అన కోపించు సామీప్యము పేరు.

గీ. కీడనగ దోష మశుభంబు కిల్బిషంబు
దుష్ట మధమంబునకు పేరు దోచె కీలు
తనరె మర్మ ముపాయసూత్రంబులకును
తూలికకు చామరమునకు తోచె కుంచె. 346

కీడు అన దోషము అశుభము కిల్బిషము దుష్టము అధమము పేరు. కీలు అన మర్మము ఉపాయము సూత్రము పేరు. కుంచె అన తూలిక చామరము పేరు.

గీ. కుంటుపడుననగను మునుకొని నశించు
పంగువగు క్షీణమగు పేరబరగ కుందు
నాగ దుఃఖించు దుఃఖంబునకును శోక
మునకు క్షీణించుటకుఁజెల్లె దనుజవైరి. 347

కుంటుపడు అన నశించుటకు పంగువగుటకు క్షీణమగుటకు పేరు. కుందు అన దుఃఖించు దుఃఖము శోకము క్షీణించుటకు పేరు.

గీ. కుదిరిక యనంగ స్థైర్యానుకూల్యమునకు
నొదవె మతి మనఃపూర్తికా కుదియుననగ
జెల్లు క్షీణించుటకు నివర్తిలుట కుప్ప
సంబనగ కంచుకము కవచంబు శౌరి. 348

కుదిరిక అన స్థైర్యము అనుకూల్యము మనఃపూర్తికి పేరు. కుదియు అన క్షీణించుటకు వతిల లుటకు పేరు. కుప్పసము [కూసము] అన కంచుకము కవచము పేరు.

గీ. కుదురనగ స్థైర్యమున కానుకూల్యమునకు
స్వస్థమగుట కలాదవాసంతి యాల
వాలమునకు మనఃపూర్తి ప్రాపగు స్థిర
మగుటకాఖ్య వహించె సురారిమథన. 349

కుదురు అన స్థైర్యము అనుకూల్యము స్వస్థమగుట కలాదవాసంతి ఆలవాలము మనఃపూర్తి ప్రాపగు స్థిరమగు పేరు.

క. కురుచన కూర్చిక శ్యేనము
కురుజు గళిత పక్ష్మ పక్షి కుయ్యయనంగన్
ధర రక్షణ మార్తధ్వని
బరగెను కుఱ్ఱ మహానమగు బాలుడు సుతుండా. 350

కురుజు అన కూర్చిక [వెన్న] శ్యేనము గళితపక్ష్మపక్షి [ఈకెలు రాల్చినపిట్ట] పేరు. కుఱ్ఱ అన మహిషము బాలుఁడు సుతుని పేరు.

గీ. కులుకనంగ శృంగారంపు కుదులుటకును
లేపనంబును కంపించు వ్యాపనంబు
సేయుటకును విక్షేపించుటాయె నింక
వెలసె నిక్షిప్యమునకును వేదవేద్య. 351

కులుకు అన శృంగారపుకుదిలిక లేపనము కంపించు వ్యాపనము సేయుట విక్షేపించుట నిక్షిప్యము పేరు.

క. కుసుమయన కుసుంభసుమము
కుసుంభవర్ణమును వృత్త కులభేదంబా
వసుమతి బహువచనంబున
వెస ధాన్యవిశేష సస్య భేదంబులకా. 352

కుసుమ అన కుసుంభపుష్పము కుసుంభవర్ణము వృత్తవిశేషము బహు ధాన్యవిశేషము బహు సస్యవిశేషము

గీ. కుసుమమన నొప్పెను కుసుంభ కుసుమమునకు
దనరి బహువచనంబున ధాన్యభేద
మగుచు కూకటియన శిఖయౌను కాకి
పక్షమగును ప్రధానమా పంకజాక్ష. 353

కుసుమము అన కుసుంభపుష్పము బ॥ ధాన్యవిశేషము పేరు. కూకటి అన శిఖ కాకపక్షము ప్రధానము పేరు.

గీ. క్షితిని కూచియనంగ నైశిత్యము రణ
వాద్యమునకౌను కూరవ ప్రాప్యమగుట
కును లభించుట కొప్పెను కూటమియన
సంగతము సురతంబౌను సారసాక్ష. 354

కూచి అన నైశిత్యము రణవాద్యముపేరు. కూడు అన ప్రాప్యమునకు లభించుటకుపేరు. కూటమి అన సంగీతమునకు సంగతమునకు పేరు.

గీ. కూరుకన నిద్ర నిద్రించు కూలియనఁగ
భాగధేయంబునకుఁజెల్లు భరణమునకు
దవరు కూలన నొప్పు పతనమగుటకు
మఱి మృతించౌను మునిలోల మదనలీల. ౩౫౫

కూరుకు అన నిద్రకు నిద్రించుటకుపేరు. కూలి అన భాగధేయము (కప్పము) భరణముపేరు. కూలు అన పతనమగు మృతించుపేరు.

గీ. అరుణమయమౌను శోణిమంబగును పద్మ
రాగ మణిపేరగును కెంపునాఁగ నింక
మృతియొనర్చుటకును మఱి పతనమొనరు
చుటకు పేరౌను కెడపన సూరివరద. ౩౫౬

కెంపు అన అరుణమయము అరుణము పద్మరాగమణిపేరు. కెడపు అన పతనమగు మృతిఁ పసేయుపేరు.

గీ. అతిశయించు విజృంభించు నాగ్రహించు
సంభ్రమించు ప్లుతధ్వని సల్పుటకును
కెరలనంగను జెల్లును కెరలువొడచు
నన విజృంభించు వర్ధిల్లుదనరె శౌరి. 357

కెరలు అన అతిశయించు విజృంభించు ఆగ్రహించు సంభ్రమించు ప్లుతధ్వనిసల్పుటకుపేరు. కెరలువొడచు అన విజృంభించు వర్ధిల్లుపేరు.

క, కెలకన నమ్మాలించగు
కెలకన దిశపేరుజెల్లు కేకిసలన నం
జలులగును హాస్తతాడన
ములరెను కేలనఁగ కరము హస్తికరంబా, 358

కెలకు అన ఉన్మాలిమకు నిశకుపేరు. కేకిసలు అవ అంజాలు హస్త తాడనముపేరు. కేలు అన హస్తము హస్తికరముపేరు.

క, కేరుత్సహించుట తిర
స్కారము సేయుటకు పరిహాసనమున కొప్పెన్
కేరడ ముపేక్షయు తిర
స్కారంబును కుటిలవాకు . పారసనేత్రా.　　359

కేరు అన ఉత్సహించుట తిరస్కారముసేయుట పరిహాసముపేరు కేరడము అన ఉపేక్ష తిరస్కారము కుటిలవాక్యమునకుపేరు.

గీ. విధము సుందరంబును మదవిహ్వాలను వి
జృంభణమునకు కైపనజెల్లె నింద
పాపమానకును కొడిమెనా బరగె సంశ
యించగు నులినస్వేదమా కొంచనాగ,　　360

కైపు అన విధము సుందరము మదనవిహ్వాలను [లాహిరి] విజృంభణముపేరు. కొడిమె అన నిందకు హితమునకుపేరు. కొంచు అన సంశయించు నులినస్వేదమునకుపేరు.

క. కొంకనగ భయపడుటకొ
సంకోచించుట భయంబు సంకోచము ని
శ్శంకయు కొప్పున నున్నతి
యింక శిఖరమునకుజెల్లు నిభరాజసుతా.　　361

కొంకు అన భయపడు సంకోచించు భయము సంకోచము నిశ్శంక పేరు. కొప్పు అన ఉన్నతి శిఖరముపేరు.

గీ. కొడమనా మృగశిశువునకు నజడింభ
ముకును గును యౌవనారంభమునకు దృఢము
నకును కొదవన వ్యాపించుటకగు నతిశ
యించు జృంభించుటకు జెల్లు నింద్రవదన.　　362

కొదమ అన మృగశిశువు అజడింభము [ఆడుమేకపిల్ల] యౌవనారంభము దృఢమునకు పేరు. కొదరు అన వ్యాపించు అతిశయించు జృంభించు పేరు.

గీ. క్షితిని కొనియాడుననగను స్తుతికి నాద
రించుటకు జెల్లు నింక రక్షించుటకును
జెల్లు కొనసాగుననగ వర్ధిల్లుటకును
మఱియు సిద్ధించుటకునొప్పు మదనజనక. 363

కొనియాడు అన స్తుతికి ఆదరించుటకు రక్షించుటకు పేరు. కొనసాగు అన వర్ధిల్లు సిద్ధించు పేరు

గీ. కొప్పరంబన నంసమైయొప్పు శిఖర
మునకునగును విజృంభణమునకు జెల్లు
కొమ్ముకాడనఁగా వరాహమ్ము శృంగ
వాద్యుడగును కలాదుఁడా వాసుదేవ. 364

కొప్పరము అన అంసము శిఖరము విజృంభణము పేరు. కొమ్ముకాడు అన వరాహమునకు శృంగవాద్యునకు కలాదునకు పేరు.

క. కొమ్మన జలకేళీ శృం
గమ్మును శిఖరమ్ము సేన గజదంతం బం
తమ్మును శాఖయు నుత్సా
హమ్మునకగు వాద్యభేద మగు కరివరదా. 365

కొమ్ము అన జలకేళీశృంగము శిఖరము సేన గజదంతము అంతము శాఖ ఉత్సాహము వాద్యవిశేషము పేరు.

క. కొమ్మయన సాలశృంగము
కొమ్మయనఁగ స్త్రీకి శాఖకును కొఱయాన మ
త్స్యమ్మును శిల్పము నూత్నన

కొమ్మ అనఁ శాలశృంగము (కోటకొమ్మ) స్త్రీ శాఖల పేరు. కొఱ అనఁ మత్స్యము శిల్పము న్యూనత్వము ప్రయోజనము పేరు.

సీ. దుర్లక్ష్యమునకును దోషంబునకు నకా
ర్యమునకు కొఱగానియనఁగఁజెల్లె
మత్స్యవిశేషంబు మఱి బహువచనంబు
ననుకంగువును కొఱ్ఱయనఁగఁజెల్లె
స్థితమునకొను ప్రాప్తించుటకొ ప్రకా
శించుటకును కొఱలంచుఁజెల్లె
నాయుధభేదమై యలరెను దారువు
నకు నభిఖ్యకొఱడు నాఁగఁజెల్లు
గీ. కొలయనఁగ హింస పాపమా కొలదియనఁగ
పరిమితికి శక్యమునకొను మఱియు కొలికి
యనఁగ హారాంతబంధనమునకగు పరి
పాకమునకొను నేత్రాంతి భాగమగును. 367

కొఱగామి అన దుర్లక్ష్యము దోషము కార్యము పేరు. కొఱ్ఱ అన మత్స్యవిశేషమునకు బహువచనకంగువులకు పేరు. కొఱలు అన స్థితమునకు ప్రాప్తించుటకు ప్రకాశించుటకు పేరు, కొఱడు అన ఆయుధవిశేషము దారువు పేరు. కొల అన హింస పాపము పేరు, కొలది అన పరిమితికి శక్యమునకును పేరు, కొలకు అన హారాంతబంధమునకు పరిపాకమునకు నేత్రాంతము (కనుకొలికి) పేరు.

క. కొసరన సంకోచించఁగ
కొసరు విజృంభించు నిచ్ఛకును ప్రార్థనకొ
కొసరన ప్రార్థించుటకొ
కొసరన సంకోచమౌను కోమలదేహా. 368

గోసరు అన సంకోచించు విజృంభించు ఇచ్చు ప్రార్థన ప్రాథికాంను సంకోచము పేరు,

ఆ. వె. కోనయన నదృశ్యకుధర గహ్వారమాను
గోనమూహ మటవి కోణమంతి
మునకు దేవభేదమునకొను కోమనా
వల్మికాంతమాను వనితయాను. 369

కోన అన అదృశ్యగిరిగహ్వారంబు (మరుగువోనె) గోసమూహము అని కోణము అంతము దేశభేదము పేరు. కోమ అన వల్మీకాంతము వని తకు పేరు.

క. సమయంబు నిమిత్తమును వి
ధము పార్శ్వము సుందరంబు ధనురగ్రము నా
ట్యము తీరుపగును బహువచ
నమున నమస్కారమునకు నామము కోపా. 370

కోపు అన సమయము నిమిత్తము విధము పార్శ్వము సుందరము ధనురగ్రము నాట్యము తీర్పు బ॥ వ నమస్కారములకు పేరు,

గీ. కోవెలయన కోయిలయన కోకిలంబు
నమరి శ్రీరంగమనగ దేవాలయంబు
నౌను కోరగించనగను సంకురించు
మఱియు ముకుళించుటకుఁజెల్లు మదనమద న. 371

కోవెల కోయిల అన కోకిలము శ్రీరంగము దేవాలయము పేరు. కోరగించు అన అంకురించు ముకుళించు పేరు.

గీ. కోరయన కలశంబునకును పటమున
కాఖ్య కోఅడమన నపహాస్యమగును
బహువచనమున నపహాస్యవాక్యములకు
దనరె కోలనా బాణమూ దండమాను. 372

కోర అన కలశమునకు పటమునకును పేరు: కోఅడము అన అపహాస్యము బ॥వ॥ అపహాస్యవాక్యములకు పేరు. కోల అన బాణము దండము పేరు.

గీ. ఇలను కోల్కొను టన నుత్సహించుటకును
జెల్లు నారోగ్యమగుట వర్ధిల్లుటాను
కోల్పడఁగ క్షయించుటకును నశించు
టలరె దృశ్యమగుటకగు జలజనేత్రి. 373

కోల్కొను అన ఉత్సహించు ఆరోగ్యమగు వర్ధిల్లు పేరు: కోల్పడు అన క్షయించు నశించు దృశ్యమగు పేరు.

గీ. కౌ ననగ కటియగు లస్తకంబు పేరు
క్రంతయన సంధివీథికా రంధ్రము సభ
యగు వివాహప్రధాన ద్రవ్యంబు పేరు
క్రచ్చర యకల్మషంబు శీఘ్రంబు శౌరి, 374

కౌను అన కటి లస్తకము పేరు. క్రంత అన సంధివీథి రంధ్రము సభ వివాహప్రధానద్రవ్యము పేరు. క్రచ్చర అన అకల్మషము శీఘ్రము పేరు

క. క్రిందన ధ్వనియించుటకౌ
సందష్ట ముపద్రవంబు స్వనమునకును పె
రందె నధికంబు శోకం
బొందుటకు దయానిధాన యురగశయానా. 375

క్రిందు అన ధ్వనించు సందష్టము ఉపద్రవము స్వనము అధికము శోకించు పేరు.

గీ. క్రిన్నయన తదుపరికి శీఘ్రమునకు పున
రర్థమునకౌను క్రాలఁగ నౌను సంభ్ర
మించు ధ్వజచలనము సంచరించు వ్యాప
నమగు నతిశల్లుటకు జెల్లు నళిననాభ. 37౬

క్రన్నన అన తదుపరి శీఘ్రము పునరర్థము పేరు. క్రాలు అన సంభ్ర మించు ధ్వజచలనము సంచరించు వ్యాపించు వర్తిల్లు పేరు.

గీ. క్రుంకనంగ మగ్నంబునకును మృతించు
నస్తమించుటకగును క్రియ్యన కృశించు
టౌను సంకోచమగును క్రేపనగవత్స
మౌను గిరిశిఖరంబు క్రొను శౌరి. 377

క్రుంకు అన మగ్నము మృతించు అస్తమించు పేరు. క్రుయ్య అన కృశించు సంకోచమగు పేరు. క్రేపు అన వత్సము శిఖరము పేర్లు.

గీ. అవని క్రీడించుననిబల్కు నపసరిల్లు
టౌనలక్షించు టౌ క్రొత్తయన నవీన
మున కపూర్వంబునకును క్రొవ్వనగ ముదము
మరియు మేదస్సునకుజెల్లు మదనజనక. 378

క్రీడించు అన అపసరిల్లు అలక్షించు పేరు, క్రొత్త అన నవీనము అపూర్వము పేరు. క్రొవ్వు అన మదమునకు మేదస్సునకు పేరు.

గీ. అవని క్రోలన భుజియించు ననుభవించు
స్వాదనత్వంబు క్రోవినా వఱలె నాళ
మౌను కురవకమౌ మూషయౌను గంటి
యనగ దుఃఖంబు క్షితికి పేరౌముకుంద. 379

క్రోలు అన భుజియించు అనుభవించు స్వాదనత్వము పేరు. క్రోవి అన నాళమునకు కురవకమునకు మూషకు పేరు. గంటి అన దుఃఖమునకు క్షతమునకు పేరు.

గీ. గంటనగ కేశబంధంబు గ్రంథి క్షతము
పర్వమగు గండరంచనబరగె నుద్భ
వింపజేయుటకౌ నుద్భవించుటకును
గంతుకౌను మృతిసేయు లంఘనముసేయు. 380

గంటు అన కేశబంధము గ్రంథి క్షతము పచ్చి పేరు, గండరించు అన ఉద్భవింపసేయు ఉద్భవించు పేరు. గంతుకొను వృతిసేయు లంఘించు పేరు,

క. గండడుగన మరణించగు
గండడుగన శౌర్య హీనకము పేరొప్పెక
గండన పౌరుషమునకగు
గండన బలమగు పురుష మృగంబగు శౌరీ. 381

గండడుగు అన మరణించు శౌర్యహీనము. గండు అన పౌరుషము బలము పురుషమృగము.

గీ. గండ్రియన ఖండమునకు దీర్ఘంబునకును
వరలె ధృష్టునకును బహువచనమందు
పరుషవాక్యములగు గచ్చు పరగెకాంతి
కౌను లేప్యంబు న్యూనవాక్యంబు శౌరి. 382

గండ్ర అన ఖండమునకు దీర్ఘమునకు ధృష్టునకు బ-వ. పరుషవాక్యములకు పేరు. గచ్చు అన కాంతికి లేప్యమునకు న్యూనవాక్యమునకు పేరు.

గీ. గగ్గనంగను సంతోష గద్గదంబు
నకును సంకోచమును సేయుటకు గజిబిజి
యనంగ క్షోభకు సంకులమునకుఁజెల్లు
మఱియు జెల్లె ఛిందీచింది మదనజనక. 383

గగ్గు అన సంతోషగద్గదమునకు సంకోచించుటకు పేరు. గజిబిజి అన క్షోభకు సంకులమునకును ఛిందీచిందికి పేరు.

క. గడయనంగ లంబదండము
గడయన స్తంభమగు కూపకంబు గణంబా
గడుసన ధైర్య మసాధ్యము
గడుసన కాఠిన్యమగును కడుకుత్సితమౌ. 384

గడ అన లంబదండము స్తంభము కూపకము (ఓడకంబము) గణము పేరు. గడుసు అన ధైర్యము అసాధ్యము కాఠిన్యము కుత్సితము పేరు.

గీ. గడసనాఁగను స్తోత్రంబు గణనకగుచుఁ
దనరె సంపాదనముపేరు గణుతియనఁగ
గణన స్తోత్రంబగును గద్దెయనఁగ పీఠ
మౌను సింహాసనము వరాహాంకముద్ర. ౧౬౫

గడన అన స్తోత్రమునకు గణన (ఎన్నిక) సంపాదనమునకు పేరు, గణుతి అన గణన స్తోత్రముపేరు. గద్దెఅన పీఠము సింహాసనము వరాహాంక ముద్ర (వరహా) పేరు.

సీ. గనయంబనఁగ నీవి ధనురగ్రమునకౌను
గనియన గుహకును ఖనికిపేరు
గబ్బు దుర్గంధంబు గర్వంబగును గమ
కము యత్నమగు నధికమునకగును
గమికాడనంగ నిక్కముగ రాజునకు పే
రలరె ముఖ్యునకు సేనాధిపతికి
గరగనాఁగను స్వల్పఘటమౌను భృంగార
మగు గరితె సతి భార్యకును జెల్లు

గీ. గరువమన గౌరవమునకు గర్వమునకు
మఱి విశాలంబునకు జెల్లె గరుసనంగ
చర్మమునకును మర్యాద శర్కరిలము
బరగె గఱి శరపత్రమౌ పత్రమగును. ౧౬౬

గనయము అన నీవి ధనురగ్రముపేరు. గని అన గుహకు ఖనికి పేరు. గబ్బు అన దుర్గంధము గర్వముపేరు. గమకము అన యత్నము అధికముపేరు. గమికాఁడు అన రాజునకు ముఖ్యునకు సేనానాయకునకుపేరు. గరగ అన స్వల్పఘటము భృంగారముపేరు. గరిత అన సతికి భార్యకు

పేరు, గరువము అన గౌరవమునకు గర్వమునకు విశాలమునకు పేరు. గరుసు అన చర్మమునకు మర్యాద శర్కరిలకు పేరు. గఱిఅన శరపక్షము పక్షము పేరు.

గీ. గరువనఁగ శర్కరిలవౌను గండభాగ
మౌ గఱువయన నధికత్వ మధికునకగు
గసికనా బాణమగు శలాకకును గాము
నగ పిశాచంబు గ్రహమౌను నలినసనయన. 387

గరువు అన శర్కరిలము గండభాగము పేరు. గఱువ అన అధికత్వము అధికునకు పేరు. గసిక అన బాణము శలాక పేరు. గాము అన పిశాచము గ్రహమునకుఁ బేరు.

గీ. తనరె గాయకమన గూఢమునకు మర్మ
మునకు ననఁగుచును గావు పట్టన మృతింప
సేయుటకు మఱి నాశముసేయుటకగు
గాళకుఁడు ధీరుఁడును ప్రౌఢ నీలదేహ. 388

గాయకము అన గూఢమునకు మర్మమునకుఁ బేరు. గావుపట్టు అన మృతింపసేయు నాశముసేయు బేరు. గాళకుఁడు అన ధీరుడు ప్రౌఢుని పేరు.

గీ. బాధపడు శ్రమపడు కోపపడుటకిలను
గాసిలననొప్పె గిట్టనంగా నశించు
నవ మృతించ ననుకూలించుటౌను గీఁటు
నాఁగ దంత ఘట్టనమును నయనసంజ్ఞ. 389

గాసిలు అన బాధపడు శ్రమపడు కోపపడు పేరు. గిట్టు అన నశించు మృతించు అనుకూలించు పేరు. గీటు అనదంతఘట్టనము నయనసంజ్ఞ పేరు.

గీ. గుండ చూర్ణంబు వస్త్రంబు గుంపెనయన
వెలసెను విజృంభణంబును వృక్షభేద
మగుచు గుజరాతియనగ పేరౌను నాట్య
భేదమును ఘూర్జరంబగు వేదవేద్య. 390

గుండ అన చూర్ణము వస్త్రము పేరు, గుంపెన అన విజృంభణము వృత్తవిశేషము. గుజరాతి అన నాట్యభేదము సౌరాష్ట్రదేశము పేరు.

గీ. గుజ్జనఁగ వామనంబగు కుబ్జమగును
ఖర్వబుసభంబునకు పేరుగగ్గలై గుట్ట
నాఁగ రాశికి కుధరంబునకగును గుడు
సనఁగ వలయంబు పరివేషమగును శౌరి. 391

గుజ్జు అన వామనము ఖర్వబుసభము. గుట్ట అన రాశి పర్వతము. గుడుసు అన వలయము పరివేషము పేరు.

క. గుడియన వలయాకారము
గుడియన దేవాలయంబగును పరిధియగుఁ
గెడియన మృగయాసాధన
ముడరె సమీపంబునకు సురారి జితారీ. 392

గుడి అన వలయాకారము దేవాలయము పరిధి పేరు. గెడ అన మృగయాసాధనము సమీపము పేరు.

గీ. గుత్తియనఁగను గుల్ఫమగు గుచ్ఛమగును
గుదియనగ వనమాలికి గుచ్ఛమగును
గుబ్బయన స్త్రీశిరోభూష కుచము ఛత్ర
శిఖరమగు వర్తులత్వమగు శేషశయన. 393

గుత్తి అన గుల్ఫము గుచ్ఛమునను పేరు. గుది అన వనమాలిక గుచ్ఛమునకు పేరు. గుబ్బ అన స్త్రీశిరోభూషణమునకు కుచమునకు ఛత్రశిఖరమునకు వర్తులత్వమునకు పేరు.

గీ. ఇలను గుదిగొనుమనన నుత్సహించుటకును
సాంద్రమునకౌ గుఱియన లక్ష్యంబు నిర్ణ
యంబు చిహ్నంబు దృష్టాంతరంబు మఱియు
నమరె గుఱుతన చిహ్నమౌ నవధి యగును. 394

గుదిగొను అన ఉత్సహించుటకు సాంద్రమునకు పేరు. గుతి అన లక్ష్యమునకు నిర్ణయమునకు చిహ్నమునకు దృష్టాంతరమునకు మితికి పేరు. గురుతు అన చిహ్నమునకు అవధికి పేరు.

గీ. గూబయన కర్ణమూలమగా ఘూకమగును

గెంటనగ చలనము ప్రయోగించు నపస

రిల్లుట చలించుట యపసరిల్లసేయు

టౌను గొబ సంధి వీధియగా గుహకుజెల్లు. 395

గూబ అన కర్ణమూలమునకు ఘూకమునకు పేరు. గెంటు అన చలనమునకు ప్రయోగించుటకు అపసరిల్లుటకు చలించుటకు అపసరిల్లసేయుటకు పేరు. గొబ అన సంధికి వీధికి గుహకు పేరు.

గీ. గొడవన యాపద దోషంబు క్షోభమగును

దుఃఖమునకౌను గొట్టన దుష్టమునకు

కఠినము విరోధి గొడ్డ నాఁగను పరుషవ

చనము కాఠిన్యమునకౌను చక్రహస్త. 396

గొడవ అన ఆపదకు దోషమునకు క్షోభమునకు దుఃఖమునకు పేరు. గొట్టు అన దుష్టమునకు కఠినమునకు విరోధికి పేరు. గొడ్డ అన పరుషవచనమునకు కాఠిన్యమునకు పేరు.

గీ. ఇలను గొదకొను నన నుత్సహించుటగును

త్వరపడుటయు విజృంభించు వలెనె గొదక

యన మృగవిశేషమగు శరంబగును గోరు

నాఁగ నల్పంబునకుజెల్లు నఖమునకగు. 397

గొదకొను అన ఉత్సహించుటకును త్వరపడుటకును విజృంభించుటకును పేరు. గొదక అన మృగవిశేషమునకు శరమునకు పేరు. గోరు అన అల్పమునకు నఖమునకు పేరు.

క. గోసన నభిశాపంబౌ

గోసన నిందించు నిందకును దోషమునౌ

నీసరణి గ్రుక్కయనఁగ

శ్వాసము కబళించు టగును స్వారావ్వరదా. 398

గోసు అన అభిశాపమునకు నిందించుటకు నిందకు దోషమునకు పేరు. గ్రుక్క అన శ్వాసమిడునకు కబళించుటమునకు పేరు.

క. చిందన వ్యాపించుటకొ

చిందన పతనము గళితము చెలె గీతి ప్ర

బంధముగుఁ బహువచనం

బంచిన నర్తనముపేరు హాటకచేలా. 399

చిందు అన వ్యాపించుటకు పతనమునకు గళితమునకు గీతప్రబంధమునకు (బహు) నర్తనమునకు పేరు.

గీ. చిందఱయన రంధ్రంబు విజృంభణంబు

ఖండమునకు నభిఖ్య చిక్కనయనంగ

దనరె బాహుళ్యమునకు బలంబునకు సూక్ష్మ

మునకు దారుఢ్యమునకౌను వనజనాభ. 400

చిందఱ అన రంధ్రమునకు విజృంభణమునకు ఖండమునకు పేర్లు చిక్కన అన బాహుళ్యమునకు బలమునకు సూక్ష్మమునకు దారుఢ్యమునకు పేరు.

గీ. చిచ్చనఁగ నగ్ని తాపంబు చిట్టకమన

చెల్లుకపటంబు లీలయై చిట్లనంగ

మించె స్ఫోటించుటకు కోపగించుటకును

మఱియు వృత్తాంతమునకౌను మదనజనక. 401

చిచ్చు అన అగ్నికి తాపమునకు పేరు. చిట్టకము అన కపటమునకు లీలకు పేరు. చిట్లు స్ఫోటించుటకు కోపగించుటకు వృత్తాంతమునకు పేరు.

గి. అవని చిట్టాడనంగ వ్యత్యాసగమన

మా చలించుట క్రీడించుటౌనుసంచ

శించుటకుఁ బేరగును బ్రసవించుటౌను
చిడిపినా పరుషము సూక్ష్మమడరె శౌరి. 402

చిట్టాడు అన వ్యత్యాసగమనమునకు చలించుటకు క్రీడించుటకు సంచరించుటకు ప్రసరించుటకు పేరు. చిడిపి అన పరుషమునకు సూక్ష్మమునకు పేరు.

క. చిదుమన పుష్పచ్ఛేదము
చిదుము నఖక్షతముసేయు ఛేదించుటకౌ
చిదుమన ప్రక్షేపించుట
చిదుమన పల్లవముపేరు చిన్మయమూర్తీ. 403

చిదుము అన పుష్పచ్ఛేదమునకు నఖక్షతమునకు ఛేదించుటకు ప్రక్షేపించుటకు పల్లవమునకు పేరు.

గీ. చిత్తరువన నాశ్చర్యంబు చిత్రితంబు
చిన్నెనా లీలచిహ్నంబు చిన్నెనాఁగ
నెగడెను మనోజ్ఞమునకు కనిష్ఠమునకు
చొక్క చిలిపి నికృష్టమౌ సూక్ష్మమగును. 404

చిత్తరువు అన ఆశ్చర్యమునకు చిత్రితమునకు పేరు. చిన్నె అన లీలకు చిహ్నమునకు పేరు. చిన్ని అన మనోజ్ఞమునకు కనిష్ఠమునకు పేరు. చిలిపి అన నికృష్టమునకు సూక్ష్మమునకు పేరు.

క. చిల్కుకన మథించు ద్వార ని
గళమగు వ్యాపింపజేయు గళితమగుటకౌ
చిలుకన ప్రసరించుటకై
మెలఁగె శరమునకు నతిశమించుటకు హరీ. 405

చిలుకు అన మథించుటకు ద్వారనిగళమునకు వ్యాపింపసేయుటకు గళితమగుటకు ప్రసరించుటకు శరమునకు నతిక్రమించుటకు పేరు.

గీ. అవని చివుకన నిస్సార మయ్యెనుద్ద
మానుకరణంబగును చివ్వుయనఁగ కలహ

మగు తరుణశాఖకును నామమనురె చీద
రయున రంధ్ర ముపద్రవము యతివినుత 406

చవుకు అన నిస్సారమునకు ఉద్గమనామకరణమునకు పేరు. చివ్వ అన కలహమునకు తరుణశాఖకును పేరు. చీదఱ అన రంధ్రమునకు ఉపద్రవమునకు పేరు.

క. చీకన నంధత్వంబగు
చీకన నిస్సారమునకు చెల్లంధుండౌ
చీకాకన బలహీనము
చీకాకన శ్రమముపేరు చెలఁగె ముకుందా. 407

చీకు అన అంధత్వమునకు నిస్సారమునకు అంధునకు పేరు. చీకాకు అన బలహీనమునకు శ్రమమునకు పేరు.

క. చీరన నాహ్వానించు వి
దారించగు చెక్కన ఖచితత్వంబునకున్
బేరగు గండస్థలము వి
దారించుటకౌను పేరు దానవవైరీ. 408

చీరు అన ఆహ్వానించుటకు విదారించుటకు పేరు. చెక్కు అన ఖచితత్వమునకు గండభాగమునకు విదారించుటకు పేరు.

గీ. చెంగలించనగాను హసించు నతిశ
యించగును ప్రకాశించు జృంభించుటౌను
చెంగనంగను వాద్య విశేషమయ్యె
నపసరంబు సంకోచించు టంచలమగు. 409

చెంగలించు అన హసియించుటకు అతిశయించుటకు ప్రకాశించుటకు జృంభించుటకు పేరు. చెంగు అన వాద్యవిశేషమునకు అపసరమునకు సంకోచించుటకు అంచలమునకు పేరు.

గీ. ఒప్పు చెందిరికయన లేఖోత్తరలిపి
పత్రమునకు కుసుంభ పుష్పమునకాఖ్య
యలరె చెట్ట యశుభమును హస్తమగుచు
చెయ్యి హస్తంబు తుండంబు శేషశయన. 410

చెందిరిక అన (జాబులనుంచు లకోట) లేఖోత్తరలిపిపత్రమునకు కుసుంభపుష్పమునకు పేరు. చెట్ట అన అశుభమునకు హస్తమునకు పేరు. చెయ్యి అన హస్తమునకు తుండమునకు పేరు.

గీ. చెనఁటినా శూన్యమును కుత్సితము వ్యర్థ
మునకుఁజెల్లును చెడుననంగను నశించు
నభ్యవస్కంధమున కదృశ్యంబగుటకుఁ
దనరె చెన్నన విధము సుందరము శౌరి. 411

చెనఁటి అన శూన్యమునకు కుత్సితమునకు వ్యర్థమునకు పేరు. చెడు అన నశించు అభ్యవస్కందము అదృశ్యము పేరు. చెన్ను అన విధమునకు సుందరమునకు పేరు.

గీ, చెనకన ముఖాముఖియగుస్పర్శించుటకును
దనరె నింక నఖాదిక్షతంబు సేయు
టౌను మ చెఱలాడ నౌను సంచ
రించు విహరించుటయును వ్యాపించుటయును. 412

చెనకు అన ముఖాముఖియగుటకు స్పర్శించుటకు నఖాదిక్షతంబు సేయుటకు పేరు. చెరలాడు అన సంచరించుటకు విహరించుటకు వ్యాపించుటకు పేరు.

క. చెఱఁగన నంచలమునకగు
చెఱఁగనఁగా నగ్రిమునకు జెల్లుచు దిశకౌ
చెఱయన నిర్బంధమునకు
చెఱయన చెరశాలపేరు చిన్మయమూర్తీ. 413

చెఱఁగు అన అంచలమునకు అగ్రమునకు దిశకు పేరు. చెఱ అన నిర్బంధమునకు చెరశాలకు పేరు.

గీ. చెలఁగనఁగ సింహనాదంబు సేయుట వికసించు శబ్దించుటకు ప్రకాశించు నంచి
తత్వమగును సంతోషించు దనరె నింక
నుత్సహించుట కాఖ్యమై యొప్పె శౌరి. 414

చెలఁగు అన సింహనాదంబు సేయుటకు వికసించుటకు శబ్దించుటకు ప్రకాశించుటకు అంచితత్వమగుటకు సంతోషించుటకు ఉత్సహించుటకు పేరు.

గీ. చెలియనఁగ స్నేహితుండగు
చెలియనఁగా మిత్రురాలు స్త్రీకిని పేరౌ
చెలువుఁడన విటుఁడు ప్రియుఁడును
చెలువుండన సుందరునకు జెల్లెమురారీ. 415

చెలి అన స్నేహితునకు స్నేహితురాలునకు స్త్రీకి పేరు. చెలువుఁడు అన విటునకు సుందరునకు పేరు.

గీ. చేఁతయన కృత్రిమంబగు చేష్టయగును
చేగ ధైర్యంబు సారమౌ చేకొనన గ్ర
హించు మఱి యాదరించు జయించుపేరు
చేయి హస్తంబు కిరణంబు చెల్లె శౌరి. 416

చేఁత అన కృత్రిమమగునకు చేష్టకు పేరు. చేగ అన ధైర్యమునకు సారమునకు పేరు. చేకొను అన గ్రహించుటకు ఆదరించుటకు పేరు. చేయి అన హస్తమునకు కిరణమునకు పేరు.

క. పాణిగ్రహణముసేయుట
స్థానం బవలంబసంబు దనరి గ్రహింపౌ
మానక నవలంబించుట
శ్రీనాథ యనుగ్రహమగు చేపట్టనగా. 417

చేపట్టు అన పాణిగ్రహణమునకు స్థానమునకు అవలంబించుటకు గ్రహించుటకు అవలంబనమునను అనుగ్రహమునకును పేరు.

గీ. బాధపడుట చలించుట పరగ చేడ్ప
డనఁగ నొప్పును చేరిక యన సమీప
మునకు సమ్మేళనమునకు దనరె చేరు
గడ సమీపము శరణమై యడరె శౌరి. 418

చేడ్పడు అన బాధపడుటకు చలించుటకు పేరు, చేరిక అన సమీపమునకు సమ్మేళనమునకు పేరు. చేరుగడ అన సమీపమునకు శరణమునకు పేరు.

క. చేరనఁగ ప్రాప్తమగుటకు
చేరు సమీపంబు రశ్మి చెల్లు నిగళమా
చేరనగ సమీపించుట
చేరనగా హారమునకు జెల్లె ముకుందా. 419

చేరు అన ప్రాప్తమగుటకు సమీపమునకు రశ్మి (పగ్గము) నిగళమునకు సమీపించుటకు హారమునకు పేరు.

క. చందంబన విధమునకగు
ఛందస్సగు చందనంగ చంద్రుండగు నా
సుందరమగు యోగ్యంబగు
సుందరమైనదియుగు నుత సురమాసంబా 420

చందము అన విధమునకు ఛందస్సునకు పేరు. చందు అన చంద్రునకు సుందరమునకు యోగ్యమునకు సుందరమైనదానికి మాసమునకు పేరు.

గీ. చండి నా పార్వతికిని క్రూరుండు మూర్ఖ
మునకు జెల్లును చక్కఁ జేయుననఁగ సవ
రించగు సమాప్తియగును నశించుటకును
చట్టునా శిష్యుడౌను పాషాణమౌను. 421

చండి అన పార్వతికి క్రూరునకు మూర్ఖునకు పేరు, చక్కటేయుఁ అన సవరణపు సమాప్తికి సళించుటకు పేరు. చట్టు అన శిష్యునకు పాపాణ మునకు పేరు.

క. చక్కటియన న్యాయంబగు
చక్కటియన శరణమాను స్థానంబునకౌ
చక్కటి కార్యము యుక్తము
చక్కటియన నార్జవంబు సారసనేత్రా 422

చక్కటి యన న్యాయమునకు శరణమునకు స్థానమునకు కార్యమునకు యుక్తమునకు అర్జవమునకు పేరు.

సీ. చనువన నధికార మనురాగమగు నిచ్చ
చదురు నామర్థ్య మారసభయైల్లు
నునా గతించు గచ్ఛయు యుక్తమగు ప్రాప్తి
చఱపు నాచ్ఛాదమాస్ఫాలనంబు
చన్న నఁగేతకి స్తంభమా స్తనమగు
చవియన రుచియు రసంబునకును
చమరుననఁగ నాస్ఫాలించుటకుఁ బేరు
చెల్లును మరణింపఁ జేయుటకును
గీ. బరగుఁ జాగరగొనుననఁ బ్రిహారణంచు
మఱియు ఖండించుటాను చామయనఁ దరుణి
సస్యభేదం బసితికిని శ్యామకు నభి
ధానమొప్పెను భక్తసంత్రాణశీల. 423

చనువు అధికారము అనురాగము కోరిక; 2 చదురు= సామర్థ్యము సభ; 3 చను=గతించు పోవు యుక్తమగు ప్రాప్తి; 4 చఱపు= ఆచ్ఛాదము అస్ఫాలనము; 5 చన్ను= కేతకీస్తంభము స్తనము; 6 చవి= రుచి రసము

7 చమరు= ఆస్ఫాలించు మృతిజెందు; 8 చాగరిగొను= ప్రహరణించు ఖండించు, 9 చామ= తరుణి సస్యభేదము; (నలుపు)కాంతికిపేరు.

క. చాయయునన్ ఋజుభావము
ఛాయాదేవికిని దిశకు సామ్యము కాంతికిన్
ఛాయ సమీపము వర్ణము
పాయక విధమునకుఁజెల్లు భవగిరివజ్రీ. 424

చాయ= ఋజుభావము ఛాయాదేవి సామ్యము ప్రకాశము నీడ సమీపము వర్ణము [రంగు] విధము.

గీ. క్షితిని చుఱుకనఁగాను నైశిత్యమౌ ప్ర
తాపమగు నిల నుష్ణమైతనరె మఱి చౌ
కాయన్నఁగ స్వచ్ఛమైనది కంచుకంబు
వఱలె మోహంబు మూర్ఛయు పరవశమగు. 425

చుఱుకు= పదును ప్రతాపము ఉష్ణము. 2 చౌకా= స్వచ్ఛము కంచుకము మోహము మూర్ఛ పరవశము.

సీ. చొప్పడ నసమమగు లభించుటకుఁజెల్లు
చొరవనాఁ బుద్ధికుశలత మఱి ప్రవేశ
మగును చొఱయును చోఱ మత్స్యంబు బాలుఁ
డౌను చాఁగంటి శరభమౌ నగ్నికౌను. 426

చొప్పడు= లభించుట. 2 చొరవ= బుద్ధికుశలత ప్రవేశించుట 3 చొఱ, చోఱ= మత్స్యభేదము బాలుడు చాగంటి శరభము దిగంబరుడు

గీ. చాపసఁగ భావనత్వంబు చోదకంబు
బఱగె క్షోభింపసేయు క్షోభంబుజెల్లె
జియ్యనాగను భగవంతుడయ్యె రాజు
వఱలె జిల్గన సూక్ష్మమౌ వస్త్రమౌను. 427

1 చోపు = భావనత్వము (పరుగెత్తుట) చోదకము (తోలుట) క్షోభింపఁజేయు క్షోభము. 2 జియ్య = భగవంతుఁడు రాజు. 3 జిల్లు = సన్నని వస్త్రము.

గీ. జీసువాఱన గమనింపు జెల్లు సపస
రిల్లు వ్యాపించుటకు పేరు జెల్లు జంకు
నాఁగ భయము సంకోచంబునకు జడి యన
వర్షమగు నిరంతరమగు బాధకొను. 428

1 జీసువాఱు = గమనించుట పసరిల్లుట వ్యాపించుట 2 జంకు = భయము సంకోచము 3 జడి = వర్షము నిరంతరము బాధ.

క. జంపము మత్తికగుచ్ఛము
జంపన నాలస్యమగును ఝల్లరిపేరౌ
జంపన సూక్ష్మము జక్కిని
యిఁకొందగ మృతిచిరంటి యెసయక్షిణి సుమా. 429

1 జంపు = ముత్తెగులచేరు ఆలస్యము ఝల్లరి (డోలు) సూక్ష్మము 2 జక్కిని = మరణించినముత్తైదు యక్షస్త్రీ

క. జడియన నస పసరము భయ
పడుట ధ్వనించుటకు మఱి నివారించుటకౌ
జడిగొనన నతిశయించుట
జడిగొనన నిరంతరంబు సారసనాభా. 430

జడి = నసపెట్టుట పసరము భయపడు ధ్వనిచేయు ఆటంకపఱచుట 2 జడిగొను = అతిశయించు నిరంతరము.

గీ. జతయనఁగ యుగళంబగు సామ్యమగును
జలకమన నుదకంబగు స్నానమగును
జల్లినాఁగన నత్కంటు ఝల్లరియగు
చామరము కబరీచ్ఛద ఝల్లరియగు. 431

జత= జంట సామ్యము జలకము ఉదకము స్నానము 2 జల్లి= సాదృశ్యము పెద్దడోలు చామరము కబరీగ్భవ [కొప్పువల] ఝల్లం [జాలరి] పంచపాదిగీ. వెలసె జల్లించనం స్రవించుటకును

మఱియు శోధించుటకుఁ జెల్లె మహిం జవర

యన జవరన యన మృదువౌను ఋజువు

కలిగె జారియనంగ భృంగారమౌ క

మండలమునకు పేరగు మదనజనక. 432

జల్లించు= కాఱుట శోధించుట 2జవర (రూ) జవరు= మృదువు ఋజువు3జారి= భృంగారము కమండలువు.

గీ. వృధ్వి జాఱనగాఁ బ్రధావించు గళిత

మగుటకు స్రవించుటకు నామమమరె జాలు

నాఁగ జలకణ పంక్తికి నడికిఁ జెల్లు

జాలువన నల్లె జెల్లును సారసాక్ష. 433

జాఱు= జాఱిపడుట గళితము [తొలఁగుట) కాఱుట జాలు జాఱులు) =జలకణపంక్తి

గీ. అవని జావడమన భయం బశ్వమౌన

పౌరుషంబగు శ్యేనమై బరగె జడుగు

కుదిరె భయమున నొడుగు సంకోచమునకు

వఱలె గూఢస్థితికిఁ బేరు వాసుదేవ. 434

జావడము= భయము అశ్వము అపౌరుషము డేఁగ2 జడుగు కుదురు= భయముననొదుగుట సంకోచము గూఢముగనుండుట.

గీ. క్షితిని జున్నన నభినవక్షీరములకు

వఱలె మఱియు మధూత్పత్తి వాసమునకు

జూలనఁగ హరిమృగకేసరి పాళి పేరు

కలిగె మఱి కరిఘాదితకంబళంబు. 435

జున్ను = క్రొత్తగనీనిన పశువుపాలు తేనెతుట్టెలోని తేనెయుండు చోటు 2 జూలు = సింగముకేసరములు ఏనుగులమీఁదఁగప్పు కంబడి

గీ. జూజమున వంచన యుధ్యాతమోజమీఁత
జొంపమనగ పర్ణస్నిగ్ధ మింపుగొనెను
మఱి నిరంతరధారకొ మఱి నిరంత
రమునకగు మఱి యుపశాఖకమరె శౌరి. 436

జూజము = వంచనము (ఎగురఁగొట్టబడినది) 2 జొంపము = అకుల గుంపు నిరంతరధార నిరంతరము ఉపశాఖ (రెమ్మ]

గీ. త్రితిని జొత్తిల్లనంగ రంజిల్లు రక్త
పుయమునకుఁ జెల్లు జొబ్బిల్లు మహిసిపూర్ణ
మగు స్రవించుట కుత్పత్తియగుటకొను
జోగియన బిక్షుకునకొను యోగికొను. 437

జొత్తిల్లు=రంజిల్లుట ఎఱుపురంగుగొనుట 2 జొబ్బిల్లు = నిండుట కారుట పుట్టుట. 3 జోగి= భిక్షుకుడు యోగి.

క. జుగళ మధీనము సామ్యం
బగు నుత్సాహము స్వరూప మగును సమూహం
బగును సమానము యుక్తం
బగువిధమౌ క్షేమమౌను హరిహయవినుతా. 438

జుగళము = అధీనము సామ్యము ఉత్సాహము స్వరూపము సమూహము సమానము యుక్తము విధము క్షేమము.

క. నగధర జోగన భిక్షుకుఁ
డగు సమయము జోకసేయునన సంపాదిం
చగు సిద్ధపరచుటకు పే
రగు జోడు సమానము యుగమగు కవచంబౌ. 439

1 జోగు = భిక్షుకుఁడు, సమయము. 2 జోకచేయు = సంపాదించు, సిద్ధపఱచు. 3 జోడు = సమానము, యుగము, కవచము.

క. అగు జోతినాఁగ దీపం
బగు కాంతియును తవణిల్లు ననగ బ్రవర్తి
ల్లగు నంచితంబు తేవయ
నగ నంచితమునకు విధమునకు జెల్లుహరీ. **440**

1 జోతి = దీపము, కాంతి. 2 తవణిల్లు = ప్రవర్తిల్లుట, అంచితము, తేవ = అంచితము.

క. డంబన కపటము కాంతియు
డంబర మధికము ప్రతిష్ఠ తవణిల్లుచు గ
ర్వంబు విధమగు తవరయన
నంబిగొనెక్ భువి పిశాచమై పౌరుషమై. **441**

1 డంబు = కపటము కాంతి, 2 డంబరము = అధికము, ప్రతిష్ఠ, గర్వము, విధము. 3 తవర = పిశాచము, పౌరుషము.

గీ. డాలనఁగ కాంతి ధ్వజము ఖేటకముపేరు
జెండె డిందనగాను శోషిల్లు నమ్ర
మగుటకగును సమాధానమగును డొంక
యవని కుంజ మరణ్యమౌ దనుజవైరి. **442**

1 డాలు = కాంతి, జెండా, ఖేటకము. 2 డిందు = శోషించు, వంగుట సమాధానమగుట 3 డొంక = నికుంజము, అడవి.

గీ. డీకొను ననంగను ప్రతిఘటించు నుత్స
హించు నావరించగు డొంగు వృక్షకోట
రమును గూఢస్థితికి నామమమరె డొంకు
వఱలె శోభిల్లు శుష్కించు వక్రమగుచు, **443**

1 డీకొను = ప్రతిఘటించుట, ఉత్సాహపడుట, ఆవరించుట. 2డొంగు=చెట్టులొట్ట, మరుగునుండుట. 3డొంకు=ప్రకాశించుట, ఎండిపోవుట, వంకరయగుట.

కం. నగధరతంటాయనశ్రిమ
మగు, పిశునము ఋణవు మోసమగు కలహంబౌ
తగవన యుక్తము న్యాయం
బగు నరణంబగును కలహమగు మునిలోలా. 444

తంటా=శ్రమ, పిశునము, అప్పువలనిమోసము, కలహము. 2 తగవు=యుక్తము, న్యాయము, ఆరిణము.

క. తగులన సక్తము గ్రాసం
బగు ననుకూలంబు స్పర్శ యాసక్తి లభిం
చగు ననుగమించు స్పర్శం
చగు తగులమనఁగ నిరోధ మాసక్తియగుఁ. 445

1తగులు=తగుల్కొనుట, గ్రాసము, అనుకూలము, తాకుట,ఆసక్తి, లభించుట,వెంటవచ్చుట, అంటుకొనుట. 2 తగులము=నిరోధము, ఆసక్తి.

గీ. తగ్గనంగ సంకోచించు దనరె భిన్న
పతనమును నూనమగుటకుఁ బరగె తచ్చ
నయన కపటము పరిహాస నామమయ్యె
తట్టు పార్శ్వంబు తీరంబు తాడనంబు. 446

1తగ్గు = సంకోచించు, భిన్నముగాఁబతనమగుట, తిరిగిపోవుట. 2 తచ్చన=కపటము, పరిహాసించుట. 3 తట్టు= పార్శ్వము, తీరము,తాడనము.

గీ అంబురుహలోచనా తట్టియనఁగ భాజ
నంబగు మృగయాసాధనంబగు త
బాటనంగను వ్యత్యాస పడు చలించు
టకు నభిఖ్యయగును శౌరి యసురవైరి. 447

1తిట్టి=పాత్రము, వేటపనిముట్టు. 2 తబాటు=వ్యత్యాసమగుట,చలించుట.

కం. ధర ప్రస్తావించుట ప్రియ
కరన్వరాలస్యజాను కరగమనము తా
స్థిరకాలం బన్వేషిం
చరయ విచారించు రక్షణాఖ్య మురారీ 448

(ఈపద్యము కవిస్వయముగా వ్రాసినవ్రాతప్రతిలో నెటులున్నదో అటులే ముద్రించితిమి. ఇందులిప్తపదము తెలియుటలేదు. సంస్కరింప వీలు కాలేదు. ఛందోలోపములున్నవి. మార్పవీలుకామి ఉన్నదియున్నట్లు ముద్రించితిమని సుధీలోకమునకు విజ్ఞప్తి.)

తే. ధరణిఁ దడవాడనఁగ జానుకరగమనము
దనరె వ్యత్యాసమునకు నృత్యంబొనర్చు
టలరె తడుపన కౌపీనమౌను సిక్త
మయ్యెను కనిష్ఠ వస్త్రమౌ నంబుజాక్ష 449

1తడవాడు=అంబాడుట, భేదము, నాట్యము. 2 తడుపు=గోచితడియుట, [చిన్నవస్త్రము.

కం. తనరునన నతిశయించుట
తనరు విజృంభించు టంచితము పేరొప్పెం
దనరు పన నుచ్ఛ్రయంబగుఁ
దనరు పనఁగ నతిశయంబు దనరె మురారీ 450

1తనరు=అతిశయించుట, విజృంభించుట,అంచితము 2తనరుపు=ఉచ్ఛ్రయము, [అతిశయము.

కం. తనుకన తపించు తాపం
బును జ్వలియించుటకుఁ బ్రాప్తమును కాంతులుబా
తనుపారనఁగా శైత్యం
బునకగుఁ దృప్తియగుటకగును పుణ్యచరిత్రా 451

1తనుకు (రూ)తన్కు= దుఃఖించుట, వేడిమి, మండుట, పొందుట, ప్రకాశించుట. 2 తనుపారు (రూ] తన్పారు=చల్లదనము, తనియుట.

కం. తనుపన నార్ద్రము శైత్యం
బును మఱి శైత్యోపచారమును తృప్తియు నిం
కను బితృయజ్ఞమగు తమ
కనగ విధంబును జలించుటౌ మునిలోలా 452

1తనుపు (రూ)తన్పు=తడియుట, శీతలము, శీతలోపచారము, తృప్తి, పితృయజ్ఞము. 2 తమక=విధము, కదలుట.

కం. వనజాక్షా! తపసియనం
దెనఁగున ఋషిపేరు నింగు దీవృక్షంబై
తనరెను తమకంబనఁ ద్వర
కును మోహంబునకు జెల్లె కుంజరవరదా 453

1తపసి=ఋషి, గారచెట్టు. 2 తమకము (రూ) తమకి [illegible] కమ్ము, వేగిరము, వలపు.

కం. తమకియన మోహితుండగు
తమయనం ద్వరితగామి తమియనగా మో
హము నపేక్షకకగును త్వరి
తమును కుతూహలము పేరు దనరె మురారీ 454

తమకి=వలచినవాడు, వడివడిగాబోవువాడు. 2 తమి= మోహము, అపేక్ష, వేగము, సంతోషము.

గీ. పుడమి తమకించు నాఁ ద్వరపడు చలించు
చెల్లెఁ దమ్మియు వృత్తవిశేషమయ్యె
నంబురుహము పద్మవ్యూహమయ్యె తరత
రంబనంగఁ బరంపర క్రమమునఁ కగుఁ 455

1తమకించు=త్వరపడుట, చలించుట. 2 తమ్మి=వృత్తవిశేషము, తామరపూవు, పద్మవ్యూహము. 3 తరతరము=పరంపర, క్రమము.

క౦ తరమన సామ్యము పురుషాం
తరము సమానంబు పేరు దనరెను దినుసా
మరి శక్యంబును మానం
బరయఁగ శక్తంబు క్రమము హాటకచేలా. 456

తరగు = సామ్యము, పురుషాంతరము, సమానము, దినుసు, శక్యము, మానము, శక్తము, క్రమము.

క౦ తరవాయి నాసమయమగు
మఱియు నుపక్రమ మనుక్రమం బావృత్తిన్
బరుగెఁ దరితీపనంగను
ధరణిని ధృతియగు నుపేక్ష తనరె మురారీ 457

1తరవాయి = సమయము, ఉపక్రమము, అనుక్రమము, ఆవృత్తి. 2తరితీపు = ధృతి, ఉపేక్ష.

క౦ తఱపియన యౌవనంబగుఁ
దఱపియనన్ వత్సమౌను తరుణంబునకౌ
తెఱటన కళ మూర్ఖత్వము
తెఱటనఁగ కశాహతికిని దనరె మురారీ 458

1తఱపి = యౌవనము, దూడ, తరుణము. 2తెఱటు = కొరడా, మూర్ఖత్వము, కొరడాతోఁగొట్టుట.

క౦. తఱియనన సమీపించుట
తఱియనన నతిక్రమించు దరియించుట యౌ
తఱినా సమయము వళియౌ
తఱినా సామీప్యమునకు దనరె ముకుందా. 459

తఱి = సమీపించుట, అతిక్రమించుట, దాటుట, సమయము, త్రాడు మున్నగువానిజుత్తిడిరేఖ, సమీపము.

గీ. తఱలువారించుఁ జలించుఁ దఱరె సంభ్ర
మించుఁదా తఱుమన నాక్రమించు వేగ
పడుఁ బ్రధావింపఁజేయుట కడరె మఱియు
నొప్పెను బలాత్కరించుట నురగశయన. 460

1తఱలు=వారించుట, చలించుట, సంభ్రమించుట. 2 తఱుము=ఆక్రమించు, వేగపడు, పరుగెత్తఁజేయు, బలాత్కరించుట.

కం. తలయన శిరము శిరోజ
స్థలమగు నుద్యమము నాది సమయము రంగం
బలరార నగ్రభాగం
బలరెను పక్షమున కాఖ్యయ బుజనాభా 461

తల=శిరస్సు, వెండ్రుకలపట్టు, పనికారంభము, సమయము, రంగము, ముందుతావు, పక్షము.

గీ. తలఁకనఁగ భయపడుటకౌఁ జలనమౌను
తలచు ధ్యానించు గణియించు తలకొనఁగఁ
బ్రాప్తి యత్నించు ధరియించుఁ బరఁగెను తల
పోఁత చింత విచారమౌ పూతచరిత. 462

తలకు=భయపడుట, కదలుట. 2 తలచు=ధ్యానించుట, గణియించుట. 3 తలకొను=ప్రాప్తించుట, యత్నించుట, ధరించుట. 4 తలపోఁత=చింత, ఆలోచనము.

కం. తలఁపనఁగ నభిప్రాయము
తలఁపనఁగా నిచ్ఛ చింత ధ్యానము జ్ఞప్తిన్
దలయెత్తన వర్ధిలుట
తలయెత్తన నంకురింపు దనుజవిదారీ. 463

తలఁపు=అభిప్రాయము, ఇచ్ఛ, చింత, ధ్యానము, జ్ఞప్తి, తలయెత్తు=వృద్ధినొందుట, అంకురించుట.

సీ. తలపక్షువనంగ యుద్ధాయుతంబు విదిత
మగుటకగున యుద్ధస్పర్శకాఖ్య చెల్లె
మఱియుఁ బ్రారంభ మగుతలమానికమన
పొసఁగ శ్రేష్ఠంబగును శిరోభూషయగును. 464

1తలపక్షు=యుద్ధాయుతము, విదితము, యుద్ధస్పర్శము, ప్రారంభము.
2 తలమానికను=శ్రేష్ఠము, శిరోభూషణము.

కం. తలరుననన సంభ్రమించుట
తలరనఁ జింతించు నంచితము ప్రాప్యంబౌ
చలియించుటకగుఁ దలరుచు
టలరారెను బల్లవించు నతిశయమునకౌ. 465

తలరు=సంభ్రమించుట, చింతించుట, అంచితము, ప్రాప్యము, చలించుట. 2 తలరుచుట=పల్లవించు, అతిశయము.

గీ. అవని తామరతంపర యనగఁ గమల
షండ మభివృద్ధి కగుఁ దారసంబనంగ స
మీపమునకుఁ నారంభించు, మించెఁ దార
సించనంగ సమీపించు వ్యాపించుటాను. 466

1తామరతంపర=తామరపూలు పెంపొందుట. 2 తారసము=సమీపము, ఆరంభను. 3 తారసించు= సమీపించు, వ్యాపించు.

గీ. తారనఁగ సమీపించుఁ దనరె గచ్ఛ
యగును సంచారమునకుఁ బేరయ్యెఁ దాఱు
నాఁగ గూఢస్థితికిఁ బేరు నమ్రమగును
తాలిమి యనంగ క్షమయగు ధైర్యమగును. 467

1తారు=సమీపించు, పోవు, సంచరించు. 2 తాఱు= గూఢముగా నుండుట, వంగుట. 3 తాలిమి=ఓర్పు, ధైర్యము.

సీ. తావలంబనఁగ నాధారమునాఁ స్థానమునా
తాళినా హారభేదము పతకము
నగు తికమకయనఁగా లోడనంబున
స్వాధీనతయును వ్యత్యాసమౌను
తిప్పనాఁగుధరంబు ద్వీపంబునకు జెల్లు
దిట్టు శపించు నిందించుటౌను
మఱియుఁదిన్నయన సామ్యము మనోజ్ఞంబు యు
క్తంబును ఋజువు స్వస్థంబు పేరు
తే. తిమురనఁగఁద్వరపడుట యుద్రేకమొందు
టౌను గర్వించుటకు నామమగు గర్వ
మగును తిరియన నావర్తమగును జటకుఁ
జేరు సెల్లెను సర్వవిభక్తులంగ. 468

1 తావలము = ఆధారము, తావు. 2 తాళి=హారభేదము, పతకము 3 తికమక= సంభ్రమము, స్వాధీనము, వ్యత్యాసము. 4 తిప్ప=కొండ, ద్వీపము. 5 తిట్టు=శపించు, నిందించు. 6 తిన్న=సామ్యము, మనోజ్ఞము, యుక్తము ఋజువు, స్వస్థము. 7 తిమురు=త్వరపడుట ఉద్రేకమొందుట, గర్వించుట గర్వము. 8 తిరి=సుడి, జడ.

తే. గీ. క్షితిని దిరుగనఁగఁ బరివేష్టించు సంచ
రించుట పరిభ్రమించు వక్రించుటకును
జేసు సెల్లెనావర్తించు పేరగు దిల
కించునాఁ బ్రకాశించు దృష్టించగును బ్ర
సన్నతాభిఖ్యయగు పంకజాతనేత్రి 469

తిరుగు=ఆవర్తించుట, సంచరించుట, పరిభ్రమించుట, వంకరయగుట. తిలకించు=ప్రకాశించుట, చూచుట, ప్రసన్నుఁడగుట.

గీ. తివురనఁగ ధ్వనించు యత్నించు నిచ్ఛ
యించును కుతూహలపడు కోపించు త్వరప
డగును తీండ్రయనఁగఁ దేజమగు ప్రకాశ
మగును కుశలత యుష్ణమౌ ఖగతురంగ. 470

1తివురు=ధ్వనిచేయు, యత్నముచేయు, ఇచ్ఛయించు, కుతూహలపడు, కోపించు, త్వరపడు, 2 తీండ్ర=తేజము, ప్రకాశము, కుశలత, ఉష్ణము.

గీ. తీఁగయన లత మేఖల స్త్రీలకంఠ
భూషయగుఁదీఱమియనంగ భువి నవశ్య
కంబువీణియతంత్రి యైకార్లు తీఱు
నాఁగ నశియించు సంధియు నల్లసామి. 471

1తీఁగ=మేఖల, కంఠభూషణము. 2 తీఱమి=ఆవశ్యము, వీణియతీఁగ. 3తీఱు=నశించుట, సంధి.

గీ. తుంట శకలంబు నిక్షువు దుష్టునకును
దనరుఁ దుందుడుకనఁగ సంతాపమగు వి
చారమునకగు క్షోభకుఁ బేరు మఱి యా
లోచితకృతుండగును వరయోగివంద్య. 472

1తుంట= శకలము,చెఱకు, దుష్టుఁడు. 2 దుందుడుకు=సంతాపము, విచారము, క్షోభ, ఆలోచనలేకపనిచేయువాఁడు.

కం. వనజాక్షా తుంపెసలా
డనఁజలియించుట నటించుట తుకమక యా
న్నను గోపము సంతాపం
బును దుడుమన వాద్యభేదమును విసరంబౌ 473

1తుంపెసలాడు=చలించు, నటించు, 2 తుకమక=కోపము, సంతాపము, 3 తుడుము=వాద్యభేదము, సమూహము.

గీ. ధరఁదుటారముదార్ఢ్యము పరుషవచన
మగుఁ దుఱఁగలించనంగనా నతిశయించు
టా ప్రకాశించుటా తుఱుమనఁగఁ గబరి
చూర్ణము సుమాదులెలమిజేప్పటకుఁ జెల్లు 474

2కుటారము=దార్ఢ్యము, పరుషవాక్యము, 2 తుఱంగలించు=అతిశయిం
చుట, ప్రకాశించుట, 3 తుఱుము=కొప్పు,చూర్ణము, పూవులను పమకూర్చుట.

గీ. క్షితినిఁ దులకించునా బ్రకాశించుటకు కు
తూహలమునొందుటకు జెల్లు తూఁగనన చ
లించు నిద్రాంకమగుఁ బ్రవర్తించగుఁ దుల
తూఁగుటకకు నాందోళించుఁ దోఁచె శౌరి. 475

1తులకించు=ప్రకాశించుట, కుతూహలము.2 తూఁగు=చలించుట,
నిద్రచేతూలుట: ప్రవర్తించుట, తులగూగుట, ఆందోళించుట.

సీ. తూటయనంగను దుష్టుఁడాఖండమగా
తెంపు సాహసము ఖండింపుటకును
తూలనఁ జలియించుఁ దోఁచె నవసరిల్లు
తెగువ సాహసము దాతృత్వమును
తెక్కలి వంచన నిక్కంబు చోరత్వ
మనకు జెల్లు ప్రమాదమునకు జెల్లు
తెగడన నింద నిందించుటను దిరస్క
రించుటకా నుపేక్షించుటను

గీ. తెగన ఖండితమగుట మృతించు సాహ
సించు న్యాయమగుటకగు ఛిన్నమగుట
కౌను తెగుదలయన ఖండమ మంతెనగును
తెప్పనా రాశి యుడుపంబు చెల్పు శౌరి. 476

1 తూటి= గన్నుండు. ఖండనము, తెంపు, సాహసము, ఖండించుట. 2 తూలు= చలించు, తొలగు. 3 తెగువ= సాహసము, దాతృత్వము. 4 తెక్కలి= వంచన, చోరత్వము, పరిహాసము. 5 తెగడు= నింద, నిందించుట, తిరస్కరించుట, ఉపేక్షించుట. 6 తెగు= ఖండితమగుట, మరణించుట, న్యాయమగుట, ఛిన్నమగుట. 7 తెగుదల= క్షయము, అంతము. 8 తెప్ప= రాశి, ఉడుపము.

క. తెగనాఁ బక్షము లంబం
బగును గుణారోహంబు నగును సమూహం
బగు నిశ్శ్రేణము ఖండిత
మగు తెఱయనఁ గాండపటము నగు వీచికయా. 477

1 తెగ= పక్షము, లంబము, గుణారోహణము, (ఎక్కుపెట్టునారి,) సమూహము, నిశ్శ్రేణము ఖండితము. 2 తెఱ= కాండపటము, తరంగము.

క. తెఱఁగన విధమగు సంధియు
తెఱఁగన ఋజుభావమునకుఁ దెఱఁగా క్రమమనా
తెఱకువ యనఁగ వివేకము
తెఱకువయు నుపాయమౌను దెలిసుగ్రైకీ. 478

1 తెఱఁగు= విధము, సంధి, ఋజుభావము, క్రమము. 2 తెఱకువ= వివేకము, ఉపాయము.

సీ. తెఱగంటి యనఁగను దేవత మర్త్యంబు
తేకువ భయమగు ధీరతయగు
తెలివినాఁగ వికాస మలరి జ్ఞానంబు ప్ర
కాశంబునకుఁ జెల్లు కాంతికొను
తేజఃప్రసన్న కాంతి ప్రతాపంబులౌ
తేరన రథము ప్రాపించుటయును

తేలు సమాప్తి ప్రాప్తించు నాశ్వాసించు
టకు విశదంబగుటకుఁ దేఱ

గీ. యున ననాయాసమునకౌను వ్యర్థమునకుఁ
జెల్లు తొంగలించనఁగ వర్ధిల్లు నతిశ
యించు వికసించు మఱి ప్రకాశించుటకు ప్ర
వించుటకు బేరుజెల్లును వేఁడ వేద్య. 479

1 తెలగంటి= దేవత, మత్స్యము. 2 తేకువ= భయము, దిరత. 3 తెలివి= వికాసము, జ్ఞానము, ప్రకాశము, కాంతి, తేజము, ప్రసన్న కాంతి, ప్రతాపము. 4 తేర= రథము. ప్రాప్తించు. 5 తేలు= సమాప్తి, ప్రాప్తి, ఆశ్వాసించు, విశదమగు. 5 తేఱ= అనాయాసము, వ్యర్థము. 6 తొంగలించు= వర్ధిల్లు, అతిశయించు, వికసించు, ప్రకాశించు, ప్రసవించు.

గీ. తొంగనఁగ నవతీర్ణంబు దోఁచెను శయ
నించుటకుఁదోఁచెఁ దొగయున నెగడెభువిని
కుముదమగుచు సమూహమై క్రిమమగుచును
కష్టునకు బేరగుచు భవగణవిభంగ. 480

తొంగు= అవతీర్ణము, (దిగుట) శయనించు, తొగ= కుముదము, సమూహము, క్రిమము, కష్టజీవి.

క. అంచితముగఁ దొట్టన వ్యా
పించుట ప్రవహించుటకు ప్రవించుటకును బూ
ర్ణించుటకుఁ బ్రముఖమునకు స్పృ
శించుటకును స్పృక్కునకును జెల్లె ముకుందా. 481

1 తొట్టు= వ్యాపించు, ప్రవహించు, ప్రవించు, పూర్ణించు, ప్రముఖము, స్పృశించుట, స్పృక్క [స్పర్శము]

క. వనజాక్షా! తొడరనగా
ననుసర మొనరించుటకును వ్యత్యాసంబ

ర్వ్యాసా సక్త మనుకరించుట
కును బ్రాపించుటకుఁ బేరగును యత్నంబౌ.                    482

1 తొడరు= అనుసరమొనర్చుట, వ్యతిత్యాసము, సక్తము (కల సినది.) అనుకరించుట, ప్రాపించుట, ప్రయత్నము.

తే. అవని దొడరనఁగ యత్నమౌను ప్రధమ
మౌను దొడకనఁగా ధేనువౌ గ్రహించు
టాఖ్య జెల్లె నాకర్షించుటౌను తొడిఁబ
డనఁ చలించుట విభ్రమమునకు శౌరి.                    483

1తొడరువు=యత్నము, పరిధము. 2తొడక=ధేనువు, గ్రహించుట' ఆకర్షించుట, 3 తొడబడ=చలించుట- విభ్రమము.

తే. తొడుగనఁగ శరసంధానమడరె భూష
ణాదిధారణమునకును భూషాదికమున
కౌను తొనకన విభ్రాంతికలరు మరియు
ఘుట జలక్షోభిత్వతనమౌ కమలనయన.

1 తొడుగు = శరసంధానము, భూషణధారణము, భూషణము.
2 తొనక= విభ్రాంతి, కుండను డినీరు తొనుకుట.

తే. అవనిఁ తొరఁగన నవతీర్ణమౌ స్రవించు
టౌ పతితమగుఁ బ్రవహించుటౌ మఱి తొలఁ
కాడనఁగఁ జలియించు ప్రకాశమొందు
నతియించగు మునిలోల యమరబంధు.                    484

1 తొరఁగు=అనతీర్ణము, స్రవించుట, పతితమగుట, ప్రవహించుట.
2 తొలకాడు=చలించు, ప్రకాశించు, అతిశయించు.

కం. తొలకనఁ దరంగనామము
చెలఁగెను మఱి ఘుటజలక్షోభిత్వతనంబై

చలియించు టతిశయించుట
కలరె బ్రకాశించుటకును విబుధస్తోమా. 485

1 తొలఁకు=తరంగము, కుండనుండనీరుతొలఁకుట, చలించుట, అతిశయించుట, ప్రకాశించుట.

కం తొలియన రంధ్రం బగ్రము
తొలియన ప్రథమంబుపేరు తొలువేల్పనఁగా
జలజోదరుడగు దనుజుం
డలరెను తోఁగనగ మగ్నమగు నార్ద్రపుగుఁజా 486

1 తొలి=రంధ్రము. అగ్రము, ప్రథమము. 2 తొలువేల్పు=బ్రహ్మ, రాక్షసుఁడు. 3 తోఁగు=మగ్నమగుట, ఆర్ద్రము (తడియుట)

కం. నగధర తోఁచన నుదయిం
చగు భావోద్భవముపేరునగు ప్రత్యక్షం
బగు తోడెంచన నుదయిం
చగు నాగమనించు దృశ్యమగుటకు జేరా. 487

1 తోఁచు=ఉదయించు, తలంపుకలుగుట, ప్రత్యక్షము. 2 తోడెంచు=ఉదయించుట, వచ్చుట, కనిపించుట.

గీ. వసుధ తోఁపనగా నుపవనము రక్తి
మంబగును తోయమన నావృతంబు విధము
పక్షమును సమయము పరివారనామ
మగును తోరము వ్రతసూత్ర మధికమహాను. 488

1 తోఁపు=ఉపవనము, ఎఱువు. 2 తోయము=ఆవృతము, విధము, పక్షము, సమయము, పరివారము. 3 తోరము=వ్రతసూత్రము, అధికము.

గీ. జగతి తుఱింగన నశియించు శకలమగుట
కొను తుఱింగుడనఁగ ప్రళయంబు నాశ

మెసగె త్రెక్కొనునా నాశకృత్యము కబ
ళించు క్షోభంబునకును స్వాదించుటౌను.			489

1 త్రుంగు=అతిశయించు, శకలమగు. 2 త్రుంగుడు= ప్రళయము, నాశనము, 3 త్రెక్కొను = నాశనముచేయుట, కబళించుట, క్షోభము, త్రాగుట.

గీ. దంటయన ప్రౌఢుఁడు యుగంబు దండ యనఁగ
హారమును ప్రాపగును దండియన సమృద్ధ
మగు ప్రతాపము శౌర్యుఁడా నధికమగును
దండు సేన సమూహమా దనుజవైరి.			490

1 దంట=నేర్పరి, జంట. 2 దండ=హారము, ప్రాపు. 3 దండి=సమృద్ధము, ప్రతాపము, శౌర్యుడు, అధికము. 4 దండు=సేన సమూహము.

సీ. దగ పరివారంబు దాహంబునకు జెల్లు
దండము వర్గుస్నిగ్ధంబునకగు
దబ్బరయన నసత్యము వంచితుం డాప
దయు వంచనయు నసత్యమున కగును
దయ్యంబన పిశాచి దైవంబు దేవత
దప్పినాఁ శ్రమమగు దాహమౌను
దరియన తీరమౌ మరిసమీపమునకౌ
దళమధికంబు స్నిగ్ధంబునకును

గీ. దాఁగురించనగా తిరోధానమగుట
కౌను వంచించుటౌను దాటన సమూహ
మగు తరించు నుల్లంఘించు టౌను లంఘ
నంబు లంఘించుటకుజెల్లు నలిననాభ॥			491

1 దగ=పరివారము, దాహము. 2 దండము=వర్గము, స్నిగ్ధము. 3 దబ్బర=అసత్యము, వంచితుఁడు, ఆపద, వంచన, అసత్యములాడువాడు.

4 దయ్యము=పిశాచి, దైవము, దేవత. 5 దప్పి=శ్రమము, దాహము. 6 దరి=తీరము, సమీపము. 7 దళ్లము=అధికము, స్నిగ్ధము. 8 దాగు రించు=తిరోధానము, వంచించుట. 9 దాటు=సమూహము, తరించుట, దుముకు, దుముకుట.

గీ॥ దాపనఁగ భయమునకు సమీపమునకు
నయ్యె దాయయనఁగ శత్రువౌను జ్ఞాతి
కౌను. దారయనఁగ దానమౌ క్రమమునగు
నుదక ధారకుఁజెల్లును మదనజనక। 492

1 దాపు=భయము, సమీపము. 2 దాయ=శత్రువు, దాయాది. 3 దార=దానము, క్రమము, ఉదకధార.

గీ॥ దారియన మార్గమునకౌను ధారణునకు
దనరె దిట్టయనంగను ధైర్యునకును
ప్రౌఢునకు దార్ఢ్యమునకిలఁ బరగె దినుసు
నా ప్రకారము వస్తువౌ నలిననాభ॥ 493

1 దారి=మార్గము, ధరించువాఁడు. 2 దిట్ట=ధైర్యవంతుఁడు, నేర్పరి. దార్ఢ్యము. 3 దినుసు=ప్రకారము, ప్రస్తువు,

సీ॥ దిమ్మయనంగ భ్రమమ్మగు రాశియౌ
దిమ్మనఁగను సమూహమ్ము భ్రమము
దుడుకన దౌష్ట్యంబు దుష్టముద్ధతి దీమ
సమన ధైర్యం బుపాయమునకౌను
దురమన యుద్ధంబు త్వరితంబునకు జెల్లు
దురుసన కఠినంబు త్వరితమౌను
దురపిల్లనఁగను దుఃఖించుటకును ల
భించుటకౌను తపించుటౌను

గీ॥ దుద్దనంగ నసత్యంబు దోఁచె కమల
కర్ణికకుపేరుజెల్లును కర్ణభూష
ణంబు దుస్తన సుందర మంబరంబు
నకును బేరగు నీరజనయన శౌరి॥ 494

1 తిమ్మ=గ్రంథము, రాశి, సమూహము, 2 దుశుస=పౌష్టి మ్ము, దుష్టము, ఉద్ధతి. 3 దీమసము=ధైర్యము, ఉపాయము. 4 దురము=యుద్ధము, త్వరితము. 5 దుసుసు=కఠినము. త్వరితము. 6 దుకపిల్లు=మోఖించు, లభించు, తపించు. 7 దుద్ద=అసత్యము, తామరపూవుగద్దె, కర్ణభూషణము. 8 దుస్తు=సుందరము. వస్త్రము.

కం॥ దెసయన పార్శ్వము ప్రాపగు
దెసయన రక్షణ మవస్థ దిశకును పేరౌ
వసుమతి దెప్పరమనఁగా
వెస నాపద దుస్సహమ్ము వినుము మురారీ॥ 495

1 దెస=పార్శ్వము, ప్రాపు, రక్షణము, అవస్థ, దిక్కు. 2 దెప్పరము=ఆపద, దుస్సహమైనది.

గీ॥ దేవరయనంగ ప్రభువగు దేవుఁడగును
దొంతరయన పరంపర దోఁచెనూర్ధ్వ
పంక్తియగు దొంతినాఁగను పంక్తియౌను
మరి ఘటాద్యూర్ధ్వపంక్తికౌ మదనజనక। 496

1 దేవర=ప్రభువు, దేవుఁడు. 2 దొంతర=పరంపర, ఊర్ధ్వపంక్తి. 3 దొంతి=పంక్తి, కుండలు మున్నగువాని పై వరుస.

క॥ దొనయన గిరిపల్వలమౌ
దొనయన తూణీరమౌను దొరయన నధికుం
డును రాజగు యోధవరుం
డును మరి సేనాధినాథుఁడును మురవైరీ. 497

1 దొసః= కొండపైనిమడుగు. అమ్ముత్రలపాది. 2 దొ. = అధిపతి రాజు, యోధుఁడు, సేనానాయకుఁడు.

క. కమలాక్షు! దొరయునన సా
 మ్యము స్పర్శము లభ్యమగు సమానమగుట పే
 రమరె దొరలన పతనమిళి
 తమగు ననుభవించుటకగు దానవవైరీ. 408

1 దొరయు=సామ్యము. స్పర్శను, లభ్యమగుట, సమానమగుట. 2 దొరలు=పడికలనికొనుట, అనుభవించుట.

సీ. దొసఁగన నాపద లోఁచౌ విఘ్నమౌను
  దోసంబు పావమౌ దోషమౌను
 దాౖచినా నధమ మధముఁడు సారంబగు
  నట్టాడన చలించు నర్తనంబు
 నక్కన నబ్రింబునకు స్వర్ణపత్రింబు
  నకు జెల్లు హేమశోభకును జెల్లు
 నగరు రాజగృహంబునకు సురాలయమగున
  కగునట్టి స్థానమౌ నాలసించు

గీ. టౌను ననయన కుట్మలంబౌను పుష్ప
 మగును పల్లవమగు ననుచనఁగ పల్ల
 వించు ననురాగమగుట రహించు నతిశ
 యించుట మనోజ్ఞమగుటకౌ నిందిరేశ. 409

1 దొసఁగు= ఆపద, విఘ్నము. 2 దోసము= పాపము, దోషము, 3 ద్రాచి=అధమము, అధముఁడు. 4 నట్టాడు,= చలించుట, నర్తనము. 5 నక్కు= అబ్బ్రకము, బంగారురేకు, బంగారుకాంతి. 6 నగరు= రాజగృహము, దేవలోకము. 7 నటు= స్థానము, ఆలసించుట, 8 ననః= మొగ్గ,

పూవు, చిగురు. 9 ననుచు= చిగిరించుట, అనురాగమగుట, రహించుట, అతిశయించుట, మనోహరమగుట.

క. నేరమియన నజ్ఞానము
నేరమియన దోషమగును నేలయనంగన్
ధారుణి దేశస్థానము
నేరుచుటన నభ్యసించు నెగడె క్షమమయునై 500

1 నేరమి= అజ్ఞానము, దోషము. 2 నేల= భూమి, ప్రదేశము. 3 నేరుచు= అభ్యసించు, క్షమ.

సీ. పంచారిమనంగ వ్యాపక మతిశయమగు
పంటనా కృషియును ఫలితమునకు
పంచు నాజ్ఞాపించు భాగించుటకుఁబేరు
పంతగించు ప్రతిజ్ఞ పడు విధించు
పండన శయనించు ఫలము పక్వంబగు
పరిక్కయనంగ శయ్య పార్శ్వమాను
పంతమన ప్రతిజ్ఞ పౌరుషంబు విధంబు
పంతన శుభమగు పరగె ఘనత
గీ. పగటనంగ ప్రకాశము ప్రగటనకును
పరగె లావణ్యమునకాఖ్య పగిదియనఁగ
క్రమమునకు కష్టమును రాజకరముపేరు
బరగె పటించు మాంద్యమా భ్రాంతియగును. 501

1 పంచారము= వ్యాపకము, అతిశయము. 2 పంట= కృషి, ఫలితము. 3 పంచు= అజ్ఞాపించు, భాగించు. 4 పంతగించు= ప్రతిజ్ఞపడు, విధించు. 5 పండు= శయనించు, ఫలముపక్వమగుట. 6 పరిక్క= శయ్య, పార్శ్వము. 7 పంతము= ప్రతిజ్ఞ, పౌరుషము, విధము. 8= పంతు శుభము,

ఘనత. 9 పగటు=ప్రకాశము, ప్రకటన. 10 పగిది= కీర్తము, ప్రాశస్త్యము. కష్టము, రాజునకిచ్చుపన్ను. 11 పంటింపు= మాంద్యము, భ్రాంతి.

గీ. సైకమన సూక్ష్మమునకు సూక్ష్మత్వమునకు
నలరె సొంపన సౌందర్యమగు సమృద్ధి
యగును సంతోషమునకాఖ్య సొగయుననఁగ
పారవశ్యతకగు మూర్ఛ బడుటకొను. 502

1 సైకము= సూక్ష్మము, సూక్ష్మత్వము. 2 సొంపు= సౌందర్యము, సమృద్ధి, సంతోషము. 3 సొగయు= పరవశమునొందుట, మూర్ఛనొందుట.

క. సొమ్మన గోధన మాభర
ణమ్ము ధనముపేరు సొరుగు నా మూర్ఛింపనా
మమ్మగు మూర్ఛయ సొలపన
వమ్మెను విముఖంబు పారవశ్యము పేరై. 503

1 సొమ్ము= గోధనము, ఆభరణము, ధనము. 2 సొరుగు= మూర్ఛిల్లు, మూర్ఛ. 3 సొలపు=విముఖము, పారవశ్యము.

క. సోఁకమ్మిహి సోఁకనగా స్ప
ర్శమ్ము గ్రహావేశమగును రాక్షసుడు పిశా
చమ్మగు సోమయనంగ శ్ర
మమ్ము పరాక్రమముపేరు మంజులభాషా. 504

1 సోఁకు= స్పర్శము, గ్రహావేశము, రాక్షసుఁడు, పిశాచము. 2 సోమ= శ్రమము, పరాక్రమము.

క. పంచాయుధభరణా! సో
మించనఁగా నగు పరాక్రమించుటకును వ్యా
పించు సదృశమగుట విజృం
భించగు సోమనఁగ నాశపేరు సుశుంభా. 505

1 సోమించు= పరాక్రమించుట, వ్యాపించుట, సవ్యశమగుట. విజృంభించుట, 2 సోము= నాశనము, సుఖము.

సీ. స్రుక్కనంగ సంకోచించు శోకమగు క్ష
యించుటా నావరించు దుఃఖించు మ్లాన
మగుటకొను పరాఙ్ముఖ మగుట భీతి
కగును హారాదిసంకీర్ణ మౌను చింత
గనుట మూర్ఛిల్లు బహువాచకమున వళులు 506

1 స్రుక్కు= సంకోచము, శోకము, క్షయము, ఆవరించు, దుఃఖించు, మ్లానమగు, పరాఙ్ముఖమగు, భీతిపడు, హారాదులు పెనవేసికొనుట, చింతించుట, మూర్ఛిల్లుట, బహువచనము నవళులు (గర్భముమీఁదముడుతలు)

గీ హత్తన లభించు సమ్మేళ నాఖ్య హరువు
నా మనోజ్ఞత యోగ్యత నామము హవ
ణించనఁగ నవరించు ధరించుపే ర
లంకరించుటకాఖ్య జలరుహనేత్ర. 507

1 హత్తు=లభించు, సమ్మేళనము. 2 హరువు= మనోజ్ఞత, యోగ్యత 3 హవణించు=సవరించు, ధరించు, అలంకరించు.

క. హవణిల్లనఁగ ప్రకాశిం
చవును విజృంభించుటౌను హసాసన లలితం
బవు సుందరమగు హాళాయలన
నవు మితమును సంతసమునకాఖ్య మురారీ. 508

1 హవణిల్లు= ప్రకాశించు, విజృంభించు. 2 హసాసు= లలితమగు, సుందరమగు. 3హాళాయలు= మితము, సంతోషము.

గీ. చన్నుకుచు గుద్దు నిమకన స్తన్యపాన
మౌను తడవాడు దోఁగు దోఁగాడు దోగి

యాడు నంబాడు తడవన నౌనుబూను
కరతలగమనమునకభిఖ్యలు మురారీ. 509

1 చన్గుడుచు, కుడుచు, నిముకు= ఇవి స్తన్యపానము పేరులు తడవాడు, అంబాడు, తడవు= ఇవి కరతలగమనము పేరులు.

గీ. పారడయు నుగ్గుచిప్పయు పాలడయున
జాడగన్న శిశుస్వాది శంఖుకంబు
పేళ్లు, బోరుకాడించన చెలగినామ
మూ శిశుస్నానకృత్యం బహార్యభరణ. 510

పారడ, ఉగ్గుచిప్ప, పాలడ= ఇవిపిల్లలకు బాలుబోయుశంఖము పేళ్లు. బోరుకాడిచు= పిల్లలస్నానముచేయించు.

క. ననుపన నతిశయమునకౌ
ననురాగంబును మనోజ్ఞమగుట కగు నయం
బన సుందరంబు లాభం
బును స్నిగ్ధతయును మృదుత్వమును శుభమగుటా. 511

1 ననుపు= అతిశయము, అనురాగము, మనోజ్ఞమగు. 2 నయంబు= సుందరము, లాభము, స్నిగ్ధత, మృదుత్వము, శుభమగుట.

సీ. నలుగన శ్రమపడు నశియించు పీడితం
బగు నల్వు సామర్థ్య మంచితంబు
నలియన సూక్ష్మంబునకు చూర్ణమునకగు
నత్యంతమునకు రోగాఖ్యకలరు
నవ్వన హాసంబునకు వికాసము వికసించుటకు పరిహాసించుటాను
నల్లనా రక్తంబునకు నసితికి నాడు
నాం దేశమునకు జనపదమునకు

గీ. నాగవాసంబనంగను నర్తనాది
మేళమనగను గణికావాళి కొను
ద్వారనిగళంబునకుపేరు దసరెనాలి
యనంగ కుత్సితమునకు మాంద్యంబునకును 512

1 నలుగు= శ్రమపడు, నశించు, పీడితమగు. 2 నల్పు=సామర్థ్యము అంచితము. 3 నలి= సూక్ష్మము, చూర్ణము, అత్యంతము, రోగము. 4 నవ్వు= హాసము, విశ్వాసము, వికసించుట, పంహసించుట. 5 నల్ల= రక్తము, అసిత వర్ణము. 6 నాడు= దేశము, జనపదము. 7 నాగవాసము=నర్తనాదిమేళము, వేశ్యలగుంపు, తలుపుగొళ్ళెము. 8 నాలి=కుత్సితము, మాంద్యము.

గీ. నిక్కమన సత్యమునకును నిశ్చయమున
కౌను, నిక్కన వర్ధిల్లు నతిశయించు
నున్నతంబగు గర్వంబు నున్నతి యగు
నిజమనంగను సత్యంబు నిశ్చయంబు. 513

1 నిక్కము= సత్యము, నిశ్చయింపఁబడినది. 2 నిక్కు= వర్ధిల్లు, అతిశయించు, ఉన్నతంబగు, గర్వంబు, ఉన్నతి. 3 నిజము= సత్యము నిశ్చయించినది.

క. నిగుడనగా వ్యాపించుట
కగు ప్రసరించుటకు దీర్ఘమగుటకు వర్ధి
ల్లగు యుక్తంబగుటకు త్వర
కగును విజృంభించుటకగు హతదితిజాతా, 514

1 నిడుగు= వ్యాపించుట, ప్రసరించుట, దీర్ఘమగుట, వర్ధిల్లుట, యుక్తంబగుట, త్వర, విజృంభించుట.

గీ. నిచ్చలంబన నచలంబు నిశ్చయంబు
మఱియు నిర్దోషమును నిరంతరము పేరు

దనరె నిట్టయనగ స్తంభమునకు స్థాన
మునకు పేరొప్పెను ప్రవాహమునకు పేరు 515

1 నిచ్చలంబు= అచలంబు, నిశ్చయము, నిర్దోషము, నిరంతరము.
2 నిట్ట= స్తంభము, స్థానము, ప్రవాహము.

క. కమలాక్షా! నిట్టన శు
ష్కమునకు నుపవాసమునకు క్షామమునకు నా
మము నిద్దమనగ స్నిగ్ధ
త్వము స్నేహితమగును కలుషవననిధితరణీ. 516

1 నిట్టు=శుష్కము, ఉపవాసము, క్షామము. 2 నిద్దము=నునుపు, స్నేహితము,

గీ. అవని నిష్పచ్చరమన శూన్యము దరిద్ర
మునకు జెల్లెను నిబ్బరమనగ నశ్వ
గతి విశేషంబునకు నధికంబునకును
పేరుజెల్లెను మౌనిహృత్సారసనిలయ. 517

1 నిష్పచ్చరము= శూన్యము, దరిద్రము. 2 నిబ్బరము= అశ్వగతి
విశేషము అధికము.

గీ. నిబ్బరించనగా నిదానించు నతిశ
యించుటకుజెల్లు నిబ్బరికించుననఁగ
నమరె కరుణించుటకు నుబ్బణమగుటకును
నిమ్మళము స్వస్థమునకగు నిశ్చితమగు. 518

1 నిబ్బరించు= నిదానించు, అతిశయించు. 2 నిబ్బరికించు=కరుణిం
చుట, ఉబ్బణంగుట. 3 నిమ్మళము= స్వస్థము, నిశ్చితము.

క. నిలుపన స్థిరపరచుటకా
నిలుపన స్థైర్యము ప్రతిష్ఠ నిష్ఠ నిరోధం

బిల నిలుకడ యన స్థానం
బలరెను స్థైర్యము విరామమగుచు మురారీ. 519

నిలుపు= స్థిగపరచుట, స్థైర్యము, ప్రతిష్ఠ, నిష్ఠ, నిరోధము.
2 నిలుకడ, స్థానము, స్థైర్యము. విరామములేనిది.

మ. నెనరౌని వ్వెఱనాఁగ భ్రాంతియగుచు న్నిశ్చేష్టయౌ నివ్వటి
ల్లన వ్యాపించు లభించుటౌ నతిశయంబౌ నానుకూల్యంబవే
రనుజెల్లెన్ మఱి నీటిఱేడన సముద్రుండౌను పాశాఖ్యయౌ
గ్గెను నీరాటయనంగ స్నానముజలక్రీడాఖ్యయౌ మాధవా.

1 నివ్వెఱ= భ్రాంతి, నిశ్చేష్ట, 2 నివ్వటిల్లు= వ్యాపించు, లభించు
అతిశయను, అనుకూలము. 3 నీటి ఱేడు= సముద్రుఁడు, వరుణుడు.
4 నీరాట= స్నానము, జలక్రీడ.

సీ॥ నీరుపుట్టువనంగ నీరేజమునకు శం
ఖమునకు పేరు కౌస్తుభము పేరు
నీళ్ళాడు ప్రసవించు నెగడెను స్నానమౌ
నగ్గన చూర్ణంబును మఱిధూళి
నఱుము చూర్ణాకృతివఱలెను వధమునౌ
నుడియన నపకీర్తియడరె వాక్కు
నున లుద్యమించుటౌను మఱి మాంద్యకృతింబు
నసులు లాఘవమగు నుచలనమగు
గీ. నూలుకొనుసన యుక్తమౌను మఱి యుత్స
హించుటకగు నంగీకార మింక నాను
కూల్యమగుటకుజెల్లె నెగులు ననంగ
దుఃఖభావంబు బాధయౌ దురితదూర 521

1 నీరుపుట్టువు=పద్మము, శంఖము, కౌస్తుభము. 2 నీళ్ళాడు=ప్రవేశించు, స్నానము. 3నుగ్గు=చూర్ణము, ధూళి. 4 నుఱుము=చూర్ణాకృతి, వధ. 5నుడి=అపకీర్తి, వాక్కు. 6 నుసలు=ఉద్యమించుట, మాంద్యపుంబని. 7 నునులు=లాఘవము, చలనము. 8 నూలుకొను=యుక్తము, ఉత్సాహించుట, అంగీకారము, అనుకూల్యము. 9 నెగులు=దుఃఖభావము, బాధ.

గీ. అవని నెట్టుకొనన స్థాయియగుట నుద్య
మించుటకు పేరగు నతిశయించుపేరు
మరి బలాత్కరించుటపేరు వఱలె నెట్టు
నానపసరించు నుద్యమనామ మూను. 522

1 నెట్టుకొను=స్థాయియగు, ఉద్యమించు, అతిశయించు బలాత్కరించు. 2 నెట్టు=త్రోయుట, ఉద్యమము.

గీ, నెత్తమన నక్షకేళిక నెగడె పణము
దనరె మఱి కుధరోపరి స్థలముపేరు
నెప మనంగవ్యాజమునకాఖ్య నెగడె దోష
మలరె కారణమొప్పె మురారిశౌరి. 523.

1 నెత్తము= పాచికలఆట, పణము, కొండమీదిచదరము. 2 నెపము=వ్యాజము, దోషము, కారణము.

క. నెనరనగా ప్రేమంబగు
నెనరనగ కృతజ్ఞతయును నెవ్వన స్థానం
బును స్థైర్యంబు నుపాయం
బును నెయ్యమియన మనోజ్ఞమును స్నేహంబౌ 524

1 నెనరు=ప్రేమము, కృతజ్ఞత 2 నెవ్వ=స్థానము, స్థిరము, ఉపాయము. 3 నెయ్యమి=మనోజ్ఞము, స్నేహము.

క. నిఘమాంతవేద్య నెమ్మి యన
నంగ ప్రేమము నిశ్చలంబునకు గన క్షేమం

బగు కేకియు సంతోషం
బగు వంజుళమునకుజెల్లు హాతదితిజాతా 525

1 నెమ్మి=ప్రేమము, నిశ్చలము, క్షేమము, నెమిలి, సంతోషము, వంజులవృక్షము.

గీ. క్షితిని నెఱపన వ్యాపింపసేయు సిద్ధ
పఱచు పూర్ణించు నధికంబువఱలె నెఱయు
ననఁగ.పూర్ణంబునకు పేరు వ్యాపనమున
కాఖ్య సిద్ధించుటకునామ మమరె శౌరి. 526

1 నెఱపు = వ్యాపింపజేయు, సిద్ధపఱచు, పూర్ణించు,అధికము
2 నెఱయు=పూర్ణము, వ్యాపకము, సిద్ధించుట.

గీ. నెరవు నెఱా నెఱ నెఱ వరయుగాను
వ్యాపకము పూర్తివిధియును వ్యాప్తమధిక
మును విశాలంబు యుక్తంబు దనరె నెరస
నఁగ కళంకము రేణువౌ నిగమ వేద్య. 527

1 నెరవు, నెఱా, నెఱ, నెఱవు, ఇవి సమార్థకములు వ్యాపకము, పూర్తి, విధి, వ్యాప్తము, అధికము, విశాలము. యుక్తము.
2 నెరసు = కళంకము, రేణువు.

గీ. నెఱీయనగ ఖగపక్షంబువఱలె సుంద
రంబు నాచారమును వలిభంబు ప్రజ్ఞ
క్రమము న్యాయంబు విధము వక్రిత పరాక్రి
మంబు కేశంబు పూర్తిపే రంబుజాక్ష 528

1 నెఱి=పక్షిరెక్క, సుందరము, ఆచారము, వలిభము. (ఆడు దాని కొకవచ్చెళ్ళు, ప్రజ్ఞ, క్రిమము, న్యాయము, విధము, వక్రత, పరాక్రమము, కేశములు, పూర్తి.

కం. నెలనా మాసము చంద్రుడు
నెలనా స్థానంబు రాక నెల కర్పూరం
బలరె నెలవంక యనఁగా
గలిగెను బాలేందునకు నఖక్షతిపేరై 529

1 నెల=మాసము, చంద్రుఁడు, స్థానము, రాక (పున్నమ), కర్పూరము. 2 నెలవంక= బాలచంద్రుఁడు, నఖక్షతము.

క. వనరుహలోచన నెవ్వయు
ననఁగ దరిద్రం బవగ్రహం బాపదనే
టన నిశ్చయంబు దృఢమున
కనువగు నేయమన స్నేహమగు న్యాయంబౌ 530

1 నెవ్వ=దరిద్రము, అవగ్రహము, ఆపద. 2 నేటు--నిశ్చయము, దృఢము. 3 నేయము=స్నేహము, న్యాయము.

క. కాంచనచేలధరా! పచ
రించన ప్రకటించ ననుసరించగను ప్రయో
గించు ప్రవర్తించు ప్రసా
రించుటపేరగు మరి ప్రసరించుటకు నగున్ 531

1 పచరించు=ప్రకటించు, అనుసరించు, ప్రయోగించు, ప్రవర్తించు ప్రసారించు, ప్రసరించు.

క. భువి, పట్టన కౌశేయం
బవకాశము పుట్టము విషయ మవశ్యకమౌ
నవసరము విస్తృతి గ్రహిం
చవు స్థానము కారణము గ్రహణమగు శౌరీ. 532

1 పట్టు=కౌశేయము, అవకాశము, వస్త్రము, విషయము, వశ్యము, అవసరము, విస్తృతి, గ్రహించుట, స్థానము, కారణము, గ్రహణము.

గీ. పచ్చనాఁగ హరిత పీత వర్ణములగు
మరకతంబగు పడగ యమరెఁ ధ్వజమున
మను ఫణంబునకును పడయుననఁగా గ
డించు ప్రాపించుటకు పేరు నెగడె శౌరి. 533

1 పచ్చ=ఆకుపచ్చరంగు, పసుపురంగు, మరకతము. 2పడగ=జెండా, పాముపడగ. 3 పడయు=గడించుట, ప్రాపించుట.

సీ. పదునన సమయంబు పరిపాకమునకాఖ్య
సిక్తంబు పేరు ని శితము పేరు
పదరననగు త్వరపడు త్వరవాక్కునా
క్షోభించు చలియించు కోపగించు
పదురు విధము త్వరపడు నధికారమగా
బహువచనంబున త్వరవచనము
పరపన విస్తృతి ప్రవహింపసేయు బా
ణాది ప్రయోగ కృత్యంబు పేరు

గీ. పన్నునా కృత్యమగు సిద్ధపఱచు నంచి
తంబగు లభించు యుద్ధాయతంబొనర్చు
నింక నియమించుటా లభియింపసేయు
టను రాజ్యకరధనమగా నంబుజాక్ష. 534

1 పదును=పరిపాకము, సిక్తము (చల్లుట) నిశితము (వాఁడి]
2 పదరు=త్వరపడు, త్వరవాక్కు, క్షోభించుట, చలించుట, కోపగించుట.
3 పదురు=విధము, త్వరపడు, అధికారము [బహువచనమున] త్వరవచనము.
4 పరపు=విస్తృతి, ప్రవహింపఁజేయు, బాణాదిప్రయోగము, 5పన్ను=కృత్యము, సిద్ధపఱచుట, అంచితము, లభించుట, యుద్ధయత్నము, నియమించుట, లభింపఁజేయుట, రాజుయొక్కపన్ను.

క. అంచితముగ పరగన విహా
రించు ప్రసిద్ధంబగు ప్రసరించుటగు ప్రవ
ర్తించు ప్రయుక్తంబగు ప్రవ
హించు ప్రయాణంబగుటను నెసంగె మునాశీ. 535

1 పరగు=విహరించు, ప్రసిద్ధమగు, ప్రసరించుట, ప్రవర్తించుట, ప్రయుక్తమగుట, ప్రవహించుట, ప్రయాణమగుట.

మ. పరినా సేన సమూహ మావృతియగుఁ బంక్తిన్ వ్యూహాహ్వ
యంబుఁ గొనెఁ
పరికించన్న పరీక్ష సేయుటగు నోపంగ విచారించుటౌ
పరిమార్పన్న వధించు పేరొలయు మఱి భంజించును ఖండించగున్
పరువంబన్నను యౌవనంబు పరిపక్వంబొప్పు ప్రాయం
బగుఁ 536

1 పరి=సేన, సమూహము, ఆవృతి, పంక్తి, వ్యూహము, 2 పరికించు=పరీక్ష సేయుట, విచారించుట. 3 పరిమార్చు=వధించుట, భంజించుట ఖండించుట, 4 పరువము=యౌవనము, పరిపక్వము, ప్రాయము.

గీ. పరిభవించన నతిశయభావమగు ధ
రించు నామంబగు నతిక్రమించు నామ
మమరె పఱియన నన్యంబు నధికమగు స
మూహమునను నభిఖ్యయా మునివిలోల. 537

1 పరిభవించు= అతిశయము, ధరించుట, అతిక్రమించుట, 2 పఱి= అన్యము, అధికము, సమూహము.

క పఱిపఱిఁగ ప్రయోగించుట
పఱిపఱిఁగా తల్పమగును త్వరనామంబౌ
పఱిపఱిఁగ నపసరించుట
పఱిపఱిఁగా విస్తృతియనబడు చోదనమా. 538

1 పఱపు, =ప్రయోగించుట, తల్పము, త్వర, అపసరించుట, విస్తృతి, తొలుకొనిపోవుట.

క. పఱగడయన పార్శ్వంబగు
పఱగడ యితరస్థలంబు పఱగడమఱ్ఱి
మఱి పలునా దంతంబగు
వఱలె ననేకంబుపేరు వాసవవినుతా 539

1. పఱగడ=పార్శ్వము. ఇతరస్థలంబు [రూపాంతరము పరగడము]
2 పలు=దంతము, అనేకము.

క. ధర పలుకన వీణాది
స్వరమగు నిందించు నింగ వాక్యము బీజాం
తరభాగము పక్షుధ్వని
మరి శకలము వాక్కు విద్య మహిం వెలసె హరీ. 540

1 పలుకు=వీణాదిస్వరము, నిందించు, నిందావాక్యము, బీజాంతరభాగము, పక్షుధ్వని, శకలము, వాక్కు, విద్య.

గీ. పల్లటిల్లన చలియించు బరగ రౌద్ర
రక్తిమంబునకగు నసారంబు పేరు
జెల్లె వ్యత్యాసనామమూ పల్లటయనఁ
దనరె చలనంబు వ్యత్యాసమును ముకుంద. 541

1పల్లటిల్లు= చలించుట, రౌద్రము, రక్తిమము, అసారంబు, వ్యత్యాసము. 2 పల్లట= వ్యత్యాసము, చలనము.

క. పసనాఁ జాతుర్యంబగు
పసనా సారము సమృద్ధి పాతిక యనంగన్
వసనము జీర్ణమునకు జే
రెసగె పురాతనముపేరు హేమసుచేలా. 542

1 పస= చాతుర్యము, సాగము, సమృద్ధి. 2 పాతిక= వస్త్రము జీర్ణము, పురాతనము.

గీ. పాటయనఁగ సంగీతమై బరఁగె విధము
నకు నభిఖ్యయు పాటన నాఁగ నొప్పె
ధర నలంకారమునకు నాదరణమునకు
మఱియు సంస్కారమునకాఖ్య మదనజనక. 543

1 పాట= సంగీతము, విధము. 2 పాటన= అలంకారము, ఆదరణము, సంస్కారము.

క. కమలాక్ష! పాటియన సా
మ్యమునకు పరిమితికభిఖ్య న్యాయమున ప్రమా
ణము పేరుబొంటె సామా
న్యమునకు సమమునకునాఖ్య యాశ్రితవరదా 544

పాటి= సామ్యము, పరిమితి, అభిఖ్య, న్యాయము, ప్రమాణము, సామాన్యము, సమము.

క. నగరాధర పాటించన
నగును ప్రతీక్షించునామ మగును విచారిం
చగు నాదరించునామం
బగు పాలించుట ధరించుటౌ భవనాశా॥ 545

1 పాటించు= ప్రతీక్షించుట, విచారించుట, ఆదరించుట, పాలించుట, ధరించుట.

సీ. పాటన శ్రమమగు పతసమాపద యగు
పాదాలవాలంబు స్వస్థమానౌ
పాడినా ధర్మమౌ వ్యవహారమగు స్వభా
వముసకు పేరు న్యాయమున కాఖ్య
పాపన కృషి పేరుబరఁగె వియోగించు
పావనా తారక బాలకాను

పాపటయనఁగను బడెవృక్షభూమిక
వృక్షంబునకు కేశవీధిపేరు

గీ. పామనఁగ ఘర్షణంబు సర్పంబునకగు
పాయనా ఖండమగు నదీభాగమాను
పాలునాఁగ సమీపంబు భాగమును వ
శంబు క్షీరంబులును తండులంబు లగును. 546

1 పాటు= శ్రమ, పతనము, ఆపద, చెట్టుపాదుచేయుట. స్వార్థము. 2 పాడి= ధర్మము, వ్యవహారము, స్వభావము, న్యాయము. 3 పాపు=కృషి చేయుట, ఎడబాటుకలిగించుట. 4 పాప = కనుపాప, బాలుడు. 5 పాపట= వృక్షవిశేషము, కేశవీధి. 6 పాము= ఘర్షణము, సర్పము. 7 పాయ= ఖండము, నదీభాగము. 8 పాలు= సమీపము, భాగము, వశము క్షీరము, తండులములు.

గీ. పాళెమన రక్షణము స్వల్ప పట్టణంబు
జెల్లె సైన్యప్రదేశమా సేనపేరు
చెలగె పిచ్చలించన ప్రశంసించు భయము
నొందు నతిశయమొందుటా కంధరాంగ. 547

1 పాళెము=రక్షణము, స్వల్పము, పట్టణము, సైన్యప్రదేశము. సేన, 2 పిచ్చలించు= ప్రశంశించుట, భయమునొందుట, అతిశయ మొందుట.

గీ. ధరణి పిడినాఁగ ముష్టియా త్సరువు స్త్రీ మృ
గాఖ్య పిమ్మటయన మనోవ్యధయనంత
రంబగును పిఱుఁదనంగ నితంబమునకు
దనరె మఱియు పశ్చాద్భాగమునకు శౌరి. 548

1 పిడి= ముష్టి, కత్తిపిడి, స్త్రీమృగము. 2 పిమ్మట= మనోవ్యథ, అనంతరము. 3 పిఱుఁదు= నితంబము, వెనుకవైపు.

గీ. పిలుకుమారు మృతించు'గాఁపైని నశింపు
బరగ పిఱువడునా భయపడు పరాఙ్ము
ఖంబగును పిల్లయన బాలికకు కనిష్ఠ
మగు బహువచనమున నపత్యంబు పేరు. 549

1 పిలుకుమారు= మరణించుట, నశించుట. 2 పిఱుపడు= భయపడు
పెడమొగమగు, చిన్నది, పత్యము.

క. వనరుహనాభ పిసాళం
బన చోరోపాయము పరిహాసంబగు వ్యా
పనమగు వికాసనామం
బును మరియు ప్రికాశమగును పుణ్యచరిత్రా. 550

1 పిసాళము= చోరులయుపాయము, పరిహాసము, వ్యాపనము, వికా
సము, ప్రికాశము.

గీ. క్షితి పిసాళియనఁగ ప్రకాశితయు వ్యాప
కత్వమగును చోరోపాయకంబు పేరు
పుట్టనాఁగ జన్మస్థానము మరి స్వల్ప
కుంజమగును వల్మీకమహా కుంజరనుత. 551

1 పిసాళి= ప్రికాశము. వ్యాపకము, చోరోపాయము. 2 పుట్ట=
జన్మస్థానము, స్వల్పమగుకుంజము, వల్మీకము.

సీ. పుయిలోటనాఁ బరాఙ్ముఖ మగుటకు పేరు
తనరెను సంకోచమునకభిఖ్య
పురణించునన పేరు బుట్టు పురాయించు
చెల్లె జృంభించు వర్ధిల్లుటకును
పురియన వ్యాపకంబును రశ్మిసంబంధ
మునగు కేకీపింఛమునకు పేరు

4 పురుడనఁగ సమానమునకు జాతాశౌచ
మమరె జాతాశౌచమునకుఁ బేరు
గీ. పూఁటనా సంధ్యకును దినంబునకు కాల
మునకు నామంబుజెల్లెను పూచుననఁగ
వెలసె నిస్సారమగుట పుష్పించుటలరె
పూరియనఁగ మృగస్తన్యమును తృణంబు. 552

1 పుయిలోటి= పరాఙ్ముఖము, సంకోచము. 2 పురణించు (రూ) పురాయించు= విజృంభించుట, వర్ధిల్లుట. 3 పుర= వ్యాపకము, త్రాడుదుక్క పురి, నెమలిపింఛము, 4 పురుడు= సాటి, జాతాశౌచము, జాతాశౌచము కలుగుట. 5 పూఁట= సంధ్య, దినము, కాలము. 6 పూచు= నిస్సారమగుట, పుష్పించుట. 7 పూరి= మృగస్తన్యము, తృణము.

క. ధరబూఁపయనఁగ శిశువగు
తరుణము నవజాలకంబు తారక పేరా
మరి పూనన యత్నించుట
ధరియించు వహించు పేరు దనరెముకుందా. 553

1 పూప=శిశువు, తరుణము, క్రొత్తమొగ్గ, చుక్క. 2పూను=యత్నించుట, ధరించుట, వహించుట.

క. పెంపన గౌరవ
మగును మహత్త్వంబు పేరు నతిశయనామం
బగును సమృద్ధియు నాశం
బగు నాశముచేయుటకు విహంగతురంగా. 554

1 పెంపు=గౌరవము, మహత్త్వము, అతిశయము, సమృద్ధి, నాశనము, నాశనముచేయుట.

గీ. పెక్కుతయన నాధిక్యంబు బేరు వ్యర్థ
నమగు పెడయనఁగ విపరీతము పురాత

నంబు జ్యేష్ఠత్వమగు పెరనాఁగమధుజ

నిత గృహంబగు నన్యమహా దితిజవైరి. 555

1. పెక్కువ=అధిక్యము, వ్యగ్రము. 2 పెద=విప్రకీర్ణము, ప్రఖ్యాతనము జ్యేష్ఠత్వము. 3 పెర=మధుజనితగృహము (కల్లఁగడి) లన్యము.

గీ. పెనకువయనంగ యుద్ధంబుపేరు మేళ

నంబగు వివాదబాహాయుద్ధంబు నావ

రింపగును పెనఁగన నావరించు ప్రతివ

చించు మేళనకృతి యాజిసేయుటౌను. 556

1 పెనకువ=యుద్ధము, మేళనము, వివాదము, బాహుయుద్ధము, ఆవ రించుట, 2 పెనఁగు=ఆవరించుట, ప్రతివచనము నొసఁగుట, మేళనము చేయుట.

గీ. పెరుఁగనగ దధినామమహా వృద్ధిబొందు

పేరగును పెఱుగన విజృంభించునామ

మగును యత్నించుటౌను పెల్లనఁగ నతిశ

యంబు నాధిక్యమత్యంతమహాను శౌరి. 557

1 పెరుఁగు=దధి, వృద్ధినొందుట, 2 పెఱుఁగు=విజృంభించుట, యత్నించుట. 3 పెల్లు=అతిశయము, ఆధిక్యము, అత్యంతము.

క. పెలుచన నతిశయంబై

యలరెను కాఠిన్యమునకు నాగ్రహమునకున్

చెలగె నాధిక్యనామము

పెళుచనఁగా మూర్ఖుడౌను విరసమగు హరీ. 558

1 పెలుచ=అతిశయము, కాఠిన్యము, ఆగ్రహము, అధిక్యము, 2 పెళుచు=మూర్ఖుఁడు, విరసమగుట.

గీ. పేదఱికమనా దరిద్రమహా భీరువౌను

పేరిమియన నతిశయము గౌరవంబు

పైఁడినా స్వర్ణము ధనంబు పైకొనన న
తిక్రమించు లభించు యత్నించు వ్యాప్తి.    559

1 పేదఅమి=దరిద్రము, పిఱికివాఁడు, 2 పేరిమి=అతిశయము, గౌర
వము. 3 పైఁడి=బంగారము, ధనము. 4 పైకొనన=అతిక్రమించు, లభించు
యత్నించు, వ్యాప్తి.

క. మనసిజజనకా! పొంగా
రన పొంగన నతిశయించు నా గర్వంచు
త్సాహమగు వర్ధిలు జృంభిం
చును సంతోషించు పేరు చూపడె శౌరీ.    560

1 పొంగారు, పొంగు=అతిశయించుట, గర్వించుట, ఉత్సాహగుట,
వర్ధిల్లుట, జృంభించుట, సంతోషించుట,

క. కమలాక్షా! పొందన స్నే
హము ప్రాపించగును సంధియగు ప్రాప్తి యభే
దము స్నేహితుండు ననుకూ
లము మేలనమగుట కాఖ్య లక్ష్మీనాథా.    561

1 పొందు=స్నేహము, ప్రాప్తించుట, ప్రాప్తి, అభేదము, స్నేహి
తుఁడు, అనుకూలము, మేలనము.

క జగతిని పొంపిరిపోవన
నగును గుణోత్పత్తి వర్ధిలాఖ్య విజృంభిం
చగు సంతసించు వ్యాపిం
చగు నింక బ్రసిద్ధికెక్కు నతిశయమొందన్    562

1 పొంపిరిపోవు=గుణోత్పత్తి, వర్ధిల్లుట, విజృంభించుట, సంతసిం
చుట, వ్యాపించుట, ప్రసిద్ధికెక్కుట, అతిశయించుట.

సీ, పొక్కయన నవధి యుపాయమునకు జెల్లు
పొక్కసగ దుఃఖమగు భయంబును దపించు

ఱాను చర్మరోగవిశేషమౌ పొగడిత
యనఁగ కీర్తికి స్తుతికావ్హాయఁబు శౌరి. 563

1 పొక్కి=అవధి, వుపాయము. 2 పొక్కు=దుఃఖము, భయము, తపించుట, చర్మరోగము, 3 పొగడిత=కీర్తి, స్తుతి.

గీ. పొదిరనఁగ దీర్ఘమగు గర్వమునకభిఖ్య
వెలసె తీక్ష్ణగంధంబు పేరొలసె పొచ్చె
మనగ కపటంబగును న్యూనమగును పొటక
రించనగ వర్ధిలు నతిశయించుశౌరి 564

1 పొగరు=దీర్ఘము, గర్వము, తీక్ష్ణగంధము, 2 పొచ్చెము=కపటము, తక్కువగుట, 3 పొటకరించు=వర్ధిలు, అతిశయించు.

క. విను పొటమన నాసాపుట
మును పుష్పాద్యుద్భవంబు పొడ తెంచనగా
గుణజననం బుదయించుట
యును పొడవడఁగన నశించుటొప్పె మృతించా. 565

1 పొటము=నాసాపుటము, పూవులపుట్టుక, 2 పొడతెంచు=గుణోదయము, ఉదయించుట 3 పొడవడగు=నశించుట,మరణించుట.

గీ. పొడుగనఁగఁజెల్లె నౌన్నత్యమునకు దీర్ఘ
మునకు నుత్కృష్టమున కాఖ్య పొత్తనఁగ
స్నేహమగు నవిభక్తతచెల్లె సంగ
తంబు సంగతి నామమౌ దానవారి., 566

1 పొడగు=ఔన్నత్యము, దీర్ఘము, ఉత్కృష్టము. 2 పొత్తు=స్నేహము, అవిభక్తత, స్నేహము, కలసియుంట,

గీ. పొదియనంగ పశుసస్య మూలమౌ స
మూహమగును తూణీరమై పొసఁగును పొద

పెట్టనఁగ నారోపించు పుట్టెపేరు
మఱియును చించుపేరగు మదనజనక. 567

1 పొది=పశుస్తనమూలము, సమూహము, అంబులపొది 2 పొదపెట్టు=ఆరోపించుట,చించుట,

గీ. పొదుగనఁగ నాచ్ఛాదనమునగు ఖచిత
మగును పక్షిప్రసూత చిహ్నంబుపేరు
జొల్లె పొనుపడుననఁగ నిస్తేజమగును
వ్యర్థమగుటకు పేరగు వారణమగు. 568

1 పొదుగు=ఆచ్ఛాదనము, ఖచితము,పక్షులప్రసూతిచిహ్నము 2 పొనుపడు=కాంతిమాయుట, వ్యర్థమగుట, అడ్డుపడుట.

క. పొరయుననఁ బ్రాప్తమగు పెర
డరయ తిరోహితమగుటకు నగును లభించా
పొరియన బలియత్యంతము
మరి దృఢముగ క్రిమమునగు మన్మథజనకా. 569

1 పొరయు=ప్రాప్తమగుట, పెరఁడు, చాటునఁజేయుట, లభించుట 2 పొరి=బలి, అత్యంతము, దృఢము, క్రిమము.

క. పొరయన వళియగు దర్వీ
కరకంచుకమునకుపేరు కదళీపత్రా
వరణము పొన్నయన మనో
హరమగు పున్నాగవృక్షమగు సురపాలా. 570

1 పొర=వళులు,పాముకుబుసము,అరటియాకులఆవరణము 2పొన్న=మనోహరము,పున్నాగవృక్షము.

గీ. పొరిగొనఁగ నాశముఁజేయు వధియించు
పొరుగనఁగ సమీపమునకు పార్శ్వ
భువికి పేరువెల్లు పొలపమన ప్రకాశ
మగును వాసనయగు వ్యాప్తమగును. 571

1 పొరిగొను=నాశనముచేయుట, వధించుట, 2 పొరుగు=సమీపము పార్శ్వము. 3 పొలపము=ప్రకాశము, వాసన, వ్యాప్తమగుట.

క. పొలమనగా సస్యోర్వర
పొలమనగా తృణసమృద్ధిభువియౌవిధమా
పొలమన సూచన గ్రామము
పొలమన విపినము ప్రదేశమునకాఖ్య హరీ. 572

1 పొలము=పైరుగలభూమి, గరికగలభూమి, విధము, సూచన, గ్రామము, విపినము, ప్రదేశము.

గీ. క్షితిని పొలయుననఁగ ప్రవేశించు సంచ
రించు వ్యాపించుటౌ సమీపించుటను
పొలసనఁగ పొలయన మాంసమునకు మాంస
గంధమునకును మత్స్యశల్కమున కాఖ్య. 573

1 పొలయు=ప్రవేశించు, సంచరించు, వ్యాపించు, సమీపించు. 2 పొలసు, పొల=మాంసము, మాంసగంధము, చేఁపపైనిచర్మము.

క. పొలయినా మృతి నాశము
పొలయునన నశించుట మృతిఁబొందుట పేరా
పొలుచన ప్రత్యక్షము స్థిర
మలరెను పూజ్యమగు దృశ్యమగుటకు పేరై. 574

1 పొలయిక=మృతి, నాశనము, 2 పొలియు=నశించుట, మృతినొందుట, 3 పొలుచు=ప్రత్యక్షము, స్థిరము, కనిపించుట.

గీ. అవని పొలిపోవునా వ్యర్థమగుట భంగ
పడు నశించు మృతించు పేగడరె పొసఁగు
నాలభిం చనుకూలించు నావు మమరి
ప్రాప్యమగు పూజ్యమునకగు పంకజాక్ష. 575

1 పొలిపోవు,= వ్యర్థమగుట, భంగమగుట, నశించుట, మరణించుట. 2 పొసఁగు= లభించు, అనుకూలించు. చేరఁదగినది. పూజనీయమైనది.

గీ. పోఁడియన పూజ్య మంచితంబును మనోజ్ఞ
మగాను పోఁడిమినాఁగ సౌఖ్యంబు విధము
పూజ్యమగు సంపదను పేరు పోకడయన
గలిపరివర్తన నాశంబు గమనమగును॥ 576

1 పోడి=పూజ్యము, అంచితము, మనోజ్ఞము. 2 పోఁడిమి=సౌఖ్యము, విధము, పూజ్యము సంపద, పోకడ, కలివర్తనము, నాశనము, గమనము.

సీ. పోకయన గమనము పేరుబుట్టె బహువ
చనమునను కపటపరివర్తనము మఱి ప్ర
వర్తనమగు పోటనఁగ నుల్బణము రణము
శౌర్య మాయుధ ముఖఘాత జలదమూర్తి॥ 577

1 పోక=గమనము, (బ. వ) కపటవర్తనము, ప్రవర్తనము. 2 పోటు= ఉల్బణము, యుద్ధము శౌర్యము, ఆయుధపుదెబ్బ.

కం పోరామియనఁగ స్నేహము
పేరగు సంకటమునకును బేరాప్తతయా
పోరచియన వ్యర్థము ని
స్సారం బుపహారమగును సారసనాభా॥ 578

1 పోరామి= స్నేహము, సంకటము, ఆప్తత. 2 పోరచి= వ్యర్థము నిస్సారము, ఉపహారము,

కం పోరన కలహము యుద్ధము
పోరన కలహించు యుద్ధమును జేయుటకౌ

పోరితమన కలహంబగు
పోరితమన స్పర్థకౌను బుధనుతచరణా. 579

పోరు= కలహము, యుద్ధము- కలహించుట- యుద్ధముచేయుట.
2 పోరితనము= కలహము, స్పర్థ.

గీ. పోరువయనంగ నుత్తరీయమునకు నాహ్వా
యంబగు కదళీపత్త్రమూలావరణము
పోలనంగ యుక్తమగుటకు పూజ్యమగుట
కౌను శక్యమగుట సామ్యమగుట కాఖ్య. 580

1 పోరువ= ఉత్తరీయము, అరటిగూరల మొదటిపొర. 2 పోలు= యుక్తమగు, పూజ్యమగు, శక్యమగు, సామ్యమగు.

సీ. పోసనమన లేప్యమును కాంతి క్షీరమౌ
పోహణపాత్రిత్వమును ఘటనయు
ప్రబ్బన వ్యాపించు వర్తిల్లు నతిశయ
మొందువర్ధిలు నింద నిందసేయు
ప్రల్లదంబనంగ దుర్భాషణంబగును పా
రుష్యంబు దుష్కృత్యరూపమౌను
ప్రాతనా, బూర్వంబు బరగె పురాతన
ములరెను భృత్యునకాఖ్యయయ్యె

గీ. ప్రాబడనంగ సిద్ధించు పురాతనమగు
బానుపాత్రమన నాచ్ఛాదమౌను మారణమగు ఘర్షించుటకు మీలనంబు లేప
నముపసనమలినక్షాళనంబు శౌరి 581

1 పోసనము=లేప్యము, కాంతి, క్షీరము. 2 పోహణ= పాత్రత్వము ఘటనము, 3 ప్రబ్బు= వ్యాపించు, వర్తిల్లు, అతిశయమొందు, వర్ధిల్లు, నింద, నిందజేయు. 4 ప్రల్లదము= దుర్భాషణము, పారుష్యము, దుష్కృత్య

యాపము. 5 ప్రాఁత= పూర్వము, పురాతనము, భృత్యుఁడు. 6 ప్రాబఁడు= సిద్ధించు, పురాతనమగు. 7 ప్రాము= ఆచ్ఛాదనము, మారణము, ఘర్షించుట' మాయుట, పూయుట, వస్త్రపుమలినముకడుగుట,

గీ. ప్రిదులనఁగ చ్యుతమగుట పుష్పించు న్యాన
మపసరిల్లాఖ్య ప్రెగ్గడ యనఁగ మంత్రి
యౌను యువరాజు ప్రేముడించన ప్రియపడు
బాధపడు శోకమందుట భవవినాశ. 582

1 ప్రిసులు= చ్యుతమగుట, పూలుపూయుట, న్యూనము, అపసరిల్లు. 2 ప్రెగ్గడ= మంత్రి, యువరాజు, ప్రేముడించు, ప్రియపడు, బాధపడుఁ శోకమందుట.

కం భువి ప్రొద్దన కాలంబు ప్ర
సవదినమగు దినము పేరు సమయము పేరౌ
రవియగును నుషఃకాలం
బవు బంతియనంగ పక్తియగు కందుకమౌ 583

1 ప్రొద్దు= కాలము, ప్రసవదినము, సమయము, సూర్యుఁడు, ఉషఃకాలము. 2 బంతి= పఙ్క్తి, కందుకము.

గీ. బంటనఁగ శిష్యుఁడౌను సేవకుడు శూరు
డగును బగిసియు బైసియనఁగను గౌర
వంబు భాగ్యంబునకుఁజెల్లు బచ్చెన యన
బరగె లేప్యము శుక్లాది వర్ణము హరి. 584

1 బంటు= శిష్యుఁడు, సేవకుఁడు, శూరుఁడు. 2 బగిసి, బైసి= గౌరవము, భాగ్యము. 3 బచ్చెన= లేప్యము, తెలుపుమొదలగురంగులు.

సీ. బడియన క్రమమగు పాఠశాలయును వ
శ్చాదర్థమగును నిశ్చయము పేరు
బడుగన కృశము శవం బశక్తుడు బన్న

మన నవమానమరా నాపదయును
బరియన రేఖయగా పార్శ్వమగా చోరుఁడగా
నంకుశంబగు శత్రునాహ్వయంబు
బరిగోలయన సృణి బాణమగాను బలిత
మన బలిష్ఠము స్థూలము నన దగు

గీ. బలువనఁగ నధికంబగు బలము పేరు
జెల్లె బాగన విధమగు క్షేమమగును
సుందరంబగు బామన శోకమునకు
జన్మమునకాఖ్య జెల్లెను జలజనయన. 585

1 బడి= క్రమము, పాఠశాల, వెంబడి, నిర్ణయము. 2 బడుగు= కృశము, శవము, అశక్తుఁడు 3 బన్నము= అవమానము, ఆపద. 4 బరి= రేఖ, పార్శ్వము, చోరుఁడు- అంకుశము, శత్రువు. 5 బరిగోల= సృణి (అంకుశము) బాణము. 6 బలితము= బలిష్ఠమైనది, లావైనది. 7 బలువు= అధికము, బలము, 8 బాగు= విధము, క్షేమము, సుందరము, 9 బామము= శోకము, జన్మము.

గీ. బారియన హింసయగును నిర్బంధము కరి
నిగళమగును బార్హాదియనగ ననేక
మునకు నధికంబునకుపేరు దనరె బాస
వాలనఁగ ఋషి దేవత వఱలె శౌరి 586

1 బారి= హింస, నిర్బంధము, ఏనుగుసంకెళ్ళు. 2 బార్హాది= అనేకము అధికము. 3 బాసవాలు= ఋషి, దేవత.

గీ. బాసయనఁగ ప్రతిజ్ఞయగా భాషయగు ప్ర
మాణమగును సంకేతమగా మఱి వ్రతమగు
బింకమన గర్వమగు దృఢం బింక నున్న
తంబగుట కాఖ్య జెల్లను దానవారి 587

బాస= ప్రతిజ్ఞ, భాష, ప్రమాణము, సంకేతము, వ్రతము. 2 బింకము= గర్వము, దృఢము, ఉన్నతము.

క॥ నిగమాంతవేద్య బిడ్డయ
నగ బాలుండగు సుపుత్రినామము పుత్రుం
డగు బిత్తరమున చంచల
మగును ప్రకాశము విలాసమగు సరసంబా 588

1 బిడ్డ= బాలుండు, పుత్రిక, పుత్రుడు. 2 బిత్తరము= చంచలము, ప్రకాశము, విలాసము, సరసము.

గీ. బిమ్మిటియన సంకోచమ్ము వివశమాను
బిరుదనంగ శౌర్యచిహ్నంబుపేరు శూరు
డగు సహర్షంబగును బుజయనంగ భుజము
కుండలీకరణంబగు కోమలాంగ. 589

బిమ్మిటి=సంకోచము. వివశము. 2బిరుద= శౌర్యచిహ్నము, శూర, శూరుండగుట, సమగ్రము. 3 బుజ= భుజము, కుండలీకరణము.

గీ. బిల్లయనగను రవిశశిబింబము లుప
ధానమగు మణివర్తులత్వంబుపేరు
బరగె లోహాదివర్తుల పత్రికాఖ్య
జెల్లె ఖండమునకుపేరు శేషశయన 590

1 బిల్ల= రవిశశిబింబములు,ఉపధానము,(దిండు)గుండ్రమైనది, లోహప్రపతకము, ఖండము.

గీ. బిందువ్రమున బుడిబుడియన నల్పమాను
సంభ్రమించుటకా బురసాయనంగ
హేమతంతువు కౌశేయనామ మమరె
యరుణకౌశేయమున శాఖ్యయగు ముకుంద 591

1 బుడిబుడి=అల్పము, సంభ్రమించుట. 2 బురసా= బంగారుతీఁగ పట్టుపత్త్రము.

గీ. బూటకంబన బూకనాఁ బొసఁగె మాయ
వంచనకుపేరు బూమెనా వంచనాఖ్య
యగు కపటవేషమును మాయయనుబొంగ
యనఁగ నార్తధ్వనికి విరహాగ్ని కౌను. 592

1 బూటకము, బూక= మాయ, వంచకుఁడు. 2బూమె= వంచకుఁడు కపటవేషము, మాయ. 3బొంగి= ఆర్తధ్వని, విరహాగ్ని.

గీ, వసుధ బెగ్గిల్లనఁగ పరవశమగు భయ
పడును చింతించు చలియించు బిరుసు బెట్టి
దమన కఠినంబు క్రౌర్య ముద్ధతము బహుళ
చనమునను నిష్ఠురోక్తులౌ జలదగాత్ర 593

1బెగ్గిల్లు= పరవశమగు, భయపడు, చలించు. 2 బెట్టిదము= కఠినము క్రౌర్యము, ఉద్ధతము, (బహుళ ఘనమున) నిష్ఠురోక్తులు,

కం జగతిని బెట్టన గౌరవ
మగు దృఢమునకాఖ్య యతిశయము నుద్ధతిపే
రగు బెడఁకన బెణఁకనగా
నగు చలనము నపసరిల్లుటాఖ్య ముగాఁదీ. 594

1 బెట్టు= గౌరవము, దృఢము, అతిశయము, ఉద్ధతి, బెడఁగు, 2బెణకు= చలనము, అపసరిల్లుట.

గీ. బెడఁగగన మనోజ్ఞ మధికంబుపేరు సుంద
రము విలాసంబగును బెడిదమన బీడి
దంబనఁగ కఠినం బధికంబు పరుష
వచనము భయంకరంబగు వాసుదేవ 595

బెడఁగు=మనోహరము, అధికము, సుందరము, విలాసము. 2 బెడిదము, బేడిదము= కఠినము, అధికము, పరుషవచనము, భయంకరము.

గీ. బెడిదయునన బెసుకనఁగను వికలమగుట
కగును దోషంబగు బెరయు ననలభించు
మఱియు బ్రాపించు వ్యాపించు వఱలె బెఱుకు
నాఁగభేదంబగు బ్రయోజనంబగు హరి 596

1 బెడియు, బెసుకు= వికలమగుట, దోషము. 2 బెరయు= లభించు ప్రాపించుట, వ్యాపించుట. 3 బెరుకు= భేదము, ప్రయోజనము.

కం బేరజమన కుత్సితునకు
పేరు కపటవర్తనంబు పేరు పరుషవా
క్కాగ్రాబై సియనంగను
గౌరవమగు భాగ్యమగును ఘనరుచి దేహా 597

1 బేరజము= కుత్సితుడు, కపటవర్తనము, పరుషవాక్యం, 2 బైసి= గౌరవము, భాగ్యము.

గీ. బొట్టనంగ ననుస్వారమును జలాది
బిందువగును మంగళసూత్ర భృత్సువర్ణ
పత్త్రమగు తిలకముపేరు బరగెబొమయు
నంగ ప్రతిమయు భ్రూవగు నలిననాభ 598

1 బొట్టు= అనుస్వారము, జలబిందువు, మంగళసూత్రము, తిలకము 2 బొమ= కన్నుబొమ, ప్రతిమ.

కం మురహర బొమ్మయనంగను
బిరుదాంకంబగును ప్రతిమపేరగు భ్రూవౌ
నగసిజగర్భం డల్పం
బరయగ నవమానచిహ్నమగు నాంధ్రమునన్ 599

1 బొమ్మ= బిరుదాంకము, ప్రతిమ, కనుబొమ్మలు, బ్రష్టశిల్పము, అవమానచిహ్నము.

గీ. బోరియనా గంధ్రిమును గర్తమును బలంబు
బరగె బోటన ధూర్తుఁడా ప్రౌఢునకు న
భిఖ్య కుధరోపరిస్థలి పేరు బోన
మనఁగ భోజనమగు నన్నమౌను శౌరి 600

1 బోరియ= రంధ్రము, కలుగు, బలము. 2 బోటు= ధూర్తుఁడు, ప్రౌఢుఁడు, కొండపైనిగలతావు. 3 బోనము= భోజనము, అన్నము.

మ. వసుధన్ బోయనఁ గిరాతకుఁడుక్తి వర్తుండగున్ బ్రాఁతినాఁ
బొసగెన్ ప్రేమము దుర్లభంబధికమై బ్రుంగన్న గూఢస్థలం
బెస మగ్నంబగు ముందునాగను జ్వలించీర్ష్యాదితాపంబు పెం
పెసగెన్ మంతనఁగా బ్రసిద్ధియగు మంత్రీశుండు మాత్రంబగున్.

1 బోయ= కిరాతుఁడు, చేఁపలబట్టువాఁడు. 2 బ్రాఁతి= ప్రేమ, దుర్లభము, అధికము. 3 బ్రుంగు= గూఢస్థలము, మగ్నమగుట, మునిఁగించుట, మండుట, ఈర్ష్యాదులవలనితాపము. 4 మంతు= మంత్రి, మంత్రము.

గీ. మంతనంబన గోప్యమేకాంతమగును
మఱియు నాలోచనంబగు మందయనగ
గోష్ఠమగు పశుబృందమౌ ఘోషమౌను
మందటయన సన్నిధికి నమ్రితకుపేరు 602

1 మంతనము= రహస్యము, ఏకాంతము, ఆలోచనము. 2, మంద= కొట్టము, పశుసమూహము, గొల్లపల్లె. 3 మందట= చేరువ, అడుసువ.

గీ. మందలయనంగ సన్నిధి మాడ్కియనుగ
డగును మందె మేలమన స్నేహమనురాగ
మగు నుపేక్షయు మఱకళించనఁగను సవ
రించు సదృశమావర్తించ 603.

1 మందలు= సన్నిధి, మాడ్కి, బ్రదుకుదెరువు. 2 మంజిమేలము= స్నేహము, అనురాగము, ఉపేక్ష. 3 మక్కళించుట= సవరించుట, సద్భ్రశము, ఆవిర్ర్భించుట.

కం. జగతిని మక్కన మలినం
బగు కాంతి విహీనమగుట కాఖ్యయగు మృతిం
చగు రోగపీడితంబగు
మగటిమిపుంసత్వమగును మఱి పౌరుషమా 604

1 మక్కు= మలినము, కాంతివిహీనమగుట, మరణించుట, రోగము చేబాధింపబడుట. 2మగటిమి= మగతనము, పౌరుషము.

కం. మగఁడన పతి పురుషుడు రా
జగును మహాశూరునాఖ్యయగు మచ్చిక నా
నగు మోహంబాసక్తియు
మగపాడియనంగ శౌర్యమగు నుపరతియా 605

1 మగఁడు= పతి, పురుషుఁడు, రాజు, మహాశూరుఁడు, 2మచ్చిక= మోహము, ఆసక్తి, 3 మగపాడి=శౌర్యము, ఉపరతి.

గీ. ఉర్వి మచ్చన పారవశ్యౌషధియగు
సౌధమగు మట్టుమనంగ హ్రస్వంబు న్యూన
మగును పరిమితియాను మట్టాడనంగ
సంచరించుటకౌను వ్యాపించుటౌను 606

1 మచ్చు = పారవశ్యౌషధి, సౌధము, 2 మట్టు= హ్రస్వము. తక్కువ, పరిమితి. 3 మట్టాడు= సంచరించుట, వ్యాపించుట.

కం. ధరమడుఁగన నుపశాంతియుఁ
బరిశుద్ధాంబరము హ్రదము పద్మాకరమా
పరిశుద్ధము తాంబూలం
బరయఁగ నమ్రిమగుపేరు హాటకచేలా 607

1 మడుంగు= ఉపశాంతి, పరిశుద్ధాంబరము, హ్రదము, [illegible] పరిశుద్ధము, తాంబూలము, నమ్రత్వము.

గీ. అవని మడఁకయనంగ పర్ణాది యోజ
యగును బద్ధముపభవాలవగును మడఁగ
నంగ నమ్రమవమావృతనామము మడు
పన విముఖమగు నిష్ఫలమగును శౌరి. 608

1 మడఁక, = ఆకులుమున్నగునవిముడుచుట. ఎద్దులు [illegible] నాగలి 2 మడఁగు= అడఁగియుండుట, మరలుట. 3 మడుపు— [illegible] నిష్ఫలము.

గీ. మడియనంగ కేదారనామంబు శుద్ధ
వస్త్రమునకాఖ్య మదినాఁగ వఱలె బుద్ధి
మనము వెలుగొందె మనుగడ యనఁగ జీవ
నంబు జీవనోపాయమగు నలిననాభ. 609

1 మడి= వరిమడి 2 శుద్ధవస్త్రము. మది= బుద్ధి మనస్సు, 3 మను గడ= జీవనము, జీవనోపాయము.

కం మనునా వర్తిలు మృత్తిక
యును జీవంచగును ఋష్య ముర్వికి పేరౌ
మనికియన వసించుట జీ
వనమగు జీవించుటగును వాసస్థలమౌ. 610

మన్ను=మట్టి, జీవము, ఋష్యమనుజంతువు, భూమి. 2 మనికి—జీవనము జీవించుట, నివాసస్థలము.

కం మనువన భర్తయగుఁ జీ
వనమగు మరణించు పతినివరియించగు వ
ర్తనమగు మన్నన మృత్తు న
వనికిని ఋశ్యమృగమాఖ్యవఱలె మురారీ. 611.

1 మనువు=భర్త, జీవనము, మరణించుట, భర్తనువరించుట, వర్తనము. 2 మన్ను=మృత్తిక, భూమి, ఋశ్యమృగము.

గీ. మబ్బనంగను మేఘనామంబు తిమిర
మునకభిఖ్యయు నజ్ఞానమునకు పేరు
మరులునాఁగ పిశాచనామంబు మోహ
మునకుఁ బేరగు భవనామవనధితరణి. 612

1 మబ్బు=మేఘము, చీకటి, అజ్ఞానము. 2 మరులు=పిశాచము, మోహము.

గీ. మఱపనఁగ విస్మృతియగుఁ బ్రమాదమగును
పారవశ్యంబు నజ్ఞాన భావమగును
మఱుఁగనఁగ గూఢమునకు నామము తిరోహి
తంబు సంతాపమొందుట నంబుజాక్ష 613

1 మఱపు=మఱచిపోవుట, పొరపాటు, పారవశ్యము, అజ్ఞానభావము. 2 మఱుఁగు=గూఢము, చాటునకుఁబోవుట, సంతాపమొందుట.

కం. అంచితముగ మలయు ననఁగ
సంచారం బుద్యమించు సంకీర్ణము వ్యా
పించు తపించగు నుద్రే
కించగు నాంధ్రమున కలుమగిరి వజ్రపదా 614

1 మలయు=సంచారము, ఉద్యమించుట, సంకీర్ణము, వ్యాపించుట, తపించుట, ఉద్రేకించుట.

కం. మసకవయిన స్వల్పాసిత
మెసగె ప్రదోషాంధకారగ మిటుల మసక యా
మసకంబన సంభోగము
వెస సంభోగేచ్ఛ పేరు వెలసె మురారీ 615

1 మసక=కొంచెము తెలుపురంగు, సాయంకాలపుచీకటి, సంభోగము, సంభోగేచ్ఛ.

కం. ఖగపతి వాహన మసలు న
నగ విహరించుట జలతప నం బాలస్యం
బగు నావర్తించుట పే
రగు మస్తనగా సమృద్ధియగును మదంబౌ. 616

1 మసలు=విహరించు, నీటిని కాచుట, ఆలస్యము, వర్తించుట. 2 మస్తు=సమృద్ధి, మదము.

గీ. ధరణిమాటనగా తిరోధానమునకు
నుపశయమునకు నావృత్తి కొప్పె మాటు
నా నివారించు మోచన మాను వృక్ష
మగు మనోజ్ఞమునకు నామ మలరె శౌరీ. 617

1 చాటు=చాటుగనుండుట, ఉపశయనము, వలయమాటు, మాను=నివారించుట, మోచనమగుట, వృక్షము, మనోహరము.

గీ. మాపనంగ ప్రదోషంబు మలినకృత్య
మగును రాత్రికి జెల్లు మారన నరించు
ప్రతిముఖుండగు నావృత్తి ప్రతియు నన్య
మగును ప్రతిరూపమగుటకౌ నంబుజాక్ష. 618

1 మాపు=ప్రదోషము, మాసిపోవుట, రాత్రి. 2 మారు=ఎదిరించుట, ఎదురుదిరుగుట, పర్యాయము, మఱియొకటి, ఇతరము, ప్రతిరూపమగుట.

గీ. మాలిమియన నౌకాశాస్త్రమర్మమౌను
మఱియు వాత్సల్యమునకగు మాలె నాఁగ
మాలికకు సౌధమునకాఖ్య మాసటియన
మల్లునకు శూరునకు పేరు జెల్లె శౌరి. 619

1మాలిమి=నౌకాశాస్త్రమర్మము, వాత్సల్యము. 2 మాలె=దండలు, సౌధము, 3 మాసటీ=మల్లుఁడు, శూరుఁడు,

గీ. మావనఁగనశ్వములసంగ మము తురగము
మీనకుల మూర్పితౌషధంబౌను మించ
నఁగ ప్రకాశము చంచలయగును మిండ
డనఁగ విటుఁడగు పురుషుండు నధికుఁడౌను.　　620

1 మావు=గుఱ్ఱములసంగము, గుఱ్ఱము, చేపలనుఁబట్టు సాధనము, 2 మించు=ప్రకాశము, మెఱుపు. 3మిండఁడు=విటుఁడు,పురుషుఁడుఅధికుఁడు.

గీ. అవని మిక్కిలినా శ్రేష్ఠ మధికమౌను
మిగులనఁగ శేషము నతిక్రమించు నతిశ
యించు శేషించుపేరగు నీక మిటార
మనఁగ నతిశయ మున్నతం బగును శౌరీ.　　621

1, మిక్కిలి=శ్రేష్ఠము, అధికము. 2 మిగులు=శేషము, అతిక్రమించుట, అతిశయించుట, శేషించుట. 3 మిటారము, అతిశయము, ఉన్నతము

చ. అవని మిటారియన్న ప్రమదాఖ్యయు నున్నతమైనదాని పే
రవు మిడినాఁగ తీక్ష్ణమునకౌ మఱి గర్వము నున్నతంబు పే
రవు నీక మిట్ట తీక్ష్ణమునకాఖ్యయు నున్నతభూమి యున్నతం
బవు మిడిపోవునాఁదొలఁగుటౌ మఱినూన్యనమగుఁ జనార్దనా.

1 మిటారి=స్త్రీ, ఉన్నతమైనది. 2 మిడి=తీక్ష్ణము, గర్వము, ఉన్నతము; 3 మిట్ట=తీక్ష్ణము, ఉన్నతభూమి, ఉన్నతము. 4 మిడిపోవు=తొలఁగుట, తక్కువగుట,

గీ. ధర మిడియనఁగ బహుఃపరిధావనమగు
నుద్గమంబగును మిడుఁగు ఱొప్పె నగ్ని
కణముఖద్యోతమున మిత్తియనఁగ మృత్యు
దేవతకు మృతిపేరగు దీనరక్ష.　　623

1 మిడియు=వెలికుఅుకుట, ఎగురుట, 2 మిణుఁగురు—అగ్నికణము, మిణుఁగురుపురుగు. 3 మిత్తి=మృత్యుదేవత, మృతి.

కం ఆంచితముగ మిడుకన గ
ర్వించుస్వభావంబు పరితపించుటకా జీ
వించగను సంచరించు చ
లించగు నిశ్శేషముగు నలిననేత్రియుగా. 624

1 మిడుకు=గర్వించుస్వభావము, పరితపించుట, జీవించుట, సంచరించుట, చలించుట, ఎండిపోవుట.

కం ఇల మినుకన కిరణము మం
గళ సూత్రాభరణనామకము బహువచనం
బొలసిన వేదము వాక్యం
బలరెను మిన్నయన రత్నము శ్రేష్ఠంబా. 625

1 మినుకు=కిరణము, మంగళసూత్రము, (బహువచనము) వేదము, వాక్యము. 2 మిన్న=రత్నము, శ్రేష్ఠము,

కం వనజాక్షు మిసిమియన నూ
తనరుచి నవనీతమునకు దనరెను మీఁదన
న్నగు భవిష్యత్కాలం
బును పరమును నుపరిభాగ మునకాఖ్యాహారీ.

1 మిసిమి=నూతనరుచి, నవనీతము. 2 మీఁదు=భవిష్యత్కాలము, పరము, ఉపరిభాగము.

కం కమలాక్షా! మీటన నధి
కము వృద్ధియు నాయుధాగ్రఘాతము నుద్రే
కము నఖరాగ్రాదివిఘు
ట్టము పేరగు భక్తవత్సలయు సారసమిత్రా. 626

1 మీటు=అధికము, వృద్ధి, అయోధాగ్రప్రపోటు, ఉద్రేకము, గోటికొన మొదలగువానితోఁ బొడుచుట,

క. దనుజాంతక! ముంగిలియనఁ
గను మధ్యస్థానము గృహకక్ష్యమగును ము
క్కున నాసికంబు చూచుక
మును చుంచువు నామవాను మునినుతచరణా. 627

1 ముంగిలి=మధ్యస్థానము, గృహకక్ష్య 2ముక్కు=నాసికము, చన్నుమొన, పక్షులోనగువానిముక్కు,

క. క్షమితా! ముచ్చటయన ప్రే
మము వృత్తాంతంబు నిచ్ఛ మఱియును సల్లా
పము మట్టడియన నిర్బం
ధము సైన్యావరణమగును దైత్యవిదారీ. 628

1 ముచ్చట=ప్రేమము, వృత్తాంతము, కోరిక, పరిసంగము, 2 మట్టడి=నిర్బంధము, సైన్యావరణము.

సీ. ముడివడునన లంభిచడరె సంధిం చలి
శయ మొందునా కీర్ణమయము పేరు
ముడుఁగనగా చేష్టలుడుగు సంకోచించు
ముకుళించు న్యూనమాటకును పేరు
ముత్తసరియనంగ ముక్తావళికి పేరు
ధాన్యవిశేషాభిధానమాను
ముదలనా ఁగెదారభూమి లక్ష్యం బాజ్ఞ
ముదియన వార్ధకము మఱివృద్ధు

గీ. ముదుకనా వృద్ధునకు స్థూలమునకు పేరు
ముదురనఁగ వృద్ధి వృద్ధాప్యమును ఫలాది

పరిణమించగు ముద్దన బరగె చుంబ
నము మనోజ్ఞత యాదరణంబు శౌరి. 629

1 ముడివడు=లభించు, జతపడు, అతిశయమొందు, పెనగబడుట. 2 ముడుగు=చేష్టలుడుగుట, సంకోచించుట, ముకుళించుట, న్యూనమగుట. 3 ముత్తసరి=ముత్తెములహారము, ధాన్యవిశేషము. 4 ముడలు=మాగాణిపొలము, లక్ష్యము, ఆజ్ఞ. 4 ముది=వార్ధకము, ముసలివాడు. 5 ముదుకడు=వృద్ధుడు, స్థూలమైనది. 6 ముదురు=వృద్ధి, వృద్ధావస్థ, ఫలాదులుముదురుట 7 ముద్దు=చుంబనము, మనోహరము, ఆదరణము.

క. మునునా నగ్రపదవిధం
బున నాద్యంతాదుల్కొను ముప్పిరిగొనునాఁ
గనగు త్రితంత్రాకీర్ణం
బును సంకీర్ణంబునగు విబుధనుతనామా. 630

1 మును=మొట్టమొదట, ముందు, వెనుక. 2 ముప్పిరిగొను=మూఁడుపేటలతోఁద్రాడుచేయుట, కలసిపోవుట,

గీ. మునుక సంగము సంతాపమునకు ప్రతివ
చించు వచియించుటకు పేరు చెలగె మురియు
ననఁగ గమనాదిలావణ్యమౌను ఖండ
మగుట గర్వించు నావృత్తిమగుట కాఖ్య. 631

1 మునుక=సంతాపము, ప్రతివచనమునొసంగుట. 2 మురియు=నడకలోనియొయ్యారము, ఖండమగుట, గర్వించుట, తెగుట.

గీ. మురువనఁగ సుందరము గర్వమునకు పేరు
వఱలె మురియునఁ గమన లావణ్యమగును
గర్వమగు మురువనఁగా నతిక్ర
మించ చతిశయించు నామమగా మేదినీశ.  632

[illegible] గర్వము 2 [illegible], గర్వము.
2 మురుమూవు=అతిక్రమించుట, అతిశయించుట.

చ. క్షమనిక మూఁకనా గణము సైన్యము మూఁడనలభ్య
వహా సమా
ప్తమునగు మూదలించు నియతంబవధానము మూల
నాఁగ కో
ణమునకు పేరగుఁగా కబరినామముజెల్లును మెండునా నధి
క్యము నధికంబుపే రతిశయంబగు నున్నతమా జనార్దనా.

•1 మూఁక=గణము, సైన్యము. 2 మూఁడు=లభ్యమగుట, సమాప్త
మగుట.• 3 మూదలించు=నియతము, హెచ్చరిక. 4 మూల=కోణము, కబరి
5 మెరిడు=విస్తారము, అధికము, అతిశయము, ఉన్నతము.

గీ. అంబుజేక్షణ మూరివోవనఁగ నతిశ
యించు సఫలమగుట విజృంభించుటకు న
శించు వర్ధిలునామంబు లెంచ మెట్ట
యనఁగ నున్నతభూమియౌనంఘ్రియౌను. 634

1 మూరివోవు=అతిశయించు, సఫలమగు,విజృంభించు, నశించు,
వర్ధించు. 2 మెట్ట =ఉన్నతభూమి, పాదము.

క కమలాక్షా మెచ్చన శ్లా
ఘ్యమగును లక్ష్యించుపేరు కలిగెను బహుమా
నము శ్లాఘించుటకొ ప్రే
మమునకు శ్లాఘనకుజెల్లు మన్మథజనకా. 635

1 మెచ్చు= శ్లాఘనము, లక్ష్యముంచుట, బహుమానము, శ్లాఘిం
చుట, ప్రేమము, శ్లాఘింపదగినవస్తువు.

క. భువిమెట్టన సుంకవుఁదల
మవు కుధరము రాశి ఘట్టమౌ సోపానం
బవు బహువచనంబున పే
రవు వీణాతంతులాఖ్యయగు పాదుకలుఁగా. 636

1 మెట్టు=సుంకములు కట్టుతావు, కొండ, రాశి, పరిచ్ఛేదము, సోపానములు, (బహువచనమున) వీణాతంతులగద్దెలు.

గీ. అవని మెత్తయనంగ పల్యాయనంబు
మృదువుగలదియు తల్పమా మెత్తబాటు
నాఁ మృదుత్వము నాలస్యనామమగుచు
దనరె మెత్తనయన మృదుత్వంబు శాంతి. 637

1 మెత్త=గుఱ్ఱపుపల్లము, మృదువైనది, పఱుపు. 2 మెత్తబాటు=మృదుత్వము, ఆలస్యము 3 మెత్తన=మృదుత్వము, శాంతి.

గీ. మెప్పనఁగ ప్రీతి శ్లాఘన మెప్పు వగము
పేరు మెయినాఁగ దేహంబు విధము పార్శ్వ
మునకు ననుగతికా మెయికొనునన ల
భించు ననుకూలమగు సమ్మతించు పేరు
మఱియు నంగీకరించుటౌ మదనజనక 638

1 మెప్పు=ప్రీతి, శ్లాఘనము, పరము. 2 మెయి=దేహము, విధము పార్శ్వము, వెంబడించుట, 2 మెయికొను= లభించుట, అనుకూలమగుట. సమ్మతించుట, అంగీకరించుట.

క. మెరమెరయనగ మనోవ్యథ
బరగెను సంశయము భేదభావంబగుచున్
ధర మెఱపనఁగా విద్యు
త్తరయు ప్రకాశింపునామ మాశ్రితవరదా. 639

1 మెరమెర=మనోవ్యథ, సందేహము, భేదభావము. 2 మెఱపు=విద్యుత్తు, ప్రకాశించుట.

కం. క్షమితా మెఱవడినా ధై
ర్యము ప్రౌఢత్వంబు నతిశయంబగు నుద్రే

కము పేరగు విద్యోత్సవ
మమరెను గౌరవము పేరు హాటకచేలా.                    640

మెఱవడి = శ్రైష్ఠ్యము, ప్రాశస్త్యము, అతిశయము, ఉద్రేకము, ఊరేగింపు, గౌరవము,

గీ. మెలకువయనంగ నవబోధమలరె జీవ
నంబు సంచారమును పరిబోధాఖ్యయు మెలఁ
గనఁగ నవబోధవర్తనంబును సంచ
రించునామంబు జెల్లె వర్తించుటను.                    641

1 మెలకువ = జాగరూకత, జీవనము, సంచారము, మేలుకొనుట. 2 మెలఁగు = జాగరూకతతో వర్తించుట, సంచరించుట, వర్తించుట,

కం. మెలపన వర్తనస్మృతి కో
మల మవబోధాఖ్యయగు భ్రమణమగు నచలం
బలరెను మెప్పన నట్లగు
మెలయు ప్రవర్తించు సంగమించుట కలరెఁ.                    642

1 మెలపు = మెలఁగునట్లుచేయుట, కోమలము, జాగ్రత్త, తిరుగుట, చలింపక నిలుకడగానుండుట. 2 మెలయు = ప్రవర్తించుట, సంగమించుట.

చ. ఫణిశయ మేయనన్ విధము పార్శ్వము దేహము పేరు మేకొన
న్నను లభితంబు సమ్మతిలు నామమునౌ నవబోధ ముద్యమిం
చు నగును ప్రాప్యమౌటకగు జొమ్మిక మేడనమన్న మేళనం
బును మృగపక్షికాదిరతముల్ మతిసంగమమౌ తెనుంగునన్

1 మే = విధము, పార్శ్వము, దేహము పేరు. 2 మేకొను = లభించుట సమ్మతించుట, జాగ్రత్తగైకొనుట, ఉద్యమించుట, పొందుట. 3 మేడనము = కలియుట, పక్షులు మృగంబులు మున్నగు వాని తగవు, సంభోగము.

మ. జగతిన్మేననగా శరీరమగు పార్శ్వంబౌను జన్మంబు పే
రగుగా మేరయనంగ క్రమంబవధి మర్యాదాఖ్యసీమాహ్వయం

బగుచున్ మేరువనంగ హారతరళంబౌ తీరసేత్వాఖ్యకీ
ర్తిగనేన్ మేలిమినాఁగస్వర్ణమగునాధిక్యంబగుఁగా మాధవా.

1 మేను=శరీరము, పార్శ్వము, జన్మము, 2 మేర=క్రమము, అవధి, మర్యాద, హద్దు. 3 మేరువు=హారమునందలి పతకము, తీగము, సేతువు. 4 మేలిమి=బంగారము, విస్తారము.

కం. కమలాక్షా మేలనలా
భము నుపకారము మదము శుభము నధికము శ్రే
ష్ఠము మోహము సుకృతము పు
ణ్యము నుపరివిశేషము శుభమైనది పేర్మా 645

1. మేలు=లాభము, ఉపకారము, మదము, శుభము, విస్తారము, శ్రేష్ఠము, మోహము, సుకృతము, పుణ్యము, ఉపరిభాగము, విశేషము, శుభమైనది.

గీ. జగతి మేలుకట్టు సోపాన ముల్లాభ
మగును మేవడియన నగు నుపాయ
మునకుపేరు నుచిత మునకాఖ్య నమ్రిమి
నామ మసురరాజ నగపవజ్ర. 646

1. మేలుకట్టు=సోపానములు, చాందిని. 2 మేవడి, ఉపాయము తగినది, నమ్రత్వము.

గీ. మేళగించనంగ మేళనమగు సంఘ
టించు సంగమించు కొంచెపేరు
మై శరీరమాను మరి పార్శ్వమౌ నావృ
తంబునామమగు విధంబగు హరి. 647

1 మేళగించు= కలిసికొనుట, సమకూర్చుట, సంభోగించుట, 2 మై= శరీరము, పార్శ్వము, ఆవృతము' విధము.

కం. క్షితి మైవడియనగా సౌ
ఖ్యతయగు ననుకూలనామమగు విధమగు స

ష్మతియగు మొగమనగా ము
ఖ్యత శ్రేష్ఠము ముఖముపేరుగాంచె సుపుపంవా. 648

1 మైపడి= సౌమ్యత్వము, అనుకూలము, విధము, సమ్మతి.
2 మొగము=ముఖ్యత, శ్రేష్ఠము, ముఖము.

చ. మురహార మొగ్గలంబుమరి మొక్కలమన్నను ధైర్యమౌను సు
ష్కరవచనంబు నుత్సుకము శౌర్యముపేరగు ముష్కరత్వ మా
ధరణి బ్రతాప మప్రతిహతంబగుముష్కరమౌను మొత్తునా
బరగెను ఖండితంబునకు బాగుగనౌ బ్రహరించుపేరుతోన్

1 మొగ్గలము, (రూ) మొక్కలము= ధైర్యము, మూర్ఖవాక్యము, ఉత్సాహము, శౌర్యము, మూర్ఖత్వము, ప్రతాపము, తిరుగులేనిది,మూర్ఖము.
2. మొత్తు=ఖండితము, కొట్టుట.

కం. మొగియన నుద్యమనామం
బగు బహుళైకత్వనామ మగును విధంబౌ
మొగియుననంగ ప్రధావిం
చగు నుద్యమమొందుటాఖ్య హాటకచేలా. 650

1 మొగి= ఉద్యమము, మొత్తము. విధము. 2 మొగియు= కవియుట ప్రయత్నించుట.

కం. మొనయన వ్యూహం బగ్రిం
బును సైన్యంబునకుపేరు మొనకాండన ము
ఖ్యునిపేరగు సేనానా
థునిపేరగు శూరుడౌను దోషవిదారీ. 651

1 మొన= వ్యూహము, అగ్రము, సైన్యము. 2 మొనకాడు= ముఖ్యుడు, సేనానాయకుడు, శూరుడు.

కం. మొనపనగా నగు నుద్యను
మును లభియింపంగసేయు మొప్పియనఁగ మూ

ర్ఖునికి పరుషమగును మొనయు
ననగ లభిం చుద్యమించు దానవుజారీ. 652

1 మొనపు= ఉద్యమము, లభింపఁజేయుట. 2 మొప్పె= మూర్ఖుఁడు, పరుషము. 3 మొనయు= లభించుట, ఉద్యమించుట.

కం. మొఱఁగనఁగా వంచకునకు
వఱలె తిరోధానమునకు వంచించుటకా
మఱి వంచకనామంబగు
మొఱకన మూర్ఖునకు పరుషమునకాఖ్యా హారీ. 653

1 మొఱఁగు= వంచనము, మాటుపడుట, వంచించుట, వంచకుఁడు. 2 మొఱకు= మూర్ఖుఁడు కఠినము.

గీ. మొల్లమన కడునధికంబు దెల్లెను ధన
మగును మోపన మరార్పి తృణాదిభార
మునగు నారోపణంబగు మోమనంగ
ముఖము ద్వారంబు శ్రేష్ఠమా మునినుతాంఘ్రి. 654

1 మొల్లము= మిగులవిస్తారము, ధనము. 2 మోపు= పెంటివారి, గడ్డిమోపు, ఆరోపించుట. 3 మోము= ముఖము, ద్వారము, శ్రేష్ఠము.

సీ. మోరనంగను తక్రిమును గిరిశిఖరంబు
మోవివృక్షవిశేషము నధరంబు
మోసయనంగను మోసమనంగ వం
చనప్రమాదంబగుచౌర్యమగును
మ్రందన వివశమూర్ఛయు పీడితము హ్రాతి
బొందుటకగు బాధనొందుటౌను
మ్రగ్గన మరణించు మరినష్టమగుటకా
విహ్వలించుటకగు వివశమగును

గీ. రంతనఁగ క్రీడకలరును రతికిపేరు
వఱలె రంగనస్వేతాది వర్ణమునకు
కాంతికిని పేరుజెల్లె రకంబనంగ
శ్రేష్ఠమును సుందరంబగు శేషశయన. 655

1 మోరు= మజ్జిగ, కొండకొన. 2 మోహి= స్త్రీకృతవిశేషము, కెదవి 3 మోస= మోసము, వంచనము, ప్రమాదము, దొంగిలెనము. 4 ప్రుందు= ఒడలెఱుంగనిమూర్ఛ, పీడింపబడినది, హింసింపఁబడుట, బాధనొందుట. 5 ప్రమగ్గు= మరణించుట, నష్టమగుట, నివ్వలించుట, వినాశమగుట, 6 రంతు= క్రీడ, సంభోగము. 7 రంగు= తెలుపుమొదలగురంగు, కాంతి. 8 రకము= శ్రేష్ఠము, సుందరము.

గీ. రచ్చనా మండపము సభ రాజవీధి
కలకలంబును గోష్ఠియు కలహమగుచు
దనరె రక్కొనునాఁగ రెక్కొనుననఁగల
భించువర్ధిలుస్వస్థత గాంచుపేరు. 656

1 రచ్చ=మండపము, సభ, రాజవీధి, కలకలము, గోష్ఠి, కలహము. 2 రక్కొను (రు. రెక్కొను)= లభించుట, వర్ధిల్లుట, స్వస్థతనొందుట.

గీ. రట్టనగ నిందకా నుపద్రవముపేరు
రమణనా రాణయనఁగను రవణయనఁగ
నుచితము ప్రీతి విధముపేరౌ రవయన
ఖండమును సూక్ష్మ మణుతాశ్వగతి విశేష
మునకు వజ్రంబునకుపేరు దనుజవైరి. 657

1 రట్టు= నింద, ఉపద్రవము, 2 రమణ రాణ. రవణ=ఉచితము, ప్రీతి, విధము. 3 రవ, ఖండము=సూక్ష్మము, అణువు, అశ్వగతివిశేషము, వజ్రము.

గీ. రహియన యోగ్యమగు ననురాగమా వి
వేక మానంద మాసక్తి విధముపేరు

దపరె రాణివాసమన నంతఃపురమగు
భార్యయలరె నంతఃపురభామయగును. 658

1 రహి= యోగ్యము, అనురాగము, వివేకము, ఆనందము, ఆసక్తి, విధము. 2 రాణివాసము= అంతఃపురము, భార్య, అంతఃపురకాంత.

కం. భువిరాటనఁగ నుపద్రవ
మవు జనసమ్మర్దనాఖ్య యగుఁ రిత్తయనన్
భవహర రిక్త మసత్యం
బును మఱియు నకారణాదు లవ్యయసంజ్ఞన్ 659

1 రాటు= ఉపద్రవము, జనసమ్మర్దము, వ్యర్థము, 2 రిత్త= శూన్యము, అసత్యము, (అవ్యయమైనపుడు) కారణములేమి.

కం. రూపరియన సౌందర్యుఁడు
రూపరియనఁగా విశేష రూపవతియగున్
రూపఱుననంగ హీనత
రూపఱిన నశించు మృతికిరూపగు శౌరీ. 660

1 రూపరి= సుందరాంగుఁడు. రూపవతియగు స్త్రీ. 2 రూపఱు= నశించు, హీనత్వము, మరణము.

కం. దనుజాట విదహనా! ను
వ్వఁగ ప్రక్షేపించుట మఱి యావర్తము రూ
పఁగ నాకృతి ఋజుభావం
బును విధమును ఔల్లె నాంధ్రమున భువిలోనన్. 661

1 నువ్వు= విసరవైచుట, సుడి, 2 రూపు= ఆకృతి, సత్యము విధము.

సీ. మహిని రెట్టయనఁగ పక్షిమూలము భుజము
పేరు రేఁగనగా విజృంభించు బదరి

శామ్రుమంబునకాఖ్య రేకయన రేఖ
పంక్తి పత్రికనామమై బరగె శౌరి. 662

1 రెట్ట=పక్షులపెంట, భుజము. 2. రేగు = విజృంభించుట, రేగు
చెట్టు, 3 రేక=గీత, వరుస, జాబు.

గీ. రేయునన ఖండించుచు విజృంభణాఖ్యన
దేటు రేవనగా నదీతీరమార్గ
మగు సముద్రాది తీరాహ్వయంబు బదరి
క్షాద్రుమంబునకాఖ్యయగా భవవినాశ. 663

1 రేయు=ఖండించుట, విజృంభించుట 2 రేవు=నదీతీరమార్గము,
3 సముద్రతీరము, రేగుచెట్టు.

గీ. రొక్కమన ధనము గణంబు రొప్పనంగ
నార్తరవము ప్రధావించు టాను కోప
మొందుటా రోయునాగను నిందజేత
నగపడ వర్తించు నన్వేషణించుటాను. 664

1 రొక్కము=ధనము, సమూహము 2 రొప్పు=ఆర్తరవము, పరుగెత్తుట,
కోపమొందుట 3 రోయు=నిందచేయుట, వర్తనము చేయుట, వెదకుట.

గీ. అవని అంకెయునంగ వృషభారవంబు
ఘనరవంబునకగు సింహగర్జనంబు
పేరు ఉంపిలునాగ వ్యాపించునతిశ
యించు వర్ధిల్లుటా విజృభించు టాను. 665

1 అంకె=వృషభధ్వని, గొప్పధ్వని, సింహగర్జనము, 2 ఉంపిలు=
వ్యాపించు, అతిశయించు, వర్ధిల్లు, విజృంభించు.

క నసజాక్ష! ఆంగయన ధూం
కృతికగు జాంఢీయు నుద్ధతుడు అవ్వన జు

క. విమలాహ్వాయ! లగ్గనగ శు
భము నపరక్రియను పేరు బరగె లవియనఁగా
గ్రమము నకు ప్రేమ కుత్సా
హామునకు వికాసమునకు నభిధానంబౌ, 668

1 లగ్గు=శుభము, అపరక్రియ 2 లవి=క్రమము, ప్రేమ, ఉత్సాహము వికాసము,

క. భువిలాఁచన వ్యాపించుట
కేవును తిరోధానమొందుటౌ లాగనగా
నవు నాకర్షించు విధం
బవు సమ్మతమునకు నామమాశ్రితవరదా! 669

1 లాఁచు=వ్యాపించుట, మఱుగుపడుట, 2 లాగు = ఆకర్షించుట సమ్మతము, విధము,

గీ. క్షమితా లావన సామ
ర్థ్యము నక్షితి బల మశక్య మగనాధిక్యం
బలరెను స్థూలమునకు నా
మము లెక్కయనంగ సంఖ్య మఱిలక్ష్యంబౌ 670

1 లావు=సామర్థ్యము, ఎడతెగనిది, బలము, అశక్యము, అధికము, స్థూలమైనది, 2 లెక్క=సంఖ్య, లక్ష్యము.

గీ. అవని లెస్సయనఁగ యోగ్యమగును శ్రేమ
మగును శ్రేష్ఠంబగును లేకయనగ
లేఖమునకౌను పంక్తికౌ పరమపురుష
4మణమునకౌను తరుణికౌ పేరయనగ 671

1 లెస్స=యోగ్యము, శ్రేష్ఠము, 2 లేక=జాబు, పంక్తి. 3 లేమ=తరుణము స్త్రీ,

సీ. లోవయానంగ శిలోచ్చయభిన్నమ
య్యెను రథపీఠాగ్రమునకుపేరు
వంకనా దిక్కగు వక్రంబు పక్షమా
వంతనా బాధ తాపంబునదియు
వంతనగను స్పర్ధ భాగంబు క్రమము సా
మ్యమును పేరు వగచన ధ్యానమునకు
బరగ పశ్చాత్తాప పడుటకు శోకించు
టకును విచారించుటకును పేరు
గీ. వగయనంగ నాలోచనయగును శోక
మగును సంతాపమగు విధంబగు విలాస
మగును గతియగు నాధారమగును వడియ
నాగ కృశించగు జలశోషణంబగు హరి 673

1 లోన=కొండలోయ, రథము మీది పీట, 2 వంక=దిక్కు, వంకర ఒక పక్షము (వైపు) 3 వంత=బాధ, తాపము, నది, 4 వంతు=విరోధము, భాగము, క్రమము, పోలిక, 5 వగచు=ధ్యానము, పశ్చాత్తాపము, శోకము విచారము, 6 వగ=ఆలోచనము శోకము సంతాపము, విధము, విలాసము, ఆధారము, గతి. 7 వడియు=కృశించుట, నీరు యెండిపోవుట.

క. వడయన భృత్యవిశేషం
బడరెను తాపంబు నుష్ణమగును శ్రమంబా
వడియన వేగము శౌర్యము
వడియనగా పద్యయతికి వలెనె మురారీ. 674

1 వడ=భృత్యము, తాపము, వేడి, శ్రమ 2 వడి=వేగము, శౌర్యము పద్యమందలి యతిస్థానము.

గీ. వన్నెయనగను శుక్లాదివర్ణ ముత్త
మాంబరము వర్ణనము సుందరముప్రసిద్ధి

1 వలపు=కామము, కోరిక, సుగంధము 2 వలము=విశాలము, లావైనది 3 వలయు=ఆవశ్యకము, ఇష్టము, యుక్తము, 4 (వలివలయుపదములనగా రూపాంతరము) 5 వలసిరి=శైత్యగుణము, కంపము.

చ. వలిపయనంగ సూక్ష్మగుణవస్త్రమగున్ బరిశుద్ధమైన దౌ
వలపమనంగ నట్లయగు వల్లెయనంగను పాశిపాశమై
యలరెను రజ్జువౌను వసమన్న వశంబును శక్యమౌ వళా
వళియన కౌతుకంబగును వర్ధితరౌద్రముజృంభణంబగున్

1 వలిప=సన్నని వస్త్రము, పరిశుద్ధమైనది, (వలపము ఇది వలిపెపదమునకు సమానార్థకము] 2 వల్లె=వరణుని పాశము, త్రాడు 3, వసము=వశము, శక్యము 4 వళావళి=ఉత్సాహము, కోపము, చెలరేగుట.

గీ. మేదిని వసగొనన నుద్యమించు నుత్స
హించుటకుపేరుజెల్లె వహియన పుస్త
కంబు విధమగు వాయన ఖడ్గధార
కలర వస్త్రంబునకుపేరు చెలగె శౌరి. 679

1 వసగొనుట=ఉద్యమించుట, ఉత్సహించుట, 2 వహి=పుస్తకము, విధము 3 వా=కత్తివాదర, ముఖము,

గీ. వాకయన నది పార్శ్వంబు వంకయగును
వాగనగ సైన్యమగు వ్యర్థభాషణంబు
స్వల్పనదికాఖ్యయౌ బహువచనమున త
రంగములకు నభిఖ్య విహంగతురగ. 680

1 వాక=నది, పార్శ్వము, వంకర, 2 వాగు=సైన్యము, వ్యర్థభాషణము, స్వల్పనది, (బహువచనమున) తరంగములు.

గీ. అవని వాడియనంగ శౌర్యమగు నిశిత
మగును తీక్ష్ణంబగును కఠారమగును వాకొ

ననగ వచించుట కార్తస్వనికిపేరు
వాడయన వీధి గృహపంక్తి వాసన హరి. 681

1 వాఁడి=శౌర్యము, పదును, తీక్ష్ణము, క్రూరము, 2 వాకొనుట=వచించుట, ఆర్తధ్వని, 3 వాడ=వీధి, గృహపంక్తి, వాసన.

గీ. మహిని వాటమనంగ సక్రమపరిదేశ
మానుకూల్యత సక్తపహానదియు వాన
కోయిలయన చాతకమునకును భుజగవి
శేషమునకు నభిఖ్యయా శేషశాయి. 682

1 వాటము=వాలుగ్నునటాన్న, అనుకూలముఁ కనిపించగ, 2 వానకోయిల=చాతకము, సర్పభేదము.

గీ. వాయినాఁగ ముఖంబగు వక్త్రమాను
ఖడ్గధారకగును వాలికయన దీర్ఘ
మగు నిశితమగు వాలాయ మన సదాయ
వశ్యమును బలవంత మవార్యమగును. 683

1 వాయి=ముఖము, నోరు, ఖడ్గదార 2 వాలిక=దీర్ఘమైనది' వాడిగ్రైనది. 3 వాలాయము=నిరంతరము, అవశ్యము,బలవంతము అడ్డగింపరానిది.

కం. క్రమమితా! వాలన నవతీ
ర్ణము ఖడ్గం బతిశయించు నామమగును దీ
ర్ఘము నమ్రమమగుటకగు శౌ
ర్యము క్రూరము నిశితమగుచురాజిలె శౌరి. 684

1 వాలు=దిగుట, కత్తి- అతిశయించుట, పొడుగు, వంగుట, శౌర్యము, క్రూరము, వాడిగ్రైనది.

కం. వాలిన నవతీర్ణించుట
వాలిన నతిశయము జెందబడు నమ్రితమా

వాలెమన నిరంతరమగు
వాలెమన నవశ్యమగుచు మవఖలెము నాకీ. ౬౫౪

1 వ్రాలు=దిగుట, అతిశయముగుట, పంక్తి. 2 వాలెమన=నిరంతరము, అవశ్యకము.

మ. ధరణిన్ వావిరి నాఁ గ్రమంబనిక ముత్కర్షంబు సత్ప్రశస్తంబు నాఁ
పరగన్ వాసియనంగ భేదముగు లాభంబు ప్రశస్తంబు నాఁ
పరిమాణంబును గౌరవంబు బుజుభావంబు న్మెఱిఁడిన్ వాసి
మ్యాతసంబా మగు వింతనాఁ గనగు నన్యాభిఖ్య యాశ్చర్యమున్.

1 వావిరి=క్రమము- అధికము- ఉత్కృష్ట- ప్రశస్తము- 2 వాసి- భేదము- లాభము- ప్రశస్తము- పరిమాణము- గౌరవము- ఋజుభావము- వాత్సల్యము- వింత- ఇతరము- ఆశ్చర్యము.

గీ. క్షితిని వింగడమనఁగ విస్తీర్ణమన్య
మౌను విపరీతమగు సుందరాఖ్య బల్లు
విందనంగను బంధువౌ బంధుభోజ
నాఖ్య విర్కన జృంభించ హుంకరించు. ౬౫౫

1 వింగడ=విశాలము- విపరీతము- సుందరము- 2 విందు=బంధువు- బంధుభోజనము 3 విర్క=విజృంభించుట- అహంకరించుట

గీ. ఇలను విచ్చలవిడినా యథేచ్ఛమగు స్వ
తంత్రమగు విచ్చుమొగ్గనాఁ దనరె కుట్మ
లాఖ్య యతిచలనమున కాఖ్యయు విడి
మట్టనగ నాశ్రయము వాస మందిరంబు. ౬౫౬

1 విచ్చలవిడి=యథేచ్ఛము- స్వతంత్రము- 2 విచ్చుమొగ్గ మిగుల కదలుట మొగ్గ విడిమట్టు 3 ఆశ్రయము నివాసగృహము

క. కమలాక్షా! విడియన క్రో
ధము నేకాకియును వర్జితంబగు నరుణ

త్వము ప్రత్యేకంబు పరా
క్రమము ప్రతాపంబు నెఱుఁగ కాంక్షిత పేరా. 68

1 పిడి=క్రోధము, ఏకాకి, గుప్పబడికట్టు, ఎత్తుపిడి ప్రత్యేకము, పరాక్రమము, ప్రతాపము, ఎఱ్ఱనిరింగు.

గీ. ధర విటాకన నిశ్చేష్టతయగు పర
వశ్యమగు విభ్రమంబగు పరవశుడగు
మఱియు నిశ్చేష్టితునకు నామంబు పెల్ల
విన్ననువసంగ ప్రౌఢిమ విధము దనరె. 690

1 విటా=నిశ్చేష్ట, పరవశము, విభ్రమము, పరవశుడగుట. నిశ్చేష్టితుఁ డగుట. 2 విన్ననవు=నేర్పు. విధము,

కం. విన్నాణియనఁగ యతిపే
రెన్నికగాను ప్రౌఢకొమ్మ నిక విన్నాణం
బన్నను ప్రౌఢిమ పూజ్యతి
పన్నుగ నంచితము మల్లబంధము శౌరీ 691

1 విన్నాణి=యతీశ్వరుఁడు, ప్రౌఢకాంత 2 విన్నాణము=నేర్పు, పూజ్యత, అంచితము, మల్లబంధము.

కం॥ విప్పన వికసించుటపే
రొప్పెను బాహుళ్యనామమొనగె విరియనం
దప్పక పుష్పము వికసన
మొప్ప గపసరిలుట శాఖ్య మొగి త్యక్తంబౌ. 692

1 విప్పు=వికసించుట. బాహుళ్యము, 2 విరి=పూవు, వికసించుట, తొలఁగుట, విడిచిపెట్టుట,

కం॥ అంచితముగ విరియునన త్య
జించు నపసరిల్లగ వికసించుటకగు శాఖ్యా
పిం చుల్బణంబగుటే భే
ఖించుట కభిదానమౌను తీనశరణ్యా. 693

1 వింయు=విడుచుట, తొలంగుట, విచ్చుట, వ్యాపించుట, విజృంభించుట, భేదించుట,

చ॥ అవని విరాళినాఁగ విరహంబును భక్తి విరాళమన్న పే
రవు విరహంబుఁజెందు నుపహారవిశేషముగన్ విసంబనన్
గ విషము పేరుగాంచె నుదకంబునకౌ వివరించునాఁగ పే
రవు విశదీకరించుటకు నన్వయమయ్యె విచార్యమైమహిన్.

1 విరాళి=విరహము, భక్తి 2 విగాళన=పిగహమొందుట, ఉపహారభేదము 3 విసము=విషము, జలము, 4 వివరించుట=విశదముచేయుట అన్వయము, విచారింపఁదగినది.

కం॥ శమి! తగును వీఁకయనఁదై
న్యము నుత్సాహము విజృంభణము నున్నతి గ
ర్వమును పరాక్రమమును సా
మ్యము ప్రభావము విధమున కాఖ్య ముకుందా. 695

1 వీఁక=దైన్యము, ఉత్సాహము, విజృంభించుట, ఉన్నతి, గర్వము, పరాక్రమము, సామ్యము, పాఱిపోవుట, విధము.

మ॥ జగతిన్ వీఁగన నుత్సహించుటగు చాంచల్యంబు గర్వింపు పే
రగు ప్రఁదాటిపఁవముపైకి జెల్లె మఱి వీఁకన్నన్ ప్రతాపంబు పే
రగు గర్వంబునకాఖ్య యున్నతికిపేరౌ వీఁటిబోవన్న పే
రుగ వ్యర్థంబగుటౌను దూష్యమునశింపున్ నష్టియౌ మాధవా.

1 వీగు=ఉత్సహించుట, చాంచల్యము, గర్వించుట, పరుగెత్తుట 2 వీఁక=ప్రతాపము, గర్వము, ఉన్నతి, 3 వీటిపోవు=వ్యర్థమగుట, మాష్యము, నాశనము, నష్టము,

కం॥ శమితగుణా వీడన సై
న్యము పథికజనాళి విశదమగుట బహుమా
నమును విసర్జించుట శిబి
రము వర్ధిలు పట్టణమంబు రసికచరిత్రా. 697

1 వీడు=సైన్యము, బాటసారులు, స్పష్టమగుట, బహుమానము విసర్జించుట, శిబిరము, వర్థిల్లుట, పట్టణము,

మ॥ విడు పట్టణమాశ్రయంబగు వెంటనే శిబిరంబగున్
వీడుపాటన వ్యత్యయంబగు విభ్రమంబగు భేదమౌ
వీడుకోలన నో యనుజ్ఞయు వెండియున్ మరణంబగున్
చూడుమింక విసర్జనంబయి యొప్పుచున్ ధృతభూవరా

1 వీడు=పట్టణము, ఆశ్రయము, శిబిరము, 2 వీడుపాటు=వ్యత్యయము విభ్రమము, భేదము 3 వీడుకోలు=అనుజ్ఞ,మరణము, విడిచిపెట్టుట.

కం॥ వనరుహలోచన!వీడ్కోను
ననగ ననుజ్ఞవడయుటకును నా వర్జితమ
య్యేను వీనన గా శ్రోత్రం
బున మఱియు ప్రసిద్ధికాఖ్యయును భూధరణీశా. 699

1 వీడ్కోను=అనుజ్ఞనొందుట, విడిచిపెట్టుట, 2 వీను=శ్రోత్రము, ప్రసిద్ధము,

కం॥ విమలాఖ్య వెంటనాగా
ర్యము పశ్చాదర్థకము మృగవ్యంబును మా
ర్గము విధము విషయంబున
కమరెను వెండియున రజితమగు తదుపరికా. 700

1 వెంట=ఔర్యము, వెనుక, వేటచేయుట, మార్గము, విధము, విషయము, 2 వెండి=రజతమనులోహము, తిరువాత.

గీ॥ వెంపరయనంగ హింసయౌ పీడనంబు
భేదనంబగు వెగటన విరసమునకు
పేరు తిక్తంబునకు పేరు వెకలియనంగ
మూఢు డాసక్తుడౌ దేవ మునినుతాంఘ్రి. 701

1 వెంపర=హింస, పీడనము, భేదనము 2 వెగటు=విరసము, చేదు 3 వెకలి=మూఢుడు, ఆసక్తిగలవాడు.

గీ॥ అవని వెక్కసమన దుస్సహత్వమగును
దుర్లభంబగు నధికమౌ దుస్సహమగు
బహువచనసంజ్ఞ దుస్సహ వచనములకు
నాఖ్య వెగడన చలనంబు వ్యత్యసనము 702

1 వెక్కసము=దుస్సహత్వము, దుర్లభము, అధికము, బహువచనమున. (బహువచనమున) దుస్సహవచనములు, 2 వెగడు=చలనము, వ్యత్యసనము.

క॥ వెడయన తుచ్ఛం బల్పం
బడరెను వికృతియు క్వచిత్తు వ్యర్థము పేరౌ
వెడగనగ వికారంబనం
బడె నవివేక మవివేకి పావనచరితా 703

1 వెడ=తుచ్ఛము, అల్పము, వికృతియు, ఒకానొకచోట, వ్యర్థము, 2 వెడగు=వికారము, అవివేకము, అవివేకి.

గీ॥ ఇలను వెదనాఁగ పశ్వాది ఋతువు కబరి
వెన్నునఁగ గృహశిఖరంబు పృష్ఠమగును
వెరవనగ వెరువనగను విధము యుక్తి
మున కుపాయమునకు పేరు మునినుతాంఘ్రి. 704

1 వెద=పశ్వాదులఋతువు, కబరి. 2, వెన్ను=గృహశిఖరము.
3 వెరవు (రూ. వెరువు)=విధము, యుక్తము, ఉపాయము.

క॥ వనజేక్షణ! వెరఁగన వెఱఁ
గన నిశ్చేష్టకును జెల్లె నాశ్చర్యంబ
య్యెను వెఱయన నాశ్చర్యం
బును భయమున కాఖ్యయొప్పె పుణ్యచరిత్రా 705

1 వెఱఁగు=నిశ్చేష్టము, ఆశ్చర్యము 2 వెఱ=ఆశ్చర్యము, భయము

క॥ వెలయునన ప్రకాశించుట
చెలగె ప్రసన్నత్వమును ప్రసిద్ధి గనుటకా

వెలసియున యోషకగు ని
ర్మలమునకు ప్రసన్నమునకుఁ రాజితె శౌరీ. 706

1 వెలయు=ప్రకాశించు, ప్రసన్నత్వము. ప్రసిద్ధిని పొందు, 2 వెలఁది=స్త్రీ, నిర్మలము, ప్రసన్నము,

గీ॥ క్షితి వెలార్చుట ప్రకాశింపఁజేయు
నిర్గమించఁగ వెలియన నెగడె బాహ్య
మును ధవళము బహిష్కారమును బహిష్కృ
తేశమునకాహ్వయంబయి దేవదేవ. 707

1 వెలార్చు=ప్రకాశింపఁజేయు నిర్గమించు. 2 వెలి=బాహ్యప్రదేశము, ధవళవర్ణము- బహిష్కారము, బహిఃప్రదేశము

గీ॥ వెల్లివిరియుననంగ వ్యాపించు నుల్బ
ణంబు ప్రకటితమగుటనా నంబగు ప్రవ
హించుపేరగు వెల్లనాఁ శ్వేతవర్ణ
మగు పరంపరయగు ప్రవాహంబగు హరి. 708

1 వెల్లివిరియు=వ్యాపించుట, విజృంభించుట, ప్రకటితమగుట, ప్రవహించుట, 2 వెల్లి=శ్వేతవర్ణము, పరంపర, ప్రవాహము,

గీ॥ అవని వెలుగన కిరణ మాతపమగు జ్వలి
యించుటకు పేరగును ప్రకాశించుటౌను
వెల్లువయన ప్రవాహమై వెలసె సైన్య
మునకు పేరౌ కుడ్యవ లీకమునకు 709

1 వెలుఁగు=కిరణము. ఎండ. ప్రకాశించుట, మండుట. 2 వెల్లువ=ప్రవాహము, సైన్యము. గోడగానుండుకంచె

గీ॥ వేయనంగ ననేకమౌ వేగమగు స
హస్రమునకాఖ్యయగు వేఁడియనఁగ నుష్ణ
మగును నైశిత్యమును తేజమగును తాప
మొలసె వేఁడిమి తాపమౌ నుష్ణమౌను. 710

1. వేఁ=అనేకము వేశము, నెయ్యి 2 వేఁడి =ఉష్ణము వాఁడి 2 తేజము, తాపము 3 వేఁడిమి=తాపము, ఉష్ణము.

ఉ॥ వేడన ప్రార్థనంబునకు పేరగు యాచిత మిచ్ఛయించుఁగా
వేడబమున్న మాయకగు వేషము పేరగు వంచనాఖ్యయా
వేడుకనాఁ గుతూహలము పేరభిలాష వినోదనావహ॥
పీడక వేఁడివేల్పనిన పేరగు నగ్నికి నుష్ణరశ్మికిన్.

1 వేఁడు=ప్రార్థనము, యాచించుట, కోరుట, 2 వేడబము=మాయ, వేషము వంచనము, 3. వేడుక=కుతూహలము, కోరిక, వినోదము 4 వేఁడివేల్పు=అగ్ని, సూర్యుడు.

క॥ ధర వేఁదుఱుఁగ మూఢుడు
మరి యున్మాదనమునకు ప్రమత్తుని పేరుః
సరియగు వేఁగనచారుఁడు
బరగె ప్రభాతంబు దేశ వార్తయు శౌరీ. 712

1 వేదుఱు=మూఢుడు, ఉన్మాదము, ప్రమత్తుడు, వేఁగు=చారుఁడు ప్రభాతము, దేశవార్త.

గీ॥ వేదు తిక్తంబు గధంబు వికటగంధ
మగునితోధికవచనంబునందు విరస
వచనములకౌను వేరన వెలసె వృత్త
మూలమున కన్యమునకాఖ్య నీలదేహ.

1 వేదు=చేదు, వాసన, దుర్గంధము, అంతకంటె నెక్కువ, విరసవచనము, 2 వేరు= వృత్తమూలము. అన్యము,

ఉ॥ వేనవినాఁగనొ కబరి వేణియు కేశము వేలమన్న సి
శానుకృపాణమందు శిబి రాఖ్యయు వేల్పన దేవతాహ్వయం
బౌ నిక జ్యోస్నానామమున కయ్యె తెలుంగున పేరువిస్తునాం
బూనెనుపేరు నాశనము పొందెను నాశకు డాశ్రితావనా.

1 వేవలి=కబరి, జడ, వెంట్రుకలు 2 వేలము=శంకరుని ఆయుధము, శిఖరము, 3 వేల్పు=దేవత,జోస్యుడు, 4 వేరుపిత్తు=నాశనము,నాశనముచేయువాడు.

క॥ కమలాక్షా! నేసదుసన
ఁశెనుపడు నిర్వేదనము విచార్యంబగు వై
నము నాఁ గారణము వివర
ణ ముపాయము క్రమము విధము వేరగు నిలలోన్ 715

1 వేసట=శ్రమనొందుట, విచారము, విచారింపదగినది, 2 వైనము= కారణము విపరణము, ఉపాయము, క్రమము, విధము,

ఉ॥ పావితదేవ! వైపనఁగ పార్శ్వము లత్యు ముపాయమయ్యెడున్
వ్రాలన వ్రమమాట ప్రియ భావముపే రవతీర్ణమాటకో
వ్రేలన నుద్యమించుటకు పేరగులంబిత మంగళంబు పే
రేవిదమయ్యె వ్రేఁగు తపిఖించుటనామము భారనామమా.

1 వైపు=పార్శ్వము లత్యము, ఉపాయము 2. వ్రాలు=వంగుట. సాగనమగుట, దిగుట వ్రేలు = ఉద్యమించు, వ్రేలాడుట, అంగళము, పరిహాసము 5 వ్రేగు=తపించుట, భారము.

మ॥ జగతిన్ సంగడినావిధంబుడుపమున్ సామీప్యమున్ ద్వంద్వమున్
నెగడన్ పార్శ్వముసంచయంబనుగతిన్ స్నేహంబు రొప్పారు చేన్
మిగిలెన్ సంగడమన్న స్నేహమగు సామీప్యంబు సైన్యంబుపే
రగు ద్వంద్వంబగు సంకు శంఖవలయం బౌ శంఖమౌ కేశవా.

1 సంగడి=విధము, పడవ, సమీపము, జంట, పార్శ్వము, సమూహము, వెంటవచ్చుట, స్నేహము, 2. సంగడము= స్నేహము, సమీపము, సైన్యము జంట 3. సంకు=శంఖముతో చేసి వలయము, శంఖము,

గీ॥ సంచనఁగ సుందరంబు సూచనవిధంబు
జెల్లు సంతనకట్టన సిద్ధపడుట
కౌను సంఘీభవించుట కౌను సంతు
నాఁ గులంబగు సంతాన నామమాను. 718

1 సంచు=సుందరము. సూచన, విధము, సంపాదనకెట్టు=సంప్రాప్త

ఘటింపించు, 3 సంతు=కలము సంతానము

ఆ. సంతరించ ననంగ సమకూర్చు నాగు లభి
యింపఁజేయు సంగ్రహించఁగు ధరి
యించుఁ జొ రచించు నెసఁగె సంపన వర్ధి
యించు పేరగును సమృద్ధి పేరు 719

1 సంతరించు=సమకూర్చు, లభింపఁ చేయు, సంగ్రహించు, ధరించు

గఁజించు. 2 సంపు=వర్ధించు, సమృద్ధి.

ఉ॥ సందడి నా జనాళి యగు సంకులమౌ జనతారవంబగుఁ
సందుకొనన్న వ్యాప్యమగు సక్తము పేరు పరిగ్రహించు పే
రొందెను సంబరంబన రసోక్తిని సంభ్రమనంగ నొప్పు నా
నాదము పేరగుఁ ద్వరిత నామమగుఁ రవిచంద్రలోచనా

1 సందడి= జనసమూహము, సంకులము, జనులధ్వని. 2 సందుకొను=

వ్యాపించు, కలసికొను, పరిగ్రహించు. 3 సంబరము (రూ॥ సంభ్రమము) =ఆనందము

తొందర.

క॥ సంబడమనగా పాధే
యంబగు వైతనిక క్లుప్త మగును భరణ్యా
ర్థంబగు సకిరియ స్త్రీనా
మంబగు సఖినామమగును హాటక చేలా 721

1 సంబడము= దారిబత్తెము, జీతము ఏర్పాటు, బత్తెము. 2 సకియ

స్త్రీ, చెలికత్తె.

సీ॥ సకినయనంగను కృత్రిమ వికిర నామ
మగును ప్రతిమయగుఁ సజ్జ యనఁగ సూతి
కాగృహంబున కాఖ్య శిరోగృహంబు
పిటకమగు సిద్ధమగు సస్యభేదమగును 722

1 సకిన=కృత్రిమపక్షి, పత్రిమ 2 సజ్జ= సూతికాగృహము, శిరోగృహము

గంపె, సిద్ధపడుట, సజ్జపైరు.

గీ. సరియన హారము సమయం
బరయగ యుక్తము సమాప్తమగు పూర్ణంబా
సరిగయన స్వర్ణతంతువు
పరగెను హారంబుపేరు పావనచరితా॥ 727

1 సరి= హారము. సమయము. యుక్తము. సమాప్తము. పూర్ణము.
2 సరిగ= బంగారుతీఁగ, హారము

గీ. సవతునాఁగ సమానము సామ్యమాను
సనియనంగ నారోగ్యమా సస్యమగును
ప్రబలకాంతికినగు ఋజుభావమగును
ఋజువు నారోగ్యభావమా కృష్ణవర్ణ. 728

1 సవతు= సమానము. సామ్యము, 2 సని= ఆరోగ్యము. పైకి విస్తారమగు కాంతి. ఋజుభావము. సత్యము. అరోగ్యము గానుండుట.

గీ. వసుధసాం బ్రాణియన ధూపవస్తు వుత్త
మాశ్వమున కాఖ్య సాకతమన ననుగ్ర
హంబు నుపశమించుట కాఖ్యయాను సాక
మనగ నుత్సవమగు వ్యాజమాను శౌరి. 730

1 సాంబ్రాణి= ధూపవస్తువు. ఉత్తమాశ్వము. 2 సాకతము= అనుగ్రహము. ఉపశమించుట. 3 సాకము= ఉత్సవము. నెపము.

గీ. అవని పాతన పథికజనాళిపేరు
వర్తకసమూహమున కాఖ్య వఱలె సామి
యనఁగ స్కంధుడు భర్త రాజౌను సారి
యనఁగ నావృతమగు యుద్ధయాత్రయగును 731

1 పాతు= బాటసారులు. వర్తకసమూహము. 2 సామి= కుమారస్వామి. మగడు. రాజు. 3. సారి= ఆవృతము, యుద్ధప్రయాణము

కం॥ సారెయన యాతకంబగు
శారిక పేరగు కులాల చక్రంబునకా
శారిఫలం బత్రమునకు
పేరగు బహువాచకమున వీణాతంత్రుల్ 732

1 సారె= కూఁతురును అత్తవారింటికిఁబంపునపుడిచ్చుసామగ్రి. గోరువంక. కుమ్మరివానిచక్రము. సొగటాలకాయ. పాచిక. (బహువచనమున) వీణాతీగ,

చ॥ సిరము సిరస్సు శైత్యమగు సీదరమన్నను సర్పకంచుకం
బరయ భుజంగమంబునకు నాహ్వయమౌను దరిద్రనామమౌ
సిరియనగా శుభంబునకు జెల్లెను లక్ష్మికి సంపదాఖ్యయౌ
స్థిరముగ సీమనాఁగను ప్రదేశము దేశము రాజ్యమౌ హరీ.

1 సిరము. సిరస్సు= శైత్యము. 2. సీదరము=పాముకుబుసము. పాము, దరిద్రము. 3. సిరి= శుభము. లక్ష్మి. సంపద. స్థిరము 4. సీమ= ప్రదేశము దేశము. రాజ్యము,

గీ॥ సుద్దియన కవచము పరిశుద్ధమగుచు
బరగె వృత్తాంతమౌను సుపాణియనగ
దనరె మౌక్తిక శోభ ముక్తాఫలాఖ్య
యొసగె సురతాణి శచియగు నింద్రుఁడౌను 734

1 సుద్ది= కవచము, పరిశుద్ధము. వృత్తాంతము 2. సుపాణి= ముత్తెములకాంతి. ముత్తెములు. 3 సురతాణి= శచీదేవి. ఇంద్రుఁడు,

కం॥ సురయన ననిలావృత్తము
సురయన ననిలం బధికము సురుఁగన గమనిం
పరయ చలిం చ దృశంబగు
మరియు పరిధావించుపేరు మన్మథజనకా 735

1 సుర= సుడిగాలి గాలి. అధికము. 2 సురుఁగు= గమనింపు. చంలిచుట. సదృశమగుట, పరుగెత్తిపోవుట.

గీ॥ సూటినా లక్ష్యము విధంబు నూడిగముల
నంగ వలయంబులగు కంకణంబులగును
సెగయనంగ సెకయన జ్వాలయగును తాప
మగు సెగ్గమనగ నింద్యవర్తనంబు 736.

1 సూటి= లక్ష్యము, విధము. 2 నూడిగములు =కడియములు, గాజులు 3 సెగ. సెక= జ్వాల, తాపము 4 సెగ్గము= నింద్యవర్తనము.

క॥ సేదియన నష్టి నాశంబు సేకరించ
నంగ నుపశమిల్లు సంగ్రహించగును సేమ
మన శుభంబగు మరిక్షేమమగును సేస
యనంగ సీమంతమునకగు నక్షతలగు 737

1 సేది= నష్టము, నాశనము, 2 సేకరించు=ఉపశమించు. సంగ్రహించు, 3. సేమము= శుభము. క్షేమము, 4 సేస= పాపట. అక్షతలు.

నానార్థవర్గముగిసెను

---

# అవ్యయవరు.

కం, తూరియనగ రువ్వంబన
పారియనగ రువ్వునాఁగ పరినా మైనా
సారియనంగ తెనుఁగున కడ
తే రావృత్త్యార్థకమును దెల్పుచు శౌరి 738

తూరి, రువ్వము. పారి, రువ్వు. పరి. మై, సారి. ఇవి. పర్యాయము అనునర్థమిచ్చును.

కం ఎటులన నెట్లన నెట్టన
నెటువలెనా నెట్టులనఁగ నెట్టెట్టూనా
నెటువోలె నెట్టువలెనా
నెటనంగను యత్ప్రకారమిల దెల్పు హరీ. 739

ఎటులు. ఎట్లు. ఎట్టన. ఎటువలె. ఎట్టుల, ఎట్టెట్టూ, ఎటువోలె, ఎట్టువలె. ఎటు = ఇవి యేవిధము అనునర్థమిచ్చును

ఆ॥ ఎట్టకేనియనిన నెట్టకునేనినా
నెట్టకేలకనిన నెటకునేని
యనఁగఁజా నతిప్రయాసార్థసూచన
దెల్పు నవ్యయములు దేవదేవ 740

ఎట్టకేని, ఎట్టకునేని, ఎట్టకేలకును, ఎటకునేని. ఇవిఅతిప్రయాసము నుసూచించును,

గీ॥ ఈయనఁగ నిదియనఁ జెల్లె నియమభిఖ్య
లట్లనంగను తత్ప్రకారార్థమౌను
చెఱియనంగ తలాయనఁ జెల్లె నాంధ్ర
మున ముకుంద యేకైకార్థమును దెలుపుచుఁ. 741

ఈ, ఇది, నిర్దేశార్థకములు, అట్లు తత్ప్రకారార్థకము, చెఱి, తలా, అనేకార్థకములు,

గీ. ఆయనఁగ నదియనఁగ పెల్లఁ దదర్థ
మనకు వల్లెయనంగను దనరె వల్లె
యనఁగ కానీయనంగ పెల్లవ్యయమున
దనరె ధరణి నంగీకారమునకు శౌరీ. 742

ఆ, అది, తదర్థకములు, వల్లే. వల్లె. కానీ, అంగీకారార్థకములు

కం॥ ఇసిరో యిస్సీ యీహీ
ఉసియును మఱియిస్సిరో యిహీ మఱియిహిహీ
యిసీయన నీద్వ్యముఁ దెల్పును
వసుధను తెనుఁ గవ్యయములు వాసవవినుతా 743

ఇసిరో, ఇస్సీ, ఈహీ, ఇసి. ఇస్సిరో, ఇహీ, ఇహిహీ, ఇసీ ఇవి నిందార్థకములు,

కం॥ ఏమీ యెట్టూ యేయన
యేమియనఁగ ప్రశ్నమునకు నేర్పడిజాడల్
కామించెను డబ్బాటన
స్వామి యకస్మాత్తుగ ననుజాడ మురారీ 744

ఏమీ, ఎట్టూ, ఏ. ఏమి, ఇవి ప్రశ్నార్థక బోధకములు, డబ్బాటు. అకస్మికముగ ననియర్థము.

గీ॥ ఆంధ్రమున నొండె యొండేని యనఁగ కాని
పక్షమున కర్థసూచన బరఁగెను మఱి
యిటుల నిట్టుల నిట్లును నిట్టనంగ
నివ్విధార్థంబు దెల్పు సురేశపాల 745

ఒండె. ఒండేని. ఇవి కాదనునర్థము తెలుపును. మఱి, ఇటులెట్టు ఇట్టులన్ ఇట్లు, ఇటు, ఇట్టు. ఈవిధము నర్థము తెల్పును.

గీ, పృథ్వి నెట్టెట్టునాఁగ నెవ్విధమునైన
యనఁట కిటఁబట్టినా నిదమాదిగ నని
యఁలర నీనాయనఁగ యుష్మదస్మదర్థ
మగుచు నవ్యయవర్గన కంతమయ్యె 746

ఎట్టెట్టు= ఏవిధముగానైనను' ఇటబట్టి= ఇది మొదలు. నీ, నా= ఇవి యుష్మదస్మదర్థకములు.

అవ్యయవర్గు ముగిసెను.



# నానార్థావ్యయవర్గు.

కం॥ అని సవి సాపి ప్రసరం
బును స్మరియించుట ప్రకారమును వాక్యము కా
రణ మిలి యవ్యయరూపం
బును సూచనఁజేయు కావ్యమార్గమునశ్లోకీ 746

అని. సవి. సాపి ఇవి అవ్యయరూపములు. ఈపద్యమునకర్థము
సువ స్ఫుటముగానున్నది.)

॥ ఐనా పూర్వవాగ్విరుద్ధార్థము సమ
యార్థకంబు నిర్ణత్వార్థమును వికల్ప
కార్థమును న్యూనసూచన యవ్యయమున
దెలుపు తెనుఁగున మునిలోల దీనపాల 747

ఐనా= పూర్వవాగ్విరుద్ధార్థము, సమయార్థము. నిర్ణత్వార్థము,
వికల్పార్థము. న్యూనసూచనము.

కం॥ కమలాక్షా బిట్టన శీ
ఘ్రముగా దృఢముగ ననెడు వికారముఁదెలుపుఁ గ్ర
మమున వలెయనఁగా సా
మ్యము నిష్టము దెల్పుస్వర్ణమయ చేలాంకా 743

1 బిట్టు= శీఘ్రము: దృఢము. 2 వలె= సామ్యము. ఇష్టము.

సీ. కాని కానీయనంగ వికల్పముఁ దు
నెమటి వాగ్విరుద్ధమునకు తదితరము నది
కగును సూచన యొండన నన్యమునకు
నేకతమునన జాడయే నిందిరేశ 749

1 కాని. కానీ= వికల్పము. ఎదుటివాక్యమునకు విరుద్ధము, తదితరము
2 ఒండు= ఇతరము ఒంటరితనము.

సీ. అకటన యక్కటా యక్కట యయ్యారె
　　యయ్యారె యయ్యరే యకట కిదరె
యయ్యొ యయ్యొ జెల్ల యాహా యయారె శౌ
　　చెల్ల యౌరౌర యొచ్చెల్ల యొచెల
యౌర కట్టా కట్ట యక్కట చెల్లరే
　　యోచెల కటకటా యొచ్చెల కట
యౌరౌ యయారే యయారె యకటా కట్ట
　　చెల్లబో కటకట చెల్లరెయును
గీ. అగుర యపుర యయ్యారే యహారె యనగ
నాంధ్రమున నివి సంతాప కార్థమును
దెలుపు నాశ్చర్యమర్థముల్ దెల్పునట్టి
యవ్యయములు రమాహృద యాబ్జభృంగ　　　7 సె

అకట. అక్కటా. అక్కట అయ్యారె. అయ్యరే, అయ్యరె. అకట. కదరె. అయ్యొ. అయ్యో. చెల్ల. ఆహా, అయారె. ఓచెల్ల ఔరౌర. ఒచ్చెల్ల. ఒచ్చెల. ఔర. కట్టా. కట్ట. అక్కట. చెల్లరే. ఓ చెల. కటకటా, ఒచ్చెల. కట ఔరౌ. అయారే. అయరె. అకటా. కట్ట. చెల్లబో. కటకట. చెల్లరె. అగుర. అపుర అయ్యారే, అహారే, ఇవి సంతాపార్థము నందును, ఆశ్చర్యార్థమునందును ఉపయోగించు అవ్యయములు.

సీ. అజ్జరే నల్లవో యద్దిరా యాహారే
　　యాహా యహారే యహారె బళిరె
యహాహా యసాదునా హారె బళే బళీ
　　యజ్జారె బాపురే యౌర బళిర
మజ్జారె మజ్జరె మమ్మారె మమ్మారె
　　మాయరే బళిరయ్యొ మజ్జరె మజ

కం॥ వెంకటశైలవిహారా!
శంకరముఖనిర్జరేంద్రసంస్తుతధీరా!
సంకోచరహితశూరా!
పంకజభవజననాభి పద్మాధారా!

## గద్య

ఇదిశ్రీమదలర్మేల్మంగోత్తుంగస్తన శృంగసంగధారాధర
వేంకటేశ్వర కృపాపాంగలబ్ధ వాగ్వైభవనిరంతర
భగవతారాధనాధేయతూముకులపవిత్రసర్వేశా
భిధాన పుత్ర రామదాస ప్రణీతంబైనయాం
ధ్రపదనిధానంబను నిఘంటువునందు
విశేష విఘ్న సంకీర్ణ నానార్థ అవ్యయ
నానార్థవ్యయ వర్గయుత తృతీయ
కాండము ముగిసెను.
మంగళం భవేత్
సర్వము సమాప్తము.